# యువ

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 27     ఫిబ్రవరి-1973     సంచిక 2

మార్చి నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10.00




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

ముళ్లపూడి వెంకటరమణ




# కర్తవ్యం

సుబ్బరాజు వచ్చి కూర్చుని ఏదో చెప్ప బోయేవరకు, రెడ్డిగారతన్ని చేసైగతో వారించి 'ఈ కథ విప్పు' అన్నారు హుందాగా.

రెడ్నాయుడి కొడుకు రావిసెట్టి కూతురుమీద మనసుపడి, మనువాడ తానని ప్రతిజ్ఞపట్టి, తలగట్టుకు పడు కున్నాడు. తండ్రి ఎంత జెప్పినా విన లేదు. గత్యంతరం లేక నాయుడోనాడు సెట్టి భవంతికెళ్లి మెల్లిగా విషయం కదలేశాడు. సెట్టి విరగబడి నవ్వాడు

"ఒర్ణసంకరమ్మాటటుంచి, అసలు నా అంతస్తేటి, నియ్యంతరవేటి ? ఆడేదో కుర్రకుంకడిగాడే అనుకో — నివ్వెట్టా వొచ్చి నన్నడిగావు. ఇదేం జరిగేదనేనా నీ వూహ" ఆవటాని దులిపేశాడు. మాటామాటా వొచ్చింది.

"నీకత నాకు తెల్దా. నువ్వా మినీస్టుౘి గారి మేనల్లుడికోసం యగబట్టం లేదా : అది నీకు పయ్యంతస్తు గాదా ? నేనే మినీస్టుౘినైతే నివ్విట్టా—మాట తూల వోడివా, ఇష్టం లేదనక ఇయ్యనీ్? ఎందుకెత్తుతావూ ?" అని ఎదురు దిరి గాడు రెడ్నాయుడు.

సెట్టి పగలబడినవ్వి, "నువ్వు మంత్రి వైతే నేరాజు [illegible] గాని [illegible]" అన్నాడు.

"అవుతా వవుతా వెందుకవ్వూ. ఈ ఊరు పంచాయతీగా ఏడిసిననాన్నాళ్ళు రాజువి నువుగాకింకెవరూ. అదీ చూద్దా రెన్నాళ్ళో" అన్నాడు నాయుడు ఉక్రోషంగా.

సెట్టిజవాబుకూడా చెప్పలేదు.పద్దులు చూసుకుంటూ కూర్చున్నాడు. రెడ్నాయుడు ఈ పరాభవం తట్టుకోలేక పోయాడు. క్షుత్రతనప్పౌరుషం కమ్ముకొచ్చేసింది.

లేచి గుమ్మందాకా వెళ్లి వెనక్కితిరిగి "నీకళ్లదుట నేను మినీష్టర్నివపోతే ఈ వూరు మునిసిపాల్టీ అయినంతొట్టు" అన్నాడు.

"నా కంటంలో పాణవుండగా అంత పన్జరగ"దన్నాడు సెట్టి.

"చూ దవుతానో కానో" అన్నాడు.

"నీ సంగతి నాకేటి మద్దన. మున్సిపాల్టీమాట జెబుతన్నా, కావలిస్తే ఊరు చుట్టూ కందకం తవ్వించి కోట గోడలు కట్టేసి పెరక్కుండా చేస్తాగాని దీన్ని మున్సిపాల్టీ జేయనివ్వను." అన్నాడు సెట్టి.

నాయుడు మాట సొంతం వినకుండానే వెళ్లిపోయాడు విశ్వామిత్రుడిలా తానూ ఓ ప్రతిజ్ఞ పట్టాడు. మినిష్టరని వించుకోవాలని.

లోగడ కొన్నాళ్లు రాజకీయాల్లో తిరిగి చెయి గాల్చుకుని, ఒళ్ళు నసిలేక తగ్గిపోయాడు. ఇన్నాళ్ళకు తిరిగి పౌరుషంగా రచ్చకెక్కాడు.

పన్జరగడానికి ముందు పార్టీలో చేరాలి. పార్టీలు మూడున్నాయి గాని ఛాన్సున్నవి రెండే. క.ఖ. అనుకుందాం. రెంటిలోనూ ఎక్కువ ఛాన్సున్నది ఖ అని తేలింది. అందులో పెద్ద తనక్కావలసినవాడుకూడా. లోగడ తనవల్ల ఉపకారం పొందాడు. ఇప్పుడు బాగా పెద్దవాడు.

వెళ్లి మాటాడాడు. కడుపులో ఊహాలు ముందరే వెళ,
లౌక్యం, రాజకీయం గాకపోయినా, ఉండబట్టలేక సంగతంతా చెప్పేశాడు.

"దానికేం? చూదాం. కాని ఖర్చు తడిసి మోపెడవుతుంది. పంచాయతీ మునిసిపలు ఎన్నికలున్నాయి ఎదర. ఇపుడు వీటికి కొంత డబ్బెట్టి సాయం చేస్తే ఆకట్టుకోవచ్చు. అది జరిగితేగాని ఆనక మన మొఖం జూసేవాడుండడు మరి" అన్నాడు నాయకుడు,

"సరే" అన్నాడు నాయుడు మర్నాడొచ్చి.

నాయుడేమంత లేనివాడుకాడు. ఇతగానికన్న సెట్టిదొక్కడు అంతస్తే ఎక్కువ. అతనిమేడకి రెండంతస్తులున్నాయి. ఉన్నంతలో పుట్టించగలిగినంత పోగేసి, కొంత తెగనమ్మి సిద్ధపడ్డాడు నాయుడు యుద్ధానికి. అక్కడినుంచి ఊహూ ఇంటికొచ్చేవాళ్లూ, పోయేవాళ్లూ, ఊళ్లు తిరగడాలూ, మీటింగులూ, ఒత్తడాలూ, తడపడాలూ, పత్రికలూ, రాతలూ, కోతలూ,కూతలూ వెవహారం అంతా మూడోకాలంలో పడింది. గ్రూపులు కలుస్తున్నాయి,

విడుతున్నాయి. నాయుడు ఒక చదువు కున్నాయన్ను కుదుర్చుకుని మంచీ చెడ్డా, శాస్త్రం, పార్టీ, కథా కమామిషూ నేర్చుకున్నాడు. ఆట, పైయాట, పట్టు విడుపూ కుడీ ఎడవా—అన్నీ తన నాయకుడి దగ్గర నేర్చుకున్నాడు. అన్ని టికీ నాయకుడేగురి, ఆయన గీచిన గీటు దాటకుండా నడుచుకున్నాడు. పేరు పేపర్లలో తరచు పడుతూంది!

ఒకసారి ఒక డెలిగేషనులో చేర్పించాడు నాయకుడు — ఓసారెళ్ళిరా నాయుడూ, పొరుగుదేశం వెళ్ళొస్తే ప్రిష్టీజి పెరుగుద్ది అన్నాడు నాయుడు వెళ్ళాడు.

ఆరువారాల తరవాత తిరిగొచ్చేసరికి కథ అడ్డం తిరిగింది. పార్టీలో చీలిక లొచ్చాయి. క పార్టీ జనం కొందరు ఖ లో కలిశారు. కొందరు ఎటూగాక మూడోపార్టీలో చేరారు. కొందరు నాలు గోది కట్టుకున్నారు. నాయుడు పార్టీ ఆఫీసుకెళ్లేసరికి నాయకుడు లేడన్నారు. అతన్ని దుమ్మెత్తిపోశాడు. భ్రష్టుడు దుష్టుడు ద్రోహి వెళ్లి అందులో కలిశాడన్నారు.

రెడ్నాయుడికి దారి తోచలేదు. తిన్నగా ఇంటికెళ్లిపోయాడు — ఎవణ్ణి సలహా అడిగితే ఏమవుతుందోనని. అతన్ని ఒక సమస్య పట్టుకుంది. తను ఇన్నాళ్లూవున్న పార్టీలోనే వుండడమా? లేక నాయకుడు కొత్త దాంట్లో చేరాడు గాబట్టి తనూ అందులోకే వెళ్ళడమా? నాయకుడి తెలివితేటలమీద. రాజ కీయంలో వుండే ప్రజ్ఞమీద తనకు ఎంతో గౌరవం. ఆయన పద్ధతులు మంచివి. వాటివల్ల దేశానికీ మేలుకలుగు తుంది...మరి ఇన్నాళ్లూ ఆయన నడిపిన పార్టీకూడా మంచిదే. ఆయన పద్ధతులే గదా అదీ అనుసరించింది? తనేం చెయ్యాలి? ఎవరితో కలవాలి? ఇదీ చిక్కు!

* * *

"సుబ్బరాజూ, నువ్వు గట్టివాడవైతే ఈ చిక్కు విప్పాలి. నువ్వే నాయుడివైతే ఏం జేస్తావు? చెప్పు" అన్నారు రెడ్డిగారు కథ ఆపి.

"పార్టీ లక్ష్యాలు, దేశం మేలుకన్న మినిస్టరవడం ముఖ్యం. పార్టీ ఏదైనా చేస్తాననేదొకటే. ఎవరుచేసినా మానినా, జరిగేదెలాగూ జరుగుతుంది. దేశంలో పన్లూ పార్టీ పాలసీలనుబట్టి కాదు; మనుషుల పాలసీలనుబట్టి జరుగుతా యెప్పుడూ. అందువల్ల నాయుడు ఇలాగే ఆలోచించివుంటాడు. ఇకపోతే, శరీరంలో తలను ఉత్తమాంగం అన్నారు. పార్టీలకీ అంతే. నాయకుడు ముఖ్యం గాబట్టి రెడ్డినాయుడు పార్టీల వెంటగాక, తనకి ఆసరావుండి ఆదు కుంటున్న నాయకుడితోనే కలిసి వుంటాడు. అతనేపార్టీ అయితే తనూ ఆ పార్టీయే కావాలి. అదే లాభసాటి. అదే జరగాల్సింది. అదే జరుగు తున్నది." అన్నాడు సుబ్బారాజు.

రెడ్డిగారు చుట్టపారేసి తలతాటించి వెనక్కు తిరిగి వెళిపోయారు.



# పెళ్ళి-వ్యవహారం

కొడవటిగంటి కుటుంబరావు

ఇంటికి చేరే సమయానికి సులోచన దడ ఇంకా శాంతంపోలేదు. ఆమె పాదాలూ, మోకాళ్ళూ ఇంకా బలహీనంగానే ఉన్నాయి. చేతుల తిమ్మెరలు పోతూ వస్తూ ఉన్నాయి. తనను చూసి ఎంతమంది ఏమనుకున్నారో ఊహించుకోవటానికికూడా ఆమెకు ధైర్యం చాలలేదు. మొట్టమొదటిసారిగా ఆడది దొంగతనమో, వ్యభిచారమో, తాగటమో చేస్తే తనకున్న స్థితే వుంటుందా అని ఆమె ఆశ్చర్యపడింది.

కాని తాను ఇంతటి ఉద్రేకానికి గురికావడం సులోచనను మరింత ఆశ్చర్యపరిచింది. ఎందుకంటే తాను చేసిందల్లా జగన్నాథంతో ఒక గంటసేపు "వ్యవహారం" మాట్లాడింది—అంతకంటే ఏమీ చెయ్యలేదు.

తనను ఒంటరిదాన్ని చేసి జగన్నాథం ఏమీ చెయ్యలేదు. చేసినా తాను పెద్దగా అల్లరిచేసి ఉండేదికాదేమో : ఏమంటే, తనను ప్రేమించితే బాగానే వుంటుంది. అని సులోచన అనుకున్న కొద్దిమంది యువకులలోజగన్నాథం ఒకడు. మనిషి అందంగా వుంటాడు. ఇరవై ఎనిమిదో ఏడు నడుస్తున్నది; తన ఇరవై రెండేళ్ళకు ఈడయినవాడు. చక్కగా "బర్మా షెల్‌లో" నాలుగు వందలు తెచ్చుకుంటున్నాడు. పెళ్ళి కాలేదు—

జగన్నాథానికి పెళ్ళి కాలేదన్నమాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సులోచన హృదయాన్ని శూలాలతో పొడిచినట్టుగా ఉండేది. ఎందుకంటే — సులోచనకు పెళ్ళి అయింది.

అది చాలా పావిష్టి పెళ్ళి—సులోచన జీవితానికి దేవుడు పెట్టిన పెద్దవాత.

సులోచన ఇంటరుపరీక్షకు కూర్చున్న కొద్దిరోజులకే జరిగిందా పెళ్ళి, అప్పటికి సులోచన తండ్రి బతికిఉన్నాడు. ఆయన జీవించి ఉండగా వాళ్ళ ఇల్లు సాంఘిక అభ్యుదయభావాలకు కేంద్రముగా ఉండేది. ఆయన మిత్రవర్గంలో హరిజనులు మొదలుకొని మహాకవుల దాకా అన్ని రకాలవాళ్ళూ, హోదాల వాళ్ళూ ఉండేవారు. సులోచన తండ్రికి ఉన్న హోదా అది ఒక్కటే. ఆయనకు ఏనాడూ పెద్దరాబడిలేదు. తీరని దారిద్ర్యమూలేదు. అందరూ ఆయనకు ఆర్థిక

సహాయంచేశారు. కాని ఆయన ఎవరికీ సహాయపడవలసి రాలేదు.

వాళ్ళ ఇంటికివచ్చే గొప్పవాళ్ళవెంట వారిబంధువులుకూడావచ్చేవారు. కనీసం వెంకటరత్నం ఆవిధంగా వచ్చాడు. అతని మేనమామ పేరుమోసిన కవి, సంస్కర్తా. ఆయన పట్నంవస్తే సులోచన వాళ్ళ ఇంటికి విధిగా వచ్చేవాడు. ఆయన పట్నంలోఉన్నన్నాళ్ళూ వెంకటరత్నం విధిగా—కాలేజీ ఎగగొట్టి అయినాసరే—ఆయన తోకలాగా తిరిగేవాడు.

ఏమైతేనేం. సంస్కృతి ధూపంతో నిషా ఎక్కి ఉన్నస్థితిలో వెంకటరత్నానికి సులోచనను పెళ్ళాడాలని, ఆమె తండ్రిగారికి అల్లుడు కావాలనీ ఆపుకోరాని కోరిక కలిగింది. తన తండ్రితో అని చూశాడు. యాభై వేలఆస్తిపరుడూ, ఒకే కొడుకూగల ఆ పెద్దమనిషి హరిజనోద్ధరణ చేసే దరిద్రుల పిల్లను చేసుకోవటానికి సుతరామూ ఒప్పుకోలేదు. తన బావమరిది సంఘోద్ధరణచేసి బొత్తిగా శీలాన్ని నాశనం చేసుకున్నాడని ఆయన విశ్వాసం.

ఆ పరిస్థితిలో వెంకటరత్నం తండ్రిని వెర్రికుట్టె కిందకట్టేసి, ఒంటిగా వచ్చి సులోచనను పెళ్ళిచేసుకున్నాడు. మైనారిటీ తీరిన ప్రతివాడూ తానుచేసే ప్రతి పనికీ బాధ్యుడని చట్టం విశ్వసించినట్లే సులోచన తండ్రి కూడా విశ్వసించాడు.

తాను చేసినది పెద్ద పొరపాటని వెంకటరత్నంచేత ఒప్పించటానికి ఆతని తండ్రికి గట్టిగా నాలుగు గంటలు పట్టలేదు.

సులోచన తండ్రిపోకముందే ఆమె వివాహబంధం తెగిపోయింది. ఆయన పోయినాక సులోచన అన్న రమణారావు బొత్తిగా అసహాయుడైనాడు. అతని తండ్రిగారి మిత్రులు అతనికో వంద రూపాయల ఉద్యోగం ఇప్పించగలిగారు. అతనికీ భార్యా, ఇద్దరుపిల్లలూ ఉన్నారు.

సులోచన భారం అదనపు భారం అతనికి. కాని పళ్ళబిగువున ఆభారాన్ని కూడా మోస్తూ వస్తున్నాడు.

తన పెళ్ళి ఇట్లా పరిణమించటంమాట అటుంచి తండ్రి పోయినాక జీవితం గురించి సులోచన చాలా తెలుసుకుంది. తనతండ్రి ఎట్లా సృష్టించాడో కాని తన చుట్టూ ఒకకృత్రిమ వాతావరణం సృష్టించాడు. ఆ వాతావరణంలో అణాపైసలకన్న ఆదర్శాలకువిలువ హెచ్చు. ఆయన పోగానే వాస్తవజీవితంయొక్క నగ్నస్వరూపం సులోచనకు కనబడింది. అందులో కులమత విద్వేషాలన్నీ ఉన్నాయి. అందరినీ అన్నిటినీ డబ్బే శాసిస్తున్నది. దీనిలో తభావతు అణుమాత్రం కూడా లేదు.

తన పెళ్ళి విషయంకూడా మొదటి సారి నిజం గ్రహించి ఆమె నీరసించి పోయింది. ఆ వెంకటరత్నం తనను

ప్రేమించి పెళ్ళాడలేదు. ఒక ఆదర్శం కోసమూ పెళ్ళాడలేదు. ఏదో తాత్కాలికమైన ఆవేశాలు, విప్లవం చేస్తున్నాననే భ్రమలో, ఆవేశపరులు తమ శక్తి సామర్థ్యాలు అంచనా కట్టుకోకుండా రాజకీయోద్యమాలలోకి దూకినట్టుగా తనను పెళ్ళాడేశాడు. ఆ తరవాత, నీటిలో మునిగిపోయేవాణ్ణి ఎవరో బయటికి లాగినట్టుగా అతన్ని తండ్రి ఉద్ధరించాడు. "బతుకు జీవుడా!'' అనుకుని అతను పెళ్ళినుంచి బయటపడ్డాడు.

బయటపడ్డాడా లేదా అన్న విషయం ఎవరికితోచినట్టుగా వారు చెప్పారు.

వాడెక్కడికి పోతాడు? కట్టుకున్న పెళ్ళాన్ని చచ్చినట్టు ఏలుకోవాలి! కోర్టుకు యీడుస్తే రోగం వదులుతుంది! ... కోర్టుకుపోతే మాత్రం ఏముంది? అతుకు అతుకే. అసలు ఉన్నవాళ్లకు, లేనివాళ్లకు పొత్తు కుదురదులే! మనోవర్తి రాబట్టండి!—ఇంకా కొన్ని ఏళ్ళు గడిస్తే విడాకులు పుచ్చుకోవచ్చు—ఈ పెళ్లాన్ని వదిలేసి వాడు మళ్ళా పెళ్ళాడతాడా! ఎన్ని గుండెలు!—అదంతా తీసిపెట్టు. పిల్లమీద పిల్ల నివ్వటానికి సిద్ధంగా బోలెడంత మంది ఉన్నారు!—

ఇటువంటి విజ్ఞానమంతా వింటుంటే సులోచనకు బుర్రగిర్రున తిరిగిపోయేది. ఇవన్నీ వట్టి ప్రగల్భాలు. మనుషుల వాక్చాతుర్యానికి, జీవించవలసిన జీవితానికీ ఏమీ సంబంధంలేదు.

సులోచన ఆ వెంకటరత్నంకోసం ఒక్క చిన్న నిట్టూర్పుకూడా విడవలేదు. వాళ్ళిద్దరూ ఎన్నడూ అయిదు నిమిషాలు బాతాఖానీకూడా కొట్టిన పాపానపోలేదు. ఒక్కొక్కసారిఆమెకు ఈజరిగినదంతా తనకు సంబంధించిన విషయం కానే కాదనికూడా భ్రమ కలిగేది—

కాని అన్న రమణారావు పైకి ఏమీ అనకపోయినా తన భారాన్ని తగ్గించుకోవటానికి ఏవేవో ప్రయత్నాలు చేస్తున్నట్టు తెలిసినప్పటినుంచీ, ఇది తన సమస్యేనన్న భావం ఆమెలో నిజంగా రూపొందసాగింది.

తన చెల్లెలికి తెలియకుండా రమణారావు ఆమె అత్తవారితో చాలా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు అతను మెతక మనిషి. దెబిరింపు వుత్తరాలు రాసి వుండవచ్చునని సులోచన అనుకున్నది. సులోచన పెద్ద 'దార్ఢ్యంగల' మనిషి అనికాదు. కాని 'వాళ్ల' దగ్గిరనుంచి వచ్చిన జవాబులు ఒకటిరెండు ఆమెకంట పడ్డప్పుడు ఆమెకు తన అన్నపైన ఎంతో జాలి కలిగింది. ''ఈ పెళ్ళి సవ్యంగా జరగలేదు.మీరు మీ చెల్లెలిని తార్చి మావాణ్ణి ఈపెళ్ళికి ఒప్పించారని నాకు సందేహంగావున్నది!—'' యిటువంటి హేయమైన ఆపాదనలు ఆ వుత్తరాలలో వున్నాయి.

రమణారావు కనీసం మనోవ_ర్తి అయినా సంపాదించటానికి ప్రయత్నించి విఫలు డయినాడు : అతని మెతకదనం వాళ్ళు బాగా అర్థంచేసుకున్నారు.

సులోచన మాత్రం ఏం చేస్తుంది : "మనకు హక్కులున్నై-కోర్టుకెక్కు !" అని అన్నతో ఎట్లా అంటుంది ? ఒక వంక నలుగురూ రెండుపూటలా తిండి తినటమే ఎంతో కష్టంగా వుం టే:

ఒకరోజు ఏదోమాటల సందర్భంలో రమణారావు ఆడవాళ్లు అంతో ఇంతో సంపాదించడం బుద్ధిగలపని అని యింట్లో గట్టిగా వాదించాడు. అది తనను మనసులో పెట్టుకునే అన్నమాట అని సులోచనకు ఎన్నో రోజులకుగాని తట్టనైనాలేదు. తట్టినాక తన మంద మతిని తలుచుకొని ఆమె కుంగి పోయింది. ఆ సంగతి ఎప్పుడు జ్ఞాపకం వచ్చినా ఆమెకు ఎంతో బాధ కలిగేది.

సులోచన తనంతట తనకే తట్టి నట్టుగా ఒకనాడు అన్నతో, "నాకు ఏదన్నా చిన్న ఉద్యోగం చెయ్యాలని ఉన్నది !" అన్నది.

రమణారావు తనకూ ఆ ఆలోచన అదివరకు రానట్టుగా, "చేస్తే చెయ్యనూ వచ్చు !" అన్నాడు.

*　　*　　*

సులోచన సంపాదించిన మొదటి చిన్న ఉద్యోగంలోనే ఆమెకు మాణి క్యంతో పరిచయమయింది. ఆమెది మంచి ఉద్యోగమే. ఆమె బియ్యే పాసయింది.

జగన్నాధం మాణిక్యం అన్న.

సులోచన చిన్నతనంనుంచి కూడా మగవాళ్ళలో బాహ్యాకర్షణకన్నా, వాళ్లు తన గౌరవాన్ని సంపాదించగలవాళ్ళా కాదా అన్నది ప్రధానంగా ఉండేది. మనిషి ఎంత అందంగాఉన్నా వాళ్ళలో కించిత్తు వెకిలితనం వుంటే ఆమె సహించలేకపోయేది.

మొదట్లో "ఓహో !" అంటే "ఓహో !" అంటూ వచ్చిన మాణిక్యం ఒకనాడు అకస్మాత్తుగా సులోచనతో గాఢస్నేహం ప్రారంభించింది. వాళ్ళి ద్దరూ కలిసి సినిమాలకూ, బీచికి షికార్లు తిరగసాగారు. ఎప్పుడన్నా జగన్నాధం వాళ్ళకు తన కారులో "లిఫ్టు" ఇచ్చే వాడు. కాని అతను పని పెట్టుకుని ఎన్నడూ సులోచనను పలకరించిన పాపాన కూడా పోలేదు.

మాణిక్యం మటుకు సులోచనను గురించి తెలుసుకోదగిన విషయాలన్నీ రాబట్టింది. అదంతా ఎప్పటికప్పుడు జగన్నాధానికి రిపోర్టవుతున్నదని ఆమె ఊహించలేదు.

ఒకనాడు సులోచన పుట్టినరోజు— ఆమెకు పుట్టినరోజు పండగలంటూలేవు- జగన్నాధమూ, అతనిచెల్లెలూ కారులో సులోచనను ఎక్కించుకుని మౌంట్ రోడ్డులో సింధీ బట్టలషాపుకు ఒకదానికి




వెళ్ళి అవీ ఇవీ కొనిపెట్టారు. ఒక వీశెడు మిఠాయికూడా కొనిపెట్టారు.

వాటిని ఎట్లా నిరాకరించాలోకూడా సులోచనకు తెలియలేదు. ఆమె తన అసహాయస్థితిని తలుచుకుని కంటతడి పెట్టుకున్నది. ఆ క్షణంలో జగన్నాధం తనకేసి చూస్తూ-డటం గమనించి ఆమె ఎంతో అవమానపడింది.

అది ఆమె ఇరవైమూడో పుట్టిన రోజు.

ఇదే తన జీవితంలో ఒక విచిత్రానుభవం అనుకుంటున్న సులోచనకు ఇవాళ అంతకు వెయ్యింతలు అపూర్వమైన అనుభవం అయింది.

అసలు ఈ అనుభవం మరే ఆడదానికన్నా అవుతుందా అనికూడా ఆమె ఆశ్చర్యపడింది.

ఆవేళ ఆదివారం. ఉదయం పది గంటలవేళ మాణిక్యం కారులో వచ్చి సులోచనను తమ ఇంటికి భోజనానికి రమ్మన్నది.

"మా అన్న నీతో ఏదో బిజెనెస్ మాట్లాడాలన్నాడు. నీ కేమన్నా అర్థ్యం తరమా?" అని దారిలో ఆమె సులోచనను అడిగింది.

"బిజినెస్'' అన్నమాట సులోచనకు కాళ్ళజెర్రిలాగా గగుర్పాటు కలిగించింది. బిజినెస్ అంటే వ్యాపారమో, వ్యవహారమో కావాలి. తనతో ఆ జగన్నాధానికి అటువంటిదేమీ ఉండే అవకాశం లేదు. అందుచేత ఆ ముక్క

మరొక అవాచ్యమైన దానికి పర్యాయ పదంగా మాణిక్యం వాడి ఉండాలి. కాని మాణిక్యం అలా మాట్లాడే వెకిలి మనిషి కాదు.

"బిజినెసా? నాతోనా?" అన్నది సులోచన రాని నవ్వు తెచ్చుకుంటూ.

"అది మా జగన్నాథం అన్నమాటే. అతను సాధారణంగా ఒక మాటకు ఒకమాట అనడు!'' అన్నదిమాణిక్యం.

మధ్యాన్నం ఒంటిగంటకు భోజనాల దగ్గర జగన్నాథం సులోచనకు కనిపించాడు. అతను మామూలు మాటలే మాట్లాడాడు. ఆ తరువాత అతను సాయంకాలం అయిదు గంటలదాకా కనిపించనేలేదు. అతని "బిజినెస్'' మాటే మరిచిపోయింది సులోచన.

అయిదుగంటలకు మళ్ళీ అతనువచ్చి బీచిమీదుగా షికారు పోదామన్నాడు. కారు వెనకసీటులో ఆడవాళ్ళిద్దరూ కూచున్నారు. కారు నేరుగా అడయారు బీచికి వెళ్ళింది.

కారు ఒకచోట ఆపి జగన్నాథం సులోచనతో, "ఒక చిన్న వ్యవహారం మాట్లాడాలి. మా సిస్టర్ కారులోనే వుంటుంది. మనం అట్లానడిచివద్దామా?'' అన్నాడు.

సులోచన నిర్భయంగా అతనివెంట నడవసాగింది. దడా, వణుకూ ఏమీ లేదు.

''నీ సంగతంతా మా సిస్టర్ చెప్పింది. నీ జీవిత సమస్యను గురించి ఆలోచించాను. అది పరిష్కారం కాని సమస్యకాదు. కాని ఎట్లా పరిష్కరించినా ఏవో చిక్కులు కొత్తవి రాక తప్పదు.

''నేనొక పరిష్కారమార్గం సూచిస్తాను. నీకిష్టమైతే దానిని వ్యవహార రీత్యా అమలుచేసుకోవచ్చు. మన ఇద్దరమూ భార్యాభర్తలుగా ఉందామని నేను సూచించబోతున్నాను

"అది చట్టరీత్యా సాధ్యంకాదు. చట్ట రీత్యా మనం భార్యాభర్తలమవుదామని నేను సూచించటంలేదు. భార్యాభర్తల మధ్య ఇంకొకరకం బంధం ప్రేమ బంధం. మనం ఒకరినొకరు ప్రేమించాలనికూడా నేను సూచించటంలేదు.

''నిజం చెప్పాలంటే నాకు ప్రేమ అంటే చెడ్డభయం. నా స్నేహితుడొకడు ప్రేమించి పెండ్లాడాడు. ప్రేమకు మంచువిచ్చినట్టు విచ్చిపోయే దురభ్యాసం ఉన్నది. ఈ ప్రేమ ఎప్పుడు ఏ బలి కోరుతుందో ఎవరూ చెప్పలేరు. కొన్ని త్యాగాలుచేసి నా స్నేహితుడిలాగా ప్రేమను వదతిట్టేకన్న, దాన్ని నమ్ముకోకుండా వుండటమే నాకు మేలని తోస్తుంది.

''నాకు శాస్త్రోక్తమైన మతవివాహాలన్నాకూడా భయమే. అది మనుషుల స్వేచ్ఛను హరించటం అట్లావుంచి ఇంకొక ప్రతిఫలం ఇవ్వదు.



''మొత్తంమీద నాకు ఏ రకం పెళ్ళిలోనూ నమ్మకంలేదని స్పష్టం చేశాను గద. అయితే నాకూ్కడా అందరిలాగే ఒక స్త్రీతో సుఖంగా ఉండాలనీ, ఆమెతో కష్టసుఖాలు పంచుకోవాలనీ, పిల్లలను కనాలనీ లేకపోలేదు. అయినా వాటికోసం రొచ్చులో దిగలేక ఇంత కాలంగా పెళ్ళిని వాయిదా వేసూ వచ్చాను.

"కాని నిన్ను గురించి ఆలోచిస్తుండగా ఒక మంచి పద్ధతి తోచింది-పెళ్ళి ఒక వ్యాపారబంధంగా ఎందుకు చేసుకోరాదు? ఈ వ్యాపారంలో ఇద్దరికీ సమానహక్కులు వున్నంతకాలము

ఒకరినొకరు గౌరవించుకోవటం జరుగుతుంది. ఒకరివల్ల ఒకరికి ఆర్థికంగా నష్టం కలగకుండా ముందే తగిన కట్టుదిట్టాలు చేసుకోవచ్చు !''

''అది ఎట్లా ?'' అన్నది సులోచన అడ్డొచ్చి.

"మన ఇద్దరమూ పెళ్ళాడేపక్షాన నేను నీకు నెలకింత ఇస్తానని ముందే రాసిఇస్తాను. పిల్లలు పుట్టినప్పుడల్లా వాళ్ళకు కొంతడబ్బు ప్రత్యేకంగా యిస్తాను."

సులోచన నవ్వి, ''వెనక డబ్బు గలవాళ్ళు ఎవరినన్నా వుంచుకుంటే యిటువంటి ఏర్పాట్లే చేసుకునే వారేమో ?'' అన్నది.

ఆమాట కొంతవరకు నిజమే అనుకుంటాను. కాని ఒకరు ఒక మనిషిని వుంచుకోవటంలో కొంత వ్యామోహం వుండేది. దాన్ని ఆధారం చేసుకుని ఉంపుడుగత్తె తన విటుణ్ణి సాధ్యమైనంత శీఘ్రంగా దివాలా ఎత్తించేసేది.''

సులోచన కాస్త ఆలోచించి, ''ఈ వ్యామోహం సమస్య ఎప్పుడూ వుండనే వుంటుందేమో ! అనూయకూడాను ! బిజినెస్ పెళ్ళి చేసుకున్న జంటలో ఏ ఒకరికి పరాయిమనుషులపై వ్యామోహం పుట్టినా బిజినెస్ దివాలా ఎత్తేస్తుంది గద ! దానివెంట అసూయలూ, కక్షలూ కొట్లాటలూ... !'' అన్నది.

''ఆటువంటివి దాటగలిగిన సంస్కారం వున్నవాళ్లకే ఈ రకం పెళ్లి సాధ్యమవుతుందనుకుంటాను'' అన్నాడు జగన్నాథం.

అతనిజుట్టు అకస్మాత్తుగా సులోచన చేతిలో చిక్కినట్టయింది. ఆమె అతన్ని అతి నిశితమైన ప్రశ్నలు వెయ్యసాగింది. ''ప్రపంచంలో అందరూ ఈ బిజినెస్ పెళ్ళి చేసుకునే అవకాశం వుందా ? అందరూ అనూయనూ, ప్రేమనూ అధిగమించేదాకా ఇలాటి పెళ్ళిళ్ళు వాయిదా పడాలా ? అప్పుడున్న పెళ్ళిళ్ళు ఎంత ఘోరంగా పరిణమిస్తున్నాయో, ఈ బిజినెస్ పెళ్లిళ్లకూడా అంత ఘోరంగాను పరిణమించే అవకాశాలున్నాయా, లేవా? ఈ పెళ్ళిళ్ళలో ఉన్న ఒక్క గొప్పదనము డబ్బు ఏర్పాట్లు చేసుకోవటంలోనే కదా వున్నది ? పెళ్లానికి నెలకు పది రూపాయలైనా ఇవ్వలేనివాడు ఈ వ్యాపారం ఎట్లా చేస్తాడు ? యివి అచ్చంగా ధనికులు మాత్రమే చేసుకునే పెళ్ళిళ్ళేనా ?''

ఈ ప్రశ్నలు కొరడాదెబ్బల్లాగా తగిలాయి జగన్నాథానికి. అతను రోషంతో, ''పెళ్ళానికి ఒక్కపూట తిండి పెట్టలేనివాడు పెళ్ళి ఎందుకు చేసుకోవాలి ? మొగుడు లక్షాధికారి అయివుండి కూడా తన పెళ్ళాం స్వేచ్ఛగా ఖర్చు చేసేటందుకు రూపాయి ఇవ్వని నిర్భాగ్యులున్నారు. వారి పెళ్ళిళ్ళు నవ్యంగావుంటే నేను చెప్పే పెళ్లి అంతకన్న వెయ్యిరెట్లు




మంచిది కాదా? మొగుడూ పెళ్లాలు మతం పేరనో, ప్రేమపేరనో ఒకరికొకరు దొరికిపోయి బతికున్నన్నాళ్ళు ఏడిచేకంటే అటువంటి భ్రమలకూ, కనువిప్పులకూ అతీతంగా తమ సంబంధాలు ఏర్పాటుచేసుకోవటం మంచిది కదా? అన్నిటికన్న ముఖ్యం ఈ పెళ్ళి ఎప్పుడు ఎవరు రద్దు చేసుకోవాలన్నా ఎవరికీ బాధగాని, నష్టంగాని ఉండదే! విడాకుల కంటె వెయ్యిరెట్లు తేలిక! ఇది నాగరికమైన వివాహం ఎందుకుకాదు?" అన్నాడు.

"మధ్యలో ప్రేమలూ, అసూయలు వస్తే ఏం చెయ్యాలో నాకు అర్థం కాలేదు.."

"మామూలు పెళ్ళిళ్ళకు ఈ ఇబ్బంది లేదా? ప్రేమలూ, అసూయలూ స్వయంకృతాపరాధాలుకావా?" అన్నాడు జగన్నాథం.

ఇంత సేపూ యిదంతా లోకవ్యవహారం అన్నట్టు మాటలాడుతున్న సులోచనకు ఇది తనకు సంబంధించిన వ్యవహారమేనని అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చి కొద్దిగా దడ పుట్టింది.

ఇద్దరూ కాస్సేపు మౌనంగా ఉన్న తరవాత అతను, "ఏం, సులోచనా ఏమంటావు?" అన్నాడు.

"ఈ పెళ్లికి నన్నే ఎందుకు ఏరుకున్నారు? అన్నది సులోచన నిబ్బరంగానే.

"దీనికి రెండు కారణాలున్నాయనుకుంటాను ఒకటి యిటువంటి పెళ్ళి నీతో సాధ్యమైనట్టుగా మరొక పెళ్ళిగాని

పిల్లతో సాధ్యంకాదు. అటువంటి కన్య చట్టరీత్యావివాహం కోరుతుంది... అంటే, మనిద్దరమూ ఏ ఇతర కారణం చేతనైనా పెళ్ళాడదలిస్తే నేను చెప్పిన బిజినెస్ పెళ్ళి తప్ప మరొక పద్ధతి లేదు.''

''యితర కారణాలంటే ?''

"అది నా రెండో కారణం, నీ అసహాయస్థితి చూస్తే నా కెందుకో పట్టరాని ఆగ్రహం కలుగుతున్నది. నీకు ఇంత అన్యాయం జరిగిపోయింది, కాని ఎవరూ నీకు ఏమీ చెయ్యలేకుండా వున్నారు. ఈ సంగతి తలుచుకుంటే ఒక్కొకసారి నాకు నిద్రకూడాపట్టదు" అన్నాడు జగన్నాధం.

చాలాసేపు సులోచన ఏమీ అనకపోవడం చూచి అతను "తొందరలేదు సులోచనా ! ఆలోచించు యిదుగో ఈ కాగితం నీదగ్గిర ఉంచుకో.యిందులో మన పెళ్ళికి నిబంధనలన్నీ రాసి సంతకం పెట్టాను. నీకు సమ్మతం కాకపోతే దాన్ని చించిపారెయ్యి, తాపీగా చదువుకుని ఏ విషయమూ సిస్టర్‌తో చెప్పు. లేకపోతే నాతోనే—" అన్నాడు.

అతనుచాచినచెయ్యి ఆమె కొంతసేపు చూడనేలేదు. కాగితం విప్పి చూసింది కాని ఆమెకళ్ళకు ఒక్క అక్షరం కనిపించలేదు.

"షేక్ హాండ్స్ !" అన్నాడతను,

సులోచన తన చెయ్యి యిచ్చింది. బిజినెస్ !

ఇద్దరూ కారుదగ్గిరికి నడిచివచ్చారు.

సులోచనన్నూ మాణిక్యాన్నీ యింటి దగ్గిర దిగబెట్టి జగన్నాధం కారులో వెళ్ళాడు.

"యింటికి పోదువుగానిలే, మంచి ఘాటైన కాఫీ యిస్తాను. లోపలికిరా !" అన్నది మాణిక్యం.

యిద్దరూ లోపలికి వెళ్ళాక. "ఏమయింది మీ బిజినెస్ ?" అని అడిగిందామె.

సులోచన తన హాండ్‌బాగ్‌లోనుంచి జగన్నాధం యిచ్చిన కాగితం తీసి ఇచ్చింది.

మాణిక్యం దాన్ని పైకి చదివింది. ఆ పత్రంలో సులోచన అతని భాగస్వామినిగా వుండేటట్టూ, అందుకుగాను అతను ఆమెకు నెలనెలా రెండువందలు ఇచ్చేటట్టూ, ఆమెకు పిల్లలుకలిగితే ప్రతి బిడ్డకూ అయిదేసివేల భీమా ఏర్పాటు చేసేటట్టూ రాసి వున్నది.

అంతా చదివాక ఇద్దరూ ఒకరికేసి ఒకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు.

"ఫూల్ ! నీమీద చాలా ప్రేమ వుండివుండాలి !" అన్నది మాణిక్యం.

"అదెట్లా ?" అన్నది సులోచన.

"నీ మీద అభిమానమో, ప్రేమో లేకపోతే నీ ఆర్థిక హక్కులను ఇంతగా పాటించడు. అది రూలే !" అన్నది

o.

ఆ క్షణంలో సులోచనలో నిజమైన




దడ ఆరంభమయింది. ఆమె కాఫీకోసం కూడా ఆగకుండా బయలుదేరి యింటికి వచ్చిపడింది.

జగన్నాథం చెప్పిన మిగతా విషయాలన్నీ ఎగిరిపోయాయి అసలు సంగతేమంటే అతను ప్రేమిస్తున్నాడు. తనతో వ్యభిచార జీవితం గడపమంటున్నాడు !

వరుసైన ఆడది అటువంటిపని ఎట్లా చేస్తుంది !

అసంభవం ! అసంభవం ! యిక తను వాళ్ళింటికి వెళ్ళలేదు; అతని మొహం చూడలేదు !...

*　　*　　*

"రమణారావుగారూ "

రమణారావు వచ్చిన మనిషిని గుర్తు పట్టలేదు. ఆయనే తానుఫలానా అనీ, ఫలానా పనిమీద వచ్చాననీ చెప్పుకున్నాడు.

సులోచన మామగారు రాయబారిని పంపాడు. తనభర్త అయిన వెంకటరత్నం తిరిగి వెళ్ళాడితే తనకు సమ్మతమేనని సులోచన పత్రంరాసి, దానిపైన రమణారావూ, భార్యా సాక్షి సంతకాలు చేస్తే అయిదు వేలిస్తారట ! ఒకప్పుడు మనోవర్తి ఇవ్వకుండా ఉండటానికిగాను అన్నిరకాల అభాండాలూ వేసిన మనుషులే !

"పైకం వెంటపట్టుకొచ్చాను. మళ్లీ అలా పనిచూసుకుని తొమ్మిదీ ఆ చాయలవస్తాను. ఎందుకొచ్చిన పేచీ, వాళ్ళకా కాగితం రాసి పారెయ్యండి. అమ్మాయి బ్రతుకెట్లాగూ పాడు కానే అయింది" అన్నాడు దూత.

ఆయన వెళ్ళిపోయాక రమణారావు సుముఖతగా ఆడబ్బు తీసుకొని కాగితం రాసివ్వటమే మేలని అన్నాడు.

"ఏదో పెద్ద కట్నంతో సంబంధం

వచ్చి వుంటుంది. పదివేలు కక్కమన్నా కక్కుతారేమో !" అన్నది రమణారావు భార్య ఆశగా.

''ఊరికే రాసిమ్మన్నా రాసిస్తాను." అన్నది సులోచన.

''నీకు పుణ్యం వుంటుంది ! ఆ మాట ఆ మనిషి ఎదట అనకు !'' అన్నాడు రమణారావు.

సులోచనకు నాటకం చూస్తున్నట్టుగా వున్నది.

దూత తొమ్మిది దాటగానే వచ్చాడు. అతగాడికి వేరేపని వున్నమాట అబద్ధమై వుంటుంది. అయిదువేల ఎర జీర్ణం కావటానికి ప్రైమిచ్చాడు అంతే !

"అయిదువేలు మరీ తక్కువండీ ! ఈరోజులలో ఎకరం పొలంకూడారాదు. మనోవర్తికింద ఇచ్చినా అయిదు వేలకు మొత్తం కానప్పుడు పత్రం రాసివ్వాలంటే—''అని రమణారావు నసిగాడు.

"అయ్యా, ఇట్లా లిటిగేషను పెట్టి ఏమీ లాభం ఉండదు. అవతల ఆయన ఉద్దండుడు. కోడలు రంకుపోయినదని కూడా సాక్ష్యం తీసుకురాగలడు. తెగ తెంపులే అనుకొని దీనికి ఒప్పుకోండీ ! మీమంచికోరే చెబుతున్నాను!'' అన్నాడు దూత.

''అధమం ఏడున్నర వేలైనా వుంటే—"

బేరం సాగింది. అరగంట అయాక దూత మహాత్యాగం చేస్తున్నవాడల్లే "అయ్యా, నా పూచిమీద ఇంకొక్క వెయ్యి తీసుకొని ఆ కాగితం రాయించి నా మొహాన పడెయ్యండి !" తెగేదాకా లాగటం మీకూ భావ్యంకాదు నాకూ భావ్యంకాదు. ఆ చేత్తోనే ఆ డబ్బు కూడా రశీదివ్పించండి !" అన్నాడు.

డబ్బూ పత్రాలూ చేతులు మారాయి

"డబ్బు ఏం చేస్తావ్ !" అన్నాడు రమణారావు.

"నీ ఎకౌంటులో వేసివుంచు !" అని సులోచన ఒక్క నిట్టూర్పు విడిచింది.

ఆ సాయంకాలమే ఆమె జగన్నాథాన్ని వెతుక్కుంటూ వెళ్ళింది. మాణిక్యాన్ని కాఫీ తెమ్మని పంపి ఆమె జగన్నాథంతో''మీరానాడు అడిగినప్రశ్నకు సమాధానం తేల్చుకున్నాను!'' అన్నది.

''ఏమిటది !'' అన్నాడు జగన్నాథం ఉద్రేకం అణుచుకోలేకుండా.

సులోచన తన హాండ్‌బాగ్‌లో నుంచి అతను రాసి ఇచ్చిన కాగితం తీసి అతనికి చూపించి, చించి ముక్కలు చేసింది.

జగన్నాథం ఇంత మొహంచేసుకుని, ''హ్వాటే పిటీ!" అన్నాడు.

"పిటి ఏం ? నేను ఒప్పుకుంటున్నాను !" అన్నది సులోచన.

ఒక్క గంతులో జగన్నాథం ఆమెను చేరి గట్టిగా వాటేసుకుని, ''ఫూల్ ! ఫూల్ !'' అన్నాడు.

కాస్సేపటికి మాణిక్యం కాఫీ కప్పులతో వచ్చేసరికి సులోచనా, జగన్నాథమూ డర్బీ గ్వెవ్ గెలుచుకున్నవాళ్ళ మొహాలు పెట్టుకొని కూచునిఉన్నారు...

నని" చెప్పాడు ఆ యుక్తిననుసరించే వుదయగిరి స్వాధీనం సాధించారు. ఆ సమయంలోనే మాదరసు తాను అజ్ఞాతా దేవియొక్క అనుచరవర్గం వాడనని చెప్పుకొన్నాడు— విజయం సాధించిన పిదప తాను కోరిన ప్రతిఫలం యివ్వవలెనని, అలా యిచ్చేటట్లు తిమ్మరుసుతో వాగ్దానం తీసుకున్నాడు. ఆ ప్రతిఫలమేదో ముందుగా అతను చెప్పలేదు — తిమ్మరుసు చెప్పితీరవలెనని పట్టుబట్టనూలేదు. ఆ రీతిగా వాడు దొంగలనాయకుడని తెలిసికూడా గత్యంతరంలేక తిమ్మరుసు మాదరసుతో ఒడంబడిక చేసుకున్నాడు — విజయానంతరం వడంబడిక విషయం వచ్చింగి. గజరాజ కుటుంబాన్ని, తనకు యిస్తానన్న ప్రతిఫలంక్రింద తనకు వశపరచవలసిందిగా మాదరసుడు కోరాడు. "వారెందుకునీ"కంటే అది మీకవసరమన్నాడు. మా రాణిగారి వుత్తరువది. మాకా ముగ్గుర్నీ యివ్వండి అని పట్టుపట్టాడు. తత్పర్యవసానం తిమ్మరుసు మాదరసు కోరికను నిరాకరించటం అతణ్ణి ఖైదులో తోయించటం జరిగింది. దుర్గంలో వీరరుద్రుడు మాయమైనాడు. రాణీ రాకుమారీమాత్రమే దొరికారు. మాదరసుకూ—వీరరుద్రుడు మాయమైపోవటానికి యేదైనా సంబంధం వుందేమోనని యీనాటికీ తిమ్మరుసు సంశోదిసూనే వనాాడు. "ఆ లూయిస్ చేతిలోని యీ వుంగరానికీ ఆ చోరనాయకురాలికీ యేదో సంబంధం వుండితీరాలి! రాజముద్ర చోరనాయకి కెలా లభించింది? రాజమాతహత్యకు, తిప్పాంబకు, రాణీ అజ్ఞాతకు సంబంధమేమైనవుందా? ప్రస్తుతం ఆ గాధనలా వుంచినా—ఈ విషమసమయంలో యీ వివాద వార్తను రాయలచెవిని వేయటం యెలా? మాతృదేవిని దైవంవలె మనసా పూజించు రాయలు మాతృవియోగాన్ని సహించి మనలగలడా? ఈ పాడు పోరాటం యేమికావాలి? ప్రతాపరుద్రుని కేమని ప్రత్యుత్తరం వ్రాయాలి? గజపతిపుత్రి యేమైపోయినట్లు?" —తిమ్మరుసు బుర్రలో యుద్ధం జరుగసాగింది.

ఎప్పుడో చెప్పవలసిన ఒక విషయాన్ని యిప్పుడైనా చెప్పుకుందాం: రాజముద్రిక లూయిస్ చేతిలోపడి. వుదయగిరి ఖజానా, ఖైదుఖానాల్లో మోసాలు జరిగిన తక్షణం తెలివిగల తిమ్మరుసు రాజమొహరులో మార్పు చేయించి పాత "ముద్దుటుంగరాన్ని" పనికిరానిదాన్నిగా చేసివేశాడు. ఎంతసేపో తిమ్మరుసు యిలా యేమీతోచని, యేమీచేయలేనిస్థితిలోపడ్డాడు. ఎట్టకేలకు యే నిర్ణయానికోవచ్చి ప్రతాపరుద్రునికి ప్రత్యుత్తరం సిద్ధపరిచాడు: తరువాత తడబాటు నడక నడుస్తూ రాయల మహారశిబిపుదిక్కుగా బయలుదేరాడు బరువు గుండెతో:

(సశేషం)



# జీవన వలయం

శారదా అశోకవర్ధన్

"సంపత్ పోయాట్ట తెలుసా అంది మాలతి.

ఉలిక్కిపడ్డాను "సంపత్ పోయాడా? ఎప్పుడు? ఎలాగ?"

"మొన్నరాత్రి పోయాడు. ఏదో రోగాలంటుకున్నాయట. అయినా శోభా నీకు తెలీదా? అతను పోయినట్టు" ఆశ్చర్యంగా అడిగింది మాలతి.

"న్యాయంగా తెలియవలసిందే కాని తెలీలేదు. నేను వారంరోజుల్నుంచీ ఊళ్ళోలేనుగా. స్నేహితుని పెళ్ళికెళ్లొచ్చాం. నల్లగొండ. అందుకే తెలీలేదు"

అన్నాను విచారంగా. "నీ తలకాయ్. అతను మంచంపట్టి ఆర్నెల్లయిందిట. మీ అత్తయ్య కొడుకేగా. పరాయివాళ్లా తెలీకుండా వుండటానికి". "మాలతీ నువ్వనేది నిజమే. దగ్గర బంధుత్వమే వుంది. కానీ మామధ్య అంతులేని దూరంకూడా వుంది. అదే డబ్బు మహత్యం. మా అత్తయ్య కేవలం డబ్బు మనిషి. ప్రేమతో పలకరించడానికి వెళ్ళినా, తన డబ్బుకోసమే వొచ్చారనుకుంటుంది. అందుకే అయినవాళ్ళందరూ ఆమెకి దూరమయ్యారు. ఆ కొడుకూ, డబ్బు ఈ రెండే ఆవిడికి ప్రాణాలు" అన్నాను ఆవేశాన్నణచుకుంటూ.

మాలతి గట్టిగా నవ్వడం మొదలెట్టింది.

ఎందుకు నవ్వుతోందో అర్థంగాక వెర్రివాసిలా దాని మొహం చూస్తున్నాను నా అయోమయావస్థచూసి మాలతి మరింత నవ్వడం మొదలెట్టింది. ఒక్కసారిగా నవ్వాపి, "శోభా, ఈ లోకంలో ఎవరికి ఎవరూ ఏమీకారే. ప్రేమా, న్యాయం, బంధం, అనురాగం. అప్యాయతా అంతా మిథ్య, అంతాకల్ల, ఎవరి స్వార్థంకోసం వాళ్ళు అల్లుకున్న తీగెలవి, వాటి పేరుతో ఎదురివారిని బందీనిచేసి వారి స్వార్థానికీ, స్వలాభానికీ వాడుకుంటారు". ఉద్రేకంతో ఉపన్యాసంలా చెప్పుకుపోతోంది మాలతి.

"ఏమిటిలా మాట్లాడుతున్నానని ఆశ్చర్యపోతున్నావు కదూ! నువ్వు నమ్మవు నాకు తెలుసు.నువ్వూ ఆ బంధాలలో చిక్కుకున్న బందీవే కాబట్టి. తల్లీ పిల్లా అన్నా చెల్లె ఈ బంధాలన్నీకూడా డబ్బుముందు బలాదూర్,డబ్బుకులోకం దాసోహం డబ్బు...డబ్బు...డబ్బుంటే చాలు, ఏమైనాచెయ్యొచ్చు ప్రపంచంలో! ఎవడిక్కావాలి ప్రేమగీతాలూ, నీతి పాఠాలూ" ఆవేశంతో దాని మొహం ఎఱ్ఱబడింది. దుఃఖంతో దాని కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి కళ్ళు తుడుచుకుని మళ్ళీ చెప్పడం మొదలెట్టింది.

"మీ సంపత్ వైద్యం లేక చచ్చిపోయాడు తెలుసా?'' అంది.

"ఆఁ..." అన్నాను తెల్లబోయి.

"అవును! ఆశ్చర్యంగానే వుంటుంది. పరోపకార పరాయణుడు, సత్‌సంపన్న కుటుంబీకుడు, దాదాపు 2 లకారాలకు తక్కువ లేకుండా భార్య కొదిలిపెట్టి కేవలం, పేరు ప్రతిష్ఠలను తన వెంట గొనిపోయిన ధన్యజీవి, అంబరాల ఆంజనేయులుగారి ఏకైకపుత్రుడు, ఈనాడు సరియైనవైద్యంలేకఅర్థాయుష్షుతోకన్ను మూశాడంటే ఆశ్చర్యంగా నే వుంటుంది తల్లి చేతుల్లో బలిఅయినఅమాయకుడు" చెప్పుకుపోతోంది మాలతి.

అంతవరకూ ఓపిగ్గా వింటున్న నాకు మతిపోయింది దాని పిచ్చివాగుడికి ఒళ్ళు మండిందికూడా. ఎక్కడైనా కన్నతల్లి

తన బిడ్డను చేతులా చంపుకుంటుందా? తన ప్రాణాన్నడ్డుపెట్టేనాసరే తన బాబుని కాపాడుకుంటుంది. తన సర్వ స్వం ధారపోసి, తన పిల్లల ప్రాణాలు కాపాడుకుంటుంది. అసలు అమ్మ అనే పదంలోనే వుందే ఆ కమ్మదనం ఆకర్షణ' మాటరాని మూగజీవులు. పశుపక్షాదులు సయితం, బిడ్డలరక్షణకోసం పడేపాట్లు, కళ్ళారా చూసినవి, కథల్లోవిన్నవీలోలె డుంటే, మానవ జన్మనెత్తి అగ్రస్థానా న్నందుకున్న మాతృప్రేమనే లోకం శంకిస్తే, మరి జీవితంలో బంధమేది, జీవితానికి అర్థమేది'' నాలో నేనను కుంటూన్నట్టుగా, నాకు తెలీకుండా గట్టిగానే అనేశాను.

"నిజమే, అందుకే మొదలే చెప్పా నుగా నువ్వు నమ్మవని. ఈ లోకంలో కొన్ని సిద్ధాంతాలు స్థిరంగా నిలిచి పోయాయి. కన్నతల్లి అనగానే, తప్పక తన బిడ్డలకి రక్షణనిచ్చే కల్పవల్లియని అదే స్థానంలో సవతితల్లిగానీ, మరెవ రైనా గానీ వుండి నిజమైన ప్రేమతో, ఎంత త్యాగాన్ని చేసినా, "ఆ.. ఎంతైనా కన్నతల్లి అవుతుందా అని" అనకం మనకు పరిపాటి అయి పోయింది.

"శోభా నీకు జీవితంలో అనుభవం తక్కువ. పెద్దకుటుంబంలో పుట్టావు. గారాల పట్టిగా పెరిగావు తల్లిదండ్రుల ప్రేమకీ, అన్నదమ్ముల ఆప్యాయతకీ నోచుకున్నావు. నీకు అందుకే ఇతర ప్రపంచం తెలీదు. నే చెప్పినవన్నీ విని నీ ఇష్టమొచ్చినట్టు తీర్పునిద్దువుగాని" అంది గంభీరంగా మాలతి. దాని కంఠంలో ఏదో మరుగుపడిపోయిన సత్యాన్ని వెతికి తవ్వితియ్యాలన్నట్టుగా నిశ్చలత్వం గోచరిస్తోంది. చెప్పటం మొదలెట్టింది. "శోభా...మా కో అత్త య్యుండేది. ఆవిడకి చిన్న తనంలోనే అయిన కుటుంబంలో అబ్బాయితోనే యధావిధిగా పెళ్ళిచేశారు. అయితే భర్త కొంచెం కురూపి. దాదాపు పది సంవత్స రాలు వారి సంసారం చక్కగానే సాగింది నలుగురు పిల్లల తల్లి అయింది. ముగ్గురుఆడపిల్లలూఒకమగపిల్లాడూనూ. తల్లీ తండ్రి, అత్తా మామా ఎంతో సంతోషించేవారు ఆ పిల్లల్ని వారి సంసారాన్ని చూసి. కానీ ఏంజరిగిందో తెలుసా?" ప్రశ్నార్థకంగా తన కళ్ళ ల్లోకి మాస్తూ కూర్చున్నాను. ఏంజరి గిందోనన్న కుతూహలంతో "ఒక శుభముహూర్తాన ఉన్నట్టుండి ఆమె లేచిపోయింది. తన సంసారాన్ని భర్తనీ పెద్దల జాలికీ భగవంతుడి దయకీ ఒదిలేసి."

"మరి పిల్లలేమయ్యారు? అందరూ చంటిపిల్లలంటున్నావే? వారి నెవరు పెంచారు? ఆవిడ తిరిగిరాలేదా? ప్రశ్నల పరంపర కురిపిస్తూన్న నన్ను చూసి "ఆగుమరీ" అంటూ మళ్ళీ మొద




లెట్టింది మాలతి. "60 ఏళ్ళ నాయనమ్మా 80 ఏళ్ల తాతయ్యా పెంచారు. ముగ్గురు ఆడపిల్లలకి చిన్నతనంలోనే ముచ్చటగా పెళ్ళిళ్ళుచేసి ఒక యింటి వాళ్ళనుచేశారు తల్లిలేకపోతే నాయనమ్మ దగ్గరో అమ్మమ్మ దగ్గరో పెరగటం సహజంకానీ, తల్లి బ్రతికుండి పిల్లలు, అమ్మఅని పిలుచుకునే భాగ్యానికి నోచుకోలేదంటే ఆపిల్లల హృదయాల్లో గూడు కట్టుకున్న బాధ ఎవరికి అర్థమవుతుంది పెళ్ళిపందిట్లో ఆ కొఱత ఎంతగా కనబడిందో, పందింట్లో మంచున్నవారి కన్నీళ్ళు చెబుతాయి." నిజంగా దాని మాటలు వింటూవుంటే అక్షణంలో నాకు ఏమిటో ఏడుపొచ్చినట్టనిపించింది.

"మరి ఆవిడ సంగతేమిటి ? కనీసం ఈ పిల్లల్ని చూడటానికికూడా ఒక్కసారైనా రాలేదా ."

"లేదు, ఆమె మరో పెళ్ళి చేసుకుంది. ఆ భర్తకు ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళూనూ, ఒకకొడుకు పుట్టు మూగ, పెద్దమ్మాయికి బ్రహ్మ చెవుడూనూ. ఈ పిల్లలు చేతికందకుండానే అతను కళ్ళుమూశాడు. తరవాత ఈ బిడ్డలపోషణకోసం ఆమె పడ్డపాట్లు తలుచుకుంటే గుండె చెరువవుతుంది" అంది మాలతి." నాకు ఆశ్చర్యం వేసింది.

"ఏమిటే నువ్వంటూన్నది. మొదటి భర్తకు పుట్టిన నలుగురు పిల్లల్ని గాలి కొదిలేసి ఈ పిల్లల పెంపకంకోసం అష్టకష్టాలుపడిన ఆమెని ఏమనాలో

అర్థంకాలేదు. హృదయంలేని కఠినాత్ము రాలా? ప్రేమాభిమానాలూ బాధ్యతా ఎరుగని ప్రోడా అంటే తరవాత పుట్టిన పిల్లలకోసం రెక్కలు కొట్టుకుని తన కడుపు మాడ్చుకునైనా వారిని పోషించి, వృద్ధిలోకి తేవడానికి బాధలు పడుతోంది. మరి ఈ బాధ్యతా ప్రేమా అవన్నీ అపనికందులపై లేవేమిటి? భర్తనచ్చకపోవచ్చు. ఆయింట్లో వాళ్ళూ నచ్చకపోనచ్చు. కానీ నవమాసాలూ మోసి, కని, వొళ్ళోపడుకోబెట్టుకుని చను పాలు త్రాగించిన తల్లికి, పిల్లలందరూ ఒక్కటేకాదా? మాతృదేవతకే పక్ష పాతం వుంటే మనుగడ సాధ్యమా? కానీ ఆమె కనీసం, ఒక్కసారైనా వాళ్ళని చూడటానికి రాలేదంటే ఏమం టావ్?" ప్రశ్నించింది మాలతి.

ఏమిటో మనస్సంతా వికలమై పోయింది ఏది నమ్మాలో, ఏది నమ్మ కూడదో తెలియని అయోమయావస్థలో పడ్డాను. అది గ్రహించిన మా మాలతి, టాపిక్ మారుస్తూ "శోభా...ఈసోదంతా ఇప్పుడెందుకులేగానీ, కాస్త కాఫీ ఇవ్వు, నీ చేతి కాఫీతాగి చాలా రోజులయింది" అంది. "అయ్యో నా తెలివి తెల్లవారా. కాఫీ కలిపిపెట్టి నీ మాటల్లోపడి మరిచే పోయాను" అంటూ వెళ్ళి చల్లారిపోయిన కాఫీని వేడి చేసి, రెండు కప్పుల్లోపోసి దానికోటిచ్చి, నేనోటితీసుకున్నాను. నోటికి వేడి కాఫీసిప్ తగలగానే బుఱ్ఱలో మళ్ళీ ఆలోచనలు రింగులు తిరగ సాగాయి. "అమ్మాయిగారింకా ఆలో చనల్లోంచి తేరుకోనట్టుంది" అంది నవ్వుతూ మాలతి.

"ఒక్క విషయం నాకర్థం కావడం లేదే మాలతీ, మా అత్తయ్య ఎంత డబ్బు మనిషైనా కొడుకుని మాత్రం పువ్వులా పెంచింది. నాకు బాగా జ్ఞాప కం. సంపత్‌ని ఎవ్వరితోటీ చేరనిచ్చేది కాదు. చెడు సహవాసాలబ్బి పాడైపోతా డని. అందుకే వాడికి పదహారుఏళ్ళువచ్చే దాకా పేరంటానికికూడా తనతో తెచ్చేది కాదు వాడికిరెండుచెంచాలకన్నా ఎక్కువ పెట్టేదికాదు అన్నం, ఏమడిగినా తినటాని కిచ్చేదికాదు, అరముక్క బిస్కెట్టు తప్ప, అజీర్ణంచేసి జబ్బులొస్తాయని, అంత జాగ్రత్తగా పెంచిందే ఆమె, ప్రేమ లేకుండానే చేసిందంటావా?"

అదోలా నవ్వింది మాలతి.

"శోభా! ప్రేమలేదని అనను. కాని ఆమె మొదటి ప్రాణం డబ్బు. తరవాతే కొడుకు. చెంచాల అన్నంపెట్టి, ఏదీతిన డానికి ఇవ్వకపోవడంలో ముందు పాయింటు ఆవిడకి పొదుపు. తరవాతే వాడి ఆరోగ్యాన్ని గురించిన బెంగ. ఇహ ఎవ్వరితోటీ అతన్ని కలవనివ్వ కుండా జాగ్రత్తపడడం, చెడిపోతాడన్న బెంగకంటే, తమలాంటి ధనవంతుల బిడ్డ, మామూలు వాళ్లతోకలిసిమెలిసి ఉండకూడదని తెలుసా? అంతా




స్వార్థం. వాడిబాగోగులు చూసే తల్లే అయితే,వాణ్ణి ఆవిధంగా పెంచి వుండదు, నాలుగుగోడల మధ్య తనకొంగు చాటున. దానివల్ల ఏమైంది ? ఆమె స్వార్థానికి, వీడు బలయ్యాడు. నలుగురిలో మాట్లాడటం చాతకాక, లోకపుతీరు తెలుసుకునే అవకాశం లేక సమాజంలో చవటగా కట్టుబడిపోయాడు. నలుగురిలో నవ్వుల పాలైపోయాడు. ఇలా చాలామంది స్త్రీలు తమ మూర్ఖత్వంవల్ల తమ పిల్లల భవిష్యత్తు చేజేతులా నాశనం చేసుకుంటారు. చివరికి ఏంజరిగిందో తెలుసా ? నువ్వు ఊహించనైనాలేవు. రెచ్చగొడితే పిల్లిపిల్ల కూడా పులిపిల్లలా విజృంభిస్తుంది. లోకంకూసే కూతలకి పౌరుషమే ఒచ్చిందో . లేక, తనలో నిద్రాణమై వున్న కోరికలు ఒక్కసారి చెలరేగి ఎదురుతిరిగాయో కానీ సంపత్ మధువూ, మగువా రెంటికీ అలవాటుపడి జబ్బులు కొనితెచ్చుకున్నాడు'' చెప్పటం ఆపింది మాలతి. టేబులుమీదున్న వక్కపొడి నోట్లో వేసుకుంటూ. ''మాలూ! నువ్వేమైనా చెప్పుకానీ,సంపత్ ఇటువంటి పన్లు చేశాడంటే నమ్మను'' అన్నాను. నా అభిప్రాయానికి తిరుగులేదన్నట్టు.

"నువ్వనేది నిజమే సంపత్ తనకు తానుగా ఎటువంటి పరిస్థితిలోనూ, ఇటువంటి పన్లుచెయ్యలేదు. కానీ సంఘంలో, కొన్ని• చీడపురుగులు ఎప్పుడు ఎవరిని పడదామా అని, ఎదురుచూస్తూ వుంటాయి. ఆటువంటివారి చేతుల్లో పడి నశించేది, ఇటువంటి అమాయకులే.

జాలరిలా వలవేసి పడతారు ఇటువంటి చేపల్ని. కొన్ని వలలో చిక్కుకుని గిల గిలా కొట్టుకుంటూవుంటే చూసి ఆనం దిస్తారు. తరవాత స్వాహాచేస్తారు. మళ్లీ కొత్తచేపలకోసం ప్రయత్నాలు చేస్తారు. రాక్షసులు, డబ్బుకోసం గడ్డితినే పశు వులు, కొంపలుకూల్చే కోడెత్రాచులు. కుళ్లువాసనలను పట్టుచీరలతో కప్పుకునే కపట వేషధారులు. వీరిచేతుల్లో సంపత్ లాంటి అమాయకులే ఆహుతైపోతారు'' ఆవేశంతో ఊగిపోతోంది మాలతి. దాని కళ్లు రౌద్రంతో చింతనిప్పుల్లా మెరుస్తూ న్నాయి నాకు భయంవేసింది, దాని ఆవేశంచూసి. "మాలూ" అన్నాను, దాని చెయ్యిపట్టుకుని ''

"అవును శోభా! నువ్వు ఇంట్లో వున్న దానివి నీకివేవీ తెలీవు పదిమందిలో వివిధ మనస్తత్వాల వారి మధ్య మెలు గుతూ, ఉద్యోగంచేసే నాకు తెలుస్తుంది ఈ గొడవంతా'' అంది. ''మాలూ" అన్నాను మళ్లీ దానిధోరణి మార్చాలని. "ఊ'' అంది ఎంతో నిదానంగా.

''హమ్మయ్య" అని ఊపిరిపీల్చు కుని, ''అవును గానీ మాలూ, ఇందాకటి నుంచి చూస్తున్నాను నీధోరణి, ఆడ వాళ్లను దుయ్యబడుతున్నావు కానీ ఇటు వంటివారిని ఆదరించి ప్రోత్సహించే, మగవారినేమంటావ్? వారి లాలనా, పాలనా చూసేగా, ఇటువంటి ఆడవాళ్లు విఱ్ఱవీగటం. నన్నడిగితే, వీరిని చేర దీస్తున్న మగవాళ్లదేతప్పంటాను ముమ్మా టికీను'' అన్నాను. మళ్లీ మాలతి అదోలా నవ్వింది. నాకు తెలుసు. మా మాలు అలా నవ్విందీ అంటే ఆ నవ్వు వెనక వేనవేల అర్థాలుంటాయని. అందుకే దాని మొహంలోకి చూస్తూ ''కాదంటావా'' అన్నాను. "కాదనను. కానీ నువ్వనేది పూర్తిగా ఒప్పుకోను. చూడూ ఆడదాని ఓరచూపులకీ, కిలకిలలకీ, చలించని పురుషుడంటూలేడు. ఉన్నానని ఎవరైనా చెబితే అతనికి నిజంచెప్పే ధైర్యంలేక ఆత్మవంచన చేసుకుంటున్నాడంటాను. స్త్రీని ప్రకృతితో పోల్చారు కవులు. ప్రకృతిలో ఒకభాగమే స్త్రీ. ప్రకృతి పులకింతకి పులకించని పురుషుడు వున్నాడూ అంటే అతను సర్వసంగ పరి త్యాగియై పంచభూతాలనూ జయించిన యోగి అయినా అయ్యుండాలి, లేదా మోడులా జీవించే హృదయంలేని మని షైనా అయ్యుండాలి. ప్రకృతిలోని శక్తి నంతా వుంజుకున్న మగువ, మగాడిని బొమ్మలా, కమ్మగా కవ్విస్తుంది రంభలా ఆడిస్తుంది. సత్యభామలా పాదా క్రాంతుణ్ణి చేసుకుంటుంది తన శక్తిని గ్రహించిన లలన! విచ్చి విచ్చి వేష ధారణతో, విచ్చలవిడిగా తిరుగుతూ స్వైరవిహారం చేసే మనకి లేని పరువు మగాడికెందుకూ? అతనూ సై అంటాడు. అతనిని రెచ్చగొట్టి రచ్చకీడ్చడం భావ్య మంటావా? చెప్పు?

"నువ్వన్నదీ నిజమే. అవయవాలను దాచే ఆరుగజాల చీరకి బదులు అంగ సౌష్టవాన్ని ఎత్తిచూపే బెల్ బాటములూ, లుంగీలూ వొచ్చాయి. చూడకుండా కళ్లు మూసుకోంగదా."

''అదికాదు నేననేది కాలాన్ని బట్టి మనుషులూ మారాలి. ఆహారవిహారాదులన్నింటిలోనూ మార్పు రావడం సహజం. కానీ సమయాన్ని బట్టీ, సందర్భాన్నిబట్టీ వేషధారణ. పదిమందిలో ఉద్యోగాని కొచ్చినప్పుడు సింపిల్‌గా నీట్‌గా వుండాలి. భర్తతో పార్టీకి వెళ్లినప్పుడు మనిష్టం. మనలో నిగూఢమైయున్న శక్తుల్ని మంచిపనులకై వినియోగించుకోవాలి. పట్టుదలా, కార్యదీక్షా, ఓపిక, సహనం, క్షమాగుణం, ఇవన్నీ ఆడవాళ్లకి భగవంతుడిచ్చిన అభయాలు. వీటితో సాధించలేనిదంటూ ఏదీలేదు. అందుకే అవకాశాలుంటే ఆడవాళ్లు అన్నిరంగాలలోనూ అగ్రగణ్యులవుతున్నారు. గృహనిర్మాణ కార్యక్రమాలలోనూ, రాజకీయ చతురతలలోనూ, ఇంటాబయటా కూడా ఉత్తమ స్థానాన్ని పొందుతోంది స్త్రీ. అంటే అంతటి శక్తివంతురాలన్నమాట. శక్తికి మారుపేరే స్త్రీ. ప్రళయానికీ పతనానికీ మారుపేరుకూడా స్త్రీయే—"ఉద్రేకంతో చెప్పుకుపోతోంది మాలూ. "ఆఁ... ఆఁ...చాల్లే తల్లీ ఉపన్యాసం... అసలే ఒకప్రశ్నకి నాలుగు సమాధానాలు చెప్తావునువ్వు.అందులోనూ కవయిత్రివి. ఇప్పుడు ఉపన్యాసం మొదలెడితే, వినే ఓపిక లేదు నాకు. చాలా అలిసిపోయావ్ కానీ టిఫిన్ తిందువుగాని పద" అంటూ లేచాను. "నువ్వన్నదీ నిజమే. ప్రణయానికీ ప్రళయానికీ కూడా స్త్రీయే కర్త." అంటూలేచాను, టిఫిన్ పెట్టడానికి. "సరే పద. ఇదీ ఒకబంధమే. ప్రేమా, అను రాగం, అసూయ, ద్వేషం, త్యాగం, స్వార్థం, ఇవన్నీకూడా జీవనవలయంలో కొన్ని భాగాలు" అంటూ నా వెనకాలే వస్తూన్న మాలతికేసి చూసి, మావారు, ఎప్పటినుండి వింటున్నారో మా సంభాషణ "చూడండి మాలతిగారూ...జన్మనెత్తిన ప్రతివ్యక్తీ ఈ వలయంచుట్టూ ప్రదక్షిణం చెయ్యవలసిందే. విజ్ఞులు కొన్ని ప్రదక్షిణాలుచేసి ఈ పరిధిని దాటి ఆవలి అంచులు చూడటానికి ప్రయత్నిస్తారు. అదే ముక్తిమార్గం. అజ్ఞాని ఆ వలయంలోనే తిరిగితిరిగి వేసారి, ఆవలి అంచులు చూడకుండానే అంతమౌతాడు. ఇదే జీవిత రహస్యం. ఇంతకీ ఇవాళంతా ఫిలాసఫీ లోకిదిగిందే ధోరణి బావగారిమీద అలిగిరాలేదు కదా" అంటూ నాచేతిలోని వేడివేడిగా నోరూరిస్తూన్న ఆవడలను చూసి, టిఫిన్ పళ్లెంతో మాలతి వెనకాల క్యూలో నుంచున్నారు లొట్టలువేస్తూ.


మాట్లాడితే కరుస్తుంది మా ఆవిడా!
నువ్వు అదృష్టవంతుడివి! మాట్లాడకుండానే కరుస్తుంది మా ఆవిడ!!
సుచిత్ర


నువ్వైనా పెరిగి పెద్దవాడివై గొప్పవాడివి కావాలి బాబూ!
ఊహూ – నాకొద్దు! నేనూ నీలాగే అవుతా!!



# వరాల తండ్రి * కిరణ్ కుమార్

వానా కాలం—

వానలు కురవటం లేదు!!!

ఒంటిమీద ఏ ఆచ్ఛాదనాలేని ఆకాశాన్ని చూసి సిగ్గుపడినట్టున్నాడు భానుడు. పశ్చిమ శిఖరాలలో నుంచి మెల్లగా దాటుకుంటున్నాడు.

మునిసిపాలిటీవాళ్ళ అరుపులకు జడవకుండా మూసీనది పక్కనే గుడిసె వేసుకుని సంసారం సాగిస్తూన్న లక్ష్మమ్మ ఆ పూట పనిలోకి వెళ్ళలేదు.

మధ్యాహ్నం నుంచీ చిన్నవాడు విపరీతమయిన జ్వరంతో పలవరింతలు పెడుతున్నాడు. పెద్దపిల్ల సీతకు ఆరేళ్లు వచ్చినా జ్వరంతోవున్న ఎనిమిది నెలల కిష్టిగాడ్ని సముదాయించుకునే శక్తి లేనిది. పోనీ, మొగుడు వెంకన్న రిక్షా తొక్కటం ఆపి మధ్యాహ్నం బువ్వకయినా ఇంటికొస్తాడేమో — అతనికి కుర్రాడ్ని అప్పచెప్పి పనిలోకి వెళదాం అనుకుంది లక్ష్మమ్మ. వెంకన్న బువ్వకి రానేలేదు!

గవర్నమెంటు ఆఫీసులో ఆఫీసరుగా పనిచేస్తూన్న రంగనాధం ఇంటిలో పని

చేస్తూంది లక్ష్మమ్మ. తెల్లవారి తొలికోడి కూసిన సమయానికి పనిలోకి వెళ్ళుతుంది వంటగిన్నెల్ని తోమటం, నీళ్ల డ్రమ్ముల్లో పట్టటం, బాయిలర్ వెలిగించి వేడినీళ్లు కాగపెట్టటం, అయ్యగారికి అమ్మగారికి నీళ్లు స్నానాలకి బాత్ రూములో పెట్టటం, వాళ్ళ ఒక్కగా నొక్క మురిపాలమూట "రాజా"కు నీళ్లుపొయ్యటం, బట్టలుతకటం, వాటిని ఆరవెయ్యటం, అమ్మగారు వంటపనులలో నిమగ్నమయినపుడు రాజాను ఎత్తుకుమొయ్యటం, ఏడ్చినప్పుడు పాలు పట్టటం, ఈ పనులన్నీ పూర్తయేసరికి సూర్యుడు నెత్తిమీదకొస్తాడు. అమ్మగారిచ్చే అన్నం కూరలు అవీ తీసుకుని అప్పుడు ఇంటికి వెళ్ళుతుంది లక్ష్మమ్మ.

ఒకగంటసేపు కుర్రాడ్ని ఆడించుకోకుండానే మళ్ళీ పనిలోకి వెళ్ళుతుంది లక్ష్మమ్మ. పనంతా పూర్తిచేసుకుని ఇంటికి రాత్రి ఎనిమిదికొట్టితేగానీ చేరుకోదు.

రంగనాథం ఇంట్లో పనిలో చేరిన కొత్తల్లో కిష్టిగాడు మరీ పసిబిడ్డవటాన తనతోపాటు తీసుకుని వెళ్లేది.

అరుణమ్మ — రంగనాథం భార్య ఆర్ద్రహృదయం కలదైనా లక్ష్మమ్మ పని చేస్తూ చేస్తూ కిష్టిగాడు ఏడవంగానే వాడికి పాలివ్వటానికని, ఎత్తుకోవటానికనీ, పరుగెత్తటంతో కోపంతో చురచురలాడేవి. ఆమె బిడ్డకూడా పసివాడే అయినా సమయానికి అన్నీ అవసరాలూ తీర్చటంతో ఏడుపే ఎరగడు. ఒకనాడు కిష్టిగాడు జలుబు చేయటాన విపరీతంగా ఏడ్చాడు. లక్ష్మమ్మ ఏ పనీ సరిగ్గా చేయలేకపోయింది ఆ రోజు. అరుణమ్మకు కోపంవచ్చి రేపట్నుంచీ నీ కొడుకుని వెంబడి తీసుకరాక అని ఆజ్ఞాపించింది—అమ్మగారు తేవద్దంటే కొడుకుని తనెలా తీసుకెళ్ళగలదు. తీసుకు వెళ్లితే పనిలోనుంచి మానెయ్యమంటె! నెలకి వచ్చే పదిహేను రూపాయలూ పోవటమే కాదు. ప్రతిరోజూ దొరుకుతూన్న కూడుకూడా పోతుంది! లక్ష్మమ్మ ఆరోజునుంచీ తనతోపాటుగా కిష్టిగాడ్ని తీసుకువెళ్ళలేదు.

*　　*　　*

రాత్రి తొమ్మిది గంటలయినా వెంకన్న రాలేదు. లక్ష్మమ్మ చేతిలో ఒక్క పైసాకూడాలేదు. డాక్టరు దగ్గరికెళ్లి 'మందుకు పైసలు రేపటేల ఇచ్చుకుంటా దొరా' అని చెప్పుకుని కుర్రాడికి మందుతెచ్చింది.

డాక్టరు చెప్పినట్టు గంటగంటకూ ఒక చెంచాడు చొప్పున మందుపోస్తూ, గాలికి వూగుతూన్న కిరసనాయిలు దీపానికి ఒక పక్కగా పడుకుని సుఖంగా నిద్రపోతూన్న సీతనుచూస్తూ కూర్చుంది లక్ష్మమ్మ.

వాతావరణం ప్రశాంతంగా వుంది. అంతవరకు ఆకలితోవున్న సింహం

అరిచినట్టు శబ్దంచేసిన పట్నం, మన్ను తిన్నపాములా నిద్రపోతూంది.

ఎప్పుడైనా సిటీ బస్సుల డమ డమ శబ్దం తప్పించి ఎటువంటి ధ్వనులూ వినిపించటం లేదు.

దూరంగా, మూసీనదికి ఆవలి వడ్డు నున్న మునిసిపాలిటీ ఆఫీసువద్దనుంచి గంటలు వినిపిస్తున్నాయి. పదకొండు లెక్కపెట్టింది లక్ష్మమ్మ.

'ఆడు ఏద తొంగున్నాడో! రిక్షా లోనే ఏ సినిమాహాలు కాడో పడుం టాడు. పెళ్ళాం బిడ్డల పూసేవుండదు గందా ఆడికి' అనుకుంది లక్ష్మమ్మ.

లక్ష్మమ్మకు అరుణమ్మగారు గుర్తు కొచ్చింది — 'అమ్మగోరు ఏమను కుంటూండాదో! దొంగ చచ్చింది. ఇయ్యాల నాగా పెట్టేసినాది, అను కుంటాది. ఈ నెల్లో ఇది ఆరో నాగా! కావాలని పనిమానినానా ఏంది ... అయితే, నా పిచ్చిగానీ గొప్పింటోరికి నాకష్టం సెప్పితే తెలుస్తదా ఏమ న్నానా! నస్కులో అంట్లు తోమి య్యందే అమ్మగోర్కి యమకోపం వచ్చే స్తాదయ్యే! నేకనేక పుట్టిందేమో 'ఉం' అంటే భరించలేదాయె. అమ్మగోరు పొద్దుటేల వంటకూర్కున్నంత సేపూ నాకు తప్పదు గందా చినబాబును మొయ్యటం.చినబాబు ఈడి కన్న రెండు నెల్లు చిన్న. ఆరినెత్తుకున్నంత సేపూ ఈడే యాదకొస్తాడు......ఈడు నా కడుపున పుట్టిండుగానీ అదే గొప్పింటో ళ్లకు పుట్టుంటే! అయినా ఈడికేం... నాముద్దుల మూట. ముత్యాల చెండు.' కిష్టిగాడి తల నిమిరి ముద్దు పెట్టుకుంది ల

అరుణమ్మగారు మళ్ళీ కళ్లల్లో మెది లింది లక్ష్మమ్మకు— 'అరుణమ్మగోరు మంచిదే. కొంచెంగా అనుమానం. నన్ను ఎన్ని ఇదాల చూసినాక పనిలోకి తీసు కున్నాది. నాకు ముందుగా ఆరి కొంపలో పనిచేసిన నరసమ్మ దొంగతనం చేసినా దంట. అందుకనే నాకు అన్ని ఇమ్తి హాన్లు పెట్టుంటాది......నాగా ఎడితే అగ్గి పోతాది గానీ లేకుంటే మంచిగానే చూస్తది. జరంత కోపం జాస్తి అంతే!... ఈడికిదేందోగానీ ఈ నెల్లో ఇది మూడో తూరి జబ్బు రావటం. ఊళ్లో మారెమ్మ న్నాదని సెప్పింద్రు. అదికాదన్నాడు డాక్టరుబాబు. మరేందై వుంటాది? ఒక్క తూరే వొళ్లు ఇంత ఏడిగా ఎందు కయి నాది? ఈ జ్వరం ఏదో డాక్టరు బాబుకే సమజికి రాటం లేదంట! ఏడి కొలిస్తే నోటారున్నాదన్నాడు డాక్టరు బాబు.' లక్ష్మమ్మ ఆలోచనలు వరుసా వాయీ లేకుండా ఒకదాని మీదనుంచి మరో దాని మీదికి పరుగెడుతున్నాయి. కిష్టి గాడి జ్వరం, సీత నిశ్చింతగా నిద్దర పోవటం, వెంకన్న ఎంత రాత్రయినా గుడిసెకి రాకపోవటం, అరుణమ్మ మాటలు—రంగనాధం అరుపులూ–అన్నీ

లక్ష్మమ్మ మనసును ఆక్రమించాయి. ఒక్కటీ ఆమెను వదలటంలేదు.

వెయ్యి ఆటంబాంబులు ఒక్కసారి బ్రద్దలయినట్టు, అథాట్టుగా ఆకాశాన్ని అప్పుడంలా విరిచివేస్తూన్నట్టు శబ్దం వినిపించింది. హోరున వర్షం కురవటం ఆరంభించింది. గుడిసె కురుస్తూంది. 'ఏందబ్బా! సెప్పకా పెట్టకా ఒక్కతూరే వచ్చేసినాది వోన' అనుకుంది లక్ష్మమ్మ.

కాంతితో వచ్చే సూర్యుడిలా, వెన్నెలతో వచ్చే చంద్రుడిలా, సీటితో వచ్చే విద్యుత్తులా వర్షంతోపాటు, గాలి వీయటం మొదలెట్టింది.

కాటునేసి పారిపోతూన్న పాము దొరకంగానే కర్రతోబాదుతూన్న మనిషిలా చాలాకాలంనుంచీ కురవలేదని తనను తిట్టుకుంటూన్న ప్రజలకు గుణపాఠం వచ్చేట్టు కసితీరా కురుస్తూంది వర్షం.

గుడిసె చుట్టూవున్న నీళ్లు అభిమన్యుడు పద్మవ్యూహంలోనికి చొరబడిన రీతిగా గుడిసె తలుపుకు, అడ్డుగా వున్న రాళ్లను ఛేదించుకుంటూ లోనికి చొరబడ్డాయి.

'అమ్మా, ఏందే నీల్లు' అంటూ లేచింది సీత.

'వర్షం కురుస్తూండాదే' అంది లక్ష్మమ్మ.

అర్జునుడి రథపు నీల పూడి ఆకాశం మీద దొర్లుతూంటే ఆ నీలను ఒక కొత్త గోళం అనుకుని — అమెరికావాళ్లూ, రష్యావాళ్లూ తయారుచేసిన ఆటం బాంబుల్ని దాయటానికని రాకెట్ల ద్వారా అక్కడికి రవాణా చేస్తే ఒకటికి మరొకటి 'ఢీ' కొన్నట్టున్నాయి. మెరుపులు ఫెళఫెళమని శబ్దం చేస్తూ ఆకాశం ఒక క్షణం పాటు కాంతి వెదజల్లింది.

'అమ్మా భయ మేస్తుండాదే!' సీత లక్ష్మమ్మను కావలించుకుంటూ అంది. లక్ష్మమ్మకుకూడా గుడిసెలో వుండటానికి భయంగా వుంది.

బైట వర్షం! విపరీత మయిన వర్షం!! భూమినే మింగేసే వర్షం!!!

చీకటి. కటిక చీకటి. తారు రోడ్డు కనుపించని కారుచీకటి ఎక్కడికని పోతుంది.

'రాక రాక వచ్చినాది గండా అనుకుంటే, ఏందిరా దేవుడా ఈ గాలివాన! మరాడి కసలే జ్వరంగా వుండాది. ఈ గాలివాన ఈడినేం చేస్తాదో! నీళ్లకు తడిసిపోతుండాడు. గుడిసె కొట్టుకుపోయేట్టుండాది. పోనీ అరుణమ్మగోరి ఇంటికి పోతే! ఈ వరుసంలో ఇంతపాటి జ్వరంతో వున్న ఈడ్ని చంకనేసుకుని మైలుదూరం ఎలా పోయేది?' అనుకుంది లక్ష్మమ్మ.

వెళ్లుమని ఉరిమిన ఉరుముకి సీత 'కెవ్వు' మని అరిచి తల్లిని గట్టిగా కావలించుకుంది. లక్ష్మమ్మ గుండె ఝల్లుమంది. వాన వెలిసిపోవాలని తనకు

తెలిసిన-తెలియని, దేవతల కందరకూ కూడా మొక్కుకుంది.

దొంగను కొట్టి కొట్టి అలసిపోయిన వాడిలా, ఎడారిలో నీటికోసం, దాహంతో పరుగెత్తి పరుగెత్తి అలసి పోయిన యాత్రికుడిలా ఆగిపోయింది వాన.

ఆకాశం మెరుపుల వల్ల విరిగిపోతుం దేమో నన్న భయంతో చంద్రుడు పారి పోయినా, దొంగాటాడుతూన్న పిల్లల్లా తొంగి తొంగి చూస్తున్నాయి నక్షత్రాలు. కుర్రాడ్ని ఎత్తుకుని, సీత చేయి పుచ్చు కుని గుడిసెలోంచి బైటకు వచ్చింది లక్ష్మమ్మ.

మసక మసకగా కనుపిస్తూన్న దారి వెంట మోకాలి లోతు నీటిలో అరుణమ్మ గారి ఇంటివైపుగా బయలుదేరింది.

అరుణమ్మగారి ఇంటి ముందు మూడు కార్లు, రెండు స్కూటర్లు ఆగివున్నాయి. ఇంటిలో వున్న లైట్లన్నీ వెలుగు తున్నాయి. లోపల్నుంచి ఇంగ్లీషులో మాట్లాడుకుంటూన్న ధ్వనులు వినిపిస్తు న్నాయి. లక్ష్మమ్మకు ఆ హడావిడి అంతా ఏమిటో అర్థంకాలేదు. ఆ సమ యంలో లోనికి వెళ్లటమా లేదా అని సందేహిస్తూ పిల్లల్తోపాటు ఇంటిముందే నుంచునుండిపోయింది; అప్పుడే ఇంట్లోంచి వస్తూన్న డాక్టర్ని చూస్తూ! కారు తలుపు తీస్తూన్న డాక్టరు దగ్గరికి బితుగ్గా వెళ్లింది లక్ష్మమ్మ.

'ఏం జరిగింది దొరా?' అనడిగింది మెల్లిగా.

డాక్టరు పరధ్యాన్నంగా 'జ్వరం' అన్నాడు.

'ఎవరికి దొరా?'

'కుర్రాడికి'.

లక్ష్మమ్మకు షాక్ తిన్నట్టయింది. 'రాజాకు జ్వరమా ! నిన్న పేల బాగానే వుండాడే, జ్వరంలాటిదేం లేదే! అను కుంటూ 'ఎన్ని డిగ్రీలు దొరా?' అమా యకంగా అడిగింది.

'తొంభై తొమ్మిది!' అంతవరకు పర ధ్యాన్నంగా జవాబులిచ్చిన డాక్టరు తేరుకుని లక్ష్మమ్మను ఒకసారి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసి 'ఎవరు నువ్వు?' అన్నాడు.

'ఈ ఇంటి పనిమనిషిని దొరా' అంది లక్ష్మమ్మ.

'అలాగా !' అన్నట్టు తల పంకించి కారు స్టార్టుచేసుకుని వెళ్ళిపోయాడు డాక్టరు.

'చినబాబు రాజాకు కూడా ఇవ్వాళ జ్వరం వచ్చిందా అన్నమాట! ఇంత జ్వరంతో వున్న కిష్టిగాడ్ని చంకనేసు కుని ఇంటిలోనికిపోతే అరుణమ్మగారు బాధపడతాదేమో! రంగనాథం అయ్య గోరు గొడవచేసి తోలేస్తారేమో!' అను కుంటూ ఇంటిముందే వుండిపోయింది లక్ష్మమ్మ.

చీకటిపోయి తెల్లవారి తూర్పు రేఖలు ఆకాశాన్ని ఆవరించసాగాయి.

లక్ష్మమ్మ లేచి సీతను తీసుకుని కిష్టిగాడితోపాటు తన గుడిసెకి బయలు దేరింది.

పటేల్ గారి తలకాయలా పైకప్పు లేకుండా నిబ్బరంగా వుంది గుడిసె. గుడిసె ముందు రిక్షాలో వెంకన్న కూర్చు నున్నాడు.

'వచ్చేసినావుటే లచ్చి, ఏమయి పోయినావో అనుకుని బెంబేలడిపోనా'. లక్ష్మమ్మను చూసి మొహం చాటంత చేసుకుని అన్నాడు వెంకన్న.

'నాన్నా' అంటూ తండ్రి కాళ్ళను చుట్టుకుంది సీత.

"మేం ఏందయిపోతే నీకేందిలే" అంది లక్ష్మమ్మ.

"కిష్టికి ఎలాగుండాది ?"

"నువ్వే చూడు."

కుర్రాడ్ని వెంకన్న కిచ్చింది లక్ష్మమ్మ.

"ఇంకా జ్వరం వుండాది" అన్నాడు కిష్టిగాడి వెన్నుమీద రాస్తూ వెంకన్న.

"ఇదిగో, నేను అమ్మగారి ఇంటి కాడకుపోయి ఇప్పుడే తిరిగొస్తా, పిల్లల్ని జర్ర చూస్తూ గుడిసెకాడే వుండు."

'అలాగే'.

"అలాగే అని దానికి కుర్రాడ్నిచ్చి రిక్షా తీసుకుపోక, ఆడికి జ్వరం ఇప రీతంగా వుంది" అంటూ వెళ్ళింది లక్ష్మమ్మ.

* * *

"ఏం మహాతల్లి ! నీకు ఇప్పటికి తీరుబాటు అయిందా, పనిలోనికి రావ టానికి."

అరుణమ్మగారి మాటలకు ఏం సమా ధానం చెప్పాలో తోచలేదు లక్ష్మమ్మకు. తల వంచుకుని నుంచుని వుండిపోయింది. ముందు గదిలో డాక్టరు బాబులు మరి కొందరు, కూర్చుని వున్నారు. అరు ణమ్మ కుర్రాడ్ని చూస్తూ మంచంమీద కూర్చుని వుంది. కుర్రవాడి టెంపరేచరు చూస్తూ నుంచునుంది నర్సు. రాజా నవ్వుతూ చేతులూ కాళ్లూ వూపు తున్నాడు.

"పో ఇంట్లోకిపోయి పనిచూసుకో" నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అంది అరు ణమ్మ.

లక్ష్మమ్మ వంటఇంటివైపు నడి చింది.

* * *

కుర్రాడ్ని డాక్టరు దగ్గరకు తీసుకు పోయి ఇంజక్షన్ ఇప్పించి తీసుకు వచ్చాడు వెంకన్న. 'ఇప్పుడే వస్తానని పోయిన లచ్చి ఇంకా రాలేదేందా' అను కుంటూ కిష్టిగాడ్ని ఎత్తుకుని కూర్చు న్నాడు.

మరొక గంట గడిచింది.

కిష్టిగాడు ఏడవటం మొదలెట్టాడు. వెంకన్న కూర్చునున్న వాడల్లా లేచి నుంచుని అటూఇటూ ఎత్తుకు తిప్ప సాగాడు. కిష్టిగాడు ఏడుపు మానలేదు.



"లలలల బబబ హాయీ" అంటూ దీర్ఘం తీసింది సీత. ఆ దారినే పోతూన్న 'సోదెమ్మ' తన సంచీలోంచి విబూది తీసి కొంచెం కిష్టిగాడి ముఖాన రాసి, వాడి వెన్నును తాకి "ఊర్కో బిడ్డా, ఊర్కో ఏడవక" అంటూ తన దారిన తను వెళ్ళిపోయింది.

మిట్ట మధ్యాహ్నం వరకూ లక్ష్మమ్మ తిరిగి రాలేదు. కిష్టిగాడు ఏడ్చి ఏడ్చి వెంకన్న చంకలో నిద్రపోయాడు. తను తెచ్చిన అన్నం గిన్నెను గుడిసెలో పెట్టి నిద్రపోతూన్న కుర్రాడ్ని ఎత్తుకుని వంటి వేడిని చూసింది లక్ష్మమ్మ. ఉదయం కన్న వళ్ళు వేడెక్కింది. లక్ష్మమ్మ కంగారుపడింది.

"జ్వరం ఎక్కువయితే డాక్టరుదొర ఈ మాత్రలు ప్రతి అర్ధగంటకూ వెయ్యమన్నాడు." చేతిలోని మాత్రల పొట్లం యిస్తూ అన్నాడు వెంకన్న.

"ఎంతసేపయినాది ఏసి ?"

"ఇంకా ఎయ్యనేలేదు !"

వేలవంగా "ఊ" అనుకుంటూ ఒక మాత్రతీసి కుర్రాడ్ని నిద్రలేపి మరీ వేసింది లక్ష్మమ్మ.

సాయంత్రంవరకూ మూసిన కన్ను తెరవలేదు కిష్టిగాడు. ప్రతిఅర్ధగంటకూ ఒక మాత్రచొప్పున లక్ష్మమ్మ వేస్తూనే వుంది.

వెంకన్న డాక్టరుదగ్గరికి కుర్రాడ్ని

తీసుకుని వెళ్ళివచ్చాడు. డాక్టరు వేరే మాత్రలు యిచ్చి పంపించాడు.

రాత్రి పదకొండు అవంగానే లక్ష్మమ్మకు నిన్నటిలా తిరిగి వర్షం ఎక్కడ వస్తుందోనని భయంవేసింది.

వర్షం కురవలేదు. కిష్టిగాడు కళ్ళు తెరిచాడు. వాడి వళ్ళు కొంచెంగా వేడి తగ్గినట్టు అనుకున్నారు భార్యాభర్తలు. తెల్లవారుతూండగానే కుర్రాడికి పాలిచ్చి పనిలోకి వెళ్ళింది లక్ష్మమ్మ. ఆ రోజు కూడా రిక్షా లాగొద్దని వెంకన్నకు చెప్పి మరీ వెళ్ళింది.

వెంకన్న గుడిసెదగ్గరే వున్నాడు.

అరుణమ్మగారి ఇంటిముందు నిన్నటిలా కార్లులేవు. స్కూటర్లూ లేవు. "చినబాబు జ్వరం తగ్గిపోయుంటాది" అనుకుంటూ లక్ష్మమ్మ ఇంటిలోకి అడుగుపెట్టింది.

'నిన్న సాయంత్రం రాలేదేమే ? అని అమ్మగారు అరుస్తే ఏంచెప్పాల.' అని ఆలోచించుకుంటూ ముందుగదిలోకి వెళ్ళింది.

గదిలో రంగనాధం, డాక్టర్లు ఎవరూ లేరు. అరుణమ్మ నేలమీద కూర్చుని వుంది.

లక్ష్మమ్మను చూసి "లక్ష్మి అయిపోయిందే, అంతా అయిపోయింది." అంటూ పెద్దగా ఏడ్చింది అరుణమ్మ.

గుండె ఆగినంత పనయింది లక్ష్మమ్మకు.

చినబాబు రాజా చనిపోయాడని చెప్తూ వికృతంగా నవ్వుతూన్న అరుణమ్మను చూసి దిగ్భ్రాంతిచెందింది లక్ష్మమ్మ.

'తొంభై తొమ్మిది జ్వరాన్ని అంత మందిడాక్టరుదొరలు తగ్గించనేకపోనారా ఏటీ ఇచిత్రం ?' అనుకుంది.

"నలుగురు డాక్టర్లు కలసి కూడా నా పసివాడ్ని వరాల తండ్రిని బ్రతికించ లేకపోయారు." అరుణమ్మ రోదనను భరించలేకపోయింది లక్ష్మమ్మ.

చినబాబు రాజా ఉదయమే అంతు తెలియని జ్వరంవల్ల మరణించాడని విన్న వెంటనే లక్ష్మమ్మకు కిష్టిగాడు జ్ఞాపకం వచ్చాడు. "అమ్మగోరూ, నేనిప్పుడే వస్తా నమ్మగోరూ" అంటూ తన గుడిసెవైపు పరుగుతీసింది.

కిష్టిగాడు కూర్చుని వెంకన్నతో ఆడుతున్నాడు.

లక్ష్మమ్మ ఒక్క పరుగునపోయి వాడ్ని అక్కున చేర్చుకుని తడితేరిన కళ్ళతో ముద్దుల వర్షం కురిపించింది

"ఏందే ! ఏమిటిది" అంటూన్న వెంకన్న మాటలు ఆమెకు వినిపించలేదు.

"నా వొరాల తండ్రీ" అనుకుంటూ కిష్టిగాడ్ని హృదయానికి హత్తుకుంది లక్ష్మమ్మ.

# సంస్కరణలు



## ఎం. ఎస్. మూర్తి

'శేషయ్యా!'

'ప్రభూ!'

'ఈ వేళ నా మనసులో ఏదో చెప్ప రాని ఆవేదనగా వుంటుందోయ్—'

'ఒక షోడాకాయ తెప్పించమంటారా?'

'ఛ! సోడాకాయకి మనసుకీ సంబంధమేమిటీ?'

'అలా అనబోకండి—మనసులోని ఆవేదనలకు కారణాలు సాధారణంగా భౌతికమైనవే అయి వుంటాయి—'

'శేషయ్యా, చూడూ—?'

'తూర్పున ఆ కారుమబ్బులా కదిలి వస్తూన్న దేమిటీ_శత్రుసైన్యాలా?'

'కాదండి—గొర్రెలమంద!'

'ఎన్ని గొర్రెలు! అవన్నీ గొర్రెలే

'చిత్తం!'

'మహాసముద్రంలావుంది ఆ మంద!'

'చిత్తం—అలానేనండి—గొర్రెజాతి చాలా అభివృద్ధిలో వుంది—'

'శేషయ్యా!'

'ప్రభూ!'

'నాకేదో దిగులుగా వుందోయ్—శత్రువులు గానీ వాటిని మనమీదకు దండెత్తించడం లేదు గదా?'

'మీకు అటువంటి భీతి కలలోకూడా వొద్దండి—అవన్నీ మన సంస్థానపు గొర్రెలే!'

'మన సంస్థానానికి చెందినవే?'

'చిత్తం! ముమ్మాటికీ!'

'మన సంస్థానంలో అన్ని గొర్రెలున్నాయా?.

'ఉన్నాయండి. ప్రభువుల వారి

హాయాంలో అవన్నీ దినదిన ప్రవర్ధమానంగా వుంటున్నాయండి—'

'ఇన్నాళ్లనుంచీ చెప్పేవుకాదేమోయి, మన సంస్థానంలో ఇన్ని గొర్రెలుంటూంటే ?'

'చిత్తం ! తమకు తెలియని విషయమా అని చెప్పటానికి సాహసించలేదండి—'

'శేషయ్యా !'

'అయ్యా ?'

'ఇకముందు ఇలాంటి ఉపేక్షలు పనికిరావు నావద్ద—'

'చిత్తం ! ప్రభువులు ఏం చెయ్యమంటే అది చేస్తాను—'

'నేను చెప్పేకనా చెయ్యటం ?'

'పొరబాటేనండి—లెంపలు వేసుకుంటున్నా—ఇకనుంచి తమరు చెప్పకపూర్వమే తమ ఆంతర్యం గ్రహించుకుని మరీ ప్రవర్తిస్తూంటానండి ?'

'రైట్ !'

'మహాప్రసాదం !'

'ఇన్ని గొర్రెలు ! ఇన్ని గొర్రెలు ! రకరకాల గొర్రెలు, రంగురంగుల గొర్రెలు, బుల్లిగొర్రెలు, పెద్దగొర్రెలు... ఇన్ని వుంటూంటే ఇన్నాళ్లూ తెలియనే లేదు...'

'పొరబాటే చేశానండి !'

'చూడ ముచ్చటైన జంతువులు కాదటోయ్ ఈ గొర్రెలూ ?'

'అవునండి— చూడముచ్చటైనవే !'

'చూడూ, ఆ మంద వూరును సమీపిస్తున్నట్టుగా వుంది—'

'అవునండి !'

'ఎంత రమ్యమైన దృశ్యం ! తీరు తీరుల జంతువులు, ఇంపైన నడక—ఒక్కటికూడా గుంపులోనుంచి తప్పించుకుని పోవటం లేదోయ్ !'

'చిత్తం ! వాటిస్వభావమే అంతండి!'

'మన మనషులకన్నా చాలా తెలివైనవిలా కనిపిస్తాయి—మన వెధవల్ని నలుగుర్ని అలాగ బారుతీరి నడవమంటే కాలుకుంటే వాడొకడూ, మడత కాలెత్తేసేవాడొకడూ,ఎవరూ చూడకుండాపక్కసందుల్లోకి దాటుకుపోయేవాడొకడూ—ఛస్ !'

'అంతేనండి !'

'గొర్రెకి వున్నంత బుద్ధికూడా లేక పోతే వీళ్లకి......!'

'అవునండి ! అంతేనండి !'

'అవి చూడూ—ఎంత స్వేచ్ఛగా, ఎంత ఉత్సాహంగా, ఎంత హాయిగా మందలో పడి వస్తున్నాయో ?'

'అవి అంతేనండి ! మనుషులకి మల్లే తిరుగుబాటు చెయ్యవు !'

'శేషయ్యా !'

'ఈ గొర్రెలను చూస్తున్నకొద్దీ వాటికేదో చెయ్యాలని బుద్ధి పుడుతుందోయ్ !'

'చిత్తం, ఏం చేద్దామండీ ?'

'చూడూ, ఆ మందను తోలుకొచ్చే వాడితో వాటినన్నింటినీ మనకోటలోనికి తోలమని చెప్పు ?'

'చెబుతానండి—చెప్పిన పిమ్మట ?'

'ఆ గొర్రెలనన్నిటినీ మనమే ఎంతో బాగా పెంచుకుందాం—ఇంత మంచి జంతువులను !'

'బాగానే వుందండి !'

'మన ఆస్థానంలో బలుస్తూండే కవుల కన్నా పండితులకన్నా తీసిపోయాయేమిటవీ !'



# చెప్పులు కుట్టేవాడు

గోపీచంద్

నన్ను మీరు చూసే వుంటారు. కాని నేను మీకు గుర్తు వుండను. మీరు ఎన్ని రాళ్ళనూ రప్పలనూ చూడటం లేదు: అవన్నీ మీకు గుర్తు వుంటున్నయ్యా? వుండవు అదేవిధంగా నేనూ మీకు గుర్తు వుండను. నాతో మీకు పనిలేదా అంటే వుంటుంది. రాయితో మాత్రం మీకు పని వుండదూ? వుంటుంది. మేకు ఏ గోడనో కొట్టవలసి వస్తుందనుకోండి. అప్పుడు ప్రక్కన వున్న రాయిని తీసుకొంటారు; దిగగొడతారు. తరువాత ఆ రాయిని విసిరివుచ్చుకుని అవతలపారవేస్తారు. ఆ రాయి మీకు ఉపయోగించింది. గనుక గుర్తు వుంటుందా? ఉండదు నేనూ అంతే. ఏ చెప్పో తెగితే నాతో పని చేయించుకుంటారు. కాని నేను మీకు గుర్తువుండను. కాకపోతే పనిచేసినందుకు ఏ కానో అర్ధణో నా మీదకు విసిరి పారవేసి వెళ్తారు.

నాతో పని చేయించుకునే వారితో, నాకు మాట్లాడ బుద్ధి అవుతుంది. వారి కష్ట సుఖాలు కనుక్కో్కబుద్ధి అవుతుంది నాకూ వారికీ తెగని సంబంధం ఏదో వున్నట్లు అనిపిస్తుంది. కాని వారు పడ నిస్తేనా!

"చెప్పుల మడమలు బాగా అరిగిపో నాయ్ బాబు గారు" అనేవాణ్ణి, ఎందు కనో వారు విననట్టే నటించేవారు. మొహం అటువైపుకి తిప్పుకునేవారు

"మఢమ వేస్తా బాబూ, లేకపోతే కాలు దెబ్బ తింటుంది" అనేవాణ్ణి.

"చెప్పినపని చెయ్యవాయ్" అనే వారు.

"అట్టాగే బాబు." అని వారు అడిగి నట్లు ఉంగటం వేసి ఇచ్చేవాణ్ణి. కాని వారు బజార్న నడుస్తూ కనపడినప్పు డల్లా మడమ వెయ్యకపోతినే అని మన స్సులో దేవుతూనే వుండేది. "ఉంగటం బాగుందా బాబూ?" అని అడగబుద్ధి అవుతూనే వుండేది. కాని వారు అడగ నిస్తేనా? ఎరగనట్టు, మొహం అవతలికి తిప్పుకుని వెళ్ళిపోతుండేవారు. అట్లా ఎందుకు చెయ్యాలి? నాకు అర్థం అయ్యేది గాదు, వెళ్ళనిచ్చేవాణ్ణి.

ఒకరోజు ఒకాయన చెప్పులకాళ్ళతో ఈడ్చుకుంటూ వచ్చాడు ఒకచెప్పు ఉంగటం తెగిపోయింది; ఒకచెప్పు, కాలిని కప్పే నడిమిభాగం లేచిపోయి వుంది. అట్లా వున్న చెప్పులు చేత్తో పట్టుకు రావటం న్యాయం. ఈ సంగతి నాకు తెలియగాలేంది - అందరికీ తెలి యదా? అందరికీ తెలుసు. కాని అలాగే చెప్పుల్ని కాళ్ళతో అతికష్టంమీద ఈడ్చు కుంటూ వచ్చాడు. కుట్టమన్నాడు. చెప్పులు,జాతిచెప్పులు. బాగా వున్నయి. వాటిని చూడగానే నాకు మనస్సు లేచి వచ్చింది. ఎంతో జాగ్రత్తగా కుట్టాను. ఆయన అడక్కుండానే పాలిష్ చేశాను. ఆయన కాళ్ళముందు పెట్టాను. చూడ్డా నికి ఎంత బాగున్నయి అనుకున్నావు! బండి లాగటానికి మువ్వలు: కుచ్చులు వేసుకొని నిలబడిన కోడెదూడలకు మల్లే వున్నాయి.ఆయన తొడుకున్నాడు. ఆయనకాలు ఎక్కడ నొచ్చుతుందోనని ఉంగటానికి, కాలిని కప్పేదానికి మంచి మెత్తని తోలువేసి కుట్టాను ఆ మెత్త దనం కాళ్లకు తెలియకుండా వుంటుందా? అందుకని, "ఎట్టావున్నయండీ?" అని అడిగాను.

"ఉన్నయ్ లేవాయ్"అని ఆయన ఒక అణా విసురుగా పారవేసి వెళ్ళిపోయారు. ఎందుకంతకోపం ? ఒక మంచి మాట అంటే ఆయన సొమ్మేం పోయె! అనరు.

నేను కూర్చునేది నాలుగు బజార్లు కలిసిన దగ్గర. ఒక ప్రక్కగా, జనం నడిచే దారిలో కూర్చుంటాను. అస్త మానం అక్కడే కూర్చోవలసి రావటం వల్ల, ఎండకి తట్టుకోలేక, చిన్న డేరా గుడ్డ దొరికితే, దానిని పెల్లలమీద లేవి,

దానికింద కూర్చొని వుంటాను. నేను చెప్పులు బాగాకుట్టగలను. అయితే నాతో చెప్పును మరామత్తు చేయించుకునేవారే గాని కుట్టించుకునేవారు లేరు. ఒకవేళ ఎవరన్నా కుట్టించుకుందాం అనుకున్నా నన్ను నమ్మి ముందుగా ఎవరు డబ్బి స్తారు? నా దగ్గర చెప్పకు కావలసిన పెట్టుబడి పెట్టడానికి నయాపైసా లేదు. మొట్టమొదట్లో ఎట్లాగో ఒక రూపాయి పోగుచేసి, పెద్ద షాపులవాళ్ళు, పనికిరాని తోళ్ళ తుక్కు అమ్ముతుంటే కొన్నాను. అదే నా పెట్టుబడి. ఆ తోళ్ళ తుక్కు ముందువేసుకుని. కూర్చొని యాపారం మొదలుపెట్టాను పొద్దున్నే గంజినీళ్ళు తాగివచ్చి కూచునేవాణ్ని. నాకుమల్లే చెప్పులుకుట్టేవాళ్ళని నేను చాలామందిని చూశాను. వాళ్ళు చూట్టానికి గలీజుగా వుండటంవల్ల చెప్పులుకుట్టించుకునే పెద్ద మనుష్యులు వాళ్లదగ్గరకు వచ్చేవారు కాదు. అందుకని అందిన గుడ్డపీలికలు అన్నిటినీ చేర్చి పొడుగ్గా కుట్టి ఒక తల గుడ్డ తయారు చేశాను. దాన్ని కానిని ఎర్రనీళ్ళలో ముంచి కంటికి నదరుగా వుండేటట్టు చేశాను. అది చుట్టుకుని పని లోకి వెళ్ళేవాణ్ని. మొదటిరోజు అది తలకు చుట్టుకుని, పిల్లలు బజార్లో ఏరు కొచ్చిన అద్దం ముక్కలో చూసు కున్నాను. నా కళ్లను నేనే నమ్మలేక పోయాను. డాబుసరిగానే వుంది. నన్ను జూసుకుంటే నాకే నవ్వు వచ్చింది తునుక్కున.

"ఎందుకట్లా నవ్వుతావ్? నీకేమన్నా పొయ్యేకాలం వచ్చిందా?" అంది గుడిసెది.

"ఇటు చూడు" అన్నాను.

"పోతు పేరంటాలల్లే వున్నావు" అంది, అని తనూ నవ్వింది.

తల వంచుకొని నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని మరీ నవ్వింది. అది నవ్వితే, దాని నవ్వు కిర్రు చెప్పులమీద తరకం మెరిసినట్టు మెరిసేది.

నా గుడిశెది నాకు చెప్పులు కుట్ట టంలోకూడా బాగా సహాయం చేసేది. నేను పొద్దున్నే పనిలోకివెళితే అదికూడు వుడకేసి తొమ్మిది పది గంటలకల్లా నా సరసనే జేరేది. దానికికూడా చెప్పులు కుట్టడం కాస్త వచ్చు. ఎవరు నేర్పారు. నన్నుచూసి అదే నేర్చుకుంది. అయితే పాలిష్ చెయ్యడం మాత్రం నా కన్నా బాగా చేసేది. అణిచిపెట్టి రుద్దేది. చెప్పు మీద దాని చెయ్యి పడితేచాలు; మిలమిల మెరిసిపొయ్యేది.

అది వచ్చి సరసన కూర్చోగానే, పని దానికి అప్పజెప్పి నేను కూటికి పొయ్యే వాణ్ణి. నాకు నలుగురు పిల్లలు. అందులో ఒకటిచంటిది. చంటిదానిని, వాళ్ల అమ్మ ఒళ్ళోనే వుంచి మిగిలిన ముగ్గురినీ తీసు కొని గుడిసెకు వెళ్ళేవాణ్ణి. వాళ్లకుఅన్నం ముద్దలుచేసి పెట్టి, నేను యింత తిని, మళ్ళీ పనిలోకివచ్చి, దాన్ని కూటికి పంపేవాణ్ణి. అది తినివచ్చి నా

నరసనే సాయంకాలం దాకా కూర్చొని, నాతోపాటు పనిచేసేది. పిల్లలు ఆ చుట్టు పక్కల ఆడుకుంటూ వుండేవారు.

నాకు ఎవ్వరన్నా భయం వుండేది కాదు; పోలీసులంటే మాత్రం భయం. ఉత్తపుణ్యానికి వచ్చేవాళ్ళు; నానా కూతలూ కూసేవాళ్ళు. చివరికి అణో బేడో పుచ్చుకు వెళ్ళేవాళ్ళు. ఒకరోజు పోలీసాయన వచ్చాడు.

"లే ఇక్కడనుంచి" అన్నాడు.

నేనూ నా గుడిసెదీ కాళ్ళా వేళ్ళాబడి బతిమాలాం. కాని ఆయన వినలేదు. "ఇక్కడ కూచోటానికి వీల్లేదు. పో" అని అక్కడున్న తోళ్లముక్కల్ని కాళ్లతో యిటూ అటూ తన్ని పారేశాడు. ఆ తోళ్ల ముక్కలని తంతుంటే నా పిల్లల్ని తంతున్నట్టే అనిపించింది నాకు. "పో ఇక్కడనుంచి. నీ అబ్బగాడి స్థలం అనుకున్నావా!" అని నన్ను బూటు కాలెత్తి తన్నబోయాడు. తన్నాడే అనుకున్నా. తంతే తన్నాడు.

పొమ్మంటాడు అక్కడనుంచి! ఎంత తేలిగ్గా అన్నాడు! కాని ఎక్కడకుపోను? ఎక్కడికి పోయినా ఏ స్థలమూ నాది కాదాయె! డబ్బున్న వాళ్ళమల్లె ఏదన్నా కొట్టు అద్దెకు తీసుకోమంటాడా! పక్కి సందుల్లోకి ఎక్కడికన్నా పొమ్మంటాడు. అక్కడికిపోతే చెప్పులు కుట్టించుకునే బాబులు ఎవ్వరు దొరుకుతారు?

వాళ్లమ్మ కాళ్లు చుట్టేసుకుని పిల్లలు గొల్లున ఏడ్చారు. నేనిక తట్టుకోలేక తలగుడ్డలో నుంచి ఒకపావులా డబ్బులు తీసి, "ఇంతకంటే యిచ్చుకోలేను బాబూ" అని ఆయన చేతిలో పెట్ట పోయాను. అందరూ చూస్తున్నప్పుడు యివ్వటం తప్పనుకోలేదు.

ఆ డబ్బునుచూచి, యిటూ అటూ చూచి ఆయన ఉగ్రుడైపోయాడు. "లమ్డీ కొడకా నాకు లంచం యిస్తావట్రా?" అని బూటుకాలుతో డొక్కలో ఒక తన్ను తన్నాడు. అనుకున్నంత పనీ అయింది. నేను దూరంగా వెళ్ళిపడ్డాను. పావలా ఇవ్వబోవడం తప్పయిందట. డబ్బు యివ్వాలని నాకు మాత్రం వుంటుందా? నేను మాత్రం ఇవ్వగలిగి యివ్వబోయినా? బెదిరించటం, అణోబేడో తీసుకోవటం వాళ్లకు రివాజే నాయే. అందుకని తప్పదని ఇవ్వబోయా. అదే తప్పయిపోయింది. డొక్క జివ్వున లాగుతూవుంది.

గుడిసెదీ పిల్లలూ ఒక్కటే ఏడుపు గల్లంతుకి దారేపోయేవాళ్లందరూ జేరారు. అందరూ నన్ను తిట్టేవాళ్లే. "నాలుగు పైసలు జేరేటప్పటికి వళ్ళుబలిసింది. పీడి బతుక్కి వీడు పోలీసాయనకు లంచం యిస్తాడు?...ఏంరా! కళ్ళు నెత్తికొచ్చినయ్యటరా?"

"లేదు బాబూ."

"లేకపోతే నీ బతుక్కితోడు పోలీసా



యనికి లంచం యిచ్చేదాకా వచ్చావా? ఆయన ఎవరనుకున్నావు ? ఎంత కరెక్టు మనిషి ! వీణ్ణి జైల్లోకి తోయించండి పోలీసుగారు, అప్పుడుగాని వీడికి బుద్ధిరాదు."

"బుద్ధి గడ్డితిన్నది బాబూ. నాతప్పు యీ సారికి కాయండి" అని బ్రతిమాలు కున్నా...ఆయన వినలేదు. వినే వీలు లేకపోయిందని, నాకు తరువాత తట్టింది. ఎవర్నని ఏం లాభం ?

తోలుముక్కలు యేరుకొని, డేరా గుడ్డ చంకన పెట్టుకొని చెప్పులు మూట కట్టుకొని, నేనూ, గుడిసెదీ, పిల్లలూ గుడిసెదారి పట్టాం. నాలుగు రోజులు యెవ్వరికీ మెతుకు లోపలకు పోలేదు. ఏం చేస్తాం ? ఒకటి రెండుసార్లు నేను కూర్చునే స్థలంవైపుకు వెళ్ళిచూశాను. అది ఖాళీగానే వుంది. బావురుమంటూ వుంది. చెప్పులు కుట్టుకోవటానికి నేను గోడకు కొట్టిన మేకులు ఇంకా అక్కడే ఉన్నాయి. నన్నంతా మరచిపోయినట్లే ఉన్నారు. మరచిపోక నేను అజలో వాణ్ణా, లెక్కలోవాణ్ణా ?

మరుసటిరోజు, ఆ బజారు విడిచిపెట్టి మరొక బజార్లో కూచున్నాను. రెండు మూడు రోజులు కాస్త కొత్త అనిపించింది గాని అక్కడా బాగానేవుంది. గుడిసెదీ పిల్లలూ అక్కడకు వచ్చి కూర్చునేవారు. మళ్ళీరోజులు మామూలుగా గడిచిపోతున్నాయి. పోలీసు చేసినపని అందరం మరచిపోయాం. కష్టపడి సంపాదించి, ఒక చెప్పులుకొట్టు పెట్టాలని నేనూ గుడిసెదీ ఒకరోజు అనుకున్నాం. బజార్లో ఒక చెప్పులకొట్టు చూచినప్పుడల్లా అటువంటి కొట్టు పెట్టాలని నేను యెప్పుడూ అనుకుంటూ వుండేవాణ్ణి. ఆరోజు అందరం సంతోషంగా నిద్దరపోయాం. కొట్టుపెట్టుకుంటే నాది— అనేది ఒక్కటి ఏర్పడుతుంది. ఏ పోలీసు భయమూ ఉండదు. కొట్లో కూచొని గుడిసెదాన్ని సరసన కూర్చోబెట్టుకొని...ఆలోచిస్తూ అలానే నిద్దరపోయాను.

ఆరోజు మొదలుకొని అందరం కష్టపడి పని చెయ్యటం మొదలుపెట్టాం. పెద్దపిల్ల కొంచెం అక్కరకు వచ్చింది. పని యెక్కువయి గుడిసెది నాతోనే కూర్చున్నా, అది కూడు ఉడకేసిపెట్టేది. పదిరూపాయలు వెనక వేశాం...యిరవయి రూపాయలు వెనకేశాం. ఇంకొక నెల పదిరూపాయలు వెనకవేస్తే కొట్టు అద్దెకు తీసుకోవచ్చు—అనుకున్నాం. ఒక కొట్టు మేమున్న స్థలానికి దగ్గరలోనే ఉంది. అది అద్దెకు తీసుకొని, జే[illegible] నెమ్మదినెమ్మదిగా బేరంసాగిద్దాం అన[illegible] కున్నాం ఒకరోజు. కాని అన్నీ మన[illegible] అనుకున్నట్లు సాగుతయ్యా? అందులో[illegible] నాబోటివాడికి, సాగవు. ఒకరోజు గు[illegible] సెది వచ్చి పక్కన కూర్చుంది. పాలిష్ చెయ్యవలసిన చెప్పులువుంటే అవి తీస[illegible] కొని పాలిష్‌చెయ్యటం మొదలుపెట్టి[illegible] నా కన్ను పడింది. ఏదో కొత్తగా కన[illegible] పించింది. అది యెలా పాలిష్ చేస్తుందో నాకు తెలుసు. ఇవ్వాళ ఎవరో కొత్త మనిషివచ్చి పాలిష్ చేస్తున్నట్లు అనిపించింది. నెమ్మదిగా జూశాను. దాని చేతుల్లో ఇదివరకు సత్తువలేదు. చేతులు వణుకు తున్నయి.

"ఏందే?" అన్నాను.

"ఏం లేదు" అంది.

దానికళ్లు ఎర్రగా వున్నయి. మెడ మీద చెయ్యివేసి జూశాను. వళ్ళు కాలతా వుంది.

"జరం వచ్చిందే" అన్నాను.

"అదే పోతది'' అన్నది.

కాని జరం పోలేదు. రోజు రోజుకీ ఎక్కువయింది. పైగా దగ్గు, వట్టి పొడి దగ్గు. ఏవో అవీయివీ నూరిపోశాను. తగ్గలేదు.

"డాక్టేరు దగ్గరకు తీసుకువెళ్తా" అన్నాను.

"వద్దు. డాక్టేరు తీసేస్తాడా ఎట్లా!" అంది.

"సూది మందిస్తే తగ్గుద్దే" అన్నాను.

"ఏ సూది మందిస్తే వచ్చింది ?" అంది.

దానికి డాక్టేరుదగ్గరికి రావటం ఇష్టం లేదు. దాని ఆలోచన నేను కనిపెట్టాను డాక్టేరుదగ్గరకు వస్తే కూడబెట్టిన డబ్బు అయిపోతుంది. మరికొట్టో! నేనుకూడా నాలుగు రోజులు పస్తాయించి చూశాను. జరంతగ్గలేదు. పొద్దున్న తగ్గినట్టుండేది; పొద్దుగూకేతలికి యెక్కడనుంచి వచ్చి పడేదో, గుడిసంతా గోల అయిపోయింది. పిల్లల్ని ఆకట్టటం నాతరం కాలేదు. పని మీదకు మనసే పోయేదికాదు. ఒకరోజు, కాదు గూడదని పట్టుబట్టి డాక్టేరు దగ్గరకు తీసుకుపోయా.

ఆయన బాగా పరీక్షచేసి "వూపిరి తిత్తులు చెడిపోయినై" అన్నాడు.

"ఏందీ?"

"ఊపిరితిత్తులోయి, వూపిరితిత్తులు."

"ఎందుకు చెడిపోయినై బాబూ ?"

డాక్టేరు చెప్పాడు. తప్పు నాదే అన్నాడు. నేను ఎప్పుడూ దాన్ని దుమ్ములో కూచోబెట్టానంట. ఆ దుమ్ము ముక్కులగుండా లోపలకువెళ్ళి గుండెలు చెడిపోయినయ్యంట. అంచులో జనం ఎక్కువ తిరిగేచోట కూర్చోబెట్టగూడదంట. నేను దాన్ని అక్కడే కూచోబెట్టానంట. చేతులారా చేసుకున్నానంట. ఇదేం అన్యాయం? జనం లేని చోట కూర్చుంటే పొట్ట నిండేది ఎట్లా? అప్పుడప్పుడూ నా దగ్గరకు వచ్చి చెప్పులు బాగు చేయించుకునే వారు ముక్కుకి గుడ్డ అడ్డంపెట్టుకు వచ్చేవాళ్ళు. ఎప్పుడన్నా అయితే సరిపోతుందిగాని ఎప్పుడూ రోడ్డుప్రక్కన కూర్చునే మాకెట్టా కుదురుతుంది—ముక్కుకి గుడ్డ అడ్డం పెట్టుకోవటం? దుమ్ములో పుట్టాం దుమ్ములో పెరిగాం, ఎక్కడని ముక్కుకి గుడ్డ అడ్డం పెట్టుకునేటట్లు?

ఏదైతే, ఎట్లాగయితే, గుడిసెది కాలం చేసింది. దానిజబ్బుకి ఉన్నదంతా ఖర్చుపెట్టాను. నేనూ పిల్లలం మిగిలాం. ఇక కోట్లుపెట్టాలనే ఆశలేదు నాకిప్పుడు. చచ్చేదాకా బతకటం ఒకటే మిగిలింది. అక్కడేకూర్చుని చెప్పులు కుడుతున్నా. పెద్దపిల్ల వచ్చి కూర్చుని నాకు తోడు పడుతూ వుంటుంది. అది అచ్చగా వాళ్ల అమ్మలాగే పాలిష్ చేస్తుంది. అప్పుడప్పుడూ రోడ్డుమీద రేగే దుమ్ము జ్ఞాపకం వచ్చి గుండె గుబేలుమంటుంది. కాని ఏం చెయ్యను? దుమ్మునుదాటి ఎక్కడికి పోయేటట్టు? దుమ్ములో పుట్టాం, దుమ్ములో పెరిగాం. దుమ్ములోనే చస్తాం.

ఫిబ్రవరి నెల

# భావపరిచయపోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*




పడతికి నొప్పులు రాగా
గడబిడపడి మగడుచేరె కాన్పులగృహమున్;
తడబడు బెఱిగిన తోడనె
వడివడిగా పరుగుతీసె వనితను తేరన్ (తేగన్)

— చిల్లర ప్రభాకరరాయశర్మ, హైదరాబాద్




త్రేనాంపేట చివర్న మలుపులో చిన్న గుడిసె అది. బైట అయిదారుగురు పిల్లలు బిళ్లలాటలో పోటీ పడుతున్నారు. ఆ పక్క ఓరగా వాల్చివున్న కుక్కి మంచంమీద ఓ వయసుమళ్లినతను పడుకుని ఉన్నాడు. నడినెత్తిమీద సూర్యుడు చుర్రున మండుతుంటే, అతను గురక పెడుతున్నాడు. అ త ను జబ్బువాడేం కాదు. కానీ బొమికలు పైకిలేచి, నిస్త్రాణగా వున్నాడు. కాళ్ళు ముడుచుకుని వున్నాయి. పైన ఈగలు వాలుతున్నాయి. పక్కనుంచి రంయ్యిమని వెళుతున్న లారీల చప్పుళ్లు, గుడిసె లోపల అరుపులు—అతనికేం పట్టినట్లు లేవు.

ఇంతలో ఓ సైకిలొచ్చి గుడిసెముందు

ఆగింది. దానిమీంచి ఖాకీదుస్తులేసుకున్న ఓ మనిషి దిగాడు. ఒంగి లోపలికి వెళ్ళాడు. లోపల పెద్దఅరుపులు చప్పున ఆగిపోయాయి. బైట ఆడుకుంటున్న పిల్లలు తుపాకీ గుండు పేలినట్లు చెల్లా చెదరయి పోయారు. ఆ ఖాకీ దుస్తులతనితో ఒక నల్లటి పొడుగాటి యువకుడు బైటికి వచ్చాడు. ఇద్దరూ గుడిసె పక్కన చెట్టువైపు నడిచారు. కింద గడ్డిమీద కూర్చున్నారు. ఖాకీబట్టలతను రెండు బీడీలు తీసి, ఒకటి ఆ యువకుడికిచ్చి, రెండోది అంటించాడు.

"రెండు రోజులనుంచీ ఇంట్లో ఒకటే తగూలు. అసలే కూడులేదేమో, నాకు వెర్రెత్తినట్లు వుంది" నల్లటతను తల వంచుకు గడ్డి పీకుతున్నాడు. ఖాకీబట్టలతను చెట్టుకు ఆనుకుని కాళ్ళుజాపాడు.

"ఆ ముసలమ్మకి చెప్పవయ్యా! రోజూ కాళ్ళు అరిగిపోయేట్లు తిరుగుతున్నాను. పని దొరకటం అంటే మాటలా? కోడంబాకంలో అదేదో థియేటరు కడుతున్నారుట. అక్కడ మేస్త్రీగాడికి రోజూ టీ, బన్ను యిప్పించి బ్రతిమాలుతున్నాను. ఏదీ "ఊ" అంటేనేగా ఇప్పటివరకూ?"

"నాకన్నీ తెలుసు. నిన్నేం అంటంలే. ఇదంతా నా ఖర్మ! ఎనిమిదివరకూ చదివాను. ఏం లాభం? పొట్టపొడిస్తే అక్షరం రానివాళ్ళు ఎంచక్కా కూలి చేసుకు బతుకుతున్నారు. నా ఇంట్లో నిప్పు రాజేసేందుకు కట్టెలు కూడా లేవు."

నల్లటతని కళ్ళుఎర్రబడ్డాయి. గొంతు జీరబోయింది.

"ఆ! అట్లాగన్నావ్ బాగుంది. అంతా మన తలరాతే అనుకో. ఆ మేస్త్రీగాడు ప్రసన్నుడయితే, ఓ ఏడాదిపాటు ఇహ నీకు కష్టంలేదనుకో. కానీ వెధవనన్యాసి ఒకడే ఆశ........."

"పోనీ ఏదో ప్రయత్నిస్తున్నావుగా. అంతేచాలు ఇదిగో ఇది పట్టుకెళ్ళు."

నల్లటతను చిరుగు చొక్కాలోంచి ఓ అర్ధరూపాయ బిళ్ళతీసి అతని చేతిలో పెట్టాడు.

పోయిన బలమేదో తిరిగి వచ్చినట్లు ఖాకీ బట్టలతను, ఆ కాసు చేతిలోకి తీసుకుని, దిగ్గున లేచాడు.

"వస్తా. దిగులుపడక." అంటూ పెద్ద అంగలతో సైకిలుని సమీపించాడు. అతనలా దూరమయేంతవరకూ చూసి, నల్లటతను, గుడిసెలోపలికి వెళ్ళాడు.

లోపల మళ్ళీ గొంతులు పెద్దగా వినపడుతున్నాయి. ఒక ఆడది వుండి వుండి ఏడుస్తోంది బైట దూరంగా నిలబడ్డ పిల్లలు ఒక్కొక్కరే లోపలికెళ్ళారు. నులకమంచంమీద పడుకునివున్న ముసలాడు లేచి కూర్చున్నాడు.

"ఏరా మంగా! ఏందొరకలా? నేను బతికుండగా నీకు పని దొరకదులేరా!" అంటూ మళ్ళీ ముడుచుకుని పడుకున్నాడు.

* * *




శీను కిటికీలోంచి ధ్యానతో బైటికి చూస్తున్నాడు. కిటికీవూచలిని పట్టుకున్న **అతని** చేతులు మెల్లిగా కిందికి జారాయి. **తల** విదిలిస్తూ వెళ్ళి పడక కుర్చీలో వాలాడు. ముఖంమీదికి తువ్వాలు లాక్కుని కళ్ళు మూసుకున్నాడు. ఆ కిటికీ ముందుగా ఎందరో వెళ్ళారు. ఎన్నో సైకిలు బెల్లులు మ్రోగాయి కానీ అతనికి కావలసిన ఖాకీ ఒట్టలతను వెళ్ళిపోయి చాలాసేపయింది. అయిదు నిముషాలు గడిచాయి. ముఖంమీద తువ్వాలు తీసి శీను లేచి నిలబడ్డాడు. అలమారులోంచి ఓ పుస్తకం తీసి చేతితో పట్టుకున్నాడు.

"అదేమిట్రా ఫాను వేసుకోలేదేం?" అతని తల్లి లోపలికి వచ్చింది. ఆవిడకి శీను ఒక్కగానొక్క కొడుకు. ఎంచక్కా కొడుకుని ఎం.ఏ. చదివించింది. అతను పరీక్ష మొదటి తరగతిలో ఉత్తీర్ణుడయితే, తన కొడుకు కలెక్టరయినంత సంబరపడింది. కానీ అతను కలెక్టరు కాలేదు. కనీసం కలెక్టరాఫీసు గుమ్మం కూడా ఎక్కలేదు. రెండేళ్ళు ఎండనక, వాననక ఎంప్లాయిమెంటు ఆఫీసుముందు క్యూలో ఓపిగ్గా నిలబడ్డాడు ఆ ఊరంతా తాపీగా తిరిగాడు. ఆఫీసు కార్యాలయాల ముంగిళ్ళు, లోగిళ్లు ఎలా వుంటాయో చూశాడు. అధికారంలో వున్నవారి వరిచయభాగ్యం కలిగించుకున్నాడు. కాళ్లు నొప్పెట్టి అరుగుతున్నకొద్దీ, కళ్ళు

పొరలు విప్పి దారి స్పష్టమయిన కొద్దీ మెదడుకి దెబ్బలు తగిలి మొద్దుబారిన కొద్దీ—అతని కోరికలు చిన్నవయి పోయాయి. అవసరాలు పరిమిత మయాయి. ఆయాసంతో నడక మంద గించింది. ఒంట్లో చురుకుదనం పాలు తగ్గింది. పౌరుషం పారిపోయి దాక్కుంది. చివరికి ఒక లోయర్ డివిజన్ క్లార్కు వుద్యోగంలో ఆత్రంగా జొరబడ్డాడు.

గులాబీ రంగు, నీలం రంగు ఫైల్సు కుప్పలు కుప్పలుగా చదివాడు శీను. తను కాలేజీలో నేర్చుకున్న చదువు, అవతల నెట్టి, తతిమ్మా గుమాస్తాల దగ్గిరనుంచి చదవటం, రాయటం ఏమిటో నేర్చు కున్నాడు. తనకంటే తక్కువ తెలివి తేటలున్నవాళ్ళు, తన తలపైకి ఎక్కి, అధికారం చెలాయిస్తుంటే, వేదాంతిలా చూడటం నేర్చుకున్నాడు. తన తరువాత ఆఫీసులో చేరినవాళ్ళు క్యూలో ముందుకి వెళ్ళిపోయి, ప్రొమోషన్లు పొందుతుంటే, చిరునవ్వు నవ్వుతూ వాళ్లని అభినందించ టం అలవరచుకున్నాడు. తన ఆఫీసే ఒక మందిరంలా, తనకిదొరికిన ఆ కుర్చీయే, దేవుడు కటాక్షించిన వరంలా, తన జీవితధ్యేయమే ఆ ఫైళ్ళమధ్యవున్నట్లు చాలా రాజీపడ్డాడు.

ఇంత విజయం సాధించేందుకు అతనికేం సులువు కాలేదు. మొదట్లో చాలా తిరుగుబాటు జరిగింది.

"ఆ గాడిదల కింద పనిచెయ్యను," అని తండ్రిముందు గొలపెట్టాడు.

"నా కింత చదువెందుకు చెప్పారు? ఇంతకంటే ఓ టీకొట్టు పెట్టుకుని బ్రత కటమే గౌరవం" అంటూ తల్లిముందు మొత్తుకున్నాడు.

"ఓ అంటే ఢం రాని అనాగరికుడి కింద దాస్యంచేయడం తల తిక్కరేగు కొస్తోంది. చూస్తో వుండండి! ఎప్పుడో వాణ్ణి చాచి లెంపకాయకొట్టి, రాజీనామా యిచ్చేస్తాను" అని స్నేహితులముందు ప్రేలు చరిచాడు.

కానీ అతనవేం చేయలేదు. అతన్ని ప్రోత్సహించినవాళ్లూ లేరు. కాలమే అతని కన్నీళ్ళు తుడిచింది. ప్రతాపాలని అణిచింది. జీవితంపట్ల ఒకవిధమైన నిర్లిప్తత బోధపరిచింది. ఒక్కో సంవ త్సరం గడుస్తున్నకొద్దీ, అతను మంచి వేదాంతి అయాడు. దాన్నే ప్రపంచం "బ్రతకనేర్చటం", "లౌకికజ్ఞానం" అన్నది.

మనసుకి కాషాయరంగు పట్టించు కున్నా శీను అప్పుడప్పుడూ మామూలు మనిషి అయేవాడు. అక్కడా ఇక్కడా దరఖాస్తులు వేసేవాడు చక్కగా ముస్తాబయి ఇంటర్వ్యూకి వెళ్లేవాడు. తనకంటె తక్కువ అర్హతలున్న అభ్య ర్థుల్ని చూసి, కొండంత ఆత్మవిశ్వా సంతో ఇంటికి వచ్చేవాడు. ఆ తరువాత రోజూ విడవకుండా పోస్టుమాన్ కోసరం చూసేవాడు. ఆ సమయమేదో



దాటిపోయి, సైకిలు బెల్లు మోత ఇల్లు దాటిపోయాక, తువ్వాలు ముఖంమీద వేసుకుని కూర్చునేవాడు. ఈ రోజూ ఇంతే అయింది.

తల్లి ఫానువేసి, అతని భుజం తట్టి వూపింది. "ఎందుకురా! అంత దిగులు పడిపోతావు. ఇప్పుడు చేతిలో ఓ వుద్యోగం వుందిగా. అదృష్టం కలిసిరావాలి."

అతను తల్లివంక పరధ్యాన్నంగా చూసి కళ్లు పుస్తకంవైపు మరల్చాడు.

ఆమె లోపలికి వెళ్లి భర్తతో అంటూంది.

"వాడి దురదృష్టం కాకుంటే ఆ సుందరమ్మ కొడుకు బి. ఏ. కూడా పూర్తిచేయలేదు. అదేదో కంపెనీలో మేనేజరుట. నా తోడికోడలు తమ్ముడు స్కూలుఫైనలు పాసయాడా? ఆఫీసరయాడటండీ?"

శీను పుస్తకం అవతల పారేసి

తువ్వాలు మళ్ళీ ముఖంమీదికి లాక్కు న్నాడు.

"అదినరేగానీ, ఆ బెజవాడ సంబంధంవాళ్ళు మళ్ళీ కబురుపంపారు. ఏం జవాబివ్వను ? వీడా ఏకు మేకై కూర్చున్నాడు," అంటున్నాడు తండ్రి.

"వాణ్ణి ఒప్పించే బాధ్యత నాది. మీరు వుత్తరం రాసేయండి. ఇది బాగుంది ! గుమాస్తానంటూ ఏది మానుకుంటాడు ? పెళ్ళా ? పిల్లలా ? అచ్చటా, ముచ్చటానా ? ఏది ?"

* * *

"ఏమండీ ! వాడు రోజూ నాతో గోలపెడుతున్నాడు. మీరేమీ పట్టించుకోవటంలేదు."

"చూడు రత్నం ! వాణ్ణి సగం నువ్వే పాడుచేస్తున్నావు. అసలు విషయం ఏమిటి ? ఆఫీసులో ఎవరితోనైనా దెబ్బలాడాడా ?"

"ఆ గొడవలన్నీ నాకు తెలియవు. మీరే పిలిచి అడగండి." అంటూ తల్లి కొడుకుని కేకవేసింది.

ఖాకీరంగు చారలలాగూ, జుబ్బా, చెరిగిన క్రాపు, చేతిలో పెర్రీమానసను పుస్తకం, పాతికేళ్ళ శేఖర్ తండ్రి ముందుకొచ్చి నిలబడ్డాడు.

"ఆ ! ఏమయింది ? నువ్విప్పుడు బొంబాయి ప్రయాణం దేనికి ? పిలుపు వచ్చిందా ?"

"వచ్చింది డాడీ."

శేఖర్ నేలచూపులు చూస్తున్నాడు.

"అక్కడ వుద్యోగం దొరకటం ఎంత కష్టమో తెలుసా ?"

"తెలుసునండీ. కానీ నాకిక్కడ జాబ్ సాటిస్‌ఫాక్షను లేదు."

"అంటే ?"

"పని రాటెన్‌గా వుంది. పైకిపోయేందుకు ఛాన్సులు లేవు."

"నాకు తెలీక అడుగుతాను ! ఏం ? నీ వయసుకి నెలకి ఆరువందల జీతం చేదా ? ఈ మాత్రం కూడా లేక..."

"అదికాదండీ నాన్నగారూ! బొంబే అయితే కారు అలవెన్సు అదీ వుంటుంది. విదేశం వెళ్లే అవకాశం వస్తుంది. ఆ సొసైటీ వేరు. ఆ లైఫ్ వేరు."

ఇంతలో గుమ్మందగ్గిర నిలుచున్న తల్లి ముందుకి వచ్చింది కొంగు సరిజేసుకుంటూ. వచ్చి భర్తపక్కన కూర్చుంది.

"ఆ సేట్ చునీలాల్ మీకు తెలుసుగా ? ఒకమాటు అబ్బాయిని తీసుకెళ్లి చూస్తే ఏంపోయింది ?"

భర్త ఆమెవంక చిరాగ్గా చూశాడు. ఈ లోపల శేఖర్ లోపలికి జారుకున్నాడు. "ఇదిగో ! నీ మాటలు ఎలా వుంటాయంటే..."

"నా మాటలకేంగానీ పాపం ! వాడి ముఖం చూడండి. కుర్రవాడికెన్నో ఆశలుంటాయి. సరదాలు కలుగుతాయి. ఈ వయసులోకాకపోతే

మరెప్పుడు ఇవి తీరటం? చిన్న వెధవ! లోలోపల కుమిలిపోతున్నాడు. మనం మటుకు చూస్తూ వూరుకోగలమా? ఏదైనా చెయ్యాల్సిందే. అసలు వాడి జాతకంలోనే వుందిట. శాస్త్రులు గారన్నారు. పెద్ద హోదా".

"నీ మాటే నీకు. ఇంకా సంవత్సర మైనా కాలేదు వాళ్ళ కాళ్లూ వీళ్ళ చేతులూ పట్టుకుని ఈ వుద్యోగం సంపాదించాను. కాస్త ఇందులో కుదురుగా పనిచేస్తే తరువాత ఏమైనా చూడవచ్చు. ఏ కారణంచెప్పి మళ్ళీ సహాయం అడగను?"

"ఆ! పోనిద్దురూ! ఇచ్చేవాళ్ళుండాలేగానీ కారణాలెందుకు?"

* * *

కాలం గిర్రున తిరుగుతోంది.

ఓ రోజు దినపత్రికలో వార్త:

"మోగాలో వీధి వూడ్చేవాని వుద్యోగానికి గ్రాడ్యుయేటు దరఖాస్తు."

ఇంకోరోజు మరో పత్రికలో తాజా వార్త:

"సైంటిస్టు షా ఆత్మహత్య. ప్రభుత్వ పరిశీలన."

మరో పత్రిక మరోరోజు అందికదా:

"రాజధానిలో బస్సు కండక్టర్ల వుద్యోగానికి నూటయాభై మంది గ్రాడ్యుయేట్ల దరఖాస్తులు."

ప్రజలు ఆ వార్తలు శ్రద్ధతో చదువుతున్నారు. ఒకరితో ఒకరు చర్చించుకుంటున్నారు. ఆలోచిస్తున్నారు. కాని క్రమేణా వారి ఆశ్చర్యం అలవాటుగా మారిపోయింది. ఆ వార్తలు వారి జీవితంలో ఒక భాగమయిపోయాయి. వారిలో పత్రికలు చదివేవారి సంఖ్య ఎక్కువయింది. మాట్లాడేశక్తి అధిగమించింది. చర్చలూ, సమావేశాలూ పెరిగిపోయాయి. కానీ ఆలోచనలే కరువయిపోయాయి. సొంత ఆలోచనలే అసలు ఎరగరు వాళ్ళు. మెల్లిగా వారిలో కొందరు మంగాలులయారు. చాలామందే శీనులయారు కొందరు శేఖరులయారు.

ఇంతకీ మంగాలు ఏమయినట్లు?

అతని తండ్రి ఓ రోజు ఆ కుక్కి మంచంమీదే కన్నుమూశాడు. కోదండం జాకంలో థియేటరు కట్టారుగానీ మంగాలుకి పని తగలలేదు. ఆ ఖాకీబట్టలతను మటుకు ఇప్పుడు మంగాలు కోసరం రావటంలేదు.

శీనుకి పెళ్ళయిందా?

అయింది. నలుగురు పిల్లల తండ్రి కూడా అయాడు. ప్రమోషనుకోసరం (యు.డి.సి.గా) ఎదురు చూస్తున్నాడు.

శేఖరం బొంబాయి వెళ్ళాడా?

వెళ్ళాడు. కారు దొరికింది. విదేశం కూడా వెళ్లివచ్చాడు. అతనికి జాతకం చెప్పిన శాస్త్రులుగారికి పట్టువంచె, తాంబూలం యిచ్చింది తల్లి.

# ది డర్టీ డాగ్



శ్రీశ్రీశ్రీ శ్రీనివాసరావుగారింట్లో ఫెళ్ళుమని పెళ్ళయింది. ధగిల్లని దీపాలు వెలిగాయి గుభిల్లని గుండెలదరగా పోలీసుబాండు చప్పట్లుకొట్టింది.

శ్రీనివాసరావుగారింట్లో — ఇల్లంటే ఇల్లాకాదూ, మేడంటే మేడాకాదూ— పదిలంగా మనలాంటి బతకడం తెలియని అడ్డమైన వాళ్ల బతుకులూ పిండేసి — పట్టణానికి పయోధరాల్లా వున్న ఎత్తైన ఒక గుట్టమీద—పదివేల చదరపుగజాల్లో—పదివేలమంది పట్టుదలగా కట్టిన — పండు లాంటి—పనస పండులాంటి—ఒకే అంతస్థుగల పసంద్రైన పొదరిల్లు.

ఆ పొదరింట్లో—పాముపడగమీద మాణిక్యంలా శ్రీనివాసరావుగారి నెత్తి మీద దేవతలాంటి మనోరంజని — జెర్రిపోతులాంటి సూరిరావుని పెద్దల

భైరవయ్య

సమక్షంలో పెళ్ళిచేసుకుంది. మనోరంజని కన్యాత్వాన్ని సూరిరావుకి ధారపోయడంతో, రావుగారికి అటు ఏడు తరాలూ—ఇటు ఏడుతరాలూ టకటకమని స్వర్గపు మెట్లెక్కేసి వైటింగ్ లిస్టులో పేర్లు రాసేసాయి.

ఆ సందర్భాన్ని పురస్కరించుకుని, రావుగారు పట్టణంలో బతకడం తెలిసిన పెద్దమనుషుల్ని కేవలం తమ సంతృప్తి కోసం, వచ్చి—కోటలాంటి హోటల్లో తయారైన ప్రత్యేకమైన వంటకాలు—సేనాధిపతుల్లాంటి బేరర్స్ వడ్డిస్తోంటే—ఆరగించమన్నారు.

ఆ పొదరింటిచుట్టూ పచ్చగా — కాన్సెన్ట్రేటెడ్ వెల్తురులా—చెర్లో నాచులా వున్న మెత్తటి లాన్స్‌మీద జరుగుతున్న ప్రస్తుత కార్యక్రమమది.

ఆ పొదరింటికి కావలాగా నాలుగు వైపులా మొగలిడొంకలా పెద్దగోడ—ఆ గోడలోంచి లోపలి కెళ్ళటాని కొక్కటే తోవ. అందులోంచి ఊర కుక్కలూ, కుక్కల్లాంటి మనుషులూ వెళ్ళకుండా అడ్డుగా యముళ్లాంటి వాచ్ మెనూ—ఆ వాచ్‌మేను కళ్ళుగప్పి ఎవడైనా లోపలికెళ్ళితే పెర్మనెంటుగా బయటికి రాకుండా పీక్కలూడదీసి పేగులు తాళ్ళలా పేనెయ్యడానికి రెడీగా వున్న నాలుగు మనిషెత్తు సీమకుక్కలూ ఎప్పుడూ వుంటాయి.

శ్రీనివాసరావుగారింట్లో పెళ్ళి విందు జరుగుతోంది.

నారిగాడు భళ్ళుమని వాంతిచేసుకున్నాడు. మూడు రోజుల్నించి కూడు లేదు. ఎక్కడా పనిదొరకలేదు. ఒక్క నాయాల పైసైనా ఇయ్యలేదు. మునిసిపాలిటీ కుళాయిలోంచి బొట్లు బొట్లుగా కారుతున్న నీళ్ళచుక్కల్తో కడుపు నింపుకుంటే అవి కాసినీ బయటికెళ్ళిపోయాయి.

నారిగాడు డొక్కగిరిపోయిన గోదావరిలా వున్నాడు ఎవడో కుర్రాడు ఆబగా చీకిపారేసిన మామిడి టెంకలా వున్నాడు. ఒంటినిండా వగిలిపోయిన పుళ్ళతో ఇంద్రుడిలా వున్నాడు.

నారిగాడు ఏ బాబుకీ — అమ్మకీ పుట్టాడో, వాడి బాబుకే—అమ్మకే తెలియదు. పేడలో పురుగులా పెరిగాడు. ఈ నాగరికతమీద పుండులా బతుకుతున్నాడు.

రావుగారు చాలా దయాస్వరూపులు. పట్నంలోవున్న పెద్దలంతావచ్చి తిన్లేక వాంతిచేసుకున్న పదార్థాలు వేస్టుచెయ్యకుండా బీదాబిక్కీకి పంచేస్తారు. వారు దుబారా ఇష్టపడరు.

రావుగారి దాతృత్వాన్ని అందుకోడానికి వచ్చిన వాళ్ళలో నారిగాడు కూడా వున్నాడు, బాక్టీరియాలాగ.

రావుగారింట్లో విందు జరుగుతోంది. గంటన్నరనుంచీ సాగుతోంది. ఒకదాని

తర్వాత ఒకటి పదార్థాలు వస్తున్నాయి. పళ్ళేలకి పళ్ళేలు మాయమవుతున్నాయి.

పెద్దలు ఆయాసపడకుండా ఇద్దరు పనసతొనల్లాంటి కాబరే డాన్సర్లని పట్టుకొచ్చారు రావుగారు. వాళ్ళు శరీరంలో ప్రతి అవయవాన్నీ ఊపేస్తున్నారు.

ఆ పొదరింటి గేటుదగ్గర వాచ్‌మేను మాన్‌సింగ్ నారిగాడిలాంటి కుక్కల్నీ, మనుషుల్నీ తోలేస్తున్నాడు. సీమకుక్కల్లాంటి పెద్దమనుషుల్ని పొరపాటున ఊరకుక్కలని మిసండర్‌స్టాండ్ చేసుకుంటాయేమోనని, ఇంట్లోవున్న సీమ కుక్కల్ని అంగుళం మందంవున్న ఇనపగొలుసులతో కట్టించేసిన రావు గార్ని తిట్టుకుంటున్నాడు. లేకపోతే తనుకూడా మిగతా నౌకర్లతోపాటువెళ్ళి కాబూలీ దానిమ్మపళ్ళలాంటి కాబరే డాన్సర్లని చూసును. ఆ కోపమంతా నారిగాడిలాంటి వాళ్ళమీద చూపిస్తున్నాడు.

నారిగాడికి ఈ విందు ముగుస్తుందని నమ్మకం చాలటంలేదు. ముగిసినా మిగిలింది ఇంతమంది మధ్య తనకి దొరుకుతుందని ధైర్యంలేదు. వాడి జీవితానికది క్లైమాక్సో—చరమాంకమో తెలియటంలేదు. అందర్నీ ఎదిరించి పది మెతుకులైనా దొరికించుకోటానికి సత్తాలేదు. దిక్కులేని పీనుగులా బిక్కచచ్చిపోయి అంతదూరంనుంచి — గేటులోంచి — లోపలికి — వెలుతుర్లో చూస్తున్నాడు. గేటుదాటి లోపలికి వెళ్ళడానికి కాళ్ళాడటంలేదు. ఎదురుగుండా అడవిపందిలా వున్నాడు వాచ్‌మేను. వాచ్‌మేను మాన్‌సింగ్‌కి చర్మరంధ్రాల్లోంచి వేడి పుడుతోంది కసిగా బీడీని నలుపుతూ తాగుతున్నాడు.

లాన్‌లోంచి ఆనందంగా హాహాకారాలు వినిపిస్తున్నాయి. బాండుమేళం అమ్మవారిజాతర డప్పుల్లా ధణాధణా మంటోంది. అంతకన్నా వేగంగా డాన్సర్లు అవయవాలన్నీ ఊపేస్తూ వీడి ఒళ్లో వాడి ఒళ్లో వాలిపోతో ఉన్నారు. కొన్నిగజాల దూరంలో నుంచున్న నౌకర్లంతా — శవాల్ని మోసుకుపోయే వాళ్ళలా వున్నారు. మాన్‌సింగు రక్తం వేడెక్కింది. లాఠీని గట్టిగా నేలమీద మూడుసార్లుకొట్టాడు. 'బద్మాష్' అని ఎవర్నో తిట్టాడు. దూసుకుంటూ లాన్స్ వేపు వెళ్ళిపోయాడు.

నారిగాడు నీరసంతో ఒళ్ళు తూలిపోయి గోడపక్కన అలాగే వాలిపోయి కూర్చున్నాడు. మాన్‌సింగు కాలుస్తున్న బీడీచూసి పళ్ళు దురదలు పెట్టాయి. మాన్‌సింగు లోపలికి దూసుకుపోతూ గిరాటెట్టిన బీడీని అందుకోడానికి దేకుతుంటే ఈ లోపున మరోడొచ్చి కాల్తో నారిగాడ్ని తోసేసి ఆ బీడీ పట్టుకుపోయాడు.

నారిగాడికళ్ళలో నీళ్ళింకిపోయాయి. మాన్‌సింగు గేటుదగ్గర లేడు. మెల్లిగా




దేక్కుంటూ నారిగాడు గేటుదగ్గర కెళ్ళాడు. కొంతసేపు అక్కడేవున్నాడు. ఎండిపోయిన శరీరాన్ని ఈడ్చుకుంటూ లాన్స్‌వేపు వెళ్ళాడు.

నారిగాడి మసకకళ్ళకి పదార్థాలన్నీ ఒకలాగే కనిపించినా, అవన్నీ ఆర బెట్టిన వాడి ఆకల్లా వున్నాయి. వాడి నోట్లోంచి, ఒంట్లోంచి అన్నిరసాలు ఉబికొచ్చాయి. ఇన్నేళ్ళ వాడి దరిద్రం కళ్ళముందు కనిపించింది.

పండినపంట తినే మిడతల్లా వున్నా రందరూ.

నారిగాడు ఒక్కఊపులో లాన్స్ దాటి—నౌఖర్లనిదాటి — టేబిల్స్‌దాటి మధ్యకొచ్చి నిలబడ్డాడు. పిచ్చికుక్కలా వున్నాడు. ఒక్కసారిగా అన్ని ప్లేట్లమీద దాడిచేసాడు. పిచ్చిగానవ్వుతూ బర్ఫీ— పులావ్—రోస్ట్ చికెన్ అన్నీ కొరుక్కు తింటున్నాడు.

జనం కెవ్వుమన్నారు. కొందరు మూర్ఛపోయారు. కొందరు డర్టీ డాగ్ అన్నారు. 'ఎవడొదిలాడ్రా ఈ గజ్జి కుక్కని' అని అరిచారు, రావుగారు. ఈ లోపున మాన్‌సింగు అరివీర భయంకరంగా 'బద్మాష్' అని అరుచు కుంటూవచ్చాడు. లాఠీతో నారిగాడిచేతుల మీదకొట్టాడు.

నారిగాడు ఎహ్హా హ్హా అని నవ్వాడు. ఒక బర్ఫీ నోట్లో కుక్కుకున్నాడు.

మాన్‌సింగు అవమానం భరించలేడు.

మాన్‌సింగు లాఠీగాల్లో లేచింది గిర్రున తిరిగింది. నారిగాడి తల బద్ద లైంది. వాడి తలమీద గడ్డకట్టిన నెత్తుర ఈ దేశంలోని లేమింలా వుంది.


మీ మనుమడు లేడండీ -
మీ అంత్యక్రియలకు సెలవు పెట్టాడు!


మా ఆవిడకు నిద్రపట్టదు డాక్టర్!
రాత్రిళ్ళు రెండు గంటల దాకా
మేలుకొనిఉంటుంది!
నువ్వు త్వరగా
ఇంటికి వెళ్ళు!!




# దిగవలసిన రైలు

"ఎక్కిన రైలు దిగక తప్పదు."

ఇంత గొప్ప సంగతి చెప్పింది ఎవరు ? ఏడుకొండలుకు గుర్తురాలేదు. తనే అన్నాడేమో ! ఎట్లాగో దిగాలిగదా అని నిరుత్సాహపడి రైలు ఎక్కకుండా ఉంటే ఎలా కుదురుతుంది ? రైలు వచ్చినపుడు ఎగిరి గంతేసి, అడ్డం వచ్చిన వాళ్ళందరినీ తోసేసి, దర్వాజానుండి పోయే అవకాశం లేకపోతే, కిటికీగుండా దూరి సీటు సంపాదించుకోవాలి. ముందు వెనకలు చూడగూడదు. మీనమేషాలు లెక్కపెట్టగూడదు. సీటు ముఖ్యం. దిక్కులుచూస్తూ, పోయిన రైలువంక టిక్కెట్టు చూపిస్తే ఏం లాభం ? పురోగామి అయిన ఏడుకొండలు దిగిన పడవనల్లా తగలేస్తూ ముందుకుపోయాడు గనకనే ఈ స్థితికి వచ్చాడుమరి. ఆఫీసరు అవటం మాటలా ?

ఏడుకొండలు గెజిటెడు ఆఫీసరు అవుతాడనీ, పరుపుల పెట్టెలో ప్రయాణం చేస్తాడని అనుకోనివాళ్లు అతని ఉత్తరం చూసి "అబ్బ... ఏడుకొండలు అంతటి వాడయ్యాడటరా,..." అని ఆశ్చర్యపడ్డారు.

ఏడుకొండలు రైలుస్టేషనువంక శ్రద్ధగా చూశాడు. తను ఆఫీసరు అయి రావటం ఇదే మొదటిసారి కాని అదివరకు అస్తమానం వస్తూనే ఉండేవాడు. ఎన్నిసార్లు వచ్చాడో లెక్కలేదు. పెద్ద పెద్ద ఆఫీసర్లను రైలెక్కించటానికి వచ్చేవాడు. వారి భార్యలను పుట్టింటికి పంపటానికి వచ్చాడు. తన భార్యను పురిటికి

పంపాల్సినప్పుడుగూడా, ఆ పని తన బావమరిదికి వదిలిపెట్టి, తను స్వయంగా ఆఫీసరుగారి భార్యను రైలెక్కించాల్సి వచ్చింది. 'ఉద్యోగ ధర్మం' ఇంట్లో ఆడవాళ్ళకి ఏం తెలుస్తుంది? అయిన దానికీ కానిదానికీ గునుస్తారుగాని! ఆఫీసరుగారికి పిల్లలు కలగలేదు. అందులో తన బాధ్యత ఏముంది? అయినా బాబాగా రొస్తే ఆఫీసరుగారి భార్యను తను తీసుకుని వెళ్ళవలసివచ్చింది తిరపతి పోతానంటే తీసుకునివెళ్ళి, అక్కడ మకాం, ఉండటానికి ఏర్పాట్లు చూసే బాధ్యత తనపైన పడింది. ఆమె ఫస్టు క్లాసులో కూర్చుంటే, తను రెండో తరగతి పెట్టెలో నిలబడ్డాడు.

పెద్ద ఆఫీసరుగారు మద్రాసునుంచి తిరపతి వచ్చి ఒక రోజుండి తిరిగి వెళ్ళిపోయారు. ఆమె వెంటనే తిరిగిరాలేదు. 'అలివేలు మంగాపురం' అన్నది 'శ్రీకాళహస్తీశ్వరా' అన్నది. 'బెజవాడ కనకదుర్గ చూడాలి' అన్నది. 'హోటలులో మకాం' అన్నది. 'గదిలో ఒంటరిగా పడుకోవటానికి భయం' అన్నది. మధ్య మధ్య వచ్చి కనబడిపోతూ ఉండమ'న్నది. 'ఉద్యోగ ధర్మం' మరి తప్పలేదు. వేళాపాళా లేకుండా దర్శన భాగ్యం పొందుతూ వచ్చాడు. రూప, స్పర్శ, రసగంధాదులు అంటారు పెద్దవాళ్ళు. వాటి అర్థం తెలుసుకున్నాడు. ఆ శీలవతికి పుత్రోదయం అయినప్పుడు, ఆ పిల్లవాడికి 'వెంకట రమణా' అని పేరు పెట్టుకున్నారు. అప్పుడు ఇంట్లో చాలా గలభా అయింది – 'ఏడుకొండలు' అన్నా, 'వెంకట రమణా'అన్నా రెండూ తిరుమలస్వామి పేర్లేగాని ఏడుకొండలకు, వెంకట రమణకు వేరే సంబంధం లేదు ఈ రెండూ భగవంతుని రూపాలే అని నచ్చజెప్పినకొద్దీ ఇంట్లోవాళ్ళు పేట్రేగిపోయారు – ఆఫీసరూ, అతని భార్యా కావాలో, తనే కావాలో తేల్చుకోమని తాళికట్టిన భార్య చెప్పేదాకా వచ్చింది. అందుకనే ఉద్యోగ ధర్మం అసిధారా వ్రతంలాంటిది అంటారు ఏడుకొండలు ఆ రోజురాత్రి భార్యతో రాజీకి వచ్చి 'నువ్వే కావాలి... ప్రమాణంచేసి చెపుతున్నాను' అన్నాడు. రామాయణం నెత్తిన పెట్టుకుని ప్రమాణం చెయ్యమన్నది రోజూ రామాయణం ఉండే చోట భాగవతం ఉన్నది. ఏడుకొండలు భాగవతం నెత్తిన పెట్టుకుని ప్రమాణం చేసి "రుక్మిణీ వల్లభా, రాధా మనోహరా... కాపాడు తండ్రీ" అన్నాడు. ప్రమోషను అంటే ఎన్ని తిప్పలు పడాలి?......

ఫస్టుక్లాసు టిక్కెట్టు వొకసారి మళ్ళీ చదువుకుని, కూలీ నెత్తిన సామాను ఎక్కించి 'పద' అన్నాడు ఏడుకొండలు. 'స్లీపరులో పెట్టమంటారా?' అన్నాడతను. ఏడుకొండలుకు వళ్లుమండిది – తను ఎవరు అనుకుంటున్నాడు? 'ఫస్టు

క్లాసులో పెట్టు...' ఆఫీసరు కోపం చూపించాడు. కూలీ నెత్తిన పెట్టుకున్న బెడ్డింగు ఏనాటిదో! కొత్త బెడ్డింగు కొనుక్కుంటే కూలివాడు అట్లా మాట్లాడే వాడుకాదు. ఆ బెడ్డింగు అనేక ప్లాటు ఫారాలమీద అనేక మడుగుల్లో తడిసింది. తారు అంటింది. పేడ అంటింది. కడిగిస్తే పెద్ద పెద్ద మరకలయింది. ఆ బెడ్డింగు తనవెంట రావటం గతం భవిష్యత్తును వెంబడిస్తున్నట్లుగా ఉంది.

సామాను కొంచెం దూరంగా పెట్టించి ఫస్టుక్లాసు వెయిటింగు రూములోకి పోయాడు. బండి వచ్చే టయిమయింది. వెయిటింగురూం అవసరంలేదు. ఇంత కాలం ఆ గది బయట తిరిగినవాడు కాబట్టి ఈనాడు సాధికారంగా లోపల కూర్చోవాలనిపించింది. గుమ్మంలో ఎవరో రైల్వేఉద్యోగి ఉంటే టిక్కెట్టు తీసి చూపించాడు. 'అక్కర్లేదులెండి...' అన్నాడతను. లోపల అన్ని పేము కుర్చీలలోనూ, సోఫాల్లోనూ జనం నిండి ఉన్నారు. వాళ్లెవరిదగ్గరా ఫస్టు క్లాసు టిక్కెట్టు ఉండిఉండదు అనుకున్నాడు ఏడుకొండలు. చికాకు వచ్చింది. రైల్వే ఉద్యోగిని పిలిచి 'కూర్చోవటానికి ఎక్కడా ఖాళీలేదు...' అన్నాడు ఏడు కొండలు.

అవును...' అన్నాడతను.

'చాలామంది...రెండోక్లాసు టిక్కెట్టు వాళ్ళు కూర్చున్నట్లున్నారు,' అన్నాడు ఏడుకొండలు ముఖం చిట్లిస్తూ.

'ఉహూఁ...' అన్నాడతను.

'నేను కంప్లైయింటుచేస్తాను...' ఏడు కొండలు జేబులోనుండి పెన్ను తీశాడు.

'అట్లాగే...' అన్నాడతను.

'కంప్లైయింట్ పుస్తకం ఎక్కడ...?' ఏడుకొండలు విసుక్కుంటున్నాడు.

'స్టేషను మాష్టరుగారిని కలవండి...' అతను నిర్లిప్తంగా దూరానఉన్న బోర్డు చూపించాడు. ఇంత సేపు అనవసరంగా ఇతనితో మాట్లాడినందుకు బాధకలిగింది. అటు పోతే సామానెవరన్నా ఎత్తుకుపోతా రేమో! 'కోరి తలనెప్పి తెచ్చుకోవటమా' అని ఆలోచిస్తుంటే రైలు రానేవచ్చింది.

పరుపుల పెట్టెలో కూర్చున్నప్పటి నుండి ఏడుకొండలకు ఆదోరకమైన ఠీవి, కళ వచ్చినాయి. కొంచెంసేపు గుమ్మందగ్గర నిలబడ్డాడు. గుమ్మం పక్కన 'వకటి' అనే అంకెకోసం వెదికి చూశాడు. పెట్టె నెంబరు నోటుచేసు కున్నాడు. పెట్టెదిగి ఎరిగినవా ళ్లెవరన్నా కనిపిస్తారేమోనని చూశాడు. తను ఫస్టు క్లాసు పెట్టె ఎక్కుతూ, దిగుతూఉంటే, 'అలగా జనమ'ంతా రెండో తరగతి పెట్టెలోకి గుంపులుగా తోసుకుంటూ, కడ్డీలు పట్టుకుని వేళ్ళాడుతూ, కిటికీల గుండా దూకుతూ, వేరుసెనక్కాయలు వలిచి పొట్టు అక్కడే పోసుకుంటూ, బత్తాయి తొక్కలు పోస్తూ ఉమ్ముతూ,

ఉచ్చులతో ఎంతటి నికృష్టమైన సాదా జీవితం గడుపుతున్నారో సుస్పష్టంగా కనిపిస్తోంది ఏడుకొండలుకు. 'ఛీ అలగా జనం... నాలుగు రూపాయలు పోయినా పై క్లాసులో పోదామని, సుఖంగా జీవితం గడుపుదామని ఉండదు... వీళ్ళకు' అనుకున్నాడు. పేడలో పురుగులాంటి వాళ్ళు వీళ్ళు. అక్కడే తిరుగుతారు. అదే స్వర్గం. ఛీ... ఛీ... చీదరించు కుంటూ ప్లాటుఫారంమీద నడుస్తుంటే రైలు కూతకూసింది. రైల్లోకి గబగబా ఎక్కాడు పెట్టెనంబరు చూసుకుంటూ.

క్షణాల్లో రైలు వేగం పుంజుకుంది. ఏడుకొండలు ఆలోచనలుగూడా వేగం పుంజుకుంటున్నాయి. తను ఎక్కడ పుట్టాడు. ఎక్కడ పెరిగాడు. ఎక్కడ ఉద్యోగం చేస్తున్నాడు. అంతా దైవ ఘటన. డైరీలో వెంకటేశ్వరస్వామి పటంతీసి దణ్ణం పెట్టుకున్నాడు. పెద్ద పదవిలోనికి వచ్చిన తర్వాత తణిఖీకి పోవటం ఇదే మొదటిసారి. వాళ్ళ మర్యాదలకు తబ్బిబ్బు అయిపోకుండా, అవన్నీ తనకు అలవాటు అయినట్లే ప్రవర్తించాలి. ఎన్ని హంగులు చేసినా, తన కార్యదీక్షలోగాని కర్తవ్య నిర్వ హణలోగాని లోపం రానీయకూడదు. అతి మెలకువతో మెలగాలి......

తను ఆఫీసరు అయి గదిలో కూర్చున్న మొదటిరోజున వాడెవడో కంట్రాక్టరు వచ్చాడు. అతి వినయంగా మాట్లాడాడు.

'ఏంటి సంగతి?' అటువంటి వాళ్లతో కర్కశంగానే మాట్లాడాలి.

'మీతో మాట్లాడదామని...' అతను నీళ్లు నమిలాడు.

'మాట్లాడుతున్నాంగా... చెప్పండి..' గదమాయించాడు. అంత తీవిగా మాట్లా డటం సహజంగా వచ్చినందుకు తనే ఆశ్చర్యపడ్డాడు.

'మీతో ఆఫీసుపని విషయం మనవి చేసుకోవాలి...' అన్నాడు కంట్రాక్టరు, చేతిసంచి డ్రాయరుమీద పెడుతూ.

'ఆఫీసుపనా... అయితే ఇంటికి రండి... తీరికగా మాట్లాడుకుందాం...' గబగబా అన్నాడు. తనేం మాట్లాడు తున్నాడు? మాటలన్నీ అన్న తర్వాత గాని వాటి అర్థం అవగతం కావటంలేదు. మనసు చెప్పినమాట నోరు అనటంలేదు. నోరు చెప్పినమాట చెవులు విని మన సుకు అందజేస్తున్నాయి. సిస్టం ఏదో చెడిపోయినట్లుంది.

'చిత్తం...అదే మనవి చేద్దామని...' కంట్రాక్టరు చేతులు జోడించాడు. 'రాస లీల... హోటల్లో రాత్రి పదింటికి... నూట పదకొండో నంబరు గది... చిత్తం...' అతను వెళ్ళిపోయాడు. ఏడుకొండలు నోటికి తాళంవేసి వెళ్ళి నట్టయింది.

ముక్కుకి ఎవరో తాడుపోసి

లాక్కుపోతున్నట్లు తొమ్మిదింటికళ్ళా బయలుదేరాడు. 'సెకండుషో సినిమాకు' అని ఇంటిదగ్గర చెప్పాడు. బస్‌స్టాండు దగ్గర ఎరిగున్నవాడు కనిపించాడు. 'సెకండుషోకి' అన్నాడు తను. అతను అడగలేదు. నవ్వాడు. పళ్ళన్నీ కనిపించాయి. ఆ పళ్ళన్నీ మొక్కజొన్న గింజల్లాగా వలిచెయ్యాలనిపించింది. ఆ నవ్వులో అంతటి వెటకారం ఉంది.

ఏడుకొండలు కిటికీలోనుండి బయటకు చూశాడు. పచ్చని పొలాలు కనిపించాయి. 'రాసలీల' హోటల్లో అమ్మాయి ఆ రంగు చీరే కట్టుకుంది. అదే రంగు జాకెట్టు. బొట్టూ అదే రంగు.

'త్రీ...ఛీర్స్...' అన్నాడు కంట్రాక్టరు గ్లాసు అందిస్తూ. తను ఏమనాలో తోచక కొంచెం కంగారుపడ్డాడు. 'ఫోర్... ఛీర్స్' అంటే గొప్పగా ఉంటుందేమో! మౌనం ఉత్తమ లక్షణం. ఇకిలించాడు. పళ్ళు బయటపెట్టాడు

'హౌ డు యు డూ..?'అన్నదిఆమె. ఏం సమాధానం చెప్పాలి?? అందరిలాంటివాడే తనూ!! ఆ మాటే అన్నాడు. ఫక్కుమని నవ్వింది ఆమె. కంట్రాక్టరు విరగబడి నవ్వాడు. ఆ అమ్మాయి తన భుజంమీద చెయ్యివేసి 'హౌ...నైస్ ..' అన్నది? ఏమిటి... ఆ చొరవ. ఏది ఎట్లాఉన్నా ఆఫీసర్లదే జీవితం. ఆఫీసరు కానివాడిదీ ఒక బ్రతుకేనా? ఏడుకొండలు జేబులో పెన్ను చూసుకున్నాడు. తనకే అధికారం ఉంటే భారతదేశ ప్రజలందరినీ ఆఫీసర్లుగా ప్రకటిస్తాడు. ఏడుకొండలు పెన్ను క్యాప్‌తీసి పాళీ ఉన్నదోలేదో అని అనుమానంగా చూశాడు. సిరా ఉన్నదో, లేదో! క్యాప్ పెట్టి పెన్ను జేబులో పెట్టుకున్న తర్వాత పెన్నుకు పాళీ ఉన్నదో, లేదో అని మళ్ళీ అనుమానం వచ్చింది. ఏడుకొండలు మనస్సు పరిపరి విధాల పోతోంది. రెండో తరగతిలో ప్రయాణం చేసినప్పుడు ఇంత ఆందోళన ఎరగడు...

పెట్టెలో నలుగురైదుగురు వున్నారు. పై బెర్తుమీద ఎవరో పెద్ద దుప్పటి కప్పుకుని పడుకున్నారు. మరీ లావుపాటి వాళ్ళయితే వొకరు కావచ్చు. లేకపోతే సన్నటివాళ్ళు ఇద్దరు కావచ్చు. రెండు టిక్కెట్లూ కొన్నారో లేదో! తనకెందుకూ. టిక్కెట్టు కలెక్టరు చూసుకుంటాడు. తను పెద్ద ఆఫీసరయినా చిన్న ఉద్యోగికి రావలసిన ఆలోచనలే వస్తున్నాయి. అలారంమోత ఒకసారి వినబడగానే తన ఆలోచనలన్నీ చెల్లాచెదరయినాయి. ఏ సూటుకేసులో ఉన్నదో అలారం గడియారం మోగుతోంది. రైల్లోగూడా ఈ గొడవ ఏమిటి. ఇంకా చీకటిపడలేదు. టైం చూసుకున్నాడు. గడియారం ఆగిపోయింది. బయటకు చూశాడు. బోలెడన్ని రైలుపట్టాలు. చిన్నపిల్లలు పలకమీద ఇష్టం వచ్చినట్లు పిచ్చిగీతలు గీసినట్లున్నాయి. ఊరొచ్చేసింది. సిగ్నలు కనిపించింది. దూరాన

ప్లాటుఫారం. దాని నీడల్లో మనుష్యులు నీడల్లాగా కదలటం అంతా కనిపిస్తోంది. గబుక్కున లేచి బెడ్డింగు చుట్టాడు. సూటుకేసు సర్దాడు. ఈ క్షణంకోసమే తను ఎదురుచూస్తున్నది. అమెరికాపోయి విమానంలో తిరిగినా వొకటే ! అడవిలో నెమలి నృత్యం చేసినా వొకటే!! అయిన వాళ్ళు చూడాలి. మెచ్చుకోవాలి. కావల సినవాళ్లు శభాష్, అనాలి. అందుకనే తను బయలుదేరేముందు తనిఖీ చేయ బోయే ఆఫీసువాళ్ళకే కాకుండా, తన బంధుమిత్రు లందరికీ ఉత్తరాలు వ్రాశాడు. 'తను ఫలానా బండికి వస్తు న్నాననీ, స్టేషనుకు రావలసిందనీ.' అందరూ వస్తారు. తను ఫస్టుక్లాసు గుమ్మంలో నిలబడి చేయి ఊపుతాడు. వాళ్లందరూ గుర్తిస్తారు. నమస్కరిస్తారు. వాళ్లు దండలుతెచ్చి వెయ్యవచ్చు. 'అబ్బే... ఇవన్నీ ఎందుకండీ.' అంటా డతను. వాళ్లు దండలు తేకపోతే ! 'మీరు దండలు తీసుకుని రావటం... స్టేషనులో వేయటం... నాకు అంతగా నచ్చవు... తరవాత మీ ఇష్టం...' అని ఉత్తరంలో వొక ముక్క వ్రాస్తే సరిపోయేదేమో !

బండీ వేగంకంటే గుండెవేగం ఎక్కువగా ఉన్నది. ముఖంమీద చిరు చెమట పట్టింది. రుమాలు కనిపించ లేదు. బెడ్డింగు చుట్టినప్పుడు లోపల పడేసినట్లున్నాడు. చేత్తో తుడుచు కున్నాడు-చేతులు లాగూజేబుకు తుడుచు కున్నాడు. ప్లాటుఫారం రానేవచ్చింది. చక్రంలా...? గుండె... చప్పు డెక్కడ నుండి వస్తోంది. ప్లాటుఫారంమీద ఆవు వొకటి తిరుగుతోంది. అక్కడక్కడ పేడ కనిపిస్తోంది. శుభ్రత లేదు. ఈ దేశం బాగుపడేదేమిటి ? ఆవులు ప్లాటు ఫారంమీదకు రావటానికి కారణం ఏమిటి? వాటికి ప్లాటుఫారం టిక్కెట్టు అక్క ర్లేదనేగదా ! రూల్సు మార్చాలి.

ప్లాటుఫారంమీద ఏదో గోడ కడు తున్నారు. ప్లాటుఫారం పెంచుతున్న ట్లున్నారు – సిమెంటు బస్తాలు లోపల నుండి తీసుకువచ్చి పడేస్తున్నారు. అంతా సిమెంటు లేస్తోంది. ఆ కూలీల వళ్లంతా సిమెంటే. సిమెంటుతో చేసిన బొమ్మల్లాగా ఉన్నారు. వళ్లంతా చెమటపట్టినట్లుంది. శరీరమంతా చారలుగా కనిపిస్తున్నాయి. కింద నడుస్తూ పేడ తొక్కినట్లున్నారు. ఒకడికి కాలంతా అంటుకుంది. వాడు ఏమీ పట్టనట్లుగా నడుస్తున్నాడు. ఆ వాసన తెలీదా ? పేడ పురుగులు వీళ్లు. వాళ్లంతా ఆఫీసర్లు కావాలంటే ఎన్ని జన్మలు ఎత్తాలి ! అప్పుడు సిమెంటు బస్తాలు ఎవరు మోస్తారు మరి ? ఛీ..ఛీ.. జేబురుమాలుకోసం చూశాడు, ముక్కుకు అడ్డం పెట్టుకుందామని. రుమాలు బెడ్డిం గులో ఉన్న సంగతి అప్పుడు గుర్తొ చ్చింది.

బండీ బ్రేకులు చప్పుడు చేసుకుంటూ ఆగింది. లేచి గుమ్మందగ్గర నిలబడ్డాడు. తనవాళ్లకోసం దృష్టిని సారించాడు, ఈ చివరనుండి ఆ చివరదాకా. ఎవరో తెలి

సిన వాడిలాగా కనిపిస్తే చేయి ఊపాడు. అతను ఎవరో? వ్యక్తినిపోలిన వ్యక్తి ఉండొచ్చు. ఏడుకొండలు గుండెదడ కొంచెం సర్దుకుని మళ్ళీ మొదలయింది. దడ రాకపోతే గుండె ఆడుతున్నదో లేదో తెలుసుకోవటం కష్టమే అయిదు నిమిషాలయింది. పదినిమిషాలయింది ప్లాటుఫారంమీద పెద్ద గడియారంముల్లు ఒక్కొక్క నిమిషం ముందుకు గెంతుతూ జరుగుతుంటే, తన వెనకాలనుండి వచ్చి తన నెవరో ముందుకు తోసేస్తున్నట్లుగా ఉన్నది. తనకోసం ఒక్కళ్ళూ రాలేదు. ఏమయిపోయారు వీళ్లంతా? చచ్చారా! బ్రతికారా! ఒక్కడన్నా రాకూడదూ. తను మొదటితరగతి పెట్టెలోనుండి దిగినట్లు చెప్పటానికి ఒక్క సాక్ష్యం గూడాలేదు. సాక్ష్యం దొరక్కుండా తన నెవరో ఖూనీచేసినట్లు బాధకలిగింది. అప్పటిదాకా తనతో ప్రయాణంచేసిన వ్యక్తి ఊరుకోకుండా 'ఏమండీ... మీ రిక్కడేగాదూ... దిగాలన్నారు...' అన్నాడు. తను స్టేషనులోనో దిగుతాడో, గోదార్లో దూకుతాడో వాడి కెందుకు? కిందకు దిగిన తర్వాత, ఫస్టుక్లాసులో దిగినవాడూ రెండో తరగతిలో దిగినవాడూ, టిక్కెట్టు లేకుండా వచ్చినవాడూ అందరూ ఒక్కటే! గుండె నోట్లోకి వస్తున్నది. చేతిలో చెమటపట్టి కడ్డీ జారిపోతున్నది. అతను 'టైమయిపోతోందండి...' అంటున్నాడు. వాడిని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది. అతను తనకు ఏం అపకారం చేశాడు? ఇంతకంటే అపకారం ఏం కావాలి. తన దురవస్థకు సాక్షి అయ్యాడు. గార్డు విజిలు ఊదాడు. పచ్చజండా ఊపాడు. గంట గణగణా మోగింది ఇంజను గుఫ్ గుఫ్ మంటూ చప్పుడు చేస్తోంది. ఎవరికి వీలయిన ధ్వనులు వాళ్లు చేస్తున్నారు. రైలు బయలుదేరింది అన్న సంగతి ఒక్కక్షణందాకా మనసుకు పట్టలేదు. ఎదురుగా ఉన్న పుస్తకాల షాపు ఎడం పక్కకు వెళ్ళిపోతుంటే కళ్ళు తిరుగుతున్నాయేమో! అనుకున్నాడు – కళ్ళు తిరగటంకాదు. బండిచక్రాలు తిరుగుతున్నాయి. బండి ముందుకు పోతున్నది. ఈ రైలు ఒకళ్ళకోసం ఆగేదికాదు. ఈ సంగతి తను ఎంతమందికో చెప్పాడు. బండి బయలుదేరే లోపునే ఎక్కాలని చెప్పాడు. బండీ ఎక్కటం నేర్చుకున్నాడు కాని దిగటం నేర్చుకున్నట్లు లేదు. గబుక్కున సూటుకేసి కింద పడేశాడు. బెడ్డింగు పడేశాడు. దాని పట్టీ ఊడింది. కాలికి చుట్టుకుంది. బెడ్డింగు ప్లాటుఫారానికి రాచుకుంటూ వస్తోంది. తనంతట తను దిగే స్థితి పోయింది. బెడ్డింగు అతన్ని పట్టుకుని లాగి కింద పడేసినట్లయింది. తర్వాత ఏం జరిగిందో కొన్ని క్షణాలదాకా అర్థం కాలేదు. పట్టాకు ప్లాటుఫారానికి మధ్య ఉన్నాడు తను. కాలు డొక్కుని పోయింది. భగ్గున మండిపోతోంది. రైలు ఆగింది.

రైలు కట్టుకున్నవాళ్ళు, కోట్లు వేసుకున్నవాళ్ళు, మల్లెపూలవంటి బట్టలు వేసుకున్నవాళ్ళు... పెద్ద పెద్ద ఆఫీసర్లు... గుంపులుగా నిలబడి చూస్తున్నారు. వాళ్లంతా ఆఫీసర్లేనా... ఏమో. మంచి బట్టలు ఎవరైనా కట్టుకోవచ్చు. ఏడు కొండలుకు స్పృహ వస్తూపోతూ ఉన్నది. వెంకటేశ్వరస్వామి గుర్తుకు వచ్చాడు. 'స్వామీ...' జనం తోసుకుంటున్నారు. 'ఏం టయింది...' 'ఏం ఓయింది ..' అంటున్నారు.

'పాపం ఎవరో పడిపోయారు...'

సిమెంటుమోసే కూలీలు వస్తున్నారు. తెల్లబట్టలవాళ్ళు పక్కకు తప్పుకుంటు న్నారు. 'చచ్చిపోయాడా...' తను చచ్చిపోలేదని చెప్పాలనిపించింది ఏడు కొండలుకు. మాట పెగల్లేదు.

'ఏంటి చూస్తున్నారు... ఇచిత్రం... ముందు పైకి లాగండి...' అందులో ఒక కూలీ అంటున్నాడు. అతనివెంట ఇద్దరు, ముగ్గురు కూలీలు దిగారు. కాళ్లు ఒకరు, చేతులు ఒకరు, నడుం ఒకరు... అంతమంది ఎప్పుడు వచ్చారు. పట్టాల పక్కన కూరుకునిపోయినవాడిని మెల్లిగా ఎత్తి ప్లాటుఫారంమీద పడుకోబెట్టారు. తల తిరుగుతోంది.

'గాలి రానీండెళ... ఛస్తాడు...' జనాన్ని వెనక్కు నెట్టుతున్నారు. అక్కడినుంచి మెల్లిగా ప్లాటుఫారం బెంచిమీద పడుకోబెట్టారు కూలీలు. తనను ఎత్తుకుని తీసుకువస్తుంటే ఆ చెమటకంపు, పేడవాసన సిమెంటు గంధం కలిసి ముక్కుపుటాలకు తగులు తోంచి. అసహ్యం వేయలేదు. నంద నోద్యానవనంలోని సుగంధ పుష్ప సౌరభంలా తోచింది. ఆ కూలీలకోసం చూశాడు. కనిపించలేదు. అతని బంధు మిత్రులు, ఉద్యోగులు అంతా అప్పుడు వచ్చినట్లున్నారు.

'ఏమండీ... సార్...'

'తమరు... ఏడుకొండలుగారు కాదా సార్.'

'దారిలో జీపుపడిపోయిందిసార్... కొత్తకారు క్యాంపుకి పోయిందిసార్... లేకపోతే అదే తెచ్చేవాళ్లం సార్...' వినయంగా నిలబడ్డారు వాళ్ళు.

ఆ మాటలన్నీ అతన్ని నమిలే స్తున్నాయి

'ఏరా... ఏడుకొండలూ... రైలు దిగటం చేతకాకపోతే ఎట్లాగురా...' ఎవరిదా గొంతు? తన మనస్సేనేమో! తనను పట్టాలమీదనుండి పైకి తెచ్చిన కూలీ పేరేమిటో అడిగి తెలుసుకోవాలి. డాక్టరుగారు రాగానే కూలీలు వెళ్ళిపోయి నట్లున్నారు. ఆ కూలీ పేరు ఎవర్ని అడగటం? ఏడుకొండలు మనస్సులో ఏదో మబ్బుతెర తొలగినట్లయింది. ఏమిటీ అవివేకం? "ఆఫీసర్లకు పేర్లు గాని, మనిషికి పేరేముంటుంది?" అనుకున్నాడు. రైలు వెళ్ళిపోతోంది. మొదటి తరగతి పెట్టేదో, రెండో తరగతి పెట్టేదో కనిపించటంలేదు ఏడుకొండలుకు.




ఆమెని ఒక బంధువుల యింట్లో చూడడం తటస్థించింది. లేత పసుపు రంగు వాయిల్ చీర కట్టుకుని, కడిగిన ముత్యంలా మెరుస్తోంది. మనిషిని చూడగానే ఆకట్టుకునే ఆకర్షణ ఏదో వుంది. జుత్తు దువ్వుకోవడంలో చీర ధరించడంలో, పొందికగా కూర్చోడంలో – ప్రతివిషయంలో ఓ అందం కనిపిస్తోంది, ఆమె చేతివేళ్లు సన్నగా. పొడుగ్గా వున్నాయి. గోళ్లు గుండ్రంగా కత్తిరించి పగడాలు పొదిగినట్లు మెరుస్తున్నాయి.

ఆమె పేరు మధు. చాలా తెలివైనదని పేరు. ఆ ఏడాదే ఎమ్. ఎ. డిగ్రీ పుచ్చుకుంది. యూనివర్సిటీలో ప్రథమ శ్రేణిలో వచ్చి బంగారుపతకం తెచ్చుకుంది.

మధు అంటే నేను యిష్టపడ్డాను.

అన్నివిధాలా అనువైన సంబంధమని మా వాళ్ళు ఒప్పుకున్నారు.

నేను ఇంజినీరింగ్ పాసై, జూనియర్ ఇంజనీర్ గా పని చేస్తున్నాను. ఉద్యోగంలో పైకి వచ్చే అవకాశాలు వున్నాయి. కుటుంబ బాధ్యతలు లేవు. అందుకని మా పెళ్ళికి ఆడపెళ్ళివారి వద్దనించీ ఏ అభియోగం లేకపోయింది.

మధూకీ, నాకూ వివాహం జరిగింది. పదిరోజులు యిట్టే పెళ్ళి హడావిడిలో గడిచిపోయాయి. మధూని తీసుకుని ఒంటరిగా తాతానగర్ వచ్చేసాను.

కాపరం పెట్టగానే మా అసలు జీవితం ప్రారంభమైంది. రైలు దిగి యిల్లు చూస్తూనే ముఖం చిట్లించింది మధు. ఇల్లు చిన్నదనికాదు. ఇల్లంతా గలీజుగా వుందట. అప్పటికీ నేను ముందుగా వుత్తరం రాస్తే నా స్నేహితుడు యిల్లు తుడిపించి, కడిగించి పెట్టాడు.

"ఎంత ఘోరంగా వుంది ప్రకాశ్!" అంది మధు.

"బ్రహ్మచారి కొంప యింతకంటె బాగా ఎలా వుంటుంది? అయినా నా కళ్ళకి బాగానేవుంది. బెనర్జీ తుడిపించాడు కదా!"

"నీ కళ్ళకి బాగుందా? నా మట్టుకు నాకు ఎన్ని రోజులు శుభ్రంచేస్తే బాగుపడుతుందో తెలియటంలేదు"

"ఇవాళేం పెట్టుకోకు. స్నానం చేసిరా. బెనర్జీ భోజనానికి పిలిచాడు. వెళ్ళాలి. ఎదురు చూస్తూవుంటారు."

"స్నానం ఎలా చెయ్యను ప్రకాశ్? ముందరీ యింటిపని చూసిన తర్వాతే తక్కినవి" అంది, చేతిలో హేండ్ బాగ్ అల్మారాలో పెడుతూ... నాకే ఆశ్చర్యంవేసింది. ఇంతట్లోనే నాకు వంటా, పనీ చేసిపెట్టే పనికుర్రాడు హనుమాన్ వచ్చాడు.

"హనుమాన్ చేస్తాడులే నువ్వు స్నానం చెయ్యి మధూ," అన్నాను.

"అబ్బే, వాడితో లాభంలేదు ఈ యిల్లు చూస్తూంటె నాకు తేళ్ళూ, జెర్రెలూ పాకినట్లు వుంది. భోజనం చేసి వచ్చి, యీ యింట్లో ఎలా కూచుంటాం? నువ్వెళ్ళి భోజనం చేసిరా ప్రకాశ్" చీర పైకి కట్టింది మధూ.

"నువ్వు రాకపోతే బెనర్జీ భార్య నొచ్చుకుంటుంది. తప్పు పట్టుకుంటారు."

"అయామ్ సారీ." మధు తన పనిలో నిమగ్నమయింది

నాకు కోపం వచ్చింది ఏం చెయ్యాలో తెలియలేదు. క్రొత్తపెళ్ళి కూతురు. బాగా పరిచయంలేదు. చిన్నపిల్ల కాదు, అదమాయించడానికి. నాతో సమంగా చదువు

కున్నది. వ్యక్తిత్వమున్న మనిషి. అలా ప్రవర్తిస్తూంటే ఏంచెయ్యను? క్రొత్త కాపరం యిలా మొదలైందని బాధపడుతూ, స్నానంచేసి, బెనర్జీ యింటికి వెళ్ళాను.

"ఆవిడకి ఒంట్లో బాగాలేదు" అని అబద్ధం చెప్పి, బెనర్జీ దగ్గిర తప్పించుకున్నాను. బెనర్జీ భార్య భోజనం అంతా కారియర్‌లో పెట్టి యిస్తే యింటికి తీసుకువచ్చా.

మధు తడిగుడ్డతో కుర్చీలు, టేబిల్స్ తుడుస్తోంది, హనుమాన్ తలుపులూ, ద్వారబంధాలూ తుడుస్తున్నాడు.

"మధూ, యింకా అలాగే వున్నావా? భోజనం తెచ్చాను."

"వంటింట్లో పెట్టు." మధు తలఎత్త లేదు.

నేను స్కూటర్ తీసుకుని వూళ్ళోకి వెళ్లాను. తిరిగి వచ్చేసరికి సాయంత్రమయింది. ఇంటికి రాగానే నా చిరాకంతా పటాపంచలైంది.

ఇల్లు నీట్‌గా సర్దివుంది. తలుపులూ, కుర్చీలు, ప్రతి వస్తువూ పాలిష్ చేసినట్టు మెరుస్తున్నాయి ఏదో అద్భుత మాయ పాత యింటిని క్రొత్త యిల్లుగా మార్చేసినట్టుంది. మధు శక్తిని లోలోపలే అభినందించకుండా వుండలేకపోయాను.

తెల్లటి చీర కట్టుకుని, ఫాన్ క్రింద కుర్చీలో కూర్చుని పేపరు చదువుతోంది మధు. ఆమె తడిజుట్టులోంచి షాంపూ వాసనలు వ్యాపిస్తున్నాయి. వెళ్ళి మధు బుగ్గమీద ముద్దుపెట్టుకున్నా.

"ఓహ్ బయటినించి తిన్నగా వచ్చి యీ పనేమిటి? కాళ్ళూ, చేతులూ కడుక్కున్నావా?" బుగ్గ రుమాలుతో తుడుచుకుంది మధు.

"సారీ."

బూట్లు విప్పి, బట్టలు మార్చుకుని, బాత్‌రూమ్‌లోకివెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కుని వచ్చా.

"ఇప్పుడు ముట్టుకోవచ్చా?" మధు ప్రక్కనే కూర్చున్నా.

"సరే లే! బూట్లు యిక్కడే నేంటి విప్పుకోడం? జోళ్ళ స్టాండ్‌లో పెట్టుకోవాలి"

"హనుమాన్ పెడతాడులే."

"వాడు వచ్చేదాకా యిలాగే వుంటాయి."

"హనుమాన్ - టీ" అని కేకేసి, పేపరు చూస్తూ కూర్చున్నా.

"వాడు లేడు. నేను టీ పెడతాను."

"ఎక్కడి కెళ్ళాడు?"

"స్నానంచేసి బట్టలు మార్చుకుని రమ్మని నేనే పంపాను"

"ఇంక యివాళ్టికి వాడు వచ్చినట్టే. పనివాళ్ళని మధ్యలో ఎప్పుడూ యింటికి పంపకూడదు మధూ."

"వాడు రాకపోతే నేనేచేసుకుంటా. కుళ్ళుబట్టలూ, వాడూ. చూస్తే

డొకొస్తున్నాడు" మధు వంటింట్లోకి వెళ్ళింది.

ఆ రోజే కాదు, హన్‌మాన్ బట్టలు కుళ్ళుగా వుంటాయని రోజూ విసుక్కునేది మధూ. సబ్బు యిచ్చి, వాణ్ణి బట్టలు వుతుక్కుని స్నానం చేసి రమ్మనేది. సబ్బులు మాయం అయ్యేవి. వాడు మట్టికొట్టుకునే వుండే వాడు. హనుమాన్‌ని వంటింట్లోకి రానిచ్చేదికాదు మధు. బయట పనే. కాని రోజంతా యిల్లు తుడుస్తూ, తడిగుడ్డతో వత్తుతూ వుండేవాడు హనుమాన్. వాడు బట్టలు వుతికితే పనికిరాదు. ఆమె మళ్ళీ వుతుక్కునేది.

మధుకి యిష్టమైన పనులు రెండు. ఇల్లు సర్దడం, పేపరు, పుస్తకాలు చదవడం. ఏ పని చేసినా, మనసంతా దానిమీదే కేంద్రీకరించేది.

పెళ్ళైన క్రొత్త రోజులే. ఓ సెలవు రోజు మా యింటికి అతిధులు వచ్చారు. వాళ్ళు భోజనంచేసి వెళ్ళారు.

రోజంతా సరదాగా గడిచిపోయింది. ఎవరు వచ్చినా యింటినీ, మధూనీ, ఆమె వంటనీ మెచ్చుకోకుండా వుండలేరు. ఆమెతో మాట్లాడిన మగవాళ్ళు ఆమె తెలివితేటలనీ, ప్రపంచజ్ఞానాన్నీ గమనించకుండా వుండలేరు. వారి కళ్ళలో కనపడే మెచ్చికోలు చూసి నాకు చాలా గర్వంగా వుండేది. ఆ రోజూ భోజనం బాగుంది. అతిధులు వెళ్ళేసరికి రాత్రి పదిదాటింది. హనుమాన్ సహాయంతో గిన్నెలూ, గదీ శుభ్రంచేయించి వచ్చింది మధు.

అలసిపోయి వున్నాం. దినపత్రిక పట్టుకుని పడుకుంది మధూ.

"లైటార్పేయనా?" అన్నాను.

"వద్దు. ఇవాల్టి పేపరు చూడాలి."

"రేపు చూడకూడదా?"

"వుహుఁ. పేపర్ చదవకపోతే నిద్దరపట్టదు నాకు."

ఆవిడ పేపరు చదవడం అంటే నాకు తెలుసు. మొదటి పేజీనించి ఆఖరి పేజీలో ఆఖరు లైన్‌దాకా చదవాలి. ఎంతసేపు మేలుకోను? నాకేమో యీ రోజు వచ్చిన అతిధుల గురించీ, వంటల గురించీ, వాళ్ళు మెచ్చుకోడం, అన్నీ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ పడుకోవాలని సరదా. కాని మధూతో లాభంలేదు. తన నిర్ణయాలకి తిరుగులేదు. ఈ కొద్ది రోజులలోనే ఆ సంగతి గ్రహించాం.

"ప్రకాశ్, నువ్వు పడుకో. నేను ముందుగదిలో కూర్చుని చదువుకుంటా. గుడ్‌నైట్" మధు లైటార్పి వెళ్ళిపోయింది.

మా యిద్దరి మధ్యా నలుగుతున్న మరో విషయం – సిగరెట్లు, నాలుగేళ్ళ బ్రహ్మచారి జీవితంలో ధూమపానం బాగా అలవాటైంది

నాకు మధుకి నేను సిగరెట్టు కాల్చడం యిష్టం వుండదు. ఆమెకి సిగరెట్టు వాసన పడదు అంటుంది నన్ను దగ్గరకి చేరనివ్వదు.

ఆమె సాన్నిధ్యం కోసమని యింట్లో నేను సిగరెట్లు కాల్చడం మానుకున్నా కాని ఆఫీసులో సిగరెట్టు లేకపోతే పని జరగదు. మెదడు పనిచెయ్యదు

ఇంటికి రాగానే బట్టలు మార్చుకుని, స్నానాల గదిలోకి వెళ్ళి, పళ్ళు తోముకోడం అలవాటు చేసుకున్నా, ఎప్పుడేనా బద్ధకించి పళ్ళు తోముకోక పోతే, "అబ్బ, వాసన ప్రకాశ్" అంటుంది మధు, ముక్కుకు రుమాలు అడ్డంపెట్టుకుంటూ. తాగి వచ్చిన వాడి తంతు అయ్యేది నా పని. ఆమెకి జవాబు చెప్పలేని నా మెత్తదనం మీద నాకే కోపం వచ్చేది.

"అవునులే మధూ, నువ్వెన్నైనా చెప్పగలవ్. నీకు చెడ్డఅలవాట్లు లేవు. మానుకోవాలనే బాధాలేదు ఒక్కసారి మారిపోవాలంటే ఎంత కష్టమో నీకెలా తెలుస్తుంది?"

"విల్ పవర్ వుంటే ఏదైనా సాధించవచ్చు."

"సిగరెట్లు కాల్చడంవల్ల అన్నీ నష్టాలే. డబ్బూ, ఆరోగ్యం— ఒప్పు కుంటావా?" మధూ రెట్టించింది.

"అన్నీ ఒప్పుకుంటా. కాని నేను అలవాటుకి బందీని. పొమ్మంటే ఎలా పోతుంది?"

"నీ కోసం నేనేమైనా మానెయ్యనా!" అంది మధూ, సీరియస్‌గా ముఖంపెట్టి.

"నువ్వేం మానేస్తావ్?"

"వారానికి ఒకరోజు భోజనం మానేస్తా. శనివారం వుపవాస ముంటా."

"నువ్వు వుపవాసం చేస్తే నా కొచ్చే లాభం ఏంటి?"

"ఇన్‌స్పిరేషన్. భోజనం మానేసి నేను వుండగలిగినప్పుడు. నువ్వు సిగరెట్లు మానేసి వుండలేవా?"

ఆమెతో ఏం వాదించను? నాకు ఏ చెడ్డ అలవాటూ లేకుండా మంచి వాడిగా చేసెయ్యాలని ఆమెకు ఎందు కంత తపన? ఏమిటీ పంతం?

మధు అన్నట్టే శనివారాలు భోజనం మానేసి వుపవాసాలు ప్రారంభించింది. నాకు తల గోడకేసి కొట్టుకోవాలనిపించింది. ఆమె అంత సులభంగా భోజనం ఎలా మానేసి కటిక వుపవాసం చెయ్యగలదో అంతు పట్టని విషయం. నాకు సిగరెట్లు మానేస్తే పిచ్చెత్తినట్టు వుంటోంది.

మేం యింకా కాపరంలో స్థిరపడనే లేదు. మూడో మెంబరు మా జీవితాల్లో ప్రవేశించాడు.

నెలలు నిండుతున్నకొద్దీ మధు

అందం యినుమడించింది. ఆమె బుగ్గలలో నునువూ, ఆమె కళ్ళలో కాంతీ, నన్ను సమ్మోహితుడిని చేసేవి.

అయితే ఆమె చాదస్తం కూడా రోజు రోజుకూ పెరిగింది. ఇంటి శుభ్రం, బట్టల శుభ్రం అంటూ. యిటు నన్నూ, అటు హానుమాన్నీ వేధించేది. కట్టుకున్నవాడిని, నాకు వేరేదారిలేదు. ఆమె ఆనందంకోసం మధుకి యిష్ట ప్రకారమే చేసేవాడిని. కాని డబ్బుకి పనిచేసే హానుమాన్‌కి ఆ అవసరం లేదు. మధుకి ఆరు నెలలు నిండుతున్నా యనగా వాడు మా యింట్లో పని మానుకున్నాడు.

ఒంటరిగా ఆ పరిస్థితిలో పనిచేసుకో లేదని మధుని పుట్టింటికి పంపేను. ఆమెని రైలెక్కిస్తూ "నువ్వు వచ్చేదాకా క్షణం ఒక యుగంగా గడుపుతా మధూ" అన్నాను ఆమె తియ్యగా నవ్వింది. ఇంటికి ఒక్కడినీ వెళ్ళాలంటే బాధగా అనిపించింది. స్నేహితులతో సాయంత్రందాకా గడిపి, రాత్రి హోటల్లో భోజనంచేసి, యింటికి వచ్చా.

రాత్రి యింట్లో ఒంటరిగా కూర్చుంటే ఏవేవో ఆలోచనలు వచ్చాయి. ఈ ఏడాదిలో యిల్లెంతో మారిపోయింది. డ్రాయింగ్ రూమ్ లోకి కార్పెట్టు వచ్చింది, కిటికీలకి, గుమ్మాలకి అందమైన డిజైనులతో వున్న తెరలు అమిరాయి. పుస్తకాలూ, పేపర్లూ— ప్రతి చిన్న వస్తువూ పొందికగా సర్ది పెట్టి వున్నాయి, ఎక్కడా ఒక్క మరకకాని, మచ్చకాని లేదు పడకగదిలో పరుపుల మీద మల్లెపూవుల లాంటి తెల్లటి దుప్పట్లు వున్నాయి. ఆ పరుపులు ఎప్పుడూ ఆహ్వానిస్తున్నట్టే వుంటాయి. మధు ఏ పని చేసినా అద్భుతంగా చేస్తుంది.

సోఫామీద దిండు వేసుకుని, కూర్చున్ని, బూట్లేనా విప్పని కాళ్ళు టీపాయ్ మీద జాపుకుని. సిగరెట్టు కాలుస్తూ, తల వెనక్కి వాల్చి ఆలోచిస్తున్నా. ఆ పోజులో, చేతిలో సిగరెట్టుతో నన్ను చూస్తే మధు ఏమంటుంది ? నవ్వు వచ్చింది. హాఠాత్తుగా నాకెందుకో సిగరెట్టు పొగతో పాటు స్వేచ్ఛావాయువు పీల్చినట్లైంది, నా వూహాకి సిగ్గుపడ్డా.

రాహుల్‌కి మూడు నెలలు రాగానే, నేను వెళ్ళి మధూని, రాహుల్‌ని తీసుకువచ్చాను రాహుల్ ఎఱ్ఱగా, బొద్దుగా ఏపిల్ పండులా వున్నాడు.

ఇంట్లోకి క్రొత్త పనివాడు రామేశ్వర్ వచ్చాడు.

"రాహుల్" అంటూ ఆఫీసునించి వస్తూనే వాడి వుయ్యాలలోకి తొంగి చూసాను. చక్కటి పౌడరు వాసన.




వాడు కళ్ళు తెరుచుకుని, రంగు గిలకలని పరిశీలించి చూస్తున్నాడు. "ఓహో, మీరు లేచే వున్నారా?" అంటూ వాణ్ణి చిటికలు వేసి నవ్వించాను. బోసి నవ్వులు ఒలక బోసాడు పలకరించినకొద్దీ నవ్వు తున్నాడు. చిన్న నోరు వెడల్పు చేసి నవ్వినపుడు, కళ్ళు మెరు స్తున్నాయి. సంతోషంతో వాడిని ఎత్తు కుని ముద్దులు కురిపించాను.

"అబ్బబ్బ, ప్రకాశ్ ఎన్నిసార్లు చెప్పాలి? చేతులూ కాళ్ళూ కడుక్కోకుండే రాహుల్‌ని ఎత్తుకో వద్దని! పిల్లలికి ఇన్‌ఫెక్షన్ తొందరగా వస్తుంది" మధు, బాబుని నా చేతు ల్లోంచి లాక్కుంది.

చేతిలోని అమృతభాండాన్ని ఎవరో రాక్షసుడు లాక్కున్నంత బాధ కలిగింది.

"వూరికే నన్ను అన్ని విషయా లలో చెక్ చెయ్యకు మధూ" చిరాకు పడుతూ, ముందు గదిలోకి వచ్చేసాను.

మధు లేని ఆరు నెలలలో మళ్ళీ నా పాత అలవాట్లు నా దగ్గరకి చేరాయి. ఇప్పుడు ఆమె కోసం సిగరెట్లు మానెయ్యాలంటే నాకు బాధగావుంది. కోపం ముక్కుమీద వుంటోంది. ప్రతిదానికీ చిరాకు ఎక్కువౌతోంది.

అయితే, మధు నన్ను ఎప్పుడూ అర్థంచేసుకోడానికి ప్రయత్నించినట్లు కనబడదు తన మాటే తనది.

రాహుల్ పెద్దవాడు అవుతున్న కొద్దీ మా మధ్య భేదాభిప్రాయాలు ఎక్కు వతున్నాయి వాడు మట్టిలో ఆడకూడదు కొన్ని నిర్ణీత సమయా ల్లోనే బయట ఆడుకోవాలి, అంటుంది

మధు నాణ్ణి స్వేచ్ఛగా వదిలెయ్యి అంటాను నేను.

ఈ మధ్యకాలంలో మేం టాటానగర్ నించి కలకత్తా మారాం. నా వుద్యోగపు హోదా పెరిగింది.

రాహుల్‌ని స్కూల్లో వేసాం వాడి పెంపకం బాధ్యతంతా మధూదే వాడు చాలా తెలివైనవాడు ఏ విషయాన్నైనా యిట్టే పట్టుకుంటాడు

వాడ్ని 'మంచి బాలుడు' గా మార్చాలని మధు తాపత్రయం. ప్రతి క్షణం వాడిమీద ఆంక్షలు పెడుతూనే వుంటుంది. "కుర్చీలో యిలా కూచోవాలి ; కాళ్ళు క్రింద పెట్టాలి, కాళ్ళు ఆడించకూడదు ; టేబిల్ మీద భోజనం చేసేటప్పుడు యిలా తినాలి, అలా చెయ్యి చాపకూడదు, బట్టలు మాపకూడదు, గట్టిగా అరవకూడదు" వంద శిక్షణలు. వాడు తప్పుచేస్తే శిక్షిస్తుంది నీళ్ళగదిలో పెట్టి బంధిస్తుంది, లేదా ఓ పూట అన్నం పెట్టదు. నాకివేం నచ్చవు. ఆ పసివాడి కంట్లో నీరు తిరిగితే చూడలేను.

మధూకీ, నాకూ రాహుల్ విషయంలో రోజూ మాట మీద మాట పెరుగుతోంది. "రాహుల్ నాకూ కొడుకే వాడి పెంపకంలో నాకూ బాధ్యతవుంది" అంటే మధు యిచ్చే జవాబు – "నువ్వు పెంచితే నీ అలవాట్లే వస్తాయ్ ప్రకాశ్".

నాకేమంత చెడ్డఅలవాట్లు వున్నాయని? సిగరెట్లు కాల్చడం, రోజుకో ఆరుసార్లు టీ త్రాగటం మహాపరాధాలా? "నువ్వైనా వుద్యోగంలో చేరకూడదా మధూ? నీ తెలివితేటలూ, డిగ్రీ వృధా అవుతున్నాయి కదా?" అన్నాను, ఆమె వుద్యోగంలో చేరితే మా తండ్రీ, కొడుకులమీద కొన్ని ఆంక్షలు తగ్గుతాయేమో అనే భావంతో.

"నాకు తీరికెక్కడ ప్రకాశ్. అయినా నువ్వు సంపాదించినది ఘనకు హాయిగా సరిపోతుందిగా" అని కొట్టిపారేసింది

రాహుల్‌కి ఏడు సంవత్సరాలప్పుడు నేను జర్మనీ వెళ్ళాను ఓ సంవత్సరం వుండి వచ్చా ఈ ఏడాది దూరం మధులో మార్పు తీసుకువస్తుందనుకున్నా కాని తనేం మారలేదు. నాలోనే మార్పు వచ్చింది హఠాత్తుగా మధుతో దెబ్బలాడే ఓర్పూ, సహనం పోయింది ఆమె చెప్పిన దానికల్లా అవుననడం, ఒప్పేసుకోడం నేర్చుకున్నా దీనికి కారణం ఆఫీసులో నా పదవి పెరగడం, బాధ్యత ఎక్కువ కావడం కావచ్చు. కారు కొన్నాను

రాహుల్ విషయం కూడా పట్టించుకోవడం మానేసా. ఆఫీసులో పని చూసుకోడం, యింట్లో మధు చెప్పి

నట్లల్లా వినడం. అన్నిటికీ 'అవునూ' అనేయడంతో మా మధ్య మాటలే ఆగిపోయాయి. ఇంట్లో ఒకరకం నిశ్శబ్దం ఆవరించింది. మా సంభాషణ లన్నీ యిలాగే జరిగేవి :

"ఎల్లుండి రాహుల్ పుట్టినరోజు. ఏం చేద్దాం ప్రకాశ్ ?"

"ఏం చేద్దాం ?"

"సింపుల్ గా చేసేద్దామా? వాడికో క్రొత్త డ్రెస్ కొనేసి, సాయంత్రం ముగ్గురం బయటికి వెళ్ళి ఐస్ క్రీమ్ తిందామా ?"

"తిందాం."

మధు కాస్సేపు ఆగుతుంది. "వాడు సైకిల్ అంటే పరదావడుతున్నాడు. సైకిల్ కొని ప్రజెంట్ చేస్తే ?"

"అలాగే సైకిల్ కొందాం "

మధు ఓ పది నిమిషాలు ఆలోచిస్తుంది.

"పోనీ, వాడి స్నేహితులని ఓ నలుగురిని పిలిచి చిన్న పార్టీ యిస్తే బాగుంటుందేమో !"

"అలాగే యిద్దాం."

"ఏమేం చేస్తే బాగుంటుది ?"

"నువ్వే చెప్పు." మధు నావైపు పరీక్షగా చూసి, మౌనం వహిస్తుంది.

ఇంట్లో మామూలుగా గడిచి పోతోంది ఎవరి దినచర్యలో వాళ్ళు వుంటున్నాం. బొంబాయిలో మంచి వుద్యోగపు ప్రకటన వస్తే పెట్టాను ఆ వుద్యోగం వచ్చింది. నివాసం బొంబాయి మారింది. కంపెనీవాళ్ళు పెద్ద యిల్లు యిచ్చారు.

కాని మధులో ఎందుకో వుత్సాహం లేదు. కొంచెం స్తబ్దుగా తయారైంది.

"ఈ మారు సెలవకి ఊటీ వెళదామా ?" అంది.

"వెళదాం" అన్నాను, పేపరు చదువుతూనే

కాస్సేపు గోళ్ళు చూసుకుంటూ కూచుంది రాహుల్ లైటార్పి పడు కున్నాడు.

"మా అమ్మకి ఒంట్లో బాగాలేదని అన్నయ్య తీసుకువెళ్ళాడు కదా! ఢిల్లీ వెళ్ళి మా అమ్మని చూసి వద్దామా?"

"అలాగే చూద్దాం, టిక్కెట్లు కొననా ?"

మధు సమాధానం చెప్పలేదు.

నేను పేపరు పేజీ త్రిప్పుతూ, ఎదురుగుండా చూసాను. మధు నావైపే దీక్షగా చూస్తోంది. ఆమె కళ్ళలో భావంచూసి గతుక్కు మన్నాను. ఆ కళ్ళు క్రొత్తగా వున్నాయి వాటిలో ఏదో భయం, అపనమ్మకం. హఠాత్తుగా మధు గట్టిగా ఏడ్చింది

"అరే, ఏమైంది మధూ ?" ఆమె

ప్రక్కనే వెళ్ళి కూర్చున్నా. ఆమె భుజాలు పట్టుకున్నాను.

"నువ్వు చాలా మారిపోయావ్, ప్రకాశ్ "

"ఎలా మారిపోయా ?"

మధు జవాబు చెప్పలేదు. వెక్కి వెక్కి ఏడ్చింది. ఎంతో రీవిగా గంభీరంగా వుండే ఆమె ఏడుస్తూ వుంటే నా మనసు వికలమైంది. మధుని నెమ్మదిగా తీసుకువెళ్ళి ప్రక్క మీద పడుకోబెట్టాను. ఆమె ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. రాహుల్ మేలుకుని వుంటే ఎంత బాగుండును! వాడి ఎదురుగా మధు ఏడవడానికి సాహసించేది కాదు.

ఆ రాత్రి చాలా సేపటిదాకా నాకు నిద్రపట్టలేదు

మధు అంటే నాకెంతో యిష్టం. ఆమెకోసం నేను ఎన్నో అలవాట్లు మానుకున్నాను. సిగరెట్లు మానేసిన క్రొత్తలో నన్నెంతో మంది స్నేహితులు "భార్యాదాసుడని" వెక్కిరించారు. అవన్నీ సహించాను. ఒకటి రెండుసార్లు ఓ చుక్క వేసుకున్నానని, మధు నానా గొడవా చేస్తే, పార్టీలలో మద్యం సేవించడం కూడా మానుకున్నాను నేను పోట్లాడిన విషయాల్లో కూడా మధు దగ్గిర ఎప్పుడూ నేనే ఓడిపోతూవచ్చాను. అన్నిటిలోనూ గెలుపు ఆమెది. ఆమె అలా నెగ్గించుకునేది. ఆమె అందం, తెలివి తేటలూ, వాగ్ధాటి నన్ను ఆమెకి వశుణ్ణి చేసాయి నేను నిస్సహాయుడిలా ఓటమి అంగీకరించాను.

కాని చివరికి ఏమైంది? మధు ఏడ్చింది. ఆమెకి సంతోషం కలిగించలేకపోయా ఎందుకిలా అయింది ?

నాకీ మధ్య క్రొత్త ఆలోచనలు వస్తున్నాయి మధు యింత అందంగా వుండకపోతే బాగుండును. ఆమె తెలివి తేటలు కూడా సామాన్యమైనవైతే బాగుండును ఇంతకంటె మేం ఎక్కువగా సుఖపడేవాళ్ళమేమో!

ఇంట్లో క్రొత్త పరిస్థితి ఏర్పడింది. మధు చాలా స్తబ్దుగా మారింది. రాహుల్ చదువు విషయం కూడా. శ్రద్ధతీసుకోవటం, లేదు. రాహుల్ కి క్లాసులో రాంక్ తగ్గిపోతోంది వాడి శ్రద్ధ ఆటలమీదకీ, స్నేహితుల మీదకీ మళ్ళింది.

ఆ రోజు ఆఫీసులో మీటింగ్ వుండి, యింటికి ఆలస్యంగా వచ్చాను. డ్రాయింగ్ రూమ్‌లో రాహుల్, స్నేహితుడితో మాట్లాడుతున్నాడు.

బట్టలు మార్చుకుని డైనింగ్ టేబిల్ దగ్గిరకి వచ్చాను కప్పులో వేడి టీ, ప్రక్కనే ప్లేటులో వుప్పు చిన్కట్లు, జాగ్రత్తగా మడిచిపెట్టిన ఆ రోజు దినపత్రికా నా కోసం ఎదురు చూస్తున్నాయి. మధు పనిలో చిన్న




లోపం కూడా ఎత్తి చూపించలేము. అన్నీ అంత పర్‌ఫెక్ట్‌గా వుంటాయి.

రాహుల్ స్నేహితుడు వెళ్ళినట్టు వున్నాడు వీధితలుపు మెల్లిగా తీసి, వేసిన శబ్దమైంది వెంటనే ఖంగు మంటూ మధు గొంతుక వినిపించింది.

"రాహుల్, ఎన్నిసార్లు చెప్పాను ? ఆ క్రికెట్ బాల్‌కి, బాట్‌కి స్థానం సోఫామీదా ? నీ గదిలో పెట్టుకు వచ్చి కూర్చోకూడదా ?"

"అబ్బ, వుండమ్మా సత్యపాల్‌తో మాట్లాడుతూ కూర్చుండిపోయా" వాడు విసుక్కున్నాడు

"పెద్దవాళ్ళకి జవాబు చెప్పడం కూడా నేర్చుకో" ఆమెలో కోపం.

"జవాబు చెప్పకపోతే, చెప్ప లేదంటావ్. చెబితే ఎదురుతిరిగా నంటావ్. ఎలాగమ్మా నీతోటి ?".

ఇకక్కణ్ణించి

"ఆఁ పోతున్నా… నువ్వెప్పుడూ యింతేనమ్మా. నాన్ననీ, నన్నూ అన్నిటికీ గదమాయిస్తావ్. ఎందుకనీ మా యిద్దరిమీద అంత కోపం ?".

నేను టీ వదిలేసి, లేచి, ముందు గదిలోకి వచ్చాను. రాహుల్ జోళ్ళు చప్పుడు చేసుకుంటూ తన గదిలోకి వెళిపోతున్నాడు.

"రాహుల్"

నా పిలుపు విని ఆగి "ఏం నాన్నా" అన్నాడు.

"అలాగేనా అమ్మతో మాట్లాడ్డం?"

వాడు వొక్కసారి నిరసనగా చూసి, మౌనంగా తన గదిలోకి వెళి పోయాడు.

మధు 'అబ్బా' అంటూ నిలుచున్న చోటే నేలకి ఒరిగిపోయింది. ఆమెను కంగారుగా ఎత్తుకు తీసుకువెళ్ళి పడక మీద పడుకోబెట్టి, డాక్టర్‌కి ఫోన్ చేసాను.

మధుకి హార్ట్ ఎటాక్ వచ్చింది.

# రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్

## విజయావారి సినిమాకథ

(గత సంచిక తరువాయి)

## 2. బంగారప్పిచిక రాజేశ్వరి స్వాగతం

మేస్టారు ఎంత మంచివారు! మొదటి రోజుని నేనల్లా కంగారుపడి పారిపోయినసరికి, పాపం ఏమనుకున్నారో, ఎంత బాధపడ్డారో. ఆయనేదో వచ్చి రౌడీ అనుకున్నాను! పని పోయిందనిచెప్పుకోడాని కొచ్చారని నాకేం తెలుసు? పైగా, "మీతో చెప్పుకుంటే అయిపోతుందని చెప్పారు, అందుకని ఎవరూ లేకుండా చూసి చెప్పుకోవాలని వొచ్చాను" అంటే నాకు నిజంగానే భయం వేసింది. పాపం, ఆయన కంగారు ఆయనది ఏమైతేనేం? ఆయన నా టీచరుకావడం నా అదృష్టం.

నానమ్మ ఆయన సంగతి తెలీగానే నిర్ణయించేసింది. "లక్షణంగా ఉన్నాడు," అంది నాతోనే. నా కప్పుడే అర్థమైపోయింది,నానమ్మ మనసులో ఏముందో. అప్పుడే నన్ను సిగ్గూ సంతోషం ముంచెత్తేశాయి.

నానమ్మకి నేనంటే పంచప్రాణాలు. హోటల్లో పిండి రుబ్బుకుంటూ ఉండేదట. అమ్మ పోవడంతోటే, పదిరోజుల పసిగుడ్డుని నన్ను నానమ్మకి అప్పగించాడు, నాన్న. నన్ను ఒళ్ళో పడుకోబెట్టుకుని పాలుపోసి పెంచింది నాకు నిజంగా ఆవిడే అమ్మ. చిన్నప్పటినించీ నాకు పూజాపునస్కారం అలవాటు చేసింది. నోములు వ్రతాలు చేయించింది. ఎందుకోగాని నాన్నకి ఇదంతా ఇష్టం ఉండేది కాదు. నేను ఈ కాలపుపిల్లలాగ ఇంగ్లీషు చదువుకోవాలనీ, డాన్సు, సంగీతం నేర్చుకోవాలని ఉండేదినాన్నకి. నానమ్మ నన్ను ఛాదస్తంగా పెంచుతోందని చిరాకుపడేవాడు.

"ఇలాగైతే దాన్ని ఎవడు చేసుకుంటాడమ్మా? ఆఖరికి ఏ వంటవాడికో ఇచ్చి కట్టిపెట్టాల్సిందే," అంటుండేవాడు—

"నీకా బెంగ అక్కర్లేదు. ఈ పూజలూ పునస్కారాలూ ఎందుకను




నేనా ఊరు ఎందుకు వెళ్ళానో, నా కిప్పుడు జ్ఞాపకంలేదు.

కాని, వెళ్ళటం చిన్నప్పటి స్నేహితుడు కనపట్టం, తన యింటికి నన్ను తీసుకువెళ్ళటం జరిగింది. కలవక కలుసుకోవటంవల్ల, చిన్నప్పటి విషయాలు తలుచుకొని నవ్వుకొంటూ వున్న సమయంలో అతడొచ్చాడు. రావటం రావటం యెలా వచ్చాడని?

ముందువాకిలి నెమ్మదిగా తెరిచాడు. కుడికాలు గడపలో పెట్టి అటూ ఇటూ దొంగచూపులు చూశాడు. చంకలో వున్న మూటని వదిలంగా రెండోచేత్తో పట్టుకుని, తల ఓరగా పెట్టి అడుగులో అడుగు వేసుకుంటూ, నా స్నేహితుని దగ్గరకు వచ్చి చంకలో మూట అందిస్తూ, "ఇదిగోనోయ్, డబ్బూ" అన్నాడు.

అసలు అతన్ని చూడగానే నా స్నేహితునికి ముఖ కవళికలు మారిపోయినై. అంతకుముందున్న సంతోషం మాయమైపోయింది. నెమ్మదిగా మూట అందుకుంటూ "మనిషంటే మనిషివి నువ్వే సూరయ్యా! నికార్సయిన మనిషివి" అన్నాడు.

ఈ మాటకు సూరయ్య సంతోషం పైకి కనబడనివ్వకుండా, "మాటలకేంలే! డబ్బు తీసుకోగానే కాదు నెల రోజులలో అసలు ఫాయిదాలు యిచ్చి వెయ్యాలి వడ్డీ నీకు తెలిసిందేగదా–ధర్మ వడ్డీ–నెలకు నూటికి రూపాయిన్నర. అదైనా నువ్వని ఇస్తున్నాను" అన్నాడు.

"అలాగే సూరయ్యా, నెల దాటక ముందే యిస్తాను" అన్నాడు నా స్నేహితుడు.

"ఇస్తానంటే కాదు, మాట చెల్లించు కోవాలి. శుభకార్యం ఒకటి తలపెట్టానా? మంచికీ చెడుకీ డబ్బు కావాల్సి వొస్తుంది. తర్వాత కోర్టు గీర్టూ అంటే..."

"అదేమిటి సూరయ్యా! నీ దగ్గర యెన్నిసార్లు డబ్బు తీసుకోలేదు. ఎన్ని సార్లు యివ్వలేదు. ఎప్పుడైనా మాట తప్పీలు వొచ్చిందా?"

"సరేలే డబ్బు లెక్క పెట్టుకో, అన్నీ రూపాయలే. కొద్దిగా మాత్రం చిల్లరవుంది. మళ్ళీ నాకు రూపాయలే యివ్వాలిసుమా! నోట్లూ గీట్లూ అంటే కుదరదు"

"నువ్వు చెప్పాలా సూరయ్యా" అంటూ నా స్నేహితుడు మూట విప్పాడు. చూసేటప్పటికి నా తల తిరిగి పోయింది అయోమయం అయిపోయింది. ఆ మూటలోవున్నవన్నీ రాళ్ళే. చిన్న చిన్న రాళ్ళూ, పెద్ద పెద్ద రాళ్ళూ-పెద్ద వన్నీ కంకర రాళ్ళూ, చిన్నవన్నీ గులక రాళ్ళూ! నమ్మలేక నా స్నేహితుని మొహం పరీక్షగా చూశాను. అతడు మాత్రం ఇదంతా లెక్కచెయ్యకుండా, అతి జాగ్రత్తగా ఆ రాళ్ళని తీసి ఒక్కొక్కటే లెక్కపెడుతూ కూర్చున్నాడు.

నాకేమీ తోచక సూరయ్యవంక చూశాను. అతనింకా తల ఓరగానే పెట్టి లెక్కపెడుతూ వున్న రాళ్ళను రెప్ప వెయ్యకుండా పరీక్షిస్తున్నాడు. ఇంతలో నా స్నేహితుడు లెక్కపూర్తి చేసి, "సరి పోయినయి, సూరయ్యా" అన్నాడు.

"ఇవాళ సరిపోయినై అంటే కాదోయ్. ఇవ్వాళ యిరవై, మళ్ళీ యిరవై సోమవారంనాటికి. నా డబ్బంతా దమ్మిడీల్తో యిచ్చెయ్యాలి" అని జ్ఞాపకం చేసి నా స్నేహితుడితో మూడుసార్లు 'ఇస్తాను' అనిపించుకొని వెళ్ళిపోయాడు సూరయ్య

అతడు ఎప్పుడు వెళ్తాడా, ఈ తంతేమిటో యెప్పుడు తెలుసుకుందామా అని కూర్చున్న నేను, అడుగుదామని నా స్నేహితునివైపుకి తిరిగేటప్పటికి, అతడు చేత్తో నన్ను వారించి వాకిలివైపుకి చూశాడు. నేను అటు చూట్టం, సూరయ్య గభాలున తలుపు నెట్టుకొని లోపలకు రావటం ఒకేసారి జరిగింది. మనిషి యిదివరకుమల్లే లేడు. ఆపాదమస్తకం వొణికిపోతున్నాడు. కళ్ళు యెర్రగా జ్యోతుల్లా వున్నై. గాలి తెగ పీలుస్తున్నాడు. తలమాత్రం ఓరగానే వుంది.

ఒక్క క్షణం వాకిట్లో ఆగి రయిన నాస్నేహితుడి మీదకువచ్చి యిలా కేకలు వేశాడు: "ఏదీ నా డబ్బు? ఎన్నాళ్ళయింది? యిదిగో అదిగో అంటూ కుక్కని తిప్పుకున్నట్టు నీ ఇంటిచుట్టూ తిప్పుకుంటావా? పరువూ మర్యాదా

వుండక్కర్లా? కడుపుకి అన్నం తింటు న్నావా, గడ్డి తింటున్నావా?"

నిజం చెప్పొద్దూ! యీ మాటలు వినే టప్పటికి నాకు కంపరం యెత్తింది, కోపం వచ్చింది, కాని యేమి చెయ్య టం? గుడ్లు వప్పచెప్పి చూస్తూ కూర్చు న్నాను.

నా స్నేహితుడు భయంగా, అతి వినయంగా, "ఇదిగో సూరయ్యా, నీ డబ్బు! నాల్గు రోజులు ఆలస్యమైనంత మాత్రాన నీబోటి పెద్దమనిషి యిట్లా నోరుపారేసుకోవటం ఏంమర్యాద?" అని తన దగ్గరేవున్న ఆ రాళ్ళమూటని యిచ్చాడు.

"మరి వడ్డీయో? డబ్బు నాకు చేద్రె యిచ్చాననుకున్నావా? నీ తాతకి అచ్చుండి యిచ్చాననుకున్నావా? పూర్తి పరిష్కారం చేసి కదులు" అని బొడ్లో చెయ్యేసి నిలవేశాడు సూరయ్య

"ఇస్తాను సూరయ్యా, మరి వొదులు" అన్నాడు నా స్నేహితుడు.

"తీసుకురా" అని ఒక్క తోపు తోశాడు సూరయ్య.

నా స్నేహితుడు పడబోయి నిభా యించుకొని గోడపక్కకు వెళ్ళి, పది రాళ్ళు యేరి తెచ్చి సూరయ్య చేతిలో పెట్టాడు. సూరయ్య వాటిని లెక్కపెట్టు కొని, నా స్నేహితునితో ఒక్కమాటైనా అనకుండా గిరుక్కున వాకిలివైపుకు తిరిగి తల ఓరగానే వుంచుకొని గబగబా నడిచి వెళ్ళిపోయాడు.

నా స్నేహితుడు ఒక్క నిటూర్పు విడిచి నేను అడగవలసిన అవసరం లేకుండా తానే యిలా చెప్పాడు—"పాపం ఏం చెప్పను? ఒకప్పుడు ఈ ఊళ్ళోకల్లా షావుకారు ఈ సూరయ్య. ఇప్పుడు పిచ్చెక్కి ఈ విధంగా తయా రయ్యాడు" అన్నాడు.

"ఇతనికి పిచ్చా! ఎందుకెత్తింది? పిచ్చిలో ఇదేమిటి!" అని అడిగాను.

నా స్నేహితుడు సూరయ్య కథ యీ విధంగా చెప్పాడు:

"సూరయ్య యీ గతికి రావటానికి అతని తండ్రే కారణం. అతని తండ్రి చాలా మంచివాడు. మెత్తని హృదయం కలవాడు. అటువంటి అతడే, కొడుకు పతనానికి కారకుడయ్యాడు."

"అంత మంచివాడు..."

"చెప్తాను విను. అంత మంచివాడు అవటంవల్ల దానాలు చేసీ, అడ్డాలువుండీ తన ఆస్తంతా పాడుచేశాడు. ఆస్తి పోయిన తర్వాత పలకరించే దిక్కు లేకుండా చచ్చిపోయాడు. ఇది కన్ను లారా చూచిన సూరయ్యకు సంఘం మీద కసి యేర్పట్టంలో ఆశ్చర్యంలేదు. అందుకని పూర్తిగా తన స్వభావాన్నే మార్చుకొని, పెత్తనానికి వొచ్చినప్పటి నుంచీ కఠోరంగా సంపాదించటం మొదలుపెట్టాడు. వున్న నాలుగు ఎక




రాలూ అమ్మేసి వడ్డీ వ్యాపారం మొదలు పెట్టాడు. మనుషుల్లోవున్న యితరత్రా సంబంధాలన్నీ క్రూరంగా తెగ్గొట్టుకున్నాడు. తనకూ మిగిలిన మనుషులకూ ఒక్కటే సంబంధం – వడ్డీవ్యాపారం. తాను వడ్డీకి డబ్బు యివ్వటానికి పుట్టాడు; మిగిలిన జనం డబ్బు పుచ్చుకొని వడ్డీ యిచ్చుకోటానికి పుట్టింది.

"ఇట్లా తయారై, మిగిలిన రైతుల్ని పీల్చి పిప్పిచేసి, కొద్ది సంవత్సరాలలోనే ఊళ్లోకల్లా షాపుకారై కూర్చున్నాడు. ఎంత షాహుకారైనా డబ్బు సంపాదించటం అలవాటైన తర్వాత పద్ధతులు యెలా మారతై—కనుక డబ్బు అవసరం లేనప్పటికీకూడా పాత పద్ధతుల మీదే నడిచాడు. పిల్లికి బిచ్చం పెట్టేవాడుకాదు. అరిచి గీ పెట్టినా దమ్మిడీ జారనిచ్చేవాడుకాదు. బాకీదార్లని ఎన్ని కష్టాలుపెట్టాలో అన్నీ పెట్టి, ఇన్ని నీళ్ళుకూడా పుట్టకుండాచేసి తన డబ్బు పిండుకునేవాడు. ఆ పిండుకోవటంలో కూడా దయాదాక్షిణ్యాల్లేవు. కొంపలు కూలినా, కుటుంబాలు నాశనమైనా అతని హృదయం కరిగేదికాదు.

"అందుకని అతని డబ్బుతోపాటు, అతనిమీద ఊళ్లో అసూయా, అసహ్యం కూడా పెరుగుతూవచ్చినై, అతన్ని చూస్తే భయమే తప్ప యిష్టం ఒక్క వ్యక్తికూ్కడా లేకుండా పోయింది. సూరయ్య యిదికూడా మంచిదే అనుకున్నాడు. నాక్కావలసింది డబ్బు, వీళ్ళ ఇష్టం ఎవరిక్కావాలి? అంటూ వుండేవాడు. పరిస్థితులు యిట్లావుండగా ఒక సంఘటన జరిగింది.

ఈ వూళ్లోనే అవతలి వీధిలో చంద్రయ్య అనే రైతు వున్నాడు. చంద్రయ్య ఈ సూరయ్యకి రెండువందల రూపాయల బాకీ ఇవ్వ తేలాడు. చంద్రయ్య అవటం చిన్నరైతే ఐనా టౌన్తో సంబంధంవున్న వాడవటంవల్ల,

డబ్బున్నా కోర్టన్నా లెక్కలేకుండావుండే వాడు. డబ్బున్నవాళ్ళంటే అసహ్యం వుంది. భయంలేదు. తనకు అవసరానికి డబ్బిచ్చాడనే విశ్వాసం లేకపోగా తన దగ్గర సూరయ్య అన్యాయంగా డబ్బు దోచుకుంటున్నాడనే భావం, కోపం కలిగినవాడు. సూరయ్య హెచ్చువడ్డీ వస్తుందని అతనికి అప్పు పెట్టాడేగాని, పెట్టిందగ్గర్నుంచీ డబ్బు రాదేమో అనే భయంతో అతని యింటిచుట్టూ తిరగటం మొదలుపెట్టాడు. ఒకరోజు చంద్రయ్యని నా డబ్బిచ్చి కదలమని నిలవేశాడు. నానా దుర్భాషలూ ఆడాడు; దాన్తో లోలోపల రగులుకుంటున్న అగ్ని చంద్రయ్యలోనుంచి గుప్పున బయటపడింది– 'నేను దమ్మిడీ యివ్వను. నీ తాత్తో చెప్పుకో! ముందు గడపలోనుంచి అవతలకు వెళ్ళు' అని కేకలువేశాడు.

"పాపం సూరయ్యకు యిట్లాంటి అనుభవం యిదివరకెప్పుడూ కలగలేదేమో, చంద్రయ్య మాటలకు నిరుత్తరుడై ఒక్కనిమిషం మాట్లాడలేక పోయాడు.

'వెళ్ళవ్!' అని గద్దించాడు చంద్రయ్య. 'చంద్రయ్యా! ఇది నీకు మంచిదికాదు; కోర్టుకులాగి పప్పు తీయిస్తాను' అన్నాడు సూరయ్య.

'పప్పుతీయిస్తావ(టా మాదర్చోద్'అని నానా బూతులూకూసి మెడమీదకర్రవేసి బయటకు గెంటాడు చంద్రయ్య.

"ఇక చూడు సూరయ్య సంగతి. సూరయ్యకు శివం ఎత్తింది. పిచ్చిగంగిలెత్తినై. కనపడ్డవాడికల్లా చెప్పాడు. 'ధర్మవడ్డీ-ధర్మవడ్డీకూడా యివ్వడట! అసలే యివ్వడట! ఇదెక్కడన్నావుందా? రాములవారి కాలంనుంచీ యీ వడ్డీ వుంది గదా!' అని మొత్తుకున్నాడు.

"తిరిగి తిరిగి ఇంటికి వెళ్ళి గబగబా నాలుగుమెతుకులు నోటిలో వేసుకుని, అంగోస్త్రం నడుంకి కట్టి తెల్లగుడ్డ గొడుగు చంకనపెట్టి టౌన్‌కి బయలుదేరాడు. అప్పటికీ ఆశ చావక చంద్రయ్య వాకిలిముందు సకిలిస్తూ నాలుగైదుసార్లు అటూ యిటూ పచార్లుచేశాడు. బజార్న పోతున్నవార్ని నిర్నిమిత్తంగా పిలిచి, 'కొంచెం కోర్టులో పనివుండి టౌన్‌కి వెళ్తున్నాను' అని యింటిలోవున్న చంద్రయ్యకు వినబడేటట్టు చెప్పాడు. చంద్రయ్య, 'కోర్టుక్కాదు, నిన్ను పుట్టించిన బ్రహ్మదేముడి దగ్గరకు వెళ్ళు. ఈ ఊరు నీళ్ళు నీకు ప్రాప్తంలేదు" అని యింటిలోనుంచే కేకవేశాడు.

"ఇంకేం చేస్తాడు? ఇక తప్పేదేముంది? చంద్రయ్య మాటలకుమనస్సులో కొంచెం జంకినా డబ్బెలా వదులుకోవటం? మనస్సుని తిట్టి లోబరచుకొని టౌన్‌కి వెళ్ళి ప్లీడరుతో మాట్లాడి చంద్రయ్యకు రిజిష్టరీ నోటీసు యిప్పించాడు. నోటీసైతే యిప్పించాడేగాని మనస్సులో ఆరాటం హెచ్చింది. దిగులు దిగులుగా




వుండి ఏమీతోచక టౌన్‌లో అటూ యిటూ తారట్లాడి యింటికి బయలుదేరేటప్పటికి మసకపడ్డది. టౌన్‌నుంచి మా ఊర్రావాలంటే రోడ్డుదిగి డొంకలో మైలు నడవాలని నీకు తెలుసు. సూరయ్య డొంకదగ్గరకు వచ్చేటప్పటికి బాగా చీకటిపడ్డది. రోడ్డు దిగేటప్పటికి అతనికి భయం వేసింది ఆ డొంక మా ఒక్క ఊరికి వచ్చేదే అవటంవల్ల మనుష్య సంచారం తక్కువగా వుంటుంది. పైగా రెండుపక్కలా కొరివిదయ్యాలు తలలు విరబోసుకున్నట్లు కనబడే, గుబురుగా పెరిగిన చెట్లు. సూరయ్య ధైర్యంచేసి ఆంజనేయ దండకం పఠిస్తూ డొంకలో పదిగజాలు నడిచాడు. ఆ పెద్దమర్రిచెట్టు చూశావుగా, అక్కడకు వొచ్చాడు. అకస్మాత్తుగా పక్కపొదల్లో అలికిడి వినిపించి ఆగిపోయాడు. గొంతులోపాట గొంతులోనే ఆగిపోయింది. వెంటనే అతనికోసం పొదలలో కనిపెట్టుక్కూచున్న, చంద్రయ్యముఠా పదిమంది అతన్ని కమ్ముకున్నారు – మీదకు దూకారు చావచిదక గొట్టారు. పాపం కిందపడేసి సున్నంమీద ఎముకల్లేకుండా కొట్టారు. చంద్రయ్య మీదపడి అతని జేబులోవున్న యిరవై రూపాయలూ లాక్కొని, 'దావా దాఖల్చేశావుగా? కర్చెవ్వరు పెట్టుకుంటారు నీ తాత?" అని కాలికివొచ్చినట్లు తన్ని, మిగిలినవాళ్ళని తీసుకొని, సూరయ్యని అక్కడే వొదిలి వెళ్ళిపోయారు.

"క్షణాలమీద యీ వార్త ఊరంతా పొక్కింది. 'సూరయ్యని కొట్టారంటే సూరయ్యని కొట్టా' రని ఊరంతా ఆ గుబ్బుగా చెప్పుతుంది. కాని ఒక్కడు కూడా జాలి తలిచినవాడే లేడు. 'పాపం' అన్న పాపాన పోయినవాడే లేడు.

"సూరయ్య భార్య దొడ్డ యిల్లాలు. కూతురుకూడా చాలా మంచిది. కాని

బయట జరిగె దురంతాలను వాళ్ళెలా ఆపగలరు? సూరయ్య మనస్సుని ఎలా తిప్పగలరు?

"తెల్లగా తెల్లవారింతర్వాత ఊళ్లో షావుకార్లు సూరయ్యని పరామర్శించ టానికి వచ్చారు. సూరయ్యకు ఆ రాత్రంతా నిద్రలేదు. ఏదో ఆలోచించు కుంటూ కూర్చున్నాడు. భార్యా, కూతురు నోటికి మూతలేకుండా యేడుస్తున్నా, వాళ్ళవంకకే చూట్టంలేదు. అన్ని దెబ్బలు తిన్నా ఒక్క మూలుగన్నా మూలగటం లేదు.

"షావుకార్లు వచ్చి, 'సూరయ్యా! ఇక చూస్తూ ఊరుకుంటే లాభంలేదు. క్రిమినల్ కేసు బనాయించి వాళ్ళ అంతు కనుక్కోవలసిందే!' అన్నారు.

"సూరయ్య కొంచెం కదిలి, వాళ్ళని నింపాదిగాచూచి, 'ఇంకేం? అందరం చందాలు వేసుకుని వ్యాజ్యమాడదాం' అన్నాడు.

"'చందాలు' అనేటప్పటికి షావుకార్లు మొహామొహాలు చూచుకున్నారు. 'అదే మిటి సూరయ్యా నిన్ను కొట్టటమేమిటి? మేం చందాలు వేసుకోవటమేమిటి?' అన్నారు.

"ఈ మాటలకు సూరయ్యకు కోపం వచ్చింది. అంత బాధలోనూ లేచి కూర్చొని, 'వాళ్ళు నన్ను కొట్టారా? నా దగ్గరవున్న డబ్బుని కొట్టారు. అంటే ఈ ఊళ్లోవున్న షావుకార్లందర్నీ కొట్టారు. వడ్డీకాసం అప్పు పట్టి ప్రతివాడ్ని కొట్టారు. నన్ను కొట్టటమైతే ఒక్క చంద్రయ్యే కొట్టేవాడు. మిగిలిన వాళ్ళంతా ఎందుకు కుమ్మక్కుచేస్తారు? వాళ్ళు కొట్టగలరు గనక అంతా కలసి కొట్టారు. మనం చందాలు వేసుకోగలం గనక అంతా కలసి చందాలు వేసుకుందాం' అన్నాడు.

"షావుకార్లకు యిదేమీ అర్థంకాలేదు. దెబ్బలతో సూరయ్య మతి చెడ్డది అను కున్నారు. నెమ్మదిగా ఒకరి తర్వాత ఒకరు జారుకున్నారు.

"ఎంతమంది చెప్పినా, ఎంత చెప్పినా సూరయ్య వినలేదు-కేసు పెట్టనంటే పెట్టనన్నాడు. "నా సొంత డబ్బు తగ లేసుకొని, ఈ డబ్బున్న వాళ్ళకోసం వ్యాజ్యం ఆడిపెట్టనా? నే చెయ్యను' అనే వాడు.

కాని చంద్రయ్య యే ముహూర్తాన చెయ్యి చేసుకున్నాడోగాని, అప్పటి నుంచీ సూరయ్య దశ తిరిగిపోయింది. దెబ్బలుతిని కేసు పెట్టకపోయేటప్పటికి ఊళ్లోవాళ్లకి లొల్లి అయిపోయాడు. తాము ఏ డబ్బుని చూచి భయపడుతున్నారో ఆ డబ్బు సమయానికి సూరయ్య ఆదుకో లేకపోయేటప్పటికి యింకేముంది? పెద్దలుమొదలు కుర్రవాళ్ళవరకూ సూర య్యని ఆటలు పట్టించటం మొదలు పెట్టారు. ఇల్లు కదిల్తే చాలు—'సూరయ్య వడ్డీ చంద్రయ్య లాఠీ' అని పిల్లలు




చప్పట్లుకొట్టుకుంటూ వెంటపడేవారు. రావలసిన డబ్బు అడిగితే బాకీదార్లు 'ఏం తన్నులు కావాలా?' అనేవారు. కొందరు 'ఇదిగో అసలు-ఇదిగో వడ్డీ' అని మొట్టికాయలు వేసేవారుకూడాను.

చివరకు సూరయ్యకు చిల్లిగవ్వ కూడావసూలుకాకుండా పోయింది. ఎట్లా వచ్చిన డబ్బు అట్లాగేపోయింది. ఎక్కడ పెట్టిన డబ్బు అక్కడే యింకిపోయింది. తనకుతదనంతరమైనా వస్తుందనుకున్న ఆస్తి రాకుండా పోయిందని అల్లుడు కూతురిని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టాడు.

సూరయ్య భార్యమొహం, కూతురు మొహం చూడలేక పీలైనంతవరకు యింట్లో వుండకుండా తిరుగుతూ కాలం గడిపేవాడు. నాలుగు మెతుకులు నోటిలో వేసుకొచ్చి చెరువుగట్టుమీద రావిచెట్టుకింద ఒంటరిగా కూర్చునేవాడు. ఇన్ని రాళ్లు ఏరుకొని ఒక్కొక్కటీ చెర్లో వేస్తూ, అవి సీళ్లలో పుట్టించే కదలికను పరీక్షిస్తూ కూర్చునేవాడు.

కాని ఊళ్లోజనం అక్కడ అతన్ని సుఖంగా వుండనివ్వలేదు. అతడు నిస్సహాయుడౌతున్నకొద్దీ జనం తన బలాన్ని

ఎక్కువగా ఉపయోగించటం మొదలు పెట్టింది జనానికి అతనిమీద కలిగిన కసీ, అలుసూ అతనితోనే ఆగక అతని కుటుంబం మీదకు తిరిగింది.

ఒకరోజు సూరయ్యకూతురు వాముల దొడ్లో గేదెకు మేత వేస్తుంటే నలుగురు పట్టుకుని గాతంలోపడేసి బలాత్కారంగా చెరిచారు. వాళ్లు విడిచిపెట్టి వెళ్ళింతర్వాత ఆ పిల్ల లేచి, నడవలేక కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి, బావిలోపడి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంగతి తెలిసి సూరయ్య భార్య అవమానాలు సహించలేక కిరసనాయిలు పోసుకుని కాల్చుకొని మరణించింది. అదే సమయంలో విరోధులు సూరయ్య ఇవ్వవలసిన బాకీలు తమ పేర ట్రాన్స్ఫర్ చేయించుకొని ఇల్లు వేలం వేయించారు..."

ఇంతవరకు ఓపికతో విని, ఇక ఆపుకోలేక నేను ఈ ప్రశ్న వేశాను—ఈ ఘోరకృత్యాన్ని జరక్కుండా ఎవ్వరూ ఆపలేదూ?

"తప్పన్నవాళ్ళే లేరు చేసుకున్నది అనభవిస్తున్నాడని కొందరూ, ఈ ఉద్రేకంలో అడ్డు చెపితే తమ కుటుంబాలు సరిగ్గావుండవేమో అనే భయంతో కొందరూ-మొత్తానికి అంతా మెదలకుండా ఊరుకున్నారు."

"ఊఁ! తరవాత ఏం జరిగింది?" అని అడిగాను

"ఇంకేముంది! డబ్బుదారిన డబ్బు నడిచింది. కూతురు అలా అయిపోయింది. భార్య ఇలా అయిపోయింది. సూరయ్య గుండెలు పగిలిపోయినై. ఆవులాగా అరలుతూ, ఊరుపట్టుకు తిరిగేవాడు. కొన్నాళ్ళకు పిచ్చెత్తింది. ఇప్పుడెవరన్నా జాలి తలిచి ఇన్ని మెతుకులు పెడితే తింటాడు. ఆ చెఱువు గట్టుమీద రావి చెట్టుకిందే వుంటాడు. ఎండలో వానలో అక్కడే వుంటాడు. ఎప్పుడూ కూతురు సంగతిగానీ, భార్య సంగతిగానీ ఎత్తడు. ఎవర్నీ పలకరించడు. రోజు కొక్కసారి వెళ్లి తన పాత ఇంటిని దూరాన్నుంచి చూచుకొని కన్నీరుపెట్టుకుంటూ ఉంటాడనీ, రాత్రిళ్ళు తన కూతురు పడి ఆత్మహత్య చేసుకున్న బావిదగ్గరకు వెళ్లి ప్రదక్షిణంచేసి వస్తూఉంటాడనీ ఊళ్లో చెప్పుకుంటూ వుంటారు...ఇదీ సమాచారం..."

నేను కథంతా ప్రాణాలు బిగపట్టుకొని విన్నాను. సూరయ్య కథచెప్పమన్నప్పుడు ఇటువంటి విషాధగాథ వింటానికి సిద్ధపడలేదు. గనక చాలా ఖేదపడ్డాను. "మరి ఈ రాళ్ల వ్యవహారమేమిటి?" అని అడిగాను.

"అలవాటు" అన్నాడు నా స్నేహితుడు "పాత అలవాటును పట్టి ఇలా చేస్తూవుంటాడు. మేం కూడా జాలిపడి అతని మనస్సుని ఈ అవస్థలో కష్టపెట్టడం ఎందుకని తగువిధంగా ప్రవర్తిస్తూ వుంటాం. ఈ సూరయ్య..."




నా స్నేహితుడు చెబుతూవుండగానే వీధిలో పెద్ద గోల బయల్దేరింది— "సూరయ్యా వడ్డీ, చంద్రయ్యా లాఠీ" అని కేకలు బయటనుంచే సూరయ్య 'ఛే' అని అరిచాడు. ఆ ధ్వని విని మేమిద్దరం బయటకు పరుగెత్తాం.

బయట వీధిలో సూరయ్య రోజుకుంటూ, రొప్పుకుంటూ గబగబా నడుస్తూ వెళ్తున్నాడు. చేతిలో నా స్నేహితుడిచ్చిన మూట భద్రంగా వుంది. వెనక పదిమంది పిల్లలు పోగై గోలచేసుకుంటూ సూరయ్య మీదకు రాళ్ళు విసురుతున్నారు.

నడుస్తూ నడుస్తూవున్న సూరయ్య అకస్మాత్తుగా పరుగెత్తటం మొదలు పెట్టాడు. రంయిన పరుగెత్తి ఒక ఇంటి ముందు ఆగి, ఒక్క నిమిషం ఆ ఇంటిని చూచి, అక్కడినుంచి కదిలి పక్కనే వున్న బావిగట్టుమీద నిలబడ్డాడు. పిల్లలంతా ఎక్కడివాళ్ళు అక్కడే ఆగిపోయారు. చేతుల్లో రాళ్ళు చేతుల్లోనే వున్నాయి. నేనూ నా స్నేహితుడూ వూపిరి బిగపట్టి చూస్తూ నుంచున్నాం. సూరయ్య వంగి బావిలోకి చూచిలేచి, ఇంటివైపుకి చూశాడు, ఉండి ఉండి 'ఛే' అని సైరన్‌లాగా విన్నవాళ్ళకి నలపరం పుట్టేటట్టు అరిచి రాళ్ళ మూటతో సహా బావిలోకి దూకాడు.

వాళ్ళూ వీళ్ళూ పోగయ్యారు. గానిఏమీ లాభం లేకపోయింది. నా స్నేహితుడిచ్చిన రాళ్ళమూట తేలనివ్వకపోయింది. శవం బయటకు వచ్చింది. తర్వాత— మేం ఇంటికివచ్చిన తర్వాత–నా స్నేహితుడు ఇలా చెప్పాడు– "ఆ ఎదురుగా వున్న ఇల్లే అతని ఇల్లు. అతడు దూకిన బావే అతని కూతురు ఆత్మహత్య చేసుకున్న బావి."




(గత సంచిక తరువాయి)

మర్నాడు రాత్రి షాహరజాద్ తిరిగి ఇలా కథ కొనసాగించింది.

నేను చెట్టువద్దకు వెళ్ళి, తలఎత్తి, "ఓ రాచకన్నెలారా, మీ రెవరో నాకు దయచేసి చెప్పండి. నా పేరు జాన్‌షా. కాబుల్, బనూ షఫ్లాన్‌లను ఏలే తఘ్మూన్ రాజు కొడుకును." అన్నాను.

ముగ్గురిలోకీ చిన్నది, నన్ను హెచ్చుగా ఆకర్షించినది, "వజ్రసౌధంలో ఉండే నస్రన్ రాజకుమార్తెలం మేము. ఇక్కడికి స్నానానికీ, జలక్రీడలకూ వస్తూంటాం," అన్నది.

"సుందరీ, అలా అయితే దిగివచ్చి నాతో క్రీడలు పూర్తిచేసి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి," అన్నాను.

"జాన్‌షా, యువతులు యువకులతో క్రీడలు ఎప్పటినుంచీ ఆడగలిగారు? నన్నుగురించి బాగా తెలుసుకోవాలంటే, నా వెంట మా తండ్రి ఇంటికి రా," అన్నదామె. ఇలా అంటూనే ఆమె నా హృదయం తూట్లుపడే చూపు ఒకటి చూసి, తన అక్కలతోసహా ఎగిరిపోయింది.

వాళ్ళు కనుచూపు దాటిపోగానే నేను ఒక్క ఆర్తనాదంచేసి, చెట్టుకింద మూర్ఛపోయాను.

నే నక్కడ అలా ఎంతసేపు పడి ఉన్నానో తెలియదు. నాకు తిరిగి తెలివి వచ్చేసరికి, వృద్ధుడు నా పక్కన కూర్చొని, నా ముఖంమీద పుష్పజలం చల్లుతున్నాడు.

నేను కళ్ళు తెరవటంచూసి ఆయన, "చెప్పినమాట విననందుకు ఫలితం చూడు, బాబూ! ఈ ప్రదేశపు వాకిలి తెరవవద్దని చెప్పాను కానా?" అన్నాడు.

నేను ఏడుస్తూ ఇలా పాడాను :

"రాణీ తలలో కెంపుల కాంతులూ
మంకెన పూవుల రక్తవర్ణమూ
ఆమె పెదవులకు ఈడు రాలేక
సిగ్గుపడి ఎక్కడో దాక్కున్నాయి
ఆమె తొడల నిగనిగలకు
చంద్రకాంతి తీసికట్టు;
అతిలోకపు సుందరులంతా
ఈర్ష్యచేత కుమిలారు."

నేనిలా పాడేసరికి ఆ వృద్ధుడు, "నీకు ఏం జరిగిందో తెలిసిందిలే. ఇక్కడికి అప్పుడప్పుడు పావురాళ్ల దుస్తులు ధరించి జలకాలాడ వచ్చే సుందరులను చూశావు," అన్నాడు.

"వాళ్ళు నస్రస్ రాజుఇంట ఉంటారట. అక్కడికి వెళ్లేమార్గం తెలిపి పుణ్యం కట్టుకోండి" అన్నాను.

"నాయనా, అలాంటి ఆలోచన పొరపాటునకూడా చెయ్యకు. నస్రస్‌రాజు భూతాలరాజులలో అత్యంతశక్తిమంతుడు ఆయన తన కుమార్తెలలో ఒకతెను నీకు పెళ్ళి చేస్తాడంటే నేను నమ్మను. అంతకంటె నీ ప్రయాణానికి సన్నాహం చేసుకో. త్వరలోనే పక్షులు నన్ను సేవించ రాబోతాయి. నీకు తోడ్పడమని నేను వాటికి చెబుతాను," అన్నాడు వృద్ధుడు.

"బాబుగారూ, మీకు నా ధన్యవాదాలు. కాని, నేను నాతో మాట్లాడిన పిల్లను మరొకసారి చూడకుండా నావాళ్ల దగ్గిరికి తిరిగిపోయే ఆలోచన తలపెట్టలేను," అన్నాను. ఇలా అని నేను ఏడుస్తూ ఆయన కాళ్లమీదపడి, ఎలాగైనా నే నా స్త్రీలను మళ్ళీ చూసేమార్గం చెప్పమని వేడుకున్నాను.

నన్నాయన చెయ్యిపట్టి లేవనెత్తి ఇలా అన్నాడు

"ఆ పిల్లకోసం దహించుకుపోతున్నావు గనక ఆమెను తిరిగి చూసే ఉపాయం చెబుతాను. ఆ పిల్లలు తిరిగి వచ్చే సమయానికి నువ్వు చెట్లచాటున ఓపికగా దాగిఉండు. వాళ్ళు తమరెక్కల ఉడుపులు విడిచి జలంలో ప్రవేశించిన దాకా వేచిఉండి, పరిగెత్తుకుంటూపోయి ఆ ఉడుపులను సంగ్రహించు. ఆ పిల్లలు నీ పట్ల సాధుత్వం వహించి, మంచిమాటలతో నిన్ను ఉబ్బగొట్టి, తమ ఉడుపులను తిరిగి సంపాదించటానికి ప్రయత్నిస్తారు. వాళ్లమాటలకు కరిగిపోయి ఉడుపులిచ్చేశావో, నువు జన్మలో మరి వాళ్ళను చూడవు. నువు ఉడుపులను తిరిగి ఇచ్చెయ్యక, నిబ్బరంగా ఉండి, నేను తిరిగి వచ్చినదాకా వాటిని తిరిగి ఇయ్యటానికి లేదనిచెప్పెయ్యి. నేనువచ్చినదాకా వారిని చక్కగా చూసుకో. నేను వచ్చినాక నీకు అనుకూలించే పద్ధతి చూస్తా."

నేను ఆయనకు కృతజ్ఞత చెప్పుకుని, చెట్లమధ్యదాక్కోవటానికి వెళ్లిపోయాను. ఆయన పక్షులకు స్వాగతం చెప్పటానికి వెళ్లిపోయాడు.

నేను దాక్కున్న చాలాసేపటికి రెక్కల చప్పుడూ, నవ్వులూ వినిపించాయి. మూడు పావురాలూ వచ్చి, జలాశయం గట్టున వాలాయి. చుట్టూ ఎవరన్నా ఉన్నారేమోనని అవి అటూ ఇటూ చూశాయి. నాతో ముందు మాట్లాడిన పిల్ల, "అక్కలూ, తోటలో ఎవరన్నా దాగి ఉన్నారేమో ? కిందటిసారి మనకు కనిపించిన యువకుడు ఏమైనట్టు ?" అన్నది.

"ఏమిటి షంసా ? వెర్రిభయాలు పెట్టుకోక, స్నానం చేద్దాం రా !" అన్నారు మిగిలిన ఇద్దరూ.

తరవాత ముగ్గురూ రెక్కల ఉడుపులు విసర్జించి నీటిలో దూకారు.

ఇక్కడ వాళ్లు జలక్రీడలలో వినోదిస్తూ జలాశయం మధ్యకు వెళ్లినదాకా వేచిఉండి, మెరుపులాగా వెళ్లి, నా ప్రియురాలి ఉడుపు సంగ్రహించాను.

నేను చేసినపని ముగ్గురూ చూశారు. వాళ్ళు కెవ్వున అరిచి, నగ్నంగా కనపడినందుకు సిగ్గుపడుతూ, మెడలదాకా నీటిలో శరీరాలను దాచుకొని, దీనంగా చూస్తూ నన్ను సమీపించారు.

ఈసారి నాదే పైచెయ్యి గనక, నేను విజయగర్వంతో నవ్వుతూ, జలాశయం అంచునుండి వెనక్కువెళ్ళి, నా చేతిలోని ఉడుపు ఎత్తి ఊపాను.

ఇదిచూసి, నాతో ముందు మాట్లాడిన షంసా, "యువకుడా, నీది కానిది ఏమని తీసుకున్నావు ?" అని అడిగింది.

"పావురమా, నీటిలోనుంచి పైకివచ్చి నాతో మాట్లాడు," అన్నాను.

"నీతో మాట్లాడటానికి అభ్యంతరం లేదుగాని, దిగంబరిగా ఉన్నాను గనక నీటిలోనుంచి బయటికి రాలేను. నా ఉడుపు నాకిచ్చావంటే అది ధరించి, పైకి వచ్చి, నీతో మాట్లాడగలను. నన్ను ముద్దుపెట్టుకో, కావాలంటే ఆలింగనం కూడా చేసుకో," అన్నదామె.

"నీ ఉడుపు నీ కియ్యడమంటే నా చేత్తో నా కన్ను పొడుచుకోవటమే. పక్షుల రక్షకుడు ఇక్కడికి వచ్చినదాకా నేనలా చెయ్యటానికి లేదు," అన్నాను.

"నువు నా ఉడుపు మాత్రమే తీసుకున్నావు గనక, ఇంకా అవతలికివెళ్ళి, వెనక్కు తిరుగు. నా అక్కలు పైకి వచ్చి, తమ ఉడుపులు తీసుకుంటారు. వాళ్ళు నా మానరక్షణకు కొద్ది ఈకలు నాకిస్తారు," అన్నదామె.

"దానికి అభ్యంతరం లేదు," అని నేను వెళ్ళి, కెంపు సింహాసనంచాటున దాక్కున్నాను.

అప్పుడు పెద్దవాళ్ళిద్దరూ నీటినుంచి పైకివచ్చి, తమ ఉడుపులు ధరించి, తమ ఉడుపులనుంచి కొన్ని ఈకలు తీసి తమ చెల్లెలుకు సిగ్గు దాచుకునేందుకు ఇచ్చి, నన్ను రావచ్చునన్నారు.

నేను వెంటనే పరిగెత్తుకుంటూవెళ్ళి,



నా ప్రియురాలు షంసాకాళ్ళపైన పడి, ఆమె పాదాలు పదే పదే ముద్దుపెట్టుకుంటూ, ఆమె ఉడుపునుమాత్రంగట్టిగా పట్టుకున్నాను.

ఆమె నన్ను లేవనెత్తి, ప్రియవాక్యాలు పలుకుతూ, గోముచేస్తూ, తన ఉడుపు తనకిచ్చెయ్యమని బతిమాలింది. నేను అలా చెయ్యటానికి బదులు ఆమెను సింహాసనంవద్దకు లాక్కుపోయి, నా ఒళ్లో కూర్చోబెట్టుకున్నాను.

తప్పించుకునే మార్గంలేదని తెలుసుకుని ఆమె నా కోరికలు మన్నిస్తూ, మెడను చేతులతో చుట్టి, ముద్దుకు ముద్దూ, ఆలింగనానికి ఆలింగనమూ ఎదురిచ్చింది. ఆమె అక్కలు మందహాసం చేస్తూ, మాకు కాపలా కాశారు.

త్వరలోనే, నాకు రక్షకుడైన వృద్ధుడు తలుపు తెరుచుకుని, అక్కడికి వచ్చాడు. ఆయన గౌరవార్థం మేం లేచి వెళ్ళి ఆయనకు వందనం చేశాం. మమ్మల్ని కూచోమని ఆయన షంసాతో "అమ్మాయీ, నిన్ను ఆరాధించే ఈయువకుణ్ణి నువు వరించినందుకు నాకు సంతోషంగా ఉన్నది. ఇతను ప్రఖ్యాత

వంశంలో పుట్టినవాడు. ఇతని తండ్రి తీఘ్‌మూన్ కాబుల్‌రాజు. అందుచేత నువ్వు ఇతనిసంబంధాన్ని ఆమోదించి, నీ తండ్రి అయిన నగ్రేన్‌ను ఒప్పించాలి," అన్నాడు.

"చిత్తం, అలాగే" అన్నదామె.

"నువు నిజంగా ఈ యువకుణ్ణి స్వీకరించేటట్టుంటే, ఇతనిపట్ల విశ్వాసంగా ఉంటాననీ, ఇతన్ని విసర్జించననీ నా దగ్గిర ప్రమాణంచెయ్యి,"అన్నాడాయన.

షంసా లేచి, ఆయన చేతులుపట్టుకుని ప్రమాణంచేసింది.

"మీ ఇద్దరినీ ఏకంచేసిన ఈశ్వరుడికి ధన్యవాదాలు చెప్పుదాం. మీ ఇద్దరికీ నా ఆశీర్వాదాలు, మీరు సుఖంగా ఉందురుగాక. ఇక మీ రిద్దరూ స్వేచ్ఛగా ప్రేమించుకోవచ్చు. ఇక నువు ఆమెకు ఉడుపు తిరిగి ఇచ్చెయ్యి. ఎందుకంటే షంసా ఇక ఎన్నటికీ నిన్ను విడవదు," అంటూ వృద్ధుడు మమ్మల్ని లోపలికి తీసుకుపోయాడు.

అక్కడ చాపలూ, తివాసీలూ పరిచి ఉన్నాయి. పళ్లాలలో పళ్లూ, ఇతర తినుబండారాలూ సిద్ధంగా ఉన్నాయి. తన పెళ్ళివార్త తమ తండ్రికి చెప్పి వేగంగా రమ్మని షంసా తన అక్కలతో చెప్పి, తానూ నేనూ తినటానికి ఫలాలు సిద్ధం చేసింది. మేం వాటిని ఆరగించి, ఒకరి బాహుబంధాల్లో ఒకరం సుఖించాం.

మర్నాడు ఉదయం షంసా ముందుగా లేచి, తన ఉడుపు ధరించి, నన్ను లేపి, "మనం మా తండ్రివద్దకు వెళ్ళే వేళ అయింది, త్వరగా దుస్తులు వేసుకో," అన్నది.

నేను అలాగే చేశాను. ఇద్దరమూ వృద్ధుడివద్దకు వెళ్ళి, వందనంచేసి, ధన్యవాదాలు చెప్పుకున్నాం.

"నా భుజాలమీద ఎక్కి, నన్ను గట్టిగా పట్టుకో. చాలా దూరంపోవాలి. నేను సాధ్యమైనంత వేగంగా పోతాను," అన్నది షంసా.

నన్ను తన భుజాలమీద కుదురుగా కూర్చోబెట్టుకుని, ఆమె ఆకాశమార్గాన కాంతివేగంతో వెళ్ళి, త్వరలోనే నన్ను వజ్రసౌధం ద్వారం సమీపంలో దించింది. మేం రాజభవనంకేసి నింపాదిగా నడిచి పోతూంటే, మాకోసం నిరీక్షిస్తూ ఉండిన భూతసేవకుడు పరిగెత్తుకుంటూపోయి, మా రాక తెలిపాడు.

భూతాల రాజూ, షంసా తండ్రీ అయిన నగ్రేన్‌రాజు నన్ను చూసి సంతోషించాడు నన్ను తన చేతుల్లోకి తీసుకుని రొమ్ముకు హత్తుకుని, నాకు మంచిబట్టలు కట్టబెట్టి, నా నెత్తిన వజ్రకిరీటంపెట్టి, నన్ను మా అత్తగారైన రాణికి పరిచయం చేశాడు. ఆమె తన కుమార్తెకు మంచి భర్తను సంపాదించినందుకు అభినందించింది. ఆమె షంసాకు అంతులేని వజ్రాలు కానుక ఇచ్చి, మాచేత మంగళస్నానాలు చేయించి, మా గౌరవార్థం మూడుపగళ్లూ,



మూడు రాత్రులూ విందు ఉత్సవం ఏర్పాటుచేయించింది.

నా భార్యను తీసుకుపోయి మా తల్లి దండ్రులకు చూపుతానన్నాను. తమ కుమార్తె దూరంకావటం ఇష్టంలేక పోయినా, రాజూ, రాణీ సరేనని, ఏటా వచ్చి కొంతకాలం ఉంటామని నా నుంచి వాగ్దానం పుచ్చుకున్నారు. మా కోసం రాజు ఒక బ్రహ్మాండమైన సింహాసనం చేయించాడు. దాని మెట్లపైననే రెండు వందల మగభూతాలూ, రెండువందల ఆడభూతాలూ నిలబడవచ్చు.

సన్నాహాలన్నీ ముగిశాక మేం ఆ సింహాసనం ఎక్కి కూర్చున్నాం. నాలుగు వందలమంది సేవకులు దాని మెట్లమీద నిలిచారు. ఒక పెద్ద భూతాలసేన ఆ సింహాసనాన్ని ఆకాశమార్గాన ఎంత వేగంగా ప్రయాణించిందంటే, కాలినడ కన రెండు సంవత్సరాలు పట్టే దూరాన్ని రెండురోజులలో ముగించి, కాబూల్‌లో మా తండ్రి ఇల్లు చేరాం.

ఎంతోకాలం నా కోసం చూసి ఆశలు వదులుకున్న నా తల్లిదండ్రులు నేను రావటంచూసి, నా భార్యను చూసి, ఆమె ఎవరో, ఆమెను నేను ఎలా పెళ్లాడానో తెలుసుకుని, ఆనందాశ్రువులు రాలుస్తూ, మమ్మల్నిద్దరినీ పదే పదే కౌగలించు కున్నారు. పాపం, మా అమ్మ ఏకంగా మూర్ఛపోయి, నా భార్య తనవెంట తెచ్చిన పన్నీరు ముఖంమీద చల్లినదాకా కోలుకోలేదు.

మేం తిరిగి వచ్చినందుకూ మా వివాహం జరిగినందుకూ విందువినోదాలు ముగిసిన అనంతరం నాతండ్రి షంసాను ఆమె కోరిక ఏమిటని అడిగాడు. పెద్దకోరికలులేని షంసా, "మహారాజా, మా కోసం తోటమధ్య ఒక మందిరం ఏర్పాటుచేసి, తోటలో కాలువలుండే టట్టు చెయ్యండి," అనికోరింది.

ఆమె కోరిక త్వరలోనే తీరింది. మేం ఆ మందిరంలో పరిపూర్ణ సౌఖ్యం అనుభవిస్తూ వచ్చాం.

ఒక సంవత్సరం ఆనందడోలికలలో ఊగిపోయింది. నా భార్య రత్నసౌధంలో తన తల్లిదండ్రులను చూడగోరింది. నేను వాగ్దానంకూడా చేసిఉన్నాను గనక అభ్యంతరం చెప్పలేదు. కాని ఆ ప్రయాణమే మాకు ఆపద తెచ్చిపెట్టింది.

మేం సింహాసనం ఎక్కాం; దాన్ని మోసే భూతాలు రోజులో నెల ప్రయాణం ముగిస్తూ బయలుదేరాయి. రాత్రివేళ ప్రయాణం చేసేవాళ్లంకాదు; ఏ నది పక్కనో, చెట్లకింద నో విశ్రమించేవాళ్లం.

ఒకనాటి సాయంకాలం మేం మజిలీ చేసినప్పుడు షంసా సమీపంలోనే ఉన్న ప్రవాహంలో స్నానం చేస్తానన్నది. చలిగా ఉన్నదనీ, స్నానంచేస్తే జబ్బు చేయవచ్చుననీ అన్నాను. కాని ఆమె నా మాటలు వినిపించుకోక, కొంతమంది దాసీలను వెంటబెట్టుకొని స్నానానికి వెళ్లింది. అందరూ ఒడ్డున బట్టలువిప్పి నీటిలోకి దిగారు. వాళ్లు కొంత సేపు జలకాలాడినమీదట నా భార్య కెవ్వున అరిచి, దాసీల చేతుల్లోకి ఒరిగిపోయింది. వాళ్లు ఆమెను ఒడ్డుకు చేర్చారు. నే నామెతో మాట్లాడి ఊరడించుదామనుకున్నాను. కాని అప్పటికే ఆమె ప్రాణంపోయింది. ఆమెను జలసర్పం కాటువేసినచోటు దాసీలు నాకు చూపారు.

నేను స్పృహతప్పి పడిపోయాను. నాకు ఎంతకూ స్పృహ రాకపోయేసరికి నేనుకూడా చచ్చిపోయాననుకున్నారు. కాని నేను షంసాకు ఈ సమాధికట్టి, యావజ్జీవమూ ఆమెకోసం శోకించాలని రాసిపెట్టి ఉండటంవల్ల బతికాను. ఈ రెండో సమాధి నా కోసం నేను నిర్మించుకున్నది. నేను నా రాజ్యాన్ని విసర్జించి, దానికి దూరంగా ఇక్కడే ఏడుస్తూ, స్మరిస్తూ, షంసాపక్కన విశ్రాతిపొందేం దాకా దుర్భరమైన కాలాన్ని గడువుతాను...

ఆ అందమైన యువకుడు తన విషాద గాథ ముగించగానే బులూకియ తన ముఖాన్ని చేతులతో కప్పుకుని ఏడ్చాడు.

అతను ఆ యువకుడితో, "అన్నా, నీ అద్భుత అనుభవాలు వింటూ, నాకు ఇటీవలనే కలిగిన అనుభవాలను సైతం మరిచాను. ఇంతకుముందు అంతకన్న వింత అనుభవాలు ఉండవనుకున్నాను. నీ దుఃఖాన్ని భరించే శక్తినిచ్చి, అల్లా నీకు మరుపు ప్రసాదించుగాక!" అన్నాడు.

అతను అక్కడే మరొకగంట గడిపి తన రాజ్యానికి రమ్మని ఆహ్వానించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. తరవాత ఆ యువకుడికి కొన్ని ఓదార్పుమాటలు చెప్పి, సెలవు పుచ్చుకొని, అయిదేళ్ల తరవాత బులూకియ మళ్ళీ తన ఇల్లు చేరుకున్నాడు.

అటువైన నాకు బులూకియ వార్తలేవీ అందలేదు. ఇంతలో నువ్వు వచ్చి, నేను బులూకియను మరిచిపోయేటట్టు చేశావు. అతను ఎప్పటికైనా మళ్ళీ వస్తాడన్న ఆశకూడా మరుపుకు వచ్చింది. హాసిబ్ నువు నన్ను అంతవేగంగా విడిచిపెట్టి పోవనుకుంటున్నాను. కొన్ని సంవత్సరాలపాటు నా దగ్గిర ఉండిపోతావు గదూ. నేను నీకు ఏ లోటూ రానివ్వను. బులూకియ కథనూ, అందమైన యువకుడి కథనూ తల దన్నేవి ఎన్నో కథలు చెబుతాను. నా కథలు శ్రద్ధగా విని నన్ను సంతోషపెట్టినందుకు, నా స్త్రీ జనం మంచి విందు ఏర్పాటుచేసి, తెల్లవార్లూ పాడి నీకు ఆనందం కలిగిస్తారు.

* * *

రాణి యమ్లిక దానియెల్ కొడుకైన హాసిబ్‌కు కథలు చెప్పి, విందు జరిగి, తెల్లవార్లూ నాగస్త్రీలు నృత్యాలాడి, పాటలు పాడిన అనంతరం అందరూకలిసి రాణిగారి వేసవినివాసానికి వెళ్లే ప్రయత్నాలు సాగాయి.

కాని, తన తల్లినీ, భార్యనూ గాఢంగా ప్రేమించే హాసిబ్ యమ్లికతో, "మహా రాణీ, నేను కట్టెలు కొట్టుకునే సామాన్యుణ్ణి అయినాకూడా, నువు నీతోబాటు సంవత్సరాల తరబడి సుఖాలు అనుభవించమంటున్నావు. కాని నాకు ఇంట్లో తల్లీ, భార్యా ఉన్నారు. వాళ్లు నా కోసం ఎంతగా పరితపిస్తూ ఉంటారో, వాళ్లను బాధపడనివ్వలేను. వాళ్లు శోకంతో చచ్చే లోపుగా నన్ను వారివద్దకు తిరిగి వెళ్ళనియ్యి. నన్ను ఆనందపరచటానికి నువు చెప్పదలచుకున్న కథలు వినలేకపోయానే అన్న విచారం నాకు జన్మాంతంవరకూ ఉంటుంది," అన్నాడు.

హాసిబ్ కోరిక న్యాయమైనదని గ్రహించి యమ్లిక అతనితో, "ఓ హాసిబ్, నీలాగా కథలు వినేవాణ్ణి పోగొట్టుకోవటం నాకు బాధాకరమే అయినప్పటికీ, నువు నీ తల్లినీ, భార్యనూ చేరుకోవటానికి ఒప్పుకుంటున్నాను. అయితే నువు ఒకప్రమాణం తీసుకోవాలి, లేకపోతే నిన్ను వెళ్ళనివ్వను. అదేమిటంటే నువు నీ జీవితాంతంవరకూ స్నానం చెయ్యరాదు. మాట తప్పావో నాశనమవుతావు. ఇప్పు డింతకన్న నేనేమీ చెప్పలేను," అన్నది.

ఇలాంటి ప్రమాణం తనకు విస్మయం కలిగించినప్పటికీ, ఆమెకోరిక కాదనలేక హాసిబ్ ఆమె కోరిక ప్రకారం ప్రమాణం చేశాడు. తరవాత రాణి అతనికి వీడ్కోలు చెప్పి, అతన్ని తన లోకంనుంచి బయటికి తీసుకుపోయే దారిచూపిరమ్మని ఒక నాగస్త్రీని పంపింది. ఆ మార్గం అతను వచ్చినదారికి విరుద్ధమైన దిశగా ఉన్నది. అది ఒక పాడుపడిన కొంపలో అంతమయింది.

హాసిబ్ తన ఇంటితలుపు తట్టే సమయానికి సూర్యుడు ఉదయిస్తున్నాడు.

అతని తల్లి తలుపు తెరిచి, అతన్ని తన చేతులతోచుట్టి, ఆనందబాష్పాలు రాల్చింది. అత్తగారికేకా, వెక్కిలూవిని కోడలు పరిగెత్తుకుంటూ వచ్చి, తన భర్త చేతులు ముద్దుపెట్టుకున్నది. ముగ్గురి ఆనందానికీ మేరలేకుండా పోయింది.

ఈ ఆనందోత్సాహంకాస్త చల్లబడ్డాక, హాసిబ్ తన తోటి కట్టెలు కొట్టేవాళ్ళ గురించి విచారించాడు. తనను తేనె గోతిలో వదిలేసిన అనంతరం వాళ్లువచ్చి హాసిబ్‌ను తోడేలు తినేసినట్టు చెప్పారనీ, వాళ్ళంతా ఇప్పుడు డబ్బుగల వర్తకులనీ వాళ్ళకు పెద్దపెద్ద దుకాణాలున్నాయనీ, వాళ్ల పని మూడుపువ్వులూ, ఆరు కాయ లూగా ఉన్నదనీ తల్లి చెప్పింది.

హాసిబ్ కొంచెంసేపు ఆలోచించి, తల్లితో, "నువు రేపు వాళ్ల దుకాణాలకు వెళ్లి, వాళ్లందరినీవచ్చి నన్ను చూడమని ఆహ్వానించు," అన్నాడు.

మర్నాడు హాసిబ్ తల్లి అలాగే వెళ్లి, కట్టెలుకొట్టినవాళ్లందరినీ ఆహ్వానించింది. వాళ్లు వెలాతెలాపోతూ, తాము సంతోషంగా వచ్చి, హాసిబ్‌కు స్వాగతం చెబుతామన్నారు. తరవాత అందరూ కూడబలుక్కుని, ఏ పాపమూ ఎరగని వాళ్ళలాగా కనిపించగలందులకు,హాసిబ్ తల్లికి తమ దుకాణాలలోనుంచి తీసి విలువైన బట్టలు కానుక పెట్టి, హాసిబ్ఇంటికి వస్తూ, తమ సంపదలోనూ, ఖానిసల లోనూ వాటా ఇయ్య నిశ్చయించారు. వాళ్లు హాసిబ్‌ను ప్రేమగా పలకరించి, తాము లోగడచేసిన ద్రోహాన్ని మరిచి పొమ్మని అతన్ని ప్రార్థిస్తూ, కానుకలు సమర్పించారు.

హాసిబ్ మనసులో కష్టపెట్టుకోక, వాళ్ళిచ్చిన కానుకలను స్వీకరించాడు. అతను వాళ్ళతో, "జరిగిందేదో జరిగింది. అలా జరగాలని రాసిపెట్టి ఉన్నది,'' అన్నాడు.

అతనికి శతవిధాల కృతజ్ఞత తెలువుకుని వాళ్ళు వెళ్లిపోయారు. అది లగాయతు హాసిబ్‌కూడా ధనవంతుడయాడు. అతనుకూడా బజారులో ఒక దుకాణం తెరిచాడు. కాలక్రమాన అది నగరంలోని దుకాణాలన్నిటికన్నా ఆకర్షవంతంగా తయారయింది.

ఒకనాడు హాసిబ్ తన దుకాణానికి వెళుతూ బజారు మొగదల ఉన్న స్నానశాల పక్కగా వచ్చాడు. స్నానశాల యజమాని వాకిలివద్ద నిలబడిఉండి, హాసిబ్‌ను చూసి సలాంచేసి, "తమరు ఎన్నడూ మా స్నానశాలలో అడుగుపెట్ట లేదు. లోపలికి దయచేసి, స్నానంచేసి, నన్ను ధన్యుణ్ణి చెయ్యండి. ఇవాళ నా ఆనందంకోసం మీకు ప్రత్యేకమైన అభ్యంగనం ఏర్పాటుచేస్తాను,'' అన్నాడు.

"నీ కోరిక మన్నించలేను నేను స్నానశాలలోకి ప్రవేశించనని ప్రమాణం చేసిఉన్నాను," అన్నాడు హాసిబ్.

ఎవరుగాని అలాంటి ప్రమాణం చేస్తా




రని నమ్మలేక, స్నానశాలవాడు, "అయ్యా, నా కోరిక ఎందుకు తోసి పుచ్చుతున్నారు? మీరు వచ్చి స్నానం చెయ్య నిరాకరించే పక్షంలో నేను నా ముగ్గురు భార్యలకూ విడాకు లిస్తానని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు.

వాడు అంత ఘోర ప్రమాణంచేసినా హాసిబ్ స్వరేననలేదు. స్నానశాలవాడు అతని కాళ్లమీదపడి, "అయ్యా, నాచేత అంత దురాగతం చేయించకండి," అని ప్రాధేయపడ్డాడు. దానికీ హాసిబ్ లొంగ లేదు.

స్నానశాలవాడు ఏడుస్తూ, "మీ వాగ్దానభంగంవల్ల కలిగే ఫలితాలకు నేను పూచీపడతాను," అన్నాడు.

ఈ లోపల చుట్టూ మూగిన జనం, అంతా తెలుసుకుని, "వాడు మీకు ఉచితంగా అభ్యంగనం చేయిస్తానంటున్నప్పుడు, మీరు వాడి కొంప కూల్చటం భావ్యంకాదు," అని హాసిబ్‌తో అన్నారు.

హాసిబ్ వాళ్ళమాటకూడా వినిపించుకోకపోయేసరికి, వాళ్ళు అతన్ని బలాత్కారంగా స్నానశాలలోకి మోసుకుపోయి, అతని బట్టలన్నీ ఊడదీసి అతని మీద ఇరవై, ముప్పై బొక్కెనల నీళ్ళు కుమ్మరించారు. అతని శరీరమంతామర్దన చేసి, సబ్బుతో రుద్ది, తుడిచి, వేడి తువాలాలు చుట్టారు.

స్నానశాలవాడు తనకు ప్రమాణభంగం కలగనందుకు పరమానందం చెంది, హాసిబ్‌కు ఒక కప్పులో షర్బత్ తెచ్చిఇచ్చాడు. భయంతో దడదడలాడి పోతున్న హాసిబ్ ఆ కప్పు స్వీకరించాలో లేదో తెలుసుకునే లోపుగా, రాజభటులు కోలాహలంగా స్నానశాలలో ప్రవేశించి, అతనిమీద విరుచుకుపడి పట్టుకుని, అతను ఎంత తన్నుకుంటున్నా మాట వినిపించుకోకుండా, రాజభవనానికి తీసుకుపోయి, తమకోసం ఎదురుచూస్తున్న వజీరుకు అతన్ని అప్పగించారు.

హసీబ్‌ను చూడగానే వజీరు ఎంతో సంతోషం ప్రకటించి, అతన్ని ఎంతో గౌరవంగా పలకరించి, తనవెంట రాజు వద్దకు రావలసిందని వేడుకున్నాడు. హసీబ్ అన్నిటికీ ఒడిగట్టి, వజీరువెంట రాజభవనంలోకి వెళ్లాడు. అక్కడ వేల సంఖ్యలో సామంతులూ, అధికారులూ, ఖడ్గహస్తులూ ఉన్నారు. ఒక బంగారు శయ్యమీద రాజు పడుకుని ఉన్నాడు. ఆయన ముఖంమీద పట్టుగుడ్డ కప్పి ఉన్నది. ఆయన నిద్రపోతున్నట్టుగా కనిపించాడు.

ఇదంతా చూసి హసీబ్ తన ఆఖరు ఘడియ సమీపించిందనుకుని హడలి పోయాడు. అయితే అతన్ని ఏ నేరానికి పట్టుకున్నదీ తెలియలేదు. అందుచేత అతను మంచం దగ్గిర సాష్టాంగపడి, తాను నిర్దోషినని ప్రకటించాడు.

వజీరు ముందుకువచ్చి, సగౌరవంగా అతన్ని లేవనెత్తి, "అయ్యా, నువు మా కరజ్దాన్ మహారాజును కాపాడాలి. ఆయనకు భయంకరమైనకుష్ఠునంప్రాప్తమైంది. దానియెల్ కుమారుడివైన నువ్వే దాన్ని నయం చెయ్యాలని మా నిశ్చయం," అన్నాడు.

"మహారాజుకు నువే చికిత్స చెయ్యాలి!" అని అందరూ ఒక్కపెట్టున అరిచారు.

"ఇదేం ప్రారబ్ధంరా, భగవంతుడా! నన్ను వీళ్లు ఏదో మహాత్ముడనుకుంటున్నారు!" అనుకున్నాడు హసీబ్. అతను మంత్రికేసి తిరిగి, "అయ్యా, నేను కావటానికి దానియెల్‌గా రబ్బాయినేకాని, వట్టి పనికిమాలినవాణ్ణి. నేను వైద్య విద్య నేర్చుకోవటానికి ప్రయత్నించాను గాని, మా గురువు వట్టి చవటకావటంచేత నెలరోజులకే మానేశాను. చిట్టచివరకు మా అమ్మ నాకు కొన్ని తాళ్ళూ, గాడిదా కొనిపెట్టి, నన్ను కట్టెలు కొట్టేవాణ్ణి చేసింది. నేను నేర్చినవిద్య అంతా అదే," అన్నాడు.

"నీ తెలివితేటలు మా దగ్గిర దాచి ప్రయోజనంలేదు. దశదిశలూ గాలించి, వైద్యంలో నీతో సమానుడు లేడని మేం తెలుసుకున్నాం," అన్నాడు వజీరు.

"కాని, వజీరు మహాశయా, నాకు రోగాలను గురించిగాని, ఔషధాలను గురించిగాని ఏమీ తెలియదే. నేను చికిత్స ఎలా చెయ్యను?" అన్నాడు హసీబ్.

"అబ్బాయీ, ఈ బొల్లికబుర్లవల్ల ఏమీ లాభంలేదు. రాజుగారి చికిత్స నీ చేతిలో ఉన్నదని మాకు తెలుసు," అన్నాడు వజీరు.

హసీబ్ చేతులు పైకెత్తి, "అదెలా?" అన్నాడు.

నాగలోకపు రాణి యమ్లిక నీకు తెలుసు. ఆమె పాలతో ఎలాటి రోగాలయినా నయమవుతాయి," అన్నాడు వజీరు.

"తాను స్నానశాలలో ప్రవేశించిన




కారణంగా తన రహస్యం బయటపడిం దని హాసిబ్ గ్రహించి, "నేను ఆ పాలను ఎన్నడూ చూడలేదు. యమ్లిక పేరే నే నెన్నడూ వినలేదు. ఆమె ఎవరో నాకు తెలియదు," అన్నాడు.

"నువు అంత మొండిగా మాట్లాడు తున్నావు గనక, నీ మాటలు ఎందుకు నమ్మలేమో చెబుతాను. అనాదిగా ఆమెను చూసివచ్చిన వారందరికీ పొట్టలమీద చర్మం నల్లబడుతుంది. కాని ఆ నలుపు స్నానం చేస్తేనేగాని బయటపడదు. ఈ సంగతి ఒక ప్రాచీన గ్రంథంలో చది వాను. నేను స్నానశాలలో ఏర్పాటు చేసిన చారులు ఇంతకుముందే వచ్చి, నువు స్నానం చేస్తుండగా నీ పొట్టమీది చర్మం నల్లబడినట్టు చెప్పారు. అందుచేత నాతో వాదించకు,'' అన్నాడు వజీరు.

"అయితే కావచ్చు, కాని నేను ఆ రాణిని చూడలేదు," అన్నాడు హాసిబ్.

వజీరు వెంటనే ముందుకువచ్చి, అతని పొట్టమీద కప్పిన తువాలా తీసేసి, అతని పొట్టమీది చర్మం గేదె చర్మంలాగా ఉండటం బయటపెట్టాడు.

హాసిబ్‌కు మూర్ఛ వచ్చినంతపని అయింది. అయినా అతను దింపుడు కళ్లాశతో, "నాకు పుట్టినప్పటినుంచీ పొట్ట అలాగే ఉన్నది," అన్నాడు.

వజీరు నవ్వుతూ, ''నువ్వు స్నాన శాల ప్రవేశించినప్పుడు అలా లేదు. నా చారులు ఆ మాట స్పష్టంగా చెప్పారు," అన్నాడు.

అయినా హాసిబ్, రాణీసంగతిబయట పెట్టటం ఇష్టంలేక, తాను ఆమెను ఎరగ నంటేఎరగనని ప్రమాణాలుచేశాడు. అది చూసి వజీరు ఇద్దరు ఖడ్గపాణులకు సంజ్ఞ చేశాడు. వాళ్ళు హాసిబ్‌ను పడుకోబెట్టి, అరికాళ్ళమీద బలంగా కొట్టనారంభిం చారు. చచ్చిపోతానని భయపడి, నిజం చెప్పటానికి ఒప్పుకున్నాడు.

వెంటనే వజీరు అతన్ని లేవదీయించి,

మంచి దుస్తులు తొడిగించి, బయటికి తీసుకుపోయి, రెండు మంచి గుర్రాలు తెప్పించి, ఒకదానిమీద తాను ఎక్కి, రెండోదానిమీద హాసిబ్‌ను ఎక్కించాడు. ఇద్దరూ బయలుదేరారు. హాసిబ్ నాగ లోకంనుంచి వచ్చేటప్పుడు చేరిన పాడు పడిన ఇంటికి ఇద్దరూ చేరారు.

హాసిబ్ యమ్లికను ప్రత్యక్షంకమ్మని ప్రార్థించేసరికి భూమి కంపించి, ఒక సొరంగం ఏర్పడింది.దానికుండా యమ్లిక బంగారు పళ్లెంలో నలుగురు నాగస్త్రీల చేత మోయించుకొని, పైకివచ్చి, "నాకు చేసినప్రమాణం నిలుపుకోవటం ఇదేనా?'' అని నిష్ఠూరంగా అడిగింది.

''భగవంతుడు సాక్షిగా, రాణీ, ఈ తప్పు వజీరుది. నన్ను ఆయన చావ గొట్టించాడు," అన్నాడు హాసిబ్.

"అవును, నాకు తెలుసు. అందుకనే నిన్ను శిక్షించను. నిన్ను బలాత్కారంగా ఇక్కడికి తెచ్చారు. రాజుకు చికిత్స జరగవలసి ఉన్నది గనక నేనుకూడా బలాత్కారంగానే వచ్చాను. చికిత్స కోసం నన్ను పాలు అడగవచ్చావు. నువు నా ఆతిధ్యం పొంది ఉన్నవాడివి గనకనూ, నా కథలు శ్రద్ధగా విన్న వాడివి గనకనూ నీకు పాలు ఇస్తాను. వాటిని ఎలా ఉపయోగించాలో చెబు తాను, దగ్గిరికి రా," అన్నది రాణి యమ్లిక.

హాసిబ్ దగ్గిరికి రాగానే ఆమె అతని చెవిలో రహస్యంగా, ''ఈ ఎర్ర గుర్తు గల సీసాలో పాలు రాజు రోగం నయం చేస్తాయి. రెండో సీసా నిన్ను కొట్టినవజీరు కోసం. రాజుకు నయంకావటం చూసి, తనకు ఏ రోగమూ రాకుండా ఉండగలం దులకు నా పాలు తాగగోరుతాడు. అప్పు డతనికి రెండోసీసా ఇయ్యి," అన్నది.

ఇలా చెప్పి యమ్లిక హాసిబ్‌కు రెండు సీసాలిచ్చి, తన అనుచరులతోసహా అదృశ్యమయింది. భూమి మళ్లామూసుకు పోయింది.

హాసిబ్ రాజభవనానికి తిరిగివస్తూనే, యమ్లిక చెప్పినట్టు, రాజును సమీపించి, మొదటి సీసాలోని పాలను రాజుచేత తాగించాడు. ఆ పాలు నాలుకకు తగులు తూండగానే రాజుకు ముచ్చెమటలు ఆరంభమై, కుష్ఠుచర్మం ఊడిపడిపోయి, దాని స్థానంలో వెండిలాగా మెరిసిపోతూ కొత్త చర్మం వచ్చింది.

వెంటనే వజీరు రెండో పాలసీసా తీసుకుని, ఒక్కగుక్కలోపాలన్నీ తాగే శాడు. ఆయన శరీరం ఉబ్బనారంభించి, కొద్దిసేపట్లో ఏనుగు శరీరమంతగా పెరిగి, ఒక్కసారిగా పేలిపోయింది. ఆయన ఆ క్షణంలోనే చచ్చాడు. ఆయన శరీరఖండాలు అన్నివైపులనుంచీ ఏరి, పాతిపెట్టేశారు.

తన వ్యాధి నిజంగా నయమైనట్టు గ్రహించగానే రాజు హాసిబ్‌ను తన పక్కన కూర్చోబెట్టుకుని, అతనికి విరి



విగా తన కృతజ్ఞత తెలిపి, అతన్ని వజీరుగానియమించాడు. రత్నాలు కుట్టిన శాలువ అతనిమీద బరువుగా కప్పి, అతని నియామకం గురించి ప్రకటన చేశారు. అతనికి మూడువందలమంది బానిసలనూ, మూడువందలమంది ఉంపుడుకత్తెలనూ, ముగ్గురు రాచకన్నె లను భార్యలుగానూ, పెద్ద పెద్ద గేదెల, గొర్రెల, ఆవుల మందలనూ కానుకగా ఇచ్చారు. రాజోద్యోగులందరూ అతనికి కైవారాలు చేశారు.

హాసిబ్ వజీరు ఇంటికి మారి అక్కడ తన తల్లితోనూ, భార్యలతోనూ, సుఖంగా జీవించసాగాడు. ఇప్పుడతనికి రాయటమూ, చదవటమూ నేర్చుకునేటందుకు వ్యవధి దొరికింది. ఈ రెండు విద్యలూ అలవడిన అనంతరం అతనికి తన తండ్రి మహాపండితుడని గుర్తువచ్చి, ఆయన తనకు వదిలిపోయిన పుస్తకాలను గురించి తల్లిని అడిగాడు.

"నాయనా, పోయేముందు నీ తండ్రి నీకు ఒక చిన్న కాగితంమాత్రం ఉంచి, మిగిలిన గ్రంథాలన్నిటినీ నాశనంచేశాడు. నువు అడిగినప్పుడు ఆ కాగితం నీ కియ్య మన్నాడు," అంటూ అతని తల్లి అతని కొక కాగితం ఇచ్చింది. దానిమీద ఇలా రాసి ఉన్నది.

"జ్ఞానమంతా నిరుపయోగం. అల్లా తన ప్రతినిధిద్వారా సమస్త విజ్ఞానాన్ని ప్రజలకు అందించే సమయం ఆసన్న మయింది. ఆయనకు మహమ్మద్ అని పేరుంటుంది. కాలం ఉండే పర్యంతమూ ఆయనకూ, ఆయన అనుచరులకూ, ఆయనను నమ్మినవారికీ శాంతిసుఖాలు కలుగుగాక!"

(సమాప్తం)

---



# అంతా వ్యాపారమే!

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

రామనాథం ఢిల్లీ విమానాశ్రయంలో దిగి, క్వీన్స్ హోటల్‌కి టెలిఫోను చేశాడు, తనకోగది ఏర్పాటుచెయ్యమని.

క్వీన్స్ హోటల్ చాలా పెద్దతరగతి హోటేలు. అతివిశాలమైన ఆవరణ, ఆవరణలో పూలతోట. చుట్టూ ప్రహరీ గోడ, ఇనపగజాల తలుపులు. సింహద్వారంవద్ద గూర్ఖావాడు. దూరంనుంచి చూస్తే ఆంగ్లేయ వాస్తుశిల్పపద్ధతిలో కట్టిన యీ భవనం రాజులూ రాణీలూ నివసించే పాతరకపు భవనంలా కనిపిస్తుంది. దానికొక విధమైన గంభీరాకారం వుంది.

దీని పేరు భారతదేశంలోనే కాక విదేశాల్లో కూడా వ్యాపించింది. విలాసార్థం భారతదేశ యాత్రకు వచ్చే విదేశ ధనికులు, స్వదేశ ధనికులు, రాజ ప్రముఖులు, రాయబారులు, పెద్ద పెద్ద వ్యాపారులు వగైరా శ్రీమంతులు అక్కడ దిగారు.

మేనేజరు భారతీయుడే కాని ఆంగ్ల నాగరికత బాగా వొంటపట్టినవాడు.

కొంచెం స్థూలకాయుడు. పొట్టి గా గుమ్మడికాయలా వుంటాడు. బట్టతల, నల్లటి ముఖంలోంచి తెల్లటి పలువరుస తొంగిచూస్తూ వుంటుంది. ఆ కళ్ళలో నిశితమైన దృష్టి, నిర్వహణసామర్థ్యం, జీవితానుభవం వుట్టిపడుతూ వుంటాయి.

రామనాథానికి మంచి గదొకటి ఏర్పాటుచేశాడు మేనేజరు. తనకొచ్చిన వివరాల ప్రకారం రామనాథం ఒక పెద్ద వ్యాపారస్తుడు. వ్యాపారంమీద విదేశాలు తిరిగినవాడు. ప్రభుత్వ వర్గాల్లో బాగా పలుకుబడి వున్నవాడు. ఆయన ఢిల్లీ వస్తున్నాడంటే ఎవరైనా మంత్రులనో, పెద్ద వుద్యోగులనో కలుసుకోడానికే అయివుండవచ్చును. ఆయన కే లోపం జరగకూడదని బంట్రోతులకూ గుమాస్తాలకూ చెప్పివుంచాడు. అతని రాక కోసం ఎదురుచూస్తున్నాడు. తను స్వయంగా స్వాగతమివ్వడమే బాగుంటుంది. మధ్యాహ్నం ఒంటి గంటైంది. మేనేజరుకి ఆకలివేస్తూంది. మరో పావు గంట చూసి భోజనానికి పోవచ్చు నను కొన్నాడు మేనేజరు.

అంతట్లో గుమ్మంలో కారు నిలబడింది. రామనాథం కారు దిగి చకచక మెట్లెక్కి హాలులోకి వచ్చాడు. కొంచెం పొడుగ్గా, తెల్లగా అందంగా వుంటాడు. చాల విలువైన ఫ్రెంచి ఉన్ని సూటు, స్విన్‌టై, కళ్ళజోడు, నోట్లో పైపు, చేతిలో తోలుసంచీ, కెమెరా. హోటలు బంట్రోతులు వచ్చి సలాంచేసి పెట్టే బెడ్డింగూ లోపలికి తీసుకువెళ్ళేరు. మేనేజరు వినయపూర్వకంగా వంగి కరచాలనం చేశాడు. పరిచయాలు చేస్తున్నారు.

మేనేజరు, "మీరిహోటల్‌కి రావడం నాకు సంతోషంగా వుంది" అన్నాడు రామనాథం ఇంగ్లీషులో. అలా అనడం సంప్రదాయం కాబోలు మరి.

"మీ కన్ని విధాలా సదుపాయంగా వుండేటట్లు చూస్తాను" అన్నాడు మేనేజరు. ఈ ఆనవాయితీలయిన తరవాత వాళ్ళిద్దరూ రామనాథంకోసం ఏర్పాటు చేసిన గదిలోకి వెళ్ళేరు గదిలో రేడియో, డ్రెస్సింగ్ టేబులు, సోఫాలు వగైరా సామగ్రివుంది.

"మీకేమైనాఅవసరంవుంటే ఆఫీసులో ఉంటాను, టెలిఫోను చెయ్యండి" అన్నాడు మేనేజరు.

"అలాగే.''

"మీరు ప్రయాణపు బడలికతో వున్నట్టున్నారు. స్నానం, భోజనం చేసి విశ్రాంతి తీసుకోండి. మళ్ళీ సాయంత్రం కలుద్దాం."

"చూడండీ, పోస్టాఫీసునుంచి ఒక వంద టెలిగ్రాం ఫారాలు తెప్పించండి, చాలా పని వుంది"అన్నాడు రామనాథం.

అలాగేనని చెప్పి మేనేజరు వెళ్ళిపోయాడు.

సాయంత్రం రామనాథ్ ఊళ్ళోకెళ్ళి

అటూ యిటూ తిరిగి హోటలు చేరుకునే సరికి చీకటి పడింది. హోటలు విద్యుద్దీపాలతో పట్టపగలులా వుంది. జట్లు జట్లుగా స్త్రీ పురుషులు కార్లలోంచి దిగి విలాసంగా నడుస్తూ మాట్లాడుకుంటూ, గట్టిగా నవ్వుకుంటూ లోపలికి వెళ్తున్నారు. హోటలు హాలుల్లోంచి సంగీతం, వీధివరండామీద స్త్రీల కిలకిలనవ్వులూ ఆవరణ అంతా వ్యాపించాయి. విద్యుద్దీపాల కాంతిలో స్త్రీల దుస్తులు, ఆభరణాలు తళ తళ మెరుస్తున్నాయి.

రామనాథం వరండాకు దిగువ ఆవరణలో వేసివున్న ఒక కుర్చీలో కూర్చుని తీరికగా పైపు కాలుస్తున్నాడు. హోటల్ లోపలికి వెళ్ళేవారినీ అక్కడ తచ్చాడుతున్నవారినీ చూస్తున్నాడు. హాలులోని నిలువుటద్దాలలో వారి ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. వారంతా గొప్ప కుటుంబాలకు చెందినవారు. భూస్వాములు, వర్తకులు, అధికారులు, ధనికులు. వారి నడకల్లోనూ కదలికల్లోనూ తాము భాగ్యవంతులమనే, అదృష్టవంతులమనే భావం కనిపిస్తూంది. స్త్రీలలో అందంగా వున్నవాళ్లూ వికారంగా వున్నవాళ్లూ, కూడా వున్నారు. కాని వారంతా చక్కగా ముస్తాబయారు. వారి చూపుల్లో, మాటల్లో పురుషులను ఆకర్షించాలనే లక్ష్యం కనిపిస్తుంది. స్త్రీలుకూడా లోపలికివెళ్ళి తాగుతున్నారు. బాల్ రూమ్‌లో జంటలుగా నాట్యం చేస్తున్నారు. హుషారుతో, ఉద్రేకంతో తుళ్లుతున్నారు. అలసిపోయినవారు సోఫాల్లో చతికిలబడి, కొంచెం షాంపైన్, లేకపోతే జిమ్‌లెట్ పుచ్చుకుంటున్నారు. వైలెన్ మీద బీతోవెన్ సంగీతం హాయిగా వుంది. దాని ప్రక్క పియానో వాయిద్యం కూడా బాగుంది. అంతా తుఫానులా, సముద్రపు హోరులా వుంది.

రామనాథానికి జీవితం ఎంతో ఆనందమయంగా తియ్యగా కనిపించింది. ఈ సుఖాలను అందుకోడానికి మనిషి ఎంతో అదృష్టవంతుడై పుట్టాలి. లేదా సమాజాన్నీ జీవితాన్నీ తన పిడికిట్లో పెట్టుకుని, అనేకమందినీ, అవరోధాలనూ జయించుకుని వచ్చి అదృష్టాన్ని సృష్టించుకోవాలి. లేకపోతే జీవితసార్థక్యం ఏమిటి? రామనాథం ఆలోచిస్తున్నాడు. వెనకనుంచి మిసెస్ స్మిత్ వచ్చింది. ఆమె ఆంగ్లో ఇండియన్ స్త్రీ. వయసు మళ్ళినప్పటికీ యవ్వనిలా వుండడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నట్లు కనిపిస్తుంది. "నీ కోసం లోపలంతా వెదికాను. నాట్యానికి రావా?" అంటూ ప్రక్కనున్న కుర్చీలో కూచుంది. ఆమె నోరు బ్రాందీ వాసన కొడుతూంది. అప్పుడప్పుడు పెదిమలు చప్పరిస్తూంది. బ్రాందీవల్ల మండుతున్నాయి కాబోలు.

అంతట్లో మేనేజరు గబగబా వచ్చి

"మంచిప్రోగ్రాం ఏర్పాటుచేశాము చాలా కాలమైంది. ఇండియన్ డాన్స్; చూడ లేదని చాలామంది అన్నారు. అంచేత ప్రత్యేకంగా కలకత్తానుండి ఒక పార్టీని తెప్పించాము లోపలికి దయచెయ్యండి" అన్నాడు.

"ఇండియన్స్‌కి డాన్సేమిటి, నా మొహం. నృత్యకళ అంటే ఫ్రాంసులోనే చూడాలి. నేను పేరిస్‌లో వున్న ప్పుడు..." అని ఏదో చెప్పబోయాడు రామనాథం. కాని దొరసాని అడ్డుతగి లింది.

"అదేమిటి మోహన్ అలా అంటావు. భారతీయనాట్యం చాల గొప్పది నాకెంతో యిష్టం. మీ భరతనాట్యంలో గొప్ప కళ వుంది."

రామనాథం చిరునవ్వు నవ్వి "నిజమే కాని, యీ మామూలు డాన్సర్లందరూ శాస్త్రయుక్తంగా నాట్యం చెయ్యలేరు. వీరు చవకబారు నృత్యాలతో భారతీయ సంస్కృతికీ, కళలకూ అపచారం చేస్తు న్నారు. భారతీయ నాగరికతనూ, సంస్కృతినీ పాడుచేస్తున్నారు'' అని రామనాథం ఒక గ్లాసు స్కాచివిస్కీ పుచ్చుకున్నాడు.

''నిజమే మోహన్, ఏ దేశంలోనైనా అంతే. కాబట్టే ప్రభుత్వం చవకబారు కళాకారుల్ని నిషేధించాలంటూ వుంటాను" అంది మిసెస్ స్మిత్. కళా కారుల్ని నిషేధించడమేమిటో మేనే జరుకి బోధపడలేదు. అసలీ దొరసాని ఎవరో, రామనాథాన్ని మోహన్ అని ఎందుకు పిలుస్తూందో అర్థంకాలేదు. అతనికంతా అగమ్యగోచరంగా వుంది "క్షమించండి. వీరెవరో పరిచయం చేయలేదు" అన్నాడు రామనాధంతో.

"ఓ, సారీ, ఈమె మిసెస్ స్మిత్ నా స్నేహితురాలు, మోహన్ అన్నది మాతండ్రిగారు నాకు పెట్టిన ముద్దు పేరు," అన్నాడు రామనాథం. 'ఏడిసి నట్టుంది' అనుకున్నాడు మేనేజరు. ఇంతట్లో యింకో యువకుడు తూలు కుంటూవచ్చి వారి ప్రక్కనున్న కుర్చీలో కూచున్నాడు. అతని కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. ద్రాక్షసారా అతని కోటు కాలరుమీద మరక కట్టింది. అతనే రామనాథాన్ని పలకరించాడు.

"హల్లో మిస్టర్ రావ్ ఎప్పుడు కల కత్తానుండి రావడం?"

"లేదు, లేదు. నేనిప్పుడు బొంబా యిలో వుంటున్నాను. మిస్టర్ మేనేజర్, ఈయన నా మిత్రుడు డేవిడ్; నా మిత్రులు కాలేజీ క్లాసుమేట్లు నన్ను రావ్ అని పిలుస్తూంటారు" అన్నాడు. ఒక మనిషికి యిన్ని పేర్లుండడ మేమిటని ఆలోచిస్తున్నాడు మేనేజరు. వాళ్ళంద రితో కరచాలనం చేసి వెళ్ళిపోయాడు. వారంతాకూడా లేచి లోపలికి వెళ్ళేరు.

మర్నాడు డేవిడ్ హోటలుమేనేజరు

దగ్గరకొచ్చి రామనాథం యింకా ఊళ్ళో ఎన్నాళ్ళుంటాడని అడిగాడు. మేనేజరు ఎందుకన్నాడు. రామనాథం తనదగ్గర అయిదు వందలు అప్పు తీసుకున్నాడని చెప్పేడు.

"ఆయన అప్పుచెయ్యవలసిన కర్మమేమిటి?"

"ఇవాళే నాకు తెలిసింది. రామనాథం వ్యాపారం దివాలా అయిందిట. ఇప్పుడు ప్రగల్భాలు చెప్పుకు తిరుగుతున్నాడట. ఈ ఊళ్ళో తెలిసినవాళ్ళ దగ్గర అప్పుడే అప్పులు చేశాడట. అతను తీర్చగలడనే నమ్మకంలేదు," అన్నాడు డేవిడ్. మేనేజరుకి యిదంతా అగమ్యగోచరంగా వుంది. డేవిడ్ వెళ్ళిపోయాడు. రామనాథం ఎటువంటివాడై వుంటాడా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు మేనేజరు.

ఆ సాయంకాలం రామనాథం మేనేజరు దగ్గరకొచ్చి "మిస్టర్ మేనేజరు నేనింకా ఈ ఊళ్ళో వారం పదిరోజులుండాలి. ఇటూ అటూ వెళ్ళడానికి తక్షణం ఒక కారు కావాలి. ఎవరేనా కార్లకంపెనీ వాళ్ళకి కబురుపెడతారా" అని అడిగాడు. ఇతనుండే వారం పది రోజులకూ కారుకొనడ మెందుకో మేనేజరుకు అర్థంకాలేదు. ఎంత లక్షాధికారైనా టాక్సీలో పోతాడుగాని, వారం రోజులకోసం పది పదిహేను వేలుపెట్టి కారుకొనడు. సరే యిదేదో చూద్దామని 'సరే' నన్నాడు.

కార్లకంపెనీకి కబురువెళ్ళగా, వాళ్ళు రావడం, రామనాథం వాళ్ళదగ్గర కారొకటి తీసుకుని పదిహేనువేలకు చెక్కు వ్రాసి యివ్వడం జరిగింది.

మర్నాడు పగల్లా రామనాథం హోటలుకురాలేదు సాయంత్రంవచ్చాడుగాని పేకాడడానికిగాని, వినోదకార్యక్రమానికిగాని రాలేదు. సరాసరి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

రాత్రి తొమ్మిదిగంటలకి ఎవరో యిద్దరు మనుషులు రామనాథం గదిలోంచి రావడం చూశాడు మేనేజరు. వాళ్ళని కలుసుకుని, తనగదిలోకి తీసుకువెళ్ళి, పానీయాలు యిప్పించి, ఏం పని మీద వచ్చారని అడిగాడు. వాళ్ళు రామనాథం దగ్గర 12 వేలకు కారు కొనుక్కున్నామని చెప్పి రసీదు చూపించారు. కారు తీసుకుపోతామని చెప్పేరు. తరవాత కారు తీసుకుపోయారు కూడాను.

మేనేజరుకిదంతా ఏమిటో అంతు చిక్కడంలేదు. రామనాథం నిన్ననే కారుకొని యివాళ మూడువేలు నష్టాని కమ్మేశాడు. డేవిడ్ చెప్పింది నిజమై వుండవచ్చును. అసలు మొదటినుంచీ యీ మనిషి వ్యవహారం విచిత్రంగానే వుంది ఈ రోజుల్లో ఎవడు పెద్దమనిషో, ఎవడు మోసగాడో తెలుసుకోవడం చాల కష్టం. హోటల్ మేనేజరయిన తరవాత

యిటువంటి చిక్కుసమస్యలను ఎదుర్కో వఁసి వస్తుంది మరి. రకరకాల మనుషులు వచ్చి దిగుతారుగదా. సరే రేపు చూసుకోవచ్చు ననుకున్నాడు మేనేజరు.

మర్నాడు ఉదయం రామనాథం మేనేజరుదగ్గరికొచ్చి హోటలు బిల్లు చెల్లించి, పదిగంటలకి విమానంలో బొంబాయి వెళ్ళిపోతున్నానని చెప్పేడు. ప్రయాణానికి సన్నాహం చేయడం మొదలెటేడు.

మేనేజరుకి తన అనుమానం రూఢి అయింది. లేకపోతే హటాత్తుగా యీ ప్రయాణ మేమిటి? తను చేసిన పని నలుగురికీ తెలిసి పట్టుబడేలోగా ఊళ్లోంచి దాటేస్తున్నాడు.

మేనేజరు వెంటనే మోటారుకారు కంపెనీకి టెలిఫోనుచేసి రామనాథం యిచ్చిన చెక్కు మారిందా లేదా అని అడిగాడు. జరిగిన సంగతంతా చెప్పి, అతను పదిగంటలకి వెళ్ళిపోతున్నాడని చెప్పేడు.

కార్ల కంపెనీవాళ్ళు వెంటనే పోలీసు స్టేషన్‌కు వెళ్ళి జరిగిన కథంతా చెప్పేరు. రామనాథం యిచ్చిన చెక్కును గురించి బ్యాంకులో దర్యాప్తు చేశారు. రామనాథానికి బ్యాంకులో ఎకౌంటు వుందో లేదో తెలుసుకోడానికి బొంబాయికి రాశామని, దాని బ్రాంచీ ఢిల్లీలో లేదనీ, టెలిగ్రాం యిచ్చినా జవాబు రావడానికి ఒకరోజు పట్టవచ్చునని బ్యాంకువాళ్ళు చెప్పేరు.

అయితే చూస్తూ చూస్తూ మనిషిని విడిచిపెడితే ఎలాగ? అసలు వ్యవహార మంతా చూస్తూవుంటే వీడు మోసగాడి లాగే కనిపిస్తున్నాడాయెను. కార్లకంపెనీ వాడు రామనాథాన్ని అరెస్టుచెయ్యాలని పట్టుబట్టేడు.

మొత్తంమీద రామనాథాన్ని పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్ళడం, ప్రశ్నించడం జరిగింది. ఆ రోజంతా అతన్ని పోలీసు స్టేషన్‌లోనే వుంచారు.

మర్నాడు బ్యాంకునుండి వర్తమానం వచ్చింది. రామనాథానికి బొంబాయిలో ఒక బ్యాంకులో 65 వేలరూపాయలున్నాయట. చెక్కు సరియైనదేననీ, దానిని మోటారుకార్లకంపెనీ ఎకౌంటుకు జమ కడుతున్నామనీ బ్యాంకువాళ్ళు చెప్పేరు

రామనాథం దర్జాగా మళ్ళీ హోటల్‌కి వచ్చి మకాం పెట్టేడు. మేనేజరు జరిగిన దానికి మనసులో పశ్చాత్తాపపడ్డాడు.

అయితే రామనాథం యిక్కడితో వూరుకుంటే రామనాథ మెలా అవుతాడు. అతను వెంటనే ప్లీడర్ని పిలిచి, తన పరువునష్టానికి, ప్రయాణం ఆగిపోయినందుకు వ్యాపారం నష్టమయిందనీ మోటారు కంపెనీమీద 50 వేలకు దావా వేసి గెలుచుకున్నాడు.




(గత సంచిక తరువాయి)

"చింతపడకండమ్మగారూ. మీకేం భయంలేదు. అన్నీ నేనిస్తానుగా! ఇదుగో ఈ తాయత్తు వుంది చూశారా? ఎంతో నిష్టగా కొండదేవత పూజచేసి ఆ పూజ దగ్గర పెట్టి మంత్రాలతో తయారుచేసిందండమ్మగారూ! ఇదిగో విభూతి–రోజూ పడుకునే ముందు ధరించమనండి. ఉదయమే ఓ చిటికెడు విభూది గ్లాసుడు నీళ్ళతో త్రాగితే మంచిది. ఈ తాయెత్తు మంగళసూత్రాల గొలుసుకు కట్టండి. అమ్మాయిగారు ఎప్పుడూ దానిని మెడలోంచి తీయకూడదు. అప్పుడప్పుడూ సాంబ్రాణి పొగవేస్తుంటే మంచిది. అన్ని దోషాలూ తొలగిపోతాయి. ఏడాది తిరిగేసరికి అమ్మాయిగారు పండంటి బిడ్డను ఎత్తుకుంటారు! కొండదేవత పలుకుతావుంది. దుర్గామాయి చెప్పుతావుంది. ఇది సత్తెం!"

'ఇంత విషం కూడా వుంటే ఇవ్వరా సన్యాసీ!' కసిగా అనుకుంది జమున.

"ఎంతివ్వమంటావ్?" రోహిణి ప్రశ్న.

"తమ దయ! ఎంతో శ్రమపడి ఎన్నో మూలికలు ప్రోగుచేసి తయారు చేశానమ్మగారూ. అయినా డబ్బుకేముంది లెండి! మీకు పని జరగాలి!"

"అయ్యో! ఎంతమాట!" యాభై



తుల మాటేమిటి? వా రాయనతో చెప్ప వచ్చుగదా!" అన్నాడు అవజ్ఞవర్మ ఎంతో ఏవగింపు కనబరుస్తూ.

"ఇది చాలా లజ్జాకరమైన పందెం!" అన్నాడు జయసింగ్.

"ఈ పందెం సంగతి ంవులకు తెలిస్తే, మీ ఇద్దరికీ దేశ బః తప్పదు," అన్నాడు ధర్మపాణి.

"ఇందులో లజ్జపడవలసిందీ, సిగ్గు పడవలసిందీ ఏమీలేదు. జూదం శాస్త్ర సమ్మతం. కుక్కవెంబడే తోకలాగా, జూదంతోపాటే పందెం వుంటుంది. కనుక, అదీ శాస్త్ర సమ్మతమే నన్న మాట. పంచమవేదాన్ని మనకు ప్రసాదించింది పందెంకాదా? పైగా..."

"అంతటితో ఆపు, ఓబలా!" అంటూ అగ్నిపాలుడు, ఓబలరాజుకేసి కన్నెర్రచేశాడు. ఓబలరాజు మాట మధ్యలోనే ఆగిపోయాడు. తరవాత అగ్నిపాలుడు, అవజ్ఞవర్మకేసి తిరిగి, "సరే, పందెం నిశ్చయమయింది! దానికి సంబంధించిన నియమ నిబంధనలు రాసుకుందామా?" అన్నాడు.

"ఓ, నిరాక్షేపణగా!" అంటూ అవజ్ఞవర్మ చిరునవ్వు నవ్వాడు.

ఆ వెంటనే నౌకరొకడు కలమూ, కాయితాలూ తెచ్చి అక్కడ పెట్టాడు. ఓబలరాజు క్షణాలమీద, ఆ పందెం సంగతీ, అందులో ఒడ్డిన ఆస్తిపాస్తుల సంగతీ రాసి; అగ్నిపాలుడూ, అవజ్ఞవర్మా చేవ్రాళ్ళు చేసినతరవాత, ఆ కాయితాలను పరస్పరమూ మార్పిడిచేసి, ఒకటి అవజ్ఞవర్మకూ, రెండవదాన్ని అగ్నిపాలుడికీ యిచ్చాడు.

(సశేషం)




ద్వివేదుల విశాలాక్షి

# బొమ్మల చొక్కా

బట్టల కొట్టుముందు నిలబడి దండేనికి వేలకట్టిన ఆ పంచరంగుల బొమ్మల చొక్కావంక అదేపనిగా చూస్తున్నాడు వెంకడు. కన్నార్పకుండా చూస్తున్నాడు. కదలికే లేకుండా చూస్తున్నాడు. తన్మయత్వంతో చూస్తున్నాడు – తల మునకలైన ఆనందంతో చూస్తున్నాడు.

ఆ రోజు కొత్తగా దాన్ని వాడు చూడ్డంలేదు. ఆరునెలల పొద్దయి చూస్తున్నాడు. ఉదయం, సాయంకాలం ఆ కొట్టుముందు నిలబడి దాన్ని అరగంటపాటైనా చూసి ఆనందించడం వాడి దినచర్యలో భాగమై కూర్చుంది. సూరిగాడి ఒంటిమీద అటువంటి పంచరంగుల బొమ్మల చొక్కా మొదటిసారిగా చూసిననాడే వాడి మనసు దానికి వశమయింది. రోజువెనుక రోజుగా దాన్ని చూస్తున్నకొద్దీ అది వాడి ప్రాణమై కూర్చుంది. దానిని ఏదోవిధంగా పొందడమే వాడి జీవిత ధ్యేయమై కూర్చుంది.

ఓ రోజు పనికుర్రాడు కొట్టు తుడిచి బట్టలు పైన పెడ్తుంటే, వాడికి పది పైసలు లంచంపెట్టి ఆ చొక్కా నోసారి ముట్టుకు చూసేడు. ఆ స్పర్శకి వాడి ఒళ్లు ఆనందంతో పులకరించింది. వాడి మనసు విమానమెక్కి ఏడేడు లోకాలు తిరిగి వచ్చింది. కడుపు పగిలేటట్లు పది రకాల పిండివంటలతో భోజనంచేసి

నంత తృప్తి కలిగింది. వేసవికాలంలో పైన పంకా తిరుగుతుండగా, మెత్తని పరుపుమీద బాగా పొద్దెక్కేవరకు మత్తుగా, బద్ధకంగా నిద్రపోయినట్టి సుఖం కలిగింది.

అది అమ్ముడుపోక రెండేళ్లుగా మూల పడిఉన్న పాతసరుకులో భాగం. ఆ రంగుల నిగనిగ, బొమ్మల ఆకర్షణ ఆ కొట్టులో వేలాడుతున్నంతవరకే. నీటిలో పెట్టగానే కరిగిపోయే కచ్చా రంగులు అవి. ఒక్క ఉతుకులోనే జాడలు తేలిపోయే నాసిరకం బట్ట అది.

కాని, ఈ విషయాలేం వెంకడికి పట్ట లేదు. ఆ చొక్కామీదఉన్న ప్రతి బొమ్మా వాడిని రారమ్మని పిలుస్తోంది – తనని చేకొమ్మని ఆహ్వానిస్తోంది. ఆలసిస్తే చేయిదాటిపోతాను. ఆ వెనుక విచారించి లాభంలేదని హెచ్చరిస్తోంది. దాన్ని చూసిన మొదటిరోజే వాడో నిశ్చయానికి వచ్చాడు. ఎలాగైనా దాన్ని తను పొందా లని – అది తనది కావాలని.

ఆ కోర్కె రాత్రీ పగలు నీడలా వెంటాడి వేధిస్తోంది. ఊపిరి సలపనీ కుండా ఉడకపెడ్తోంది. ఆ ఆలోచనే వాడి ఊపిరై కూర్చుంది – వాడి హృదయ చలనమై కూర్చుంది. తీరని ఆ కోరిక నోటికి తిండి హితవు లేకుండాచేసింది – కళ్ళమీదకి నిద్ర రాకుండా చేసింది.

ఆ చొక్కా అసలు ఖరీదు పదిహేను రూపాయలు – ఎంతకీ అమ్ముడుపోక మిగిలిపోతే కొట్టువాడు రెండుసార్లు దాని ధర తగ్గించి చీటి కట్టాడు. ఆరునెలల నాడు సూరిగాడు దానిని పదిరూపాయలకి కొన్నాడు. ఆ విషయం బట్టలకొట్లో పనిచేస్తున్న కుర్రాడిని అడిగి సరియైన సమాచారమే అని నికరం చేసుకొన్నాడు వెంకడు.

కాని... పదిరూపాయలు... పది రూపాయలు అంటే మాటలా ? వాడికి పదిరూపాయలు ఖర్చుచేసి ఎవరు కొని పెడ్తారు బొమ్మల చొక్కా ? తల్లిని అడి గితే "కడుపుకి బుక్కెడు గెంజినీళ్ళు కానక సత్తూంటే నీకు బొమ్మల సొక్కా తక్కువయిందిరా గొల్లిగాడా ?" అని తిట్టిపోస్తుంది. తండ్రి సంగతి సరేసరి. చుట్టముక్కలకి వాడి జేబులోనే అయిదూ, పదీ పైసలు కాజేస్తుంటాడు. సూరిగాడిలా వాడికి ఇంటికొచ్చి డబ్బులు చేతబెట్టి పోయే అక్కా, బావా లేరు. ఆ బొమ్మల చొక్కా కొనుక్కోవాలంటే ఏదో విధాన వాడే డబ్బులు కూడబెట్టుకోవాలి – తనం తట తను స్వయంగా వాడే కొను క్కోవాలి.

కాని ఎలా పదిరూపాయలు కూడ బెట్టడం అన్నదే అంతుతేలని ప్రశ్న అయి కూర్చుంది. పొద్దుపోయే వేళకి ఎలా గోలాగ సంపాదించి రూపాయి చేతిలో పెట్టకపోతే తల్లి తిండి పెట్టదు. "కాని డబ్బు గడించి తేనేవుకాని కూటికి ముంగల కూకుంటావు. నే నేడనుంచి తెచ్చి

పెట్టేడిరా సచ్చినోడా" అని విరుచుకు పడుంచె. "ఏటి తావింకా ! సూత్తుంటే రోజు రోజుని నీ యవ్వారం ఏటీ బాగో నేదు. నువ్వు సంపాదించుకున్నదంతా ఆడ కచ్చేట్టుకొత్తే ఇంటికాడ కూడెట్ట కొత్త దనుకున్నావ్" అని గదమా ఇస్తాడు తండ్రి.

పూర్వపురోజుల్లో అయితే పోటీగా సూరిగాడు ఒకడు తయారు కాకపూర్వం, రోజుకో రూపాయి గడించడం వెంకడి కేమంత కష్టమైన పనిగా తోచేదికాదు. పార్కు ఉత్తరపు గేటుముందుగా పెట్టె పెట్టుకొని కూర్చుని "బాబూ, పాలిష్ - అమ్మా పాలిష్ - పాలిష్ సార్, బూటు పాలిష్'' అని కేకలుపెట్టి పిలుస్తూ బజార్లు పోయేవారివి, పార్కులోకి షికారు కొచ్చేవారివి ఎన్నో బూట్లు పాలిష్ చేసేవాడు. కరువుకాటకా లింతగా పెర గని ఆ రోజుల్లో తమ బూట్లు నిగనిగ లాడ్డంకోసం పది పైసలు ఖర్చు చెయ్య డానికి మనుష్యులు వెనుకాడేవారుకాదు.

కాలం మారిపోయింది. కలియుగంలో ఆకలికాలం మొదలయింది. మగాడు ఎంత గడించినా ఇంట్లో పెళ్ళాం, పిల్లల తిండితిప్పలకే సరిపెట్టలేక సతమత మవు తున్నాడు. ఇంక నిగనిగలాడే బూట్లూ, మడత నలగని బట్టలూ - వాటి సంగతే మరచిపోయేడు. ఇటువంటి పైసల బ్రతు కుల మనుషులుకాక, జేబు నిండుగాఉండే ఆసాములు పాలిష్‌కోసం వెంకడి దగ్గరికి రారు. సూరిగాడి దగ్గరున్నట్లు వాడి దగ్గర మంచి బ్రెష్‌లు - క్రీములు ఉండవు. సూరిగాడంత నేర్పుగా పాలిష్ కూడా చెయ్యలేడు.

పెద్దబజారు వీధిలోంచి సూరిగాడు తన దుకాణం పార్కుగేటు ముందుకు ఎందుకు మార్చేడో వెంకడికి తెలియదు. "ఎందుకేటి నీ కడుపు కొట్టనాడికి" అంటుంది తల్లి. "అలా ఎందుకనాలేస్ - ఆడి బతుకు ఆడు బతుకుతున్నాడు - ఈడిని ఒళ్లొంచి పన్చేసి బతకొద్దన్నా దేటి ? అంతా పాటడేది ఆ తిండికోసమే గంద" అంటాడు తండ్రి.

ఓ రోజు ఉన్నట్టుండి సూరిగాడు జ్వరంతో మంచాన పడ్డాడు. ఆ రోజు తల్లికి అలవాటుగా ఇచ్చే రూపాయిపోగా మరో పాతిక పైసలు ఎక్కువే గడించ గలిగాడు వెంకడు.

"బగమంతుడా ఆడిని మరి కొన్నాళ్ళ పాటు జొరంతో అలానే మంచాల పడుం డనీ" అని మనసులో దేవుడికి వెయ్యి దండాలు పెట్టేడు వెంకడు.

వెంకడి ప్రార్థన భగవంతుడు విన్నాడు - మంజూరు చేసేడు. నెల రోజులకి పైగా వాడి పోటీదారుని ఇల్లు కదలకుండా అడ్డగించేడు.

వెంకడి రేకుపెట్టెలో చిల్లర తల్లి కడుపులో పిల్లలా రోజురోజుకి పెరుగు తోంది. వాడి కళ్ళలో బొమ్మల చొక్కా-

రంగులు రకరకాల రూపాల్లో ప్రతి ఫలిస్తున్నాయి.

రోజూ ఉదయం లేస్తూనే తమ గుడిసెకి కాస్త దూరంలోఉన్న మర్రిచెట్టు దగ్గరికిపోయి రహస్యంగా తన దగ్గర కూడబడ్డ డబ్బులు ఎన్ని ఉన్నాయో లెక్కచూసుకోడం ఇటీవల కాలంలో వాడికో అలవాటైపోయింది. ఆ రోజు అలా లెక్కపెట్టుకొంటుంటే పొరుగింటి ఎల్లమ్మ చెమ్మట్టుకుపోయి తిరిగివస్తూ వాడిని చూసింది. "ఏట్రా ఎంకా, పెల్లం కోసవేనేటి సొమ్ము కూడెడ్తున్నావు?" అంది పరిహాసంగా.

వెంకడికి ఇంకా పెళ్ళివయసు రాలేదు - పెళ్లాం కావాలన్న కోరికా పుట్టలేదు. కాని, ఆరునెలలుగా వాడి మనసులో తిష్ఠవేసిందో స్వప్నసుందరి. దాన్ని పొందడానికి ఇంకా ఎంత సంపాదించాలో — ఎంతకాలం వేచిఉండాలో అంచనా వేసుకొంటున్నాడు.

"ఏటీనేదే పిన్నమ్మా, సవితిపండక్కి సొక్కా కొందావని —" అన్నాడు సంశయంగా ఆమెవైపు చూస్తూ. ఆమె తన డబ్బులు చూసింది. తల్లితోకాని ఆ విషయం చెప్పేస్తుందేమోని కంగారుగా వాటిని రేకడొక్కులో నింపుకొని బజారువైపు బైలుదేరేడు.

అన్నిరోజుల వాడి నిరీక్షణ ఆ రోజుతో ముగింపుకి రానుంది. అప్పటికే వాడిదగ్గర తొమ్మిది రూపాయల సొమ్ము కూడబడింది. పదిరూపాయలకి ఇంక ఒక్కటంటే ఒక్కటే రూపాయి తక్కువ. ఆ రోజు తప్పకుండా ఆ రూపాయి గడిస్తాడు. ఆ బొమ్మల చొక్కా తనది చేసుకొంటాడు. కాని, చవితి పండుగదాకా దానిని తల్లికి చూపడు. ఆ రోజు నీళ్లు పోసుకొని పుట్టకి పోయేముందు అప్పుడు తీసి తొడుక్కొంటాడు.

"కొత్త సొక్కా ఎక్కడిదిరా గొల్లిగా" అంటుంది తల్లి ఆశ్చర్యంగా.

అప్పుడు సెప్తాడు ఆరునెల్లుగా ఆ చొక్కా కొనుక్కోడంకోసం తను డబ్బులు కూడపెట్టిన సంగతి. నోరు కట్టుకొని ప్రతి పైసా దాసుకొన్న విషయం.

"ఒలే సిట్టీ, నీ చిట్టిడు గట్టోడేనే, వుప్పుడే ఇంతత పానువేస్తన్నాడు. ఇంకా పెద్దోడైతే ఇంకెత బుద్ధులు నేరుస్తడో?" అంటాడు తండ్రి మెచ్చికోలుగా.

ఆలోచనలమధ్య దూరం కరిగిపోతోంది. అలవాటుపడ్డ వెంకడి కాళ్లు వాడిని బట్టలకొట్టువైపు నడిపించేయి. అల్లంతదూరంలో కన్పిస్తోంది వాడి ప్రాణానికి ప్రాణమైన బట్టలకొట్టు. ఆత్రంగా అటు ఇటు వెతుకులాడేయి వాడి కళ్ళు.

ఉండవలసినచోట్లో బొమ్మలచొక్కా లేదు. వాడి స్వప్నం కరిగిపోయింది.

వాడి స్వర్గం కూలిపోయింది. వాడి గుండెపగిలి ముక్కలయింది. వాడి నోట తడారిపోయింది. ఇంక వాడు దేనికోసం ఎదురుచూడాలి? ఏది పొందడానికి తపనపడాలి? అటువంటి పంచరంగుల బొమ్మలచొక్కా అదొక్కటే మిగిలి ఉందని కొట్టువాడు ఆ రోజే చెప్పేడు. "కావాలనుకొంటే మీ అమ్మనడిగి సొమ్ము తెచ్చి వెంటనే కొనుక్కుపో — లేకుంటే ఇంకెవరికైనా అమ్ముడు పోవచ్చు," అని సలహా చెప్పేడు.

కాని, వాడి మనసెరిగిన ఆ బొమ్మల చొక్కా ఆరునెలలపాటు వాడికోసం వేచిఉంది. ఏదోరోజున వాడి చేతుల్లో వాలగలనన్న నమ్మకంతో అంతకాలం ఎదురుచూసింది. కాని, ఆ రోజు... దాన్ని తనదానిగా చేసుకోడానికి వాడు అర్హత సంపాదించుకొన్న ఆ రోజు అది వాడిని మోసంచేసింది. చెప్పా చెయ్యాకుండా మాయమైపోయింది. ఇంకెవరికో స్వంతమైపోయింది.

తనని అంతలా ఆకర్షించి, కవ్వించి, బెల్లించి తనచుట్టూ నెలల తరబడి తిప్పుకొన్న ఆ బొమ్మలచొక్కా అకారణంగా తనని అలా మోసంచేసి ఎవరివెంటో వెళ్ళిపోయి ఉంటుందన్న ఆలోచనని వాడి మనసు సమర్థించలేకపోయింది. భ్రాంతి తీరక అలా కొట్టువైపు చూస్తూ బొమ్మలా నిలబడిపోయేడు.

నీళ్ళ నిండిన వాడి కళ్ళపై అంతలో ఓ వింత వెలుగు పడింది. అది క్షణాలమీద పంచరంగుల హరివిల్లుగా మారింది ఆ బొమ్మల చొక్కా అమ్ముడుపోలేదు. ముందుండే చోటు మార్చుకొంది — అంతే. ఈ పక్కనుండి ఆ పక్కకివెళ్ళి వెంకడి రాకకోసం ఎదురుచూస్తోంది. 'ఇదిగో నేను ఇక్కడ ఉన్నాను' అంటూ గాలికి ఇటు అటు ఊగులాడుతోంది.

ఉత్సాహంగా అడుగులువేస్తూ ముందుకు నడిచేడు. వెంకడు. అది అలా చోటు మార్చుకొని తనని కంగారుపెట్ట డానికి కారణం ఏమిటో వాడికి తెలియ వచ్చింది. అంతకు పూర్వం అక్కడ పనిచేసే నౌకరు కుర్రాడు సెలవుమీద ఇంటికి వెళ్లాడు. కొత్తగా వచ్చినవాడికి దాని స్థలం ఏదో సరిగ్గా తెలియక అటు తగిలించేడు.

వాడు కిటికీలు, గుమ్మాలు గుడ్డతో దులుపుతుంటే వాడి చెయ్యితగిలి అది నేలపడ్డం, అలా పడ్డంలో దానికి కట్టి ఉన్న వెల చీటి ఊడిపోయింది. వాడు దాన్ని తీసి మెడదగ్గర అ్పలితో తిరిగి గుచ్చి పెట్టేడు.

ఆ చొక్కా అలా నేలపడితే ఉన్న పాటున తను నేలపడి, తలబొప్పి కట్టి నంతగా బాధకలిగింది వెంకడికి. వాడు అలా గుండుసూదికి చీటి గుచ్చిపెడ్తుంటే, ఎవరో తనపీక ముడిదగ్గర లోతుగా గుచ్చినట్టు గిలగిల్లాడిపోయేడు వాడు.

"నెమ్మదిగెట్టు. సొక్కా సిరిగి

పోతాది." అన్నాడు మనసులోఉన్న బాధ ఆపుకోలేక. మొలకో గోచి, చిరుగుల చొక్కా – వెంకడివంక వింతగా చూసేడు నౌకరు కుర్రాడు.

"ఏట్రా, అధికారిలా ఆర్డరు సేత్తున్నావు? ఇది నీ అబ్బగాడి సాపేటి?" అన్నాడు దబాయిస్తూ.

"సాపు నా అబ్బది కాదుకాని, ఆ సొక్కా నాది," అన్నాడు వెంకడు తడుముకోకుండా.

"ఏటేటి... ఈ సొక్కా నీదా? ఎప్పుడు కొన్నావేటి?" అన్నాడు వాడు వేళాకోళంగా నవ్వుతూ.

వాడి నవ్వు వెంకడి గుండెలో మంటలు రేపింది. కాని దాన్ని పైకి రానీయలేదు. మరో రూపాయి సంపాదించుకొచ్చి దాన్ని కొనుక్కుపోతున్నప్పుడు అప్పుడు చెప్పవచ్చు వాడి ప్రశ్నకు జవాబు అనుకొన్నాడు.

"దీని ఎలెంతో నీకు తెలుసా?" అన్నాడు వాడు. దానికి కట్టిన చీటీ చూస్తూ, "పన్నెండు రూపాయలు," అన్నాడు మళ్ళీ వాడే

"ఏటీ... ఏటీ... పన్నెండా... ముంగల పదే కదా?" అన్నాడు వెంకడు దిగులుగా.

"పెరిగిపోనాది. అన్నోస్తువులు పిరం కావడంలే... ఇదీ అంతే. అది సరే... మరి నీకాడ పదిరూపాయలు మాత్రం ఉన్నాయేటి. కొనుక్కుపోనాడికి?" అన్నాడు రెట్టిస్తూ.

"పదినేవు... తొమ్మిదున్నాయి," అన్నాడు వెంకడు నిరానగా.

"నిజం?"

"నమ్మిక నేకపోతే సూడు." వెంకడు తన రేకు డొక్కులోఉన్న డబ్బులు చూపించేడు.

"అబ్బో సానకూడ బెట్టినవే" అన్నాడు ఆశ్చర్యంగా.

"కాని ఏటి నాబం. నానా సొక్కా ఎల పదే అనుకొంటన్న – నువ్వేమో పన్నెండంటువి." సవితి పండుక్కి కొనుక్కోవాలనుకున్న వెంకడి గొంతుకలో దుఃఖం గురగురలాడింది.

"అయితే ఓ పనిసెయ్యి. సందడే ఏలకి ఆ రూపాయి కలిపి పదీ పట్టుకురా. మా అయ్యగారితో సెప్పి నీకు పదికే ఆ సొక్కా ఇప్పిత్త."

"నిబద్దిగా?" అన్నాడు వెంకడు ఉత్సాహంగా. ఆ చొక్కా ధర మరో రూపాయి తరిగి అప్పుడు తొమ్మిదే అనీ, తన దగ్గర ఓ రూపాయి కమీషన్ కొట్టడానికే ఆ నౌకరు కుర్రాడు ఆ నాటకం ఆడేడనీ వాడికి తెలియదు.

"నిబద్దిగా" చేతిలో చెయ్యి వేసేడు వాడు.

సందేలదాకా ఎందుకు మద్దినాలకే పదిరూపాయలట్టుకురానా – అని ఉత్సా

హ౦గా మనసులో అనుకొ౦టూ ముందుకు సాగిపోయేడు వె౦కడు.

ఆ రోజు ఆదివారం. ఆఫీసులు, షాపులు మూతపడి ఉ౦డేరోజు. సాయం కాల౦దాకా బేరాలు లేవు. గ౦టగ౦ట గడుస్తున్నకొద్దీ వె౦కడి మనసులో ఉదయం పొ౦గులువారిన ఉత్సాహం చల్లబడిపోసాగి౦ది. కళ్ళలో దిగులు పేరుకుపోయి౦ది.

"అయ్యా పాలిస్ - పాలిస్ సార్ బూటుపాలిస్," అని నోరు ముయ్యకు౦డా అ౦దర్నీ పిలుస్తున్నాడేకాని ఎవరూ వాడి గోడు వినిపి౦చుకోడ౦లేదు. ఉదయం నుండి ఒక్క పైసా అయినా పెరగని తన డబ్బుని మాటిమాటికి లెక్కపెట్టుకొ౦టూ వాలిపోతున్న పొద్దువ౦క చూస్తూ కొట్టుమిట్టాడిపోతున్నాడు వాడు.

ఆ సమయ౦లో వచ్చేరు ఎవరో ఇద్దరు కుర్రాళ్లు. పే౦ట్లు, షర్టులు కాలేజీ విద్యార్థుల్లా ఉన్నారు. ''పాలిస్ సార్... పాలిస్... బూటు పాలిస్" అన్నాడు వె౦కడు వారివ౦క చూస్తూ.

"ఏం తీసుకు౦టావు" అన్నాడు ఆ ఇద్దరిలో పొట్టిగా ఉన్నవాడు.

"పావలా బాబూ'' అన్నాడు వె౦కడు ఉత్సాహ౦గా పాలిష్ డబ్బా మూత తీస్తూ.

"ఇదే౦ బొ౦బాయి, ఢిల్లీ అనుకొ౦టున్నావే౦ట్రా - పదిపైస లిస్తాను."

"కిట్టదు బాబూ, అస్లే పిరవై పోనా౦ు."

"సరే... పదిహేనుపైసలు తీసుకో."

"నాను జాస్తి చెప్పడం నేదుబాబూ! ఏరినేనా అడిగి సూడ౦డి. వుప్పుడు రేట౦తే."

"సరే...నువ్వన్న౦తా ఇస్తాను. కాని బాగా చెయ్యాలి"

"అద్ద౦లా సేత్తా బాబూ," అ౦టూ పనికి ఉపక్రమి౦చేడు వె౦కడు.

వె౦కడు పాలిష్ చెయ్యకపూర్వం ఆ జోళ్ళు నిగనిగ మెరుస్తున్నాయి. వాడు తన దగ్గిరున్న చవక మచ్చుర౦గు పులిమి, పుల్లబూడిన ఆ పాత బ్రెష్‌తో పాలిష్ చేసేసరికి అవి మకమరలాడుతూ ఏనాడూ పాలిష్ ముఖం ఎరగని జోళ్ళలా తయారయేయి అయినా ఆ విషయం ఏమీ ఆ కుర్రాళ్ళు పట్టి౦చుకొన్నట్లులేదు.

"అయిపోనాది బాబూ" అని వె౦కడు అనగానే జేబులో చెయ్యిపెడ్తూ, "చిల్లరు౦దిరా" అన్నాడు పొట్టివాడు.

"ఎ౦తకి బాబూ" అన్నాడు వె౦కడు తన రేకుపెట్టి పైకితీస్తూ.

"పదిరూపాయల నోటుకి."

"నేదు బాబూ... అ౦త నేదు" అన్నాడు వె౦కడు తన డబ్బులువ౦క చూస్తూ.

"లేకపోద మేమిట్రా... అ౦త



సౌమ్ము దగ్గిరుంచుకొని ?" రెండో కుఱ్రాడు రెట్టించేడు.

"అయి తొమ్మిది రూపాయలే బాబూ! నా కెరికే... వుప్పుడే లెక్కెట్టినా ?"

"మరోసారి సరిగ్గా చూడ్డా... మరో ముప్పావలా ఉండకపోదు."

"నిబద్దిగా అయి తొమ్మిది రూపాయలే బాబూ! నాకాడే పదిరూపాయ లుంటే బొమ్మల సొక్కా కొనిరానా" అన్నాడు వాడు సగం ఉత్సాహం – సగం నిరాశా మిశ్రితమైన స్వరంతో. వాళ్లు అడక్కపోయినా వెంకడు ఆ బొమ్మల చొక్కా కథంతా వాళ్ళకి చెప్పేడు. పదిరూపాయల చొక్కా ఉన్న పాటున పన్నెండు రూపాయలు అయి పోయిన వైనం – ఆ కొట్లో పనిచేసే కుఱ్రాడు, తన యజమానితో చెప్పి దాన్ని తనకి పదిరూపాయలకే ఇప్పిస్తా నన్న సంగతి – అన్నీ చెప్పేడు. ఆ సంగతులన్నీ అలా చెప్పుకుపోతుంటే వాడి దృష్టి ఎదుటఉన్న మనుషులమీద లేదు. ఎక్కడో షాపులో వేలాడుతున్న ఆరంగులచొక్కామీద ఉంది. పన్నెండు రూపాయలదాన్ని తనకి పది రూపాయ లకే ఇప్పిస్తానన్న నౌకరు కుఱ్రాడిమీద ఉంది.

"ఇంద తీసుకో," అంటూ పదిరూపా యలనోటు తన చేతిలో వాళ్లు పెడ్తుంటే తిరిగి ఈలోకంలోకి వచ్చేడు. "నిబద్దిగా సెప్తున్నా బాబూ – నాకాడ అంత సౌమ్ము నేదు — తవరే ఎక్కడోకాడ మారి సిప్పించండి" అన్నాడు.

"మరేం ఫరవాలేదులే – నీ దగ్గర ఉన్నంతే ఇయ్యి. ఇప్పుడు ఈ నోటు పట్టుకొని చిల్లరకోసం బజారంతా తిరిగే ఓపిక మాకులేదు" అన్నాడు పొట్టివాడు.

తన చెవుల్నే తాను నమ్మలేనట్లు వాళ్ళవంక ఆశ్చర్యంగా చూసేడు వెంకడు.

"నిజంగానే చెప్తున్నారా... తీసుకో.

ఆ బొమ్మల చొక్కా ఏదో కొనుక్కొని మా పేరు చెప్పుకొని తొడుక్కో" అన్నాడు రెండోవాడు.

''లెక్కెట్టుకోండి సార్" అన్నాడు వెంకడు తన రేకుడబ్బాలో చిల్లర అంతా అక్కడ వారు పరచిన జేబురుమాలులో పోస్తూ.

"నువ్వు లెక్కపెట్టినవే కదా? సరిగ్గానే ఉంటాయిరా. మనిషిమీద మనిషికి ఆపాటి నమ్మకం లేకపోతే ఈ లోకంలో బ్రతకడం కష్టం," అన్నాడు పొట్టివాడు ఆ డబ్బు లెక్కపెట్టకుండానే మూట కట్టుకొని, పేంటు జేబులో దోపుకొంటూ.

అప్పుడే ప్రసవించిన ప్రియాతి ప్రియమైన తన బిడ్డని తల్లి ఆప్యాయంగా చూసుకొన్నట్లు తన చేతిలో ఉన్న ఆ సరికొత్త పదిరూపాయల నోటు వంక ఉత్సాహంగా చూసేడు వెంకడు. అంతకు పూర్వం ఒకటి రెండుసార్లు తనకి డబ్బులు ఇవ్వడానికి బాబులు తమ పర్సులు తీస్తున్నప్పుడు వాటిలోంచి తొంగిచూసే పదిరూపాయలనోట్లని వాడు చూడకపోలేదు. కాని అంతవరకు జీవితంలో ఎప్పుడూ చేతితో తాకి చూడలేదు. తను పదిరూపాయలనోటుకి అధికారి అవుతాడన్నది వాడు కలలోకూడా ఊహించలేని విషయం.

చేతిలో రెపరెపలాడుతున్న నోటు మనసుని తొందరపెట్టింది. ఇంకా కొద్దిగా పొద్దున్నా ఇంక అక్కడ బేరాల కోసం ఎదురుచూస్తూ వాడికి కూర్చోవాలనిపించలేదు వెంటనే వెళ్ళి ఆ బొమ్మల చొక్కా తనది చేసుకోవాలనిపించింది. ఆ రాత్రికి డబ్బులు ఇవ్వలేదని తల్లి తిండి పెట్టకపోయినా – చొక్కా కొనుక్కొన్న తృప్తితో తను హాయిగా నిద్ర పోగలననుకొన్నాడు – తండ్రి కొట్టే దెబ్బల్ని ఏడవకుండా తట్టుకోగల ననుకొన్నాడు.

వాడు తన పెట్టె సర్దుకు లేవబోతుంటే అంతవరకు ఆ చుట్టుపక్కలే తిరుగుతున్న కల్లీలాల్చీ ఆసామీ ఒకడు "ముందుకివచ్చి ''పాలిష్ చెయ్యరా" అన్నాడు, అక్కడఉన్న రాతిబెంచీమీద కూర్చుంటూ.

"నా నింటికి పోతున్నా బాబూ" అన్నాడు వెంకడు వినయంగా.

"ఏందిరా... కొవ్వెక్కిందేంది లేక డబ్బు చేదయిందా? పాలిష్ చెయ్యరా – అంటే ఇంటికి పోతన్నానంటున్నావు" అన్నాడు గదమాయిస్తూ

"అదికాదు బాబూ..."

"ఏదికాదురా... పాలిష్‌చేసి పావలా పుచ్చుకోరా అంటే మహ నీలిగిపోతున్నావు" రెట్టించేడు కల్లీలాల్చీ.

ఇంక తప్పదన్నట్లు సర్దుకొన్న వస్తువులన్నీ మళ్ళీ పైకితీసి అతడి జోళ్లకి పాలిష్ చేసేడు వెంకడు. పోన్లే ఇదీ ఒకందుకు మంచిదే – ఆ డబ్బులుపెట్టి ఏ శెనక్కాయలో కొనుక్కొని తినిపోతే

రాత్రికి తిండిలేకపోయినా ఫరవాఉండదు అనుకొన్నాడు.

వాడి పని పూర్తికాగానే పాతికపైసల నాణెం వాడి చేతిలో పడేసి, గబగబా అక్కడినుండి వెళ్ళిపోయేడు ఆ ఆసామి. అతడు అలా వెళ్ళిపోయేక వెంకడు తన సామాన్లని పెట్టెలో సర్దుకొని లేవబో తుంటే ఎదురుగాఉన్న రాతి బెంచీమీద నల్లరంగు ప్లాస్టిక్ పర్సు ఒకటి కన్పిం చింది. పాపభీతిగల వెంకడు గుప్‌చుప్‌గా ఆ పర్సుని తన పెట్టెలో వేసుకొని వుడా యించలేకపోయేడు. ఆ కల్లీలాల్చీ వ్యక్తి కోసం చూస్తూ అతడు వెళ్ళినవైపు నడక సాగించేడు. అట్టే దూరం పోకుం డానే అతడిని అందుకోగలిగేడు. "సార్... సార్... ఇది మీదేనేంటి?" అన్నాడు పర్సు సూపుతూ.

"నాదేరా... ఎక్కడ దొరికిం దేమిటి?" అన్నాడు అతడు దానిని అందుకొంటూ.

"మీరు కూకున్నసోట పడుంది," అన్నాడు వెంకడు.

"జేబులోంచి జారిపోయి ఉంటుంది. మంచివాడివిరా వెతుక్కొంటూ తెచ్చి యిచ్చావు. ఇంద ఈ పావలా తీసుకో" అని పర్సులోంచి చిల్లర డబ్బులు తియ్య బోయేడు.

వెంకడు "సార్ సార్'' అని పిలుసు కొంటూ వచ్చి పర్సు అందివ్వడం చుట్టు పక్కల మనుషులు చూసేరు. ఏమి టేమిటి? అంటూ ముందుకొచ్చేరు. జరిగిన విషయం తెలుసుకొని, "వీడెవడో ఉత్త అమాయకుడిలా ఉన్నాడు. లేక పోతే ఈ రోజుల్లో చేతబడ్డ సొమ్ము తిరిగిఇచ్చే నీతిమంతు డెవడున్నాడు?" అన్నారు కొందరు వెంకడిని చూస్తూ.

చిల్లర డబ్బులకోసం పర్సులో చెయ్యి పెట్టిన ఆసామి అంతలోనే వెంకడి జుట్టు పట్టుకొంటూ "ఇందులో పదిరూపాయల నోటేదిరా దొంగవెదవా" అన్నాడు.

"నాకు తెల్దుబాబూ - నాను తియ్య నేదు." అన్నాడు వెంకడు బెదురుతూ.

"నువ్వు తియ్యకపోతే ఇందులో ఉండవలసిన నోటు లేకుండా ఎలా పోతుందిరా?"

"ఏమో బాబూ...మా యమ్మతోడు- మా అయ్యతోడు - బగమంతుడి సాచ్చిగా సెప్తున్న... నాను ఏటీ తియ్యనేదు."

"అలా మంచి మాటలతో సొమ్ము బైట పడదండీ! వెధవకి రెండు అంటిస్తే..." ఎవరో సలహా ఇచ్చేరు.

"ఇప్పటి కిప్పుడు ఎక్కడ దాస్తాడు? ఆ పెట్టెలోనో, వాడి జేబులోనో ఉంటుంది. చూస్తే సరి" ఇంకెవరో మాట అందించేరు.

వెతకండంటే... వెతకండంటూ అంతా వెంకడిమీద విరుసుకుపడి అసలే చిరిగిఉన్న వాడి చొక్కాని మరింత పీలికలుగ, పీలికలుగ చేసిపారేసేరు.

"ఇదిగో... ఇదిగో ఇక్కడ ఉంది"

అంటూ వెంకడు తన రేకుపెట్టిలో పది లంగా దాసుకొన్న పదిరూపాయల నోటును పైకి తీసేరు.

''అమ్మ దొంగ వెధవా! అమ్మతోడు-అయ్యతోడు - దేవుడుసాక్షి - అంటూ ఎంతెంత పెద్దమాటలు చెప్పేవురా" అన్నారు మిగిలినవాళ్ళు.

"అది నాది బాబూ నాది'' ఆత్రంగా నోటుని అందుకోబోయేడు వెంకడు.

"అవున్రా నీదే... పాపం చాల కష్ట పడి గడింవేవుకదా?" హేళనగాఅన్నారు ఎవరో.

"నిబద్ధిగా అది నాది బాబూ. ఆరి పర్సునోంచి తీసిందికాదు - నాను పైచకి పైచ నేరిసి కూడపెట్టుకొన్న బాబూ. సవితి పండుక్కి బొమ్మలసొక్కా కొను క్కోవాలని కూడపెట్టి... ఈ బాబు నూత్తనే ఉన్నరు. నాకాడున్న సిల్లరంత తీసుకొని ఆ బాబులు నోటిచ్చిపోడం... నిబద్ధిగ సెప్పండిసార్... మీరు సూడ నేదా? మా పేరు సెప్పుకొని బొమ్మల క్కా కొనుకోరా అని ఆరు అనడం మీ రిననేదా! అది నాది బాబూ నాది... మా యమ్మతోడు - భగమంతుడిసాచ్చిగా చెప్తున్న..." వెంకడు ఏడుస్తున్నాడు, మొత్తుకుంటున్నాడు.

కాని, ఎవరూ వాడి మాటలు విని పించుకోడంలేదు. వాడి ఏడుపు పట్టించు కోడంలేదు. పైపెచ్చు 'తన్నండి దొంగ వెధవని. మళ్ళాఇలాటిపని ఎప్పుడూ చెయ్యకుండా చావకొట్టండి,' అంటూ చేతి కొచ్చినదెబ్బ కొడ్తున్నారు - కాలి కందిన తావు తంతున్నారు. ఆ కల్లీలాల్చి ఆసామి కల్పించుకొని, "ఏదో గుంట వెధవ కక్కుర్తిపడ్డాడు. ఇంక విడిచి పెట్టండి. చచ్చి ఊరుకొంటాడు" అని అడ్డుపడేవరకు ఆ దమనకాండ అలా జరుగుతూనే ఉంది.

అప్పటికే వెంకడి ఒళ్ళు హూనమయింది. కళ్ళు చీకట్లు కమ్మేయి. ప్రాణంపోయిన కట్టెలా నేలమీదికి ఒరిగి పోయేడు.

మంది కదలిపోయింది. పొద్దు వాలి పోయింది. కొద్దిసేపటికిముందు వెంకడి కళ్ళలో మెరసిన పంచరంగుల హరివిల్లు అంతలోనే కరగిపోయింది. పొద్దుగూకే లోపల తనది కాబోతోంది అనుకొన్న బొమ్మలచొక్కా ఆకాశానికి ఎగిరి కూర్చుంది. అందని చందమామ అయి పోయింది.

తనదిఅంటూ వెంకడి పదిరూపాయల నోటు ఎగరేసుకుపోయిన కల్లీలాల్చీ ఆసామీ నిండా అరగంట కాకుండానే అక్కడికి మళ్లా తిరిగి వచ్చేడు. అల్లంత దూరంలో అతడిని చూస్తూనే వెంకడి కళ్లు ఆనందంతో మెరవసాగేయి. బహుశ అతడికి అతడి నోటు దొరికి ఉంటుంది. లేక ఇంకేదానికో ఖర్చుపెట్టి నట్టు గుర్తుకొచ్చి ఉంటుంది. తనది తనకి



తిరిగి ఇవ్వడానికే తిరిగి వస్తున్నాడను కొన్నాడు.

కొన్ని క్షణాల క్రిందట వాడి ఒంట్లో ఇటునుండి అటు కదలడానికి శక్తిలేదు. కాని, ఇప్పుడు పరుగుపెట్టడానికి తగినంత బలం పుట్టుకొచ్చింది. "సార్... సార్" అంటూ అతడివైపు ఆత్రంగా పరుగుతీసేడు.

ఆ కల్లీలాల్చీ ఆసామీ ఒంటరిగా లేడు. అతడి వెంట ఒక పోలీసువాడు ఉన్నాడు 'పోలీసు' అన్నమాట వింటేనే వెంకడికి చచ్చేంత భయం పుట్టుకొస్తుంది. ఇంక ఎదురుగా నిలిచి పోలీసువాడిని చూడ్డం అంటే అది సింహస్వప్నమే. ఉత్సాహంగా ముందుకు పరుగుపెడ్తున్న వాడల్లా సడన్‌బ్రేకుపడ్డ కారులా అక్కడికక్కడే ఆగిపోయేడు. క్షణం వృధా పుచ్చకుండా వెనుదిరిగి పరుగు అందుకొన్నాడు.

"అడిగో... అదిగో... వాడే... వాడే... పారిపోతున్నాడు... పారిపోతున్నాడు... పట్టుకోండి... పట్టుకోండి," అంటూ కేకలు పెట్టేడు అతడు.

ఒక్క పరుగులో ముందుకివచ్చి పోలీసువాడు వెంకడి జబ్బ పట్టుకొన్నాడు. వెంకడి ప్రాణం పైపైకి లేచిపోయింది. కాళ్ళు చేతులు భయంతో గడగడ వడకిపోయేయి. "ఈ నోటు నీదేనా?" పది రూపాయల నోటు వెంకడి కళ్ళముందు ఆడిస్తూ అడిగేడు పోలీసు.

"నాదే సార్... నాదే" అన్నాడు వెంకడు ఉత్సాహంగా.

నోటిలోనిమాట ముగియకముందే

వాడి చెంప చెళ్ళుమంది. కళ్ళముందున్న మనుషులు, బజారు, రోడ్డు అంతా గిర గిర తిరగసాగింది. దెబ్బతగిలినవైపు చెవి గింగురుమంది.

"సార్...సార్" అన్నాడు వెంకడు చేత్తో చెంప తడుముకుంటూ.

"ఇంతున్నావో లేదో...అప్పుడే నీ కిన్ని బుద్ధులా లంజకొడకా ? ఈ నోటు ఎక్కడినుండి తెచ్చేవు ? ఇలాటివి ఇప్ప టికి ఎన్ని మార్చేవు ? చెప్పరా దొంగ లంజాకొడకా !" అంటూ మరో లెంప కాయ తగిలించేడు పోలీసు.

"దారిన నా మానాన నేను పోతుంటే సార్ పదిరూపాయల నోటుకి చిల్ల రుందా ?" అంటూ అడుగుతూ వచ్చి నప్పుడే అనుకొన్నాను. బూటుపాలిష్ చేసే ఈ గుంటవెధవకి ఇంత సొమ్ము ఎక్కడినుండి వచ్చిందా - అని. సర్లే ఎలావస్తే మనకేం - ఎవరో మార్చమని ఇచ్చుండొచ్చు అనుకొని సరిపెట్టు కొన్నాను. జేబులో పర్సుతీసి మూడు రెండు రూపాయలనోట్లు, నాలుగు విడి రూపాయల నోట్లు రెండు ఇచ్చేను. తీరా అవసరంపడి నే మార్చబోయేసరికి అది దొంగనోటని తేలిపోయింది."

ఆ నోటు తనదేనంటూ కథ చెప్పి నప్పుడు విని ఆనందించి, దోషిని శిక్షించడానికి తలో చెయ్యివేసి సాయ పడిన మూక ఇప్పుడు అక్కడలేదు. ఇప్పటి వారికి ఈ కథ నచ్చింది. ఈ రోజుల్లో ఇటువంటి చిన్నగుంటలు ఎన్నెన్ని నేరాలు చేస్తున్నారో ఎంత గుండెలుతీసిన బంటుల్లా ప్రవర్తిస్తున్నారో తాము విన్నవీ, అనుభవంలో ఉన్నవీ ఒకరికొకరు చెప్పుకొన్నారు.

పోలీసువాడిచేత ఎన్ని తన్నులు, దెబ్బలు తిన్నా - దొంగనోట్ల చెలామణి ముఠాలో వాడుకాక ఇంకెవరెవరున్నారో చెప్పలేదు వెంకడు.

"నీ పని ఇక్కడ కాదురా లంజ కొడకా ! స్టేషనుకి పద. ఎట్ల సెప్పవో నేనూ చూస్తాను. నువ్వుకాదురా... నీ తల్లో జేజెమ్మ దిగొచ్చి చెప్తుందిరా" అంటూ వాడి మెడపట్టి గెంటుకుపోయేడు పోలీసు

అంతమందిముందు తన అధికారం చూపుకోడానికే వాడు వెంకడిని అలా తీసుకుపోయేడేకాని, వాడిని స్టేషనులో పెట్టి తన్ని, వాడిచేత దొంగనోట్ల చెలా మణి ముఠాలోఉన్న మిగతా సభ్యుల పేర్లు తెలుసుకొనే అభిప్రాయం అతడికి లేదు. ఆ పెద్దమనిషిదగ్గర మార్చిన పది రూపాయల్లో అంతా కాకపోతే కొంత యినా సొమ్ము ఇంకా వాడిదగ్గర మిగిలి ఉంటుంది. అది కాస్తా జేబులో వేసుకొని వాడిని దయతలచి వదలిపెట్టా లను కొన్నాడు. కాని, వాడి పెట్టితీసి చూస్తే అందులో ఉన్నది పాతికపైసల నాణెం. అదేం దురదృష్టమోకాని తనుపట్టిన ప్రతి కేసూ ఇంతే. తంతే దమ్మిడీ ఉండదు

వెధవలదగ్గిర. దరిద్రగొట్టు వెధవలా – అని చికాకుపడ్తూ ఆ నాణేన్ని జేబులో వేసుకొని, "పోరా వెధవా... పోనీకద సిన్నోడివని ఈ సారికి వదిలిపెడ్తున్నా. ఇంకోసారి ఇటువంటి పనిచేస్తివో కళ్ళు పొడిచి, కాళ్లో పడేస్తా" అని ఓ హెచ్చరికచేసి ముందుకి పోయేడు రక్షక భటుడు.

వెంకడికి ప్రపంచంమీద విరక్తి పుట్టింది. తన బ్రతుకుమీద విరక్తి పుట్టింది. రంగురంగుల బొమ్మలచొక్కా మీద విరక్తి పుట్టింద. ఇంటికిపోయి తల్లి ఒడిలో తలపెట్టుకొని తనివితీరా ఏడవాలనిపించింది. పక్కగాఉన్న పార్కు చెరువులో దూకాలనిపించింది

కాని పీటన్నిటినీ తోసిరాజని ముందు కొచ్చింది ఇంకో కోరిక. చివరిసారిగా ఆ బొమ్మలచొక్కాని ఒక్కసారి మనసు తీరా కళ్ళతో చూడాలని నెమ్మదిగా లేచి కాళ్ళీడ్చుకొంటూ బజార్న పడి పోయేడు. ఆ అరమైలుదూరం ఆరు ఆమడల దూరంలా అనిపించింది వాడికి. అల్లంతదూరంలో షాపు ఉందనగానే కళ్ళు తిరిగి ఒళ్ళు తూలి దారిపక్కన కూలపడ్డాడు.

తిరిగి వాడికి తెలివి వచ్చేసరికి రోడ్డు మీద జనసంచారంలేదు. షాపుల్లో లైట్లు లేవు. వచ్చేపోయే వాహనాల రాకలేదు.

కళ్ళు నులుపుకు చూసేడు తను ఉన్న ప్రదేశాన్ని. ఉదయంనుండి జరిగిన ఒక్కొక్క సంఘటన వాడి మనసులో తిరిగింది. అది కలగాదనీ, నిజమనీ తెల్పుతున్నాయి ఒంటిమీద దెబ్బలు – చిరిగి పేలికలైన బట్టలు. ఆ విధంగా ఉన్న తన బట్టల్ని చూసుకొంటుంటే వాడికి తను కలలుగన్న బొమ్మల చొక్కా గుర్తుకొచ్చింది. ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది. అలా ఎంతో సేపు వెక్కివెక్కి ఏడుస్తూ ఉండి పోయేడు. టక్...టక్‌మని వినిపించిన ఏదో చప్పుడు వాడిని మామూలు స్థితికి తెచ్చింది. ఏమిటా అని ఇటు అటు తేరి పార చూసేడు. అప్పుడే వాడి దృష్టిలోకి వచ్చింది పది బారల దూరంలోఉన్న బట్టల కొట్టు. అద్దాల బీరువాలో వాడివైపు జాలిగా చూస్తున్న బొమ్మల చొక్కా.

వీధిలైటు వెలుగు ఆ ప్రదేశంలో బాగానే పడ్తోంది. అక్కడ ఎవరో ఇద్దరు మనుష్యులు ఉన్నట్లు స్పష్టంగా కన్పిస్తోంది. ఆ చప్పుడు వస్తున్నది అటు వైపునుండే. ఆ రాత్రప్పుడు వాళ్ళు అక్కడ ఏంచేస్తున్నారా – అని వెంకడికి సందేహం కలిగింది. నెమ్మదిగా లేచి కాళ్లీడ్చుకొంటూ అక్కడికి వెళ్ళేడు. అప్పటికే వారు అద్దాల బీరువా తలుపు తెరచేరు. దానిలోఉన్న బట్టల్ని ఒక టొకటిగా తీసి కుప్ప పెడ్తున్నారు

"సార్" అన్నాడు వెంకడు మెల్లగా వారి పక్కకిచేరి.

ఆ వ్యక్తు లిద్దరూ తుళ్ళిపడ్డారు.

"ఎవఱ్రాసువ్వు?" అన్నారు వాడి పీక మీద చెయ్యేసి పట్టుకొంటూ.

"నాను ఎంకణ్ణి సార్" అన్నాడు వెంకడు వినయంగా చేతులు జోడిస్తూ.

"ఇక్కడి కెందుకొచ్చేవు?" ఆ ఇద్ద రిలో పెద్దవాడు గద్దించేడు.

వెంకడు వారి ప్రశ్నకి జవాబు చెప్ప లేదు. "ఈ కొట్టు తవదేనా సార్" అన్నాడు.

"అవును" అన్నాడు చిన్నవాడు ఖింకంగా.

"నాను రోజూ ఈ కొట్టుముంగల కూకుని ఆ బొమ్మలసొక్కా సూత్తుం టాను. కాని తవర్నెప్పుడు సూడనేదు."

"మాకు పెద్దబజార్లో ఇంకో షాపుంది. అక్కడ మేము పనిచూస్తాము. ఇక్కడ మా అన్నయ్య ఉంటాడు."

"అంగదీ అలా సెప్పండి. ఆ సొక్కా లన్నీ తీత్తున్నారు ఏటి సేత్తారు?"

"ఇంకో షాపుకి పట్టుకుపోతు న్నాము."

"సార్... సార్... ఆ బొమ్మల సొక్కా కూడా అట్టుకుపోతారా?" ఆ మాట అడుగుతుంటే వాడి గొంతుక బొంగురుపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగేయి.

"ఏం అలా అడుగుతున్నావు?" ఆ ఇద్దరిలో ఒకడు ప్రశ్నించేడు.

తను ఆ బొమ్మలసొక్కా కొను క్కోడం కోసం పైసకి పైస చేర్చి కూడ బెట్టిన సంగతి చెప్పేడు వెంకడు.

"సరే... ఆ సొమ్ము ఇలాతే. ఆ చొక్కా నీ కిచ్చేస్తాము" అన్నాడు పెద్ద వాడు.

ఇంక దుఃఖం పట్టలేకపోయేడు వెంకడు. ఒక్కసారిగా బావురుమని ఏడ్చేసేడు.

వాడి ఏడుపువిని ఎవరైనా అటు వస్తున్నారేమోని సంశయంగా ఇటు అటు చూసేరు వాళ్ళు. బాగా రాత్రి ముదిరింది. అందునా చలికాలం. పైగా బజారువీధి. రోడ్డుమీద ఎవరూ తిరగడంలేదు.

అలా ఏడుస్తూనే తను కష్టపడి కూడ పెట్టుకొన్న సొమ్ము ఎవరో కాజేసిన కథ చెప్పేడు వెంకడు. "సూడబోతే ఆడు దొంగనా లేడు బాబూ! తవరినాగే మంచిబట్ట లేసుకొన్నాడు జోళ్ళు తొడి గేడు... ఏదో పెద్దబాబు — అనుకొన్నా ..."

వెంకడు అలా తన కథ చెప్తుంటే ఆ వ్యక్తు లిద్దరూ కళ్ళతో సౌంజ్ఞలు చేసుకొన్నారు. వాడికి వినపడకుండా నెమ్మదిగా ఏదో గుసగుసలాడేరు. ఆ బొమ్మల చొక్కాకి కట్టిఉన్న చీటి చూసేరు.

"ఇంద. తీసుకో" ఇద్దరిలో పెద్ద వాడు ఆ చొక్కా తీసి వెంకడి చేతిలో పెట్టేడు

"నాకాడ డబ్బుల్లేవు.బాబూ" ఏడుస్తూ జవాబు చెప్పేడు వెంకడు.

"ఫరవాలేదులే... ఆ సొమ్ము తీరే దాకా మా ఇంటికివచ్చి మా పిల్లల జోళ్ళు పాలిష్ చేసిపోదువుగాని."

"తవ రిల్లెక్కడ సార్" ఉత్సాహంగా

అడిగేడు వెంకడు. ఆ బొమ్మలచొక్కా కోసం ఆ సొమ్ము తీరేవరకేకాదు వాడి జీవితాంతం వాళ్ళ పిల్లలజోళ్ళు పాలిష్ చెయ్యమన్నా వాడు చేస్తాడు

"మేము రేపు ఊరికి పోతున్నాం... తిరిగివచ్చేక నిన్ను పిల్చుకెళ్ళి సూపిస్తాంలే ... దాన్ని తీసుకొని ఇంక నువ్వు వెళ్ళిపో... మేము పనిచూసుకోవాలి."

"నిజ్జిగా ఇది నా కిత్తన్నారాసార్?" వెంకడు తన అదృష్టాన్ని నమ్మలేక పోతున్నాడు

"సీదేరా. పట్టుకుపో... ఇంక అట్టే వాగక. ముందు నడువు" పెద్దవాడు విసుక్కొన్నాడు.

పడుతూ, లేస్తూ వెంకడు ఇల్లు చేరే సరికి తెల్లవారుజాము అయింది. అప్ప టికే తల్లి పాచిపన్లు చెయ్యడానికి వెళ్ళి పోయింది. తండ్రికి రాత్రిపూట ఇంటికి వచ్చే అలవాటులేదు – తాగుడికి డబ్బులు లేని రోజున తప్పిస్తే. తన ప్రాణానికి ప్రాణం అయిన ఆ బొమ్మల చొక్కాని రెండుచేతులా గుండెలకి అదిమిపెట్టు కొని ముక్కినులకమంచానపడి నిద్రలోకి జారిపోయేడు.

వాడికి తిరిగి తెలివి వచ్చేసరికి బైట ఫెళ్ళున ఎండ కాస్తోంది. ఏదో బలమైన దెబ్బ వాడి పొట్టలో తగిలి వాడికి తెలివి వచ్చింది. ఒక్కసారిగా కళ్ళువిప్పి చూసేడు. ఎదురుగా పోలీసువాడు. ముందురోజు వాడిదగ్గర మిగిలిన పాతిక పైసలు తీసుకొని చిన్నవాడని వాడిని దయతలచి విడిచివేసినవాడు. వాడి పక్కనే ఐట్టంకొట్లో కొత్తగా చేరిన నౌకరు కుర్రాడు – వాడి యజమాని.

వాడి పొట్టకో తగిలింది పోలీసువాడి కాలితాపు. "నెగరా దొంగ నంజకొడకా! సిన్నోడివికదాని దయతలచి వొదిలిపెడ్తే సాపులకే కన్నాలెయ్యడం మొదలెట్టే వురా?" అంటూ డొక్కలో బూటు కాలితో మరో తన్ను తన్నేడు

"నాకేటి తెల్దుసార్...నాను దొంగెద వను కాను... ఈ సొక్కా... ఆ బాబు లిచ్చేరు..."

"ఈ అయ్యగారి సొపంతా కొల్లగొట్టి ఏ బాబుల్రా నీకు సొక్కాలు పంచెట్టేరు దొంగనాయాలా? పద... పద... అయన్నీ టేసన్లో సెప్దువుగాని" అని మెడపట్టి మంచంలోంచి పైకిలాగి ఒక్క తోపు తోసేడు పోలీసువాడు.

అసలే ముందురోజు తగిలిన దెబ్బ లతో బలహీనంగాఉన్న వెంకడి కాళ్ళు ఆ తోపుకి తట్టుకోలేకపోయేయి. ముందుకి తూలిపడి, గడపముందున్న రాయికి తల కొట్టుకొన్నాడు. వాడి చేతిలోఉన్న పంచరంగుల బొమ్మల చొక్కా విసురుగా మరికాస్త దూరంవెళ్ళి రోడ్డుపక్కగా ఉన్న మురికిగుంటలో పడింది. దానిపై గల ఒక్కొక్క బొమ్మనే మురికి ఆక్ర మిస్తోంది. కరిగిపోతున్న ఆ రంగుల వంక నిశ్చలంగా చూస్తున్నాయి నిర్జీవ మైన వెంకడి కళ్లు.

---




ఎక్స్‌ప్రెస్ పరుగెడుతుంది.

ఆ అమ్మాయిని చూస్తున్నప్పట్నుంచి మధుసూదనం మనసులో ఆలోచనలూ పరుగెడుతున్నాయి. ఆమె పాళాబంగా రంలా మెరిసిపోతుంది. రేకులు విప్పిన గులాబిలా సొగసుగా ఉంది. నిండు చందమామలా అందంగా ఉంది. మధుసూదనంలాంటి కుర్రకారు గుండెల్లో పర్మనెంట్‌గా చోటు సంపాదించుకొనే విజేతలా ఉంది. ఆమె అలా ఉందిగనుకే మధుసూదనం మనసుపడ్డాడు. తనకు తెలియకుండానే ఆమెకి మనసు యిచ్చేశాడు. మనసులో ముద్దుగా ఆమెకు 'అపరంజి' అని పేరు పెట్టుకున్నాడు.

నిలబడిఉన్న అపరంజికి సీటు ఆఫర్ చేశాడు. మధుసూదనం లేచి నిలబడ్డాడు. పరిచయం పెంచుకోవటానికి చేతిలో ఉన్న కొత్త పత్రికలు అపరంజి చేతికిచ్చాడు.

ఏ చిత్రకారుడూ ఊహించని భంగిమలో అపరంజి పుస్తకంలో పేజీలు తిప్పి చూస్తుంది.

మధుసూదనం పార్టిషన్‌కి చేరబడి, సిగరెట్టు వెలిగించాడు కుడిచేతి రెండు వేళ్ల సిగరెట్టు మీదుంచి, ఎడంచేయి కుడిచేయి కింద పెట్టుకొని, అపరంజిని తనివితీరా చూస్తున్నాడు. అతను అందంగా ఉంటాడు. అతని ఒడ్డూ పొడుగూ చూసి, వాళ్ళ ఆఫీసులోవాళ్ళు అతన్ని 'ధర్మేంద్ర' అని పిలుస్తారు. అతను చాల నాజూకుగా ఉంటాడు. మొన్న న్యూయార్క్‌లో కొత్తగావచ్చిన

ష్యాషను, నిన్న బొంబాయిలో యింపో ర్టయితే, ఈ రోజు మధుసూదనం దగ్గర కనిపిస్తుంది అతనంటే చాలమందికి యిష్టం అతను తెలివైనవాడు కూడ. అందుకే అతను ఆఫీసరు రావుగారికికూద యిష్టమైపోయాడు.

మధుసూదనంకి మామయ్యలు లేరు. మామయ్యల దగ్గర ఎదిగున్న కూతుళ్లు అంతకంటె లేరు. అతనికంటె పెద్దవా ళ్ళిద్దరూ పెళ్ళిళ్ళు చేసుకొని, మధు సూదనంకి 'లైన్‌క్లియర్' చేశారు తనకు నచ్చిన అమ్మాయిని చూపించి, గ్రీన్ సిగ్నల్ యివ్వాలేగాని - దేవతలు అమృతం తాగినట్లు కమ్యూనిస్టు సిద్ధాం తాల్ని ఉగ్గుపాలతోనే జీర్ణించుకున్న మధుసూదనం తండ్రి క్షణాల్లో పెళ్ళి జరిపిస్తాడు. కులం పట్టించుకోకుండా, రాచిరంపాన పెట్టకుండా కోడల్ని కూతు రిలా మధుసూదనం తల్లి ముద్దుగా చూసుకుంటుంది. అతనికి కారు లేక పోయినా, పెద్ద బంగళా లేకపోయినా, జీవితంలో యిబ్బంది ఏమిటో ఎర క్కుండా సాఫీగా సాగిపోవటానికి నెలకు ఠంచన్‌గా నాలుగొందల జీతం అందు తుంది. ఒకరికి ఇద్దరైనా, ఆపైన మరో యిద్దరు వచ్చినా ఖుషీగా రోజులు గడవ టానికి అంతో యింతో బ్యాంకులో పోగు చేశాడు. అతను క్యాంపులు వెళ్ళినప్పుడు తన 'సగాన్ని' సరదాగా తీసుకెళ్ళవచ్చు. అతని ఆఫీసరు అభ్యంతరం చెప్పడు. అతనివేపు ఏ అభ్యంతరమూ, యిబ్బందీ లేదు. అపరంజివేపు ఎలాంటి అభ్యంత రమూ, యిబ్బందీ లేకుండా తనను అమాంతం ప్రేమిస్తే బావుణ్ణని మధు సూదనం ఉబలపడ్డాడు.

మధుసూదనం వేళ్లు చుర్రుమన్నాయి. సిగరెట్టు అవతలికి విసిరాడు. ఉఫ్. ఊహించలేనన్ని ఊహలు రంగురంగుల సీతాకోకచిలుకల్లా అతని మనసులో కదులుతున్నాయి ఏదో స్టేషన్ వచ్చింది. (మధుసూదనం ఈ లోకంలో లేడు గనుక ఆ స్టేషన్ పేరు తెలియదు. అతను బోర్డుమీద స్టేషన్‌పేరు చదవలేదు. ఎవర్నీ అడిగి తెలుసుకోలేదు!) రైలు ఆగింది. అపరంజికి ముందుసీట్లో కూర్చున్న ముసలాయన ఇద్దరు కండు వాను భుజంమీదికి లాక్కుంటూ, లేచి వెళ్ళిపోయాడు. ఆ సీట్లో మధుసూదనం కూర్చున్నాడు. కంపార్టుమెంటులో జనం పలచబడ్డారు

మనుషుల్ని ఆడించి, తమాషాలు చేసే 'ఆ పైవాడు' ఒక్కోసారి చిత్రమైన అవకాశాలు కల్పించి, పుణ్యం కట్టు కుంటాడు. మధుసూదనం 'థాంక్ గాడ్' అనుకున్నాడు, మనసులో. అపరంజితో మాట కలపాలి. ఆపైన పరిచయం పెంచుకోవాలి. వీలుంటే క్యాంపు ఎగ్గొట్టి, అపరంజితో ఎంతదూరమైనా వెళ్ళాలి. అవసరం కలిగితే ఏ త్యాగమైనా

చేయాలి. ఈసారికూడ మధుసూదనం మనసులోనే అనుకున్నాడు.

గార్డు విజిల్ వేశాడు.

రైలు చక్రాలు కదిలాయి.

మధుసూదనం ఎడ్వెంచర మొదలయింది.

అప్పుడప్పుడు అపరంజి పుస్తకంలో చూపుల్ని మళ్ళించి, ఓరగా మధుసూదనం వేపు చూస్తుంది. అతను చూసినప్పుడు చూపులు తప్పిస్తుంది. అతను ఎటో చూస్తున్నప్పుడు అతన్ని చూస్తుంది. అతను మళ్ళీ అపరంజిని చూస్తున్నాడు. అపరంజి మళ్ళీమళ్ళీ చూస్తుంది. అపరంజి చూపులు మధుసూదనంకి ఎన్నో అర్థాలు చెప్పాయి. కథలూ చెప్పాయి. కబుర్లూ చెప్పాయి. అతను కబుర్లు మొదలు పెట్టాడు.

"మీ ప్రయాణం ఎంతవరకో తెలుసుకోవచ్చా ?..." మధుసూదనం మొదట్లో తడబడ్డాడు. తడారిపోతున్న పెదవులు తడుపుకొంటూ అడిగాడు.

''ఎందుక్కాదన్నట్లు" చిలిపిగాచూసి, మధుసూదనంలా కాకుండా చాల ఫ్రీగా చెప్పింది. అతనికి కొండంత ధైర్యం వచ్చింది.

"అరెరె...నేనూ అక్కడికేనండీ... అది మీ సొంత ఊరా ?..."

"అవును...మరి, మీరూ ?..."

"మీ ఊరివాణ్ణి కాదులెండి... ఆఫీసు పనిమీద వస్తున్నాను."

"అంటే, మీరు...?"

"నేను స్టెనోగ్రాఫర్ని... ఆఫీసరుతో క్యాంపులు వెళ్ళటం, ఇనస్పెక్షన్ రిపోర్టులు టైపుచేయటం మన ఉద్యోగం."

"ఇంతకూ, మీ ఆఫీసు...?"

"సారీ !... చెప్పలేదు కదూ ? మా ఆఫీసు పేరు వినటానికి మీకు యిబ్బందిగా ఉంటుంది. మీరు చాల చాల ప్రశ్నలు వేస్తారు. ఎబ్రివేషన్‌లో చెబితే అర్థంకాదు. కాంటెక్సుతో జతచేస్తే బోరుకొడుతుంది. అందుకని సింపుల్‌గా మా ఆఫీసు 'మంత్రాల తంత్రాల కార్యాలయం' అనుకోండి "

అపరంజి 'మంత్రాల తంత్రాల కార్యాలయం' అనే మాటకి విరగబడి నవ్వింది. ఆ నవ్వుకి ఆమె మెళ్ళో ఒంటిపేట గొలుసు విలాసంగా కదిలింది. తలలో గులాబి ఆలవోకగా కదిలింది. ముత్యాల్లాంటి పలువరుస తళుక్కుమంది.

"మీరు యూనివర్సిటీలో చదువుతున్నారా ?" ఆమె నవ్వు ఆపిన తర్వాత మధుసూదనం అడిగాడు.

అపరంజి 'అవునూ కాదూ' అని చెప్పలేదు. పోస్టుగ్రాడ్యుయేట్‌లా ఫోజు పెట్టి, చిన్నగా నవ్వింది. 'ఆమె పోస్టుగ్రాడ్యుయేషన్ చేయకుండా పొయ్యి ఊదుతుందా ?' అనుకున్నాడు, మధుసూదనం.

ఎన్నో స్టేషన్లు వెనక్కి వెళ్లాయి. దూరం చిన్నదయిపోతుంది. పరిచయం




పెద్దదవుతుంది. ఎన్నో విషయాలమీద సంభాషణ నడిచింది. అపరంజి చాలా తెలివైనది. ప్రపంచంలో ఎన్నో విషయాల్ని క్రోడీకరించి, జత చేసిన పుస్తకం ఆమె. ఆమెకు తెలియని సబ్జెక్టు ఏమీ లేదనుకున్నాడు, మధుసూధనం. చాలా తమాషాగా మాట్లాడుతుంది. చక్కగా ఆర్గ్యుమెంట్సు చేస్తుంది. ఆమెతో ఎంతసేపైనా మాట్లాడాలని పిస్తుంది. ఏ దేవతో శాపగ్రస్తురాలై పొరపాటున మనుషులమధ్య అపరంజి రూపంలో పుట్టిందేమో?

"మీర్రు చాలా తమాషాగా మాట్లాడగలరు." మధుసూదనం అపరంజి కళ్ళలో కళ్ళు నిలిపి అన్నాడు.

"నేనా?...కాదు. మీరు చక్కగా మాట్లాడుతున్నారు. నన్ను తెలివిగా మాట్లాడిస్తున్నారు."

''నో...నో...మీరు చాలా తెలివైనవారు. హౌ నైస్ టు హేవ్ యువర్ కంపెనీ..."

"మీకు థాంక్స్ చెప్పడంకోసం నన్ను పొగుడుతున్నారు. అవునా?..." ఆమె కిలకిల నవ్వింది. మధుసూదనం నవ్వేడు. నవ్వుతూనే మనసులో అనుకున్నాడు-మీథాంక్స్ కాదు. నాకు మీ హృదయం కావాలి' అని.

"మీ పేరు తెలుసుకోవచ్చా?..."మధుసూదనం ప్రశ్న.

"విజయలక్ష్మి...మీ పేరు ?..." విజయలక్ష్మి గాలికిచెదిరిన ముంగురుల్ని పైకి జరుపుకుంటూ అడిగింది.

''మధు ... పూర్తి పేరు మధుసూదనం.'' ఆతర్వాత—మధుసూదనం విజయలక్ష్మి గురించి చాలా తెలుసుకున్నాడు.

విజయలక్ష్మికి - జబ్బుతో మంచాన పడిపోయిన తండ్రీ, స్కూలుకి వెళ్ళకుండా రౌడీగా రోడ్లమీద తిరిగే తమ్ముళ్ళూ, నలుపూ తెలుపూ చదరపు గళ్ళను గుర్తించలేక జీవితంలో మోసపోయిన చెల్లెళ్ళూ, కాంపౌండువాల్ లేని డొక్కు పెంకుటిల్లూ, బెంగపెట్టుకొని రాత్రీ పగలూ తల పగలగొట్టుకొనే అప్పులూ, ఆలోచనలు లేవు. ముద్దుగా 'స్వీట్ మమ్మీ' అని పిలుచుకోవటానికి విజయలక్ష్మికి తల్లిమాత్రం ఉంది. కన్న తల్లి ప్రేమ ఉంది. ఆమెతో సరదాగా ఆడుకోవటానికి 'జూలీ' (డాగ్) ఉంది. కాంపౌండువాలు, అందమైన లాన్ ఉన్న 'సీట్‌హోం' ఉంది. బెంగపెట్టుకోవటానికి అప్పులూ లేవు. రాత్రీ పగలూ ఆలోచించటానికి ఆలోచనలూ లేవు. అందుకే విజయలక్ష్మి చాలా ఆరోగ్యంగా ఉంది. అందంగా ఉంది.

"మీరు చాలా అందంగా ఉంటారు. నా కళ్ళలో మెదులుతున్న మిమ్మల్ని మరిచిపోవటం నాకు సాధ్యంకాదు." ప్లాటుఫారంమీద విజయలక్ష్మి ప్రక్కన నడుస్తున్న మధుసూదనం చాల నెమ్మదిగా అన్నాడు. అతను చనువుగా మాట్లాడేడు. తన స్నేహం కేవలం రైలు ప్రయాణంలో పరిచయం కాకూడదు. విజయలక్ష్మిని తన 'సగం'గా సంపాదించుకోవాలి. మరికొన్ని క్షణాల్లో ఆమె వెళ్ళిపోతుంది. తనదారి వేరయిపోతుంది. దారులు వేరుకాకముందే ఆమె ప్రేమను పొందటానికి మరోదారి వెదకాలి.

విజయలక్ష్మి మాట్లాడలేదు. కోపగించుకోలేదు. మధుసూదనం మాటలకి ఆమె లేతచెక్కిళ్లు ఎరుపెక్కినట్లున్నాయి. కాళ్లు తడబడ్డాయి. తల వంచుకుంది.

"క్ష మిం చం డి, తప్పుగా మాట్లాడితే..."

"అబ్బే, అదేం కాదండీ..."

"అయితే, నామీద మీకు కోపం లేనట్లేగా?..."

లేదన్నట్టు విజయలక్ష్మి తల అడ్డుగా తిప్పింది.

స్టేషన్ అవతలకి వెళ్ళిన తర్వాత- మధుసూదనం అన్నాడు.

"మీ ఊళ్ళో నేను మూడురోజులుంటాను...మిమ్మల్ని కలుసుకోవాలంటే...?" మధ్యలోనే మాటను త్రుంచేశాడు. పూర్తిచేయలేక పోయాడు.

ఆమె కొన్ని క్షణాలు ఆలోచిస్తూ ఉండిపోయింది. అతనివేపు చూసింది.

"రేపు వేణుగోపాలస్వామి గుడికి రాగలరా?" నేలమీద బొటనవేలితో గిరులు గీస్తూ విజయలక్ష్మి అడిగింది. మధుసూదనం నమ్మలేకపోయాడు. సంశయంగా ఆమెవేపు చూశాడు. ఆమె నవ్వింది. నవ్వు తప్ప ఆమె ఎప్పుడూ ఏడ్చి ఉండదనిపించింది. ఆమె నవ్వని క్షణం లేదనుకున్నాడు.

"మీరు తప్పకుండా కనిపిస్తారా?"

"చీకటి పడినతర్వాత రండి. అమ్మతో చెప్పి గుడికి వస్తాను"

"మీకోసం ఎదురుచూస్తూఉంటాను."

"వచ్చేవరకు ఉండండి."

విజయలక్ష్మి రిక్షాలో వెళ్ళిపోయింది. మధుసూదనం గాలిలో నాలుగువేళ్ళూ ఊపుతూ ''టాటా" అని చెప్పాడు. ప్రేమనేది ఏ యిద్దరిమధ్య ఎప్పుడు ఎలా ఏర్పడుతుందో చెప్పటం కష్టమే మరి.

* * *

మధుసూదనంకి తన ఆఫీసరు రావు గారి గురించి బాగా తెలుసు. అతను మహా కచ్చితమైన మనిషి. అతను రూల్సుమీద నడుస్తాడు. కానీ, రూల్సు విడిచి, అక్రమంగా ప్రవర్తించేవాళ్ళను రూళ్ల కర్రతోమాత్రం కొట్టడు. ఛార్జి షీట్సు అంతకంటె యివ్వడు. కొట్టకుండా ఛార్జిషీట్సు యివ్వకుండా మాటలతో మనిషిని నిర్దాక్షిణ్యంగా చంపుతాడు. ఎంత పండిపోయిన వాళ్లనైనా పల్టీలు కొట్టిస్తాడు. ఎంతటి మొండివాళ్లనైనా బ్రెయిన్ వాష్‌చేసి దారిని పెడతాడు ఆఫీసులో అవకతవకలు కనిపిస్తే, పెళ్ళాం పిల్లల్నయినా చూసుకోవటానికి యింటికి పోనివ్వకుండా జైల్లో బంధించినట్లు–ఆఫీసులో పని పూర్తయ్యేవరకు స్టాఫ్‌ను కదల్నివ్వడు. అతను మహానుభావుడు–దండాలంటారు, పనిచేసేవాళ్లు. దుర్మార్గుడు — పోవాలంటారు, పని ఎగ్గొటేవాళ్లు. అతను చాలా తక్కువ సర్వీసులో ప్రమోషన్ తెచ్చుకున్నాడు.

ఆఫీసరు రావుగారు 'లాజిక్' గా మాట్లాడతారు. అతనితో బాగా పరిచయం ఉన్నవాళ్ళయినా–అతను ఫలానా వర్గం మనిషని ముద్రవేయలేరు. అతను కేపిటలిస్టో, సోషలిస్టో ఎవరికీ అర్థం కాదు. కారున్నవాడు దేశానికి చాల ఉపయోగపడతాడట. చాలామందికి జీవనోపాధి కల్పిస్తాడట. కారుకి పన్ను, రోడ్డుకి పన్ను, పెట్రోలు కొనటం, మెకానికల్ ఛార్జీలు, అడిగినవాళ్లకి మామూళ్లు యివ్వటం కారులేనివాడు చేయడట. దేశసంపదను కొందరే అనుభవించటానికి వీల్లేదట జగన్నాథ రథాన్ని కదిలించాలట. పల్లకి ఎక్కేవాళ్ళు మోసే వాళ్లు అనే భేదాలుపోయి, అంతా సమానం కావాలిట.

అతని లెక్చర్లు వింటున్నప్పుడు మధుసూదనంకి మతిపోయింది.

ఆ రోజు యినస్పెక్షన్ మొదలయింది.

ఆఫీసు ఇన్‌ఛార్జీ అరచేతిలో ప్రాణాలు పెట్టుకున్నాడు.

రావుగారు పాతరికార్డులు, కొత్తరికార్డులు తిరగవేశారు. ప్రతి పేజీ విడిచి పెట్టకుండా చూశారు. రికార్డుల్లో రాసిన వన్నీ తప్పన్నారు. అలా ఉండటానికి తప్పెవరిదన్నారు. అక్కౌంట్లు సరిగ్గా

లేవన్నారు. సరిగ్గా లేకపోవటానికి కారణం ఏమిటన్నారు. ట్రాఫిక్ పుస్తకం దూరంగా గిరాటువేశారు. డెలివరీ రికార్డులో ఎర్రసిరాతో పెద్ద రిమార్కులు గీశారు. ఇన్‌ఛార్జిని ఎడాపెడా చీవాట్లు వేశారు.

"మిస్టర్...ఇది ఆఫీసేనా?... కిరాణాకొట్లో సుబ్బరంగా పద్దులు రాయటానిక్కూడా నువ్వు పనికిరావు. రికార్డులు సరిగ్గా మెయింటెయిన్ చేయలేవు. ఆఫీసుని సక్రమంగా నడపలేవు. సంసారాన్ని కావలసినతీరులో దిద్దుకోలేవు. పిల్లల్ని క్రమశిక్షణలో పెంచలేవు. ఏమీ చేయలేవు. కానీ, వీధిలో పెద్దలెక్చర్లు ఇవ్వగలవు. గాంధీగార్ని చంపిన గాడ్సేది తప్పు కాదంటావు. ఇందిరాగాంధీ ఇండియాను పాడుచేస్తుందంటావు. నీ ఆఫీసులో యూనియన్లుఎక్కువై, ఎవరూ నీమాట వినలేదంటావు. ఆఫీసరు వట్టి వెధవని బండబూతులు తిడతావు... ఇదేనయ్యా! నీ గొప్పదనం.

ఎదుటివాడిలో ఏమైనా తప్పులు దొరుకుతాయని భూతద్దాలతో వెదకటం కాదు. మొదట నీ తప్పుల్ని సరిదిద్దుకో. ఆత్మవంచన లేకుండా నీ డ్యూటీ సరిగ్గా చేయటం నేర్చుకో. ఆ తర్వాత గవర్నమెంటుని అను. 'గవర్నమెంటు సారా' తాగి గవర్నమెంటునే తిట్టు. నాయకులంతా వాజమ్మలని గోలచేసి తిట్టు. ఆఫీసర్లు తెలివితక్కువ వెధవలని తిట్టు, ఫరవాలేదు. నిన్నెవరూ అనరు. అందరూ నిన్ను రైటంటారు. కాదంటే నన్ను తిట్టు. అంతేకాని — అయినదానికి కానిదానికి దేశాన్ని దుయ్యపట్టకు. పెద్దవాళ్ళను గురించి చెడ్డగా మాట్లాడకు. నీకు నాలుగు మెతుకులు పెట్టే ఆఫీసుని నిర్లక్ష్యం చేయకు...నువ్వు చేసిన పనిమీద నీకు డివోషనుండాలి నీలో సిన్సియారిటీ ఉండాలి. మనిషన్న తర్వాత మంచి కల్చరుండాలి. అప్పుడే నీ ఆఫీసు బాగుపడుతుంది. ఈ దేశం బాగుపడుతుంది. నీ యిల్లు బాగుపడుతుంది. మనందరం బాగుపడతాం." రావుగారి కళ్ళలో ఎరుపురంగు పులుముకుంది.

ఇన్‌ఛార్జి కళ్ళలో భయంపేరుకుంది. రావుగారి లెక్చరుకి 'అవునూ కాదూ' అనకుండా అతను తలవంచుకున్నాడు. అంతకంటె గొప్పపని తెలియదన్నట్లు ఊరుకున్నాడు అతను దేశాన్ని దుయ్యపట్టాడనిగాని, పెద్దవాళ్ళ గురించి చెడ్డగా మాట్లాడేడనిగాని, తన ఆఫీసుని అశ్రద్ధ చేశాడనిగాని మధుసూదనం అనుకోలేకపోయాడు. అతని మంచితనాన్ని బలహీనతగా తీసుకొని, స్టాఫే ఆఫీసుని పాడు చేశారనిపించింది. ఎవరికైనా పట్టూవిడుపూ ఉండాలి. అమాయకంగా కనిపించే యిన్‌ఛార్జిని ఊపిరి తీసుకోకుండా రావుగారు నానా చీవాట్లు పెడుతుంటే మధుసూదనంకి జాలేసింది.

'క్వెశ్చనైర్'లో పది పాయింట్లయినా

పూర్తికాలేదు. రావుగారు ప్రతి విషయానికి ఇన్‌ఛార్జి మీద ధుమ ధుమ లాడి పోతున్నారు. మధుసూదనం నోట్‌బుక్ చివరిపేజీలో 'గ్రామ్‌లాగ్స్'రాస్తున్నాడు. అతని స్మృతిపథంలో విజయలక్ష్మి మెదిలింది. సాయంత్రం ఆమె వేణుగోపాలస్వామి గుడికి వస్తుంది. అతను కలుసుకుంటాడు. తన మనసులో మాట ఆమెకి చెబుతాడు. అంతలో నేసందేహం, ఇనస్పెక్షన్ పూర్తికాకపోతేః పూర్తికాదు కూడా. మధుసూదనం బెంగపెట్టుకున్నాడు.

మధ్యాహ్నం భోజనానికి రావుగారు వెళ్ళలేదు. ఇన్‌ఛార్జి యిచ్చిన కాఫీ తీసుకోలేదు. ఎండ చల్లబడిందిగాని అతనిలో కోపం చల్లబడలేదు. అతని ధోరణిచూస్తే ఆ రాత్రి కూడ ఆఫీసులో తిష్ఠవేస్తాడని పించింది. మధుసూదనం చేతిలో పెన్సిలు ముందుకి జరగలేదు.

ఎర్రబడ్డ సూర్యుడు ఊరుదాటి, చేల గట్లుదాటి, చెరువుదాటి, పడమట కొండల్లోకి వెళ్ళిపోయాడు. ఎర్రబడ్డ ఆఫీసరు రావుగారు లేలినిలబడ్డారు.

"మిస్టర్...నా సర్వీసులో యింత చెత్త ఆఫీసుని చూల్లేదు. నీలాంటి పనికి రానివాణ్ని చూల్లేదు. నీలాంటివాళ్లుండే ఆఫీసులు బాగుపడవు. దేశం అసలు బాగుపడదు. నీ ఆఫీసుని చూస్తే ఈ దేశం ప్రగతి ఏఁవిటో చెప్పొచ్చు...ఛీఛీ... నాకు ఓర్పు పోయింది. పని చేయలేను. రేప్పొద్దుట వస్తాను. నే నొచ్చేసరికి రికార్డులు పూర్తిచేయాలి. అకౌంట్లు సరిగ్గా చూపించాలి ఎలాంటి అవకతవకలు కనిపించకూడదు. రాత్రికి పనిచేస్తావో పడుకుంటావో నాకనవసరం. నీ స్టాఫ్‌ను ఆఫీసులో ఉంచుతావో యిళ్లకే పంపిస్తావో అనవసరం. తెల్లవారేసరికి పని పూర్తికావాలి. కాకపోతే నీ ఒంట్లో బాగులేదని మరో సర్కిల్‌కి ట్రాన్స్‌ఫర్ చెయ్యమని సిఫారసు చేస్తాను. తర్వాత విచారించి ప్రయోజనంలేదు.

"మధూః రేపు త్వరగారావోయ్..." సమాధానంకోసం ఎదురుచూడకుండా రావుగారు రహదారిబంగళాకి విసురుగా వెళ్ళిపోయారు.

త్వరత్వరగా ఫైల్లో పేపర్లు సర్దుతున్నాడు, మధుసూదనం.

"సార్ః...ఆఫీసరుగారు చాల కోపంగా ఉన్నారు. అతను అడిగినట్లు అన్నీ క్షణాల్లో జరిగిపోవాలంటే కష్టం. ఇరవైనాలుగ్గంటలూ గొడ్డులా కష్టపడి పనిచేసినా ఈ బండచాకరీ తరగదు... ఆఫీసరుగార్ని మంచిచేసుకొనే ఉపాయం చెప్పండి. అయ్యగారి గురించి మీకు బాగా తెలిసుండాలి." ఇన్‌జార్జి చాల నెమ్మదిగా ధైర్యంగా అడిగాడు.

మధుసూదనం ఆశ్చర్యపోయాడు. అతని 'విశ్వరూపాన్ని' చూడాలనిపించి తలెత్తాడు. అంతవరకు అతను చూపించిన వినయం వట్టి అబద్ధం.

"మీ మాటలు నాకర్థం కావటంలేదు." మధుసూదనం సశయంగా అడిగాడు. రావుగార్ని తేలికగా అంచనావేసినందుకు బాధపడ్డాడు కూడ.

"అర్థంకాకపోవటాని కేముంది సార్...అంతా మామూలే! ఆఫీసర్లకి యిబ్బంది కలిగించి, మేము యిబ్బంది పడలేం...ఈ అయ్యగారు కొత్తవారు. మాకు అంతగా తెలీదు..."

మధుసూదనం మధ్యలో అందుకున్నాడు.

"అవును. అతను కొత్తవారు. అతని గురించి మీకు బాగా తెలీదు."

"అందుకే, సార్! మిమ్మల్ని అడగటం...దయచేసి అయ్యగారి అలవాట్లు..."

"క్షమించండి. మనిషిలో బలహీనతలకి రంగులువులుమి మీపొరపాట్లు దాచిపెట్టటానికి ప్రయత్నించకండి. లంచం పెట్టి మనిషిని కొనటం ఆరోగ్యంకాదు."

"అపార్థం చేసుకుంటున్నారు. ఇలాంటివి మామూలే! దేశంలో పెద్దవాళ్లు కూడ మర్యాదల పేరుతో ఈ పనులు చేస్తారు."

"ఇట్స్ డిప్లోరబుల్..." మధుసూదనంకి కోపం వచ్చింది.

"చూడండి! మీరు కుర్రవాళ్లు. మీకు జీవితంగురిచి, మనుషులు గురించి పూర్తిగా తెలీదు. అందుకే ఆవేశపడుతున్నారు." నెరసిన తలవెంట్రుకల్ని ఎడంచేత్తో ఇన్‌ఛార్జి సర్దుకున్నాడు, తన పెద్దరికం తెల్లవెంట్రుకల్లో ఉందన్నట్లు.

"మీరు అపోహపడుతున్నారు. అందర్నీ ఒకేలా అంచనా వేయటం ఆరోగ్యంకాదు. మీరు పిచ్చిగా ప్రవర్తిస్తే ఆఫీసరుగారు రాత్రికి రాత్రే మిమ్మల్ని ట్రాన్స్‌ఫర్ చేయించగలరు. జీవితంలో అన్ని విషయాలకి ఒకే ఫార్ములా ఉపయోగపడదు." తనని కుర్రాడిగా ఏమీ తెలీనివాడుగా లెక్కకట్టినందుకు మధుసూదనం అహం దెబ్బ తింది.

"వాట్ సార్!... మీరు మరీ సెన్సిటివ్‌లా ఉన్నారు. చిన్న విషయాన్ని పెద్దది చేస్తున్నారు."

"పెద్దవాళ్లనుకున్న మీలో యింత ఎక్స్‌ప్లాయిటేషన్ ఉందనుకోలేదు."

ఇన్‌ఛార్జి వికారంగా నవ్వేడు. ఇప్పుడు మధుసూదనంకి అతనిమీద జాలి లేదు. ఆ స్థానంలో జుగుప్స చోటు చేసుకుంది. మనిషిని చాలా చవకగా అంచనావేసే మనస్తత్వం అతనిది. లంచగొండితనం అతనిలో జీర్ణించుకుపోయింది కాబోలు. కష్టపడటం అతనికి యిష్టంలేదు. తేలికగా ఆఫీసర్ని బుట్టలో వేసుకోవాలనే ఆలోచన ఉంది. ఆ ధీమాతో ఆఫీసుని అశ్రద్ధ చేసిఉండాలి. అతను పొరపాటున ఓ చిన్న ఆఫీసుకి యిన్‌ఛార్జిగా పనిచేస్తున్నాడుగాని కేబినెట్‌లో ఏ మినిస్టరో అయితే_ తన

అమోఘమైన తెలివి తేటలతో గంటకో పార్టీ మార్చి, రోజుకో పదవి పుచ్చు కొని, నెలరోజుల్లో మనవాళ్లకి యిబ్బంది లేకుండా దేశాన్ని నిమిషాల్లో బేరం పెట్టేవాడు. ఏ రాజకీయవేత్తకు తెలియ నన్ని రాజకీయాలు అతని దగ్గర ఉన్నాయి. రాజనీతి ఉంది. ఐక్యరాజ్య సమితిలోనైనా అతను రాణించగలడు. మధుసూదనం ఆలోచనలవి.

ఆ తర్వాత- మధుసూదనం యిన్ ఛార్జిగురించి చాల విషయాలు తెలుసు కున్నాడు. అతని శ్రీమతిపేర లంకత యిల్లుందిట. అత్తవారు లాంఛన ప్రాయంగా యిచ్చిన పాతిక ఎకరాల మాగాని ఉందట. సరదాగా ఊళ్లో ఓ ప్రత్యేకతకోసం ఉద్యోగం చేస్తున్నా డట. ఊళ్లో పెద్దతలకాయలతో స్నేహం ఉందట. అసెంబ్లీలో సగానికిపైగా ఏమ్మెల్యేలు అతనికి తెలుసట. ఆ ఊరికి మినిస్టర్లొచ్చినా, ఆఫీసర్లొచ్చినా బాగా చూస్తాడట. అతనితో మధుసూ దనంకి మాట్లాడా లనిపించలేదు. అత నికి సరియైన పాఠం చెప్పేమనిషి రావు గారే అనుకున్నాడు.

మధుసూదనం తనకు కేటాయించిన ఆఫీసు రెస్టురూంకి దారితీశాడు.

* * *

పూర్ణచంద్రుడు వచ్చాడు.

మధుసూదనం వేణుగోపాలస్వామి గుడి చేరుకున్నాడు. విజయలక్ష్మి రాలేదు.

వెన్నెల్లో పాతబడిపోతున్న గుడి స్పష్టంగా కనిపిస్తుంది. రాణిడిలేదని పెద్దవాళ్లు అశ్రద్ధ చేసినట్లున్నారు. ఆలయ ప్రాంగణం అయితే పెద్దదేగాని చుట్టూఉన్న ప్రహారీగోడ జీవితంలో ఎదురుదెబ్బలు తిన్న మధ్యతరగతి మనిషిలా సగం నగం పడిపోయిఉంది. అక్క డక్కడ గన్నేరుచెట్లు మనసులో మిగిలిపోయిన ఆశల్లా మొండిగా నిలు చున్నాయి. తనను మనుషులు అశ్రద్ధ చేస్తున్నారని దేవుడు బెంగపెట్టుకున్నట్లు లేదు. గుడిలో గోరంత ప్రమిద వెలు గులో కొండంత దేవుడు చిరునవ్వులు చిందిస్తున్నాడు.

భక్తులెవరూ లేరు. ఇంటి లెక్కలు రాసుకుంటున్నాడు పూజారి. దేవుడు ఖాళీగా ఉన్నాడు. మధుసూదనం వేణు గోపాలస్వామికి రెండుచేతులెత్తి నమ స్కరించాడు. అతని మనసులో కోటి కోరికలు చోటుచేసుకున్నాయి. ఆ కోరి కలమధ్య విజయలక్ష్మి దేవతలా ఉంది. ఆ దేవతను తనకు అర్ధాంగిగా ప్రసా దించమని దేవుణ్ని ప్రార్థించాడు.

మధుసూదనం చెరువుగట్టుమీద చతి కిలబడ్డాడు. చెరువులో తేలుతున్న కలువ పువ్వులు వెన్నెల్లో మెరుస్తు న్నాయి. అతను వేస్తున్న చిన్న చిన్న గులకరాళ్లకి చెరువులో పెద్ద పెద్ద

వృత్తాలు ఏర్పడుతున్నాయి కలువ పువ్వులు విలాసంగా కదులుతున్నాయి. క్షణ క్షణం విజయలక్ష్మి వస్తుందేమో నని తోవవేపు ఆశగా చూస్తున్నాడు.

జీవితంలో జరిగే సంఘటనలు కొన్ని చిత్రంగా ఉంటాయి. మధుసూదనం చాలాసార్లు క్యాంపులు వెళ్లాడు. బస్సుల్లో రైళ్లలో ప్రయాణించేశాడు. అమలాపురం వెళ్లినప్పుడు కోటిపల్లి రేవులో పడవ మీద వెళ్లాడు. కానీ, ముందురోజులాంటి అనుభవంమాత్రం అత నెప్పుడూ పొందలేదు. అందమైన విజయలక్ష్మి కనిపించటం, ఆమె స్నేహం పొందా లని తను అనుకోవటం, యాదృచ్ఛి కంగా అనుకున్నవి జరిగిపోవటం అదొక థ్రిల్. తను అదృష్టవంతుడు.

విజయలక్ష్మి రాలేదు. మధుసూదనం వాచ్ కేసి చూశాడు. తొమ్మిది దాటింది. పూజారి తలుపులుమూసి వెళ్ళిపోయాడు. మధుసూదనం బరువుగా నిట్టూర్చాడు.

'చీకటిపడిన తర్వాత రండి. అమ్మతో చెప్పి గుడికి వస్తాను... వచ్చే వరకు ఉండండి.' విజయలక్ష్మి మాటలు గుర్తొచ్చాయి. మధుసూదనం ఒంటరిగా నిశ్శబ్దంలో మిగిలిపోయాడు.

విజయలక్ష్మిని చూసిన మరుక్షణం నుండి మధుసూదనం ఆమె గురించే ఆలో చిస్తున్నాడు. ఆమె లేకపోతే అతను పిచ్చివాడై పోతాడు. అతనికి జీవితమే లేదు. వింత వింత ఊహలతో అతను ఉక్కిరి బిక్కి రయిపోయాడు.

చర్చి గంటలు విని మధుసూదనం వాస్తవంలోకి వచ్చాడు. పన్నెండు గంట లయింది. విపరీతమైన చలి. కురుస్తున్న మంచు వెన్నెల్లో జలతారు తెరలా కని పిస్తుంది. విజయలక్ష్మి జాడలేదు. ఆమెతో ఎన్నెన్నో చెప్పాలని వచ్చాడు. అతనిలో ఉత్సాహం చల్లబడిపోయింది. విజయలక్ష్మి కళ్ళముందు మెదిలింది. తనను వేణుగోపాలస్వామి గుడికి రమ్మని ఆమే అడిగింది. రమ్మని చెప్పి ఆమె ఎందుకు రాలేదు? తనకు అబద్ధం చెప్పి ఎందుకు మోసంచేస్తుంది? సరియైన కారణం ఊహించలేకపోయాడు, మధు సూదనం.

విజయలక్ష్మి వస్తుందనీ నమ్మకం, ఆశ - మధుసూదనం కున్నాయి. ఆ నమ్మకంతో, ఆశతో ఆమె కోసం అక్కడే ఉండాలనిపించింది. మంటపం లోకి వెళ్ళి కూర్చున్నాడు. సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ ఆలోచించసాగాడు.

ఆ రాత్రంతా మధుసూదనం విజయ ౦ ఎదురుచూస్తూ ఉండి పోయాడు. ఎప్పుడో నిద్రలోకి జారి పోయాడు. తెలివి వచ్చేసరికి తెల్లవారి పోయింది. మధుసూదనం కంగారుగా లేచి, తన రూంకి దారితీశాడు. దారి పొడుగునా విజయలక్ష్మి గురించి ఆలో

చించాడు. ఆమెను ఎలా కలుసుకోవాలో తెలియలేదు.

రూం తాళం తీస్తున్నప్పుడు ఆఫీసు వాచ్‌మన్‌వచ్చి, మధుసూదనం చేతికి టెలిగ్రాం యిచ్చాడు. రావుగార్ని వెంటనే హెడ్‌క్వార్టర్సుకు తిరిగి రమ్మని పై అధికారు లిచ్చిన 'ప్రయారిటీ మెసేజ్' అది.

"వాచ్‌మన్!... ఈ టెలిగ్రాం ఎప్పు డొచ్చింది?" సాధారణంగా ఆఫీసరుకి వచ్చే టెలిగ్రాములుగాని ఉత్తరాలుగాని స్టెనోకి యిస్తారు.

"రాత్రి తొమ్మిది గంటలకి వచ్చిం దండి. రాత్రంతా మీ కోసం చూశాను... మా అయ్యగారుకూడ లేరు, చెప్ప టానికి." వాచ్‌మన్ పైమీది రగ్గును సరిగ్గా చుట్టుకుంటూ చెప్పాడు.

"సరే!... నువ్వెళ్ళు..." అని చెప్పి, మధుసూదనం త్వరత్వరగా ముఖం కడుక్కొని బట్టలు మార్చు కున్నాడు. టెలిగ్రాం జేబులో పెట్టుకొని, టి. బి. కి బయలుదేరాడు, రిక్షా చేయించు కొని.

ఏ పరిస్థితుల్లోకూడ రావుగారు ఉండ టానికి వీల్లేదు. ఇనస్పెక్షన్ మధ్యలో ఆపి, వెంటనే బయలుదేరి వెళ్ళిపోతారు. మళ్ళీ ఎప్పుడో వచ్చి, యినస్పెక్షన్ పూర్తిచేస్తారు. ఇన్‌ఛార్జి బతికిపోయాడు. కానీ, తను మాత్రం యిబ్బందిలో పడ్డాడు. తను వెళ్ళిపోతే విజయలక్ష్మిని జీవితంలో మరి చూడలేడు. తను జీవి తంలో సుఖపడలేడుకూడ. రావుగార్ని పర్మిషన్ అడిగి తీసుకోవాలి. ఎలాగైనా విజయలక్ష్మిని చూడగలగాలి. అను కున్నది సాధించిన తర్వాతగాని తను తిరిగి వెళ్ళకూడదని మధుసూదనం నిర్ణ యించుకున్నాడు.

ప్రహరీగోడ కవతల రిక్షా దిగి పోయాడు, మధుసూదనం. పూర్తిగా తెల్లవారిందేమో కాంపౌండులో చెట్లమీద పక్షులు కోలాహలం చేస్తున్నాయి. మంచుకి తడిసిన కాలిబాట కొంచెం బుర దగా ఉంది. బంగళా వాచ్‌మన్, ఆర్డర్లీ అప్పారావు దూరంగా మంటముందు కూర్చొని చలి కాచుకుంటున్నారు.

బంగళా ముందు ఒక రిక్షాఉంది. అక్కడే ఉన్న ఇన్‌చార్జి డబ్బు లెక్క పెడుతున్నాడు. విలాసంగా సామ్రా జ్యాల నేలే మహారాజులా ఠీవిగా కని పిస్తున్నాడు. అంటే! రావుగారి బలహీన తలు తెలుసుకొని, రంగులు పూశాడని మధుసూదనం ఊహించాడు. రావుగారూ ఓడిపోయారు. గాంధీమహాత్ముడిలాంటి వారర్నికూడ తప్పుడుతోవ తొక్కించే నేర్పు ఇన్‌చార్జికుంది. ఇన్‌చార్జికి బుద్ధి చెపుతాడనుకున్న రావుగారు కూడ బుద్ధి లేని బురద మనుషులతో కలిసిపోయారు ఈ రోజుల్లో డబ్బుతో మనిషిని చాల సులువుగా కొనవచ్చును.

ఇన్‌చార్జి లెక్కపెట్టిన డబ్బు రిక్షాలో

కూర్చున్న ఆమెకి అందించాడు. ఆమె? ఆమెనుచూసి మధుసూదనం నిశ్చేష్టుడై పోయాడు. కొన్ని గంటల ప్రయాణంలో తనతో ఎన్నో విషయాలు మాట్లాడి, తన మనసులో చోటుచేసుకొన్న విజయలక్ష్మి-ఇన్‌చార్జి ఇచ్చిన డబ్బు తీసుకొని బ్యాగులో పెడుతుంది ఆమెతో తన జీవితాన్ని ముడిపెట్టుకోవాలని మధురమైన ఊహలతో రాత్రంతా మంచులో ఎదురుచూసిన విజయలక్ష్మి రాత్రంతా సుఖాన్ని అందించినందుకు ప్రతిఫలం అందుకుంటుంది. చెదిరిపోయిన ముంగురులు, నలిగి వాడిపోయిన పువ్వులు జుగుప్సను కలిగించాయి. అందమైన విజయలక్ష్మి అసహ్యంగా కనిపిస్తూంది.

''ఓ స్టేనోగారా?...ఇప్పుడే నేనూ వచ్చాను...అయ్యగారు లేచినట్లున్నారు" ఏదో మాట్లాడాలన్నట్లు యిన్‌చార్జి మాట్లాడేడు. అతని మాటలు వినిపించటంలేదు. అతను నవ్విన నవ్వే ఎక్కువగా వినబడింది.

"హల్లో!...మీరా?... మీకు డిసప్పాయింట్ చేసినట్లున్నాము...'' విజయలక్ష్మి గడుసుగా నవ్వింది. తలను మరో వేపుకి తిప్పుకుంది. అతన్ని చూడలేక సిగ్గుపడుతూ కాదు. నిద్రలేక ఎర్రబడిన కళ్ళను దాచుకోటానికి తలను తిప్పుకుంది.

మధుసూదనం మాట్లాడలేదు.

ఆహాటంగా గొప్పనీతులు చెబుతూ సమాజంలో ప్రతివ్యక్తి నీతిగా బతకాలని ఆదేశిస్తూ, తెరవెనుక నీతిమాలిన పనులు చేసే ఆఫీసరు రావుగారు, డబ్బుతో దేవుణ్ని కూడ మార్చగలిగే ధీమాతో జీవితంలో చాలా తేలికగా నెగ్గుకొస్తున్న కరప్టెడ్ యిన్‌ఛార్జి అందమైన అబద్ధాలతో తననొక ప్రత్యేకమైన వ్యక్తిగా చాటుకుంటూ, చాటుగా శరీరాన్ని అమ్ముకొనే రంగులబొమ్మ విజయలక్ష్మి-కాగితంపూలు మాదిరి మధుసూదనం కళ్ళముందు రెపరెపలాడేరు. కేవలం కాగితంపూలు మెరుపుచూసి, తను పూలూ పుష్పాలని భ్రమించాడు. చాల ఉన్నతంగా ఊహించుకున్నాడు. వాసన ఇవ్వలేని కాగితంపూలు వెలుగులో నిస్తేజంగా కనిపిస్తుంటే దారంలా ఆ కాగితంపూలకి చుట్టుకున్న తను సిగ్గుపడిపోయాడు.

ఆ కాగితంపూలు గురించి మధుసూదనం మరెప్పుడూ ఆలోచించలేదు.






"డాక్టర్—డాక్టర్...పెండ్లి...చేసు ... కోరూ, డా...క్ట"

ఇన్‌జెక్షన్ యిస్తున్న డాక్టరు మధు సూధనరావు చేతులు వణుకుతున్నాయి. బాధతో ముఖం ప్రక్కకు తిప్పుకొని నిల్చున్నాడు. పేషెంటు స్వరం క్షీణించి పోతున్నది. మరల మైకం వచ్చిందని తెలుసుకొని ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచి తన రూముకు బయలుదేరాడు.

ఎదురుగా వస్తున్న నర్సు గ్రేన్ నవ్వుతూ "డాక్టరుగారూ! మీ పేషెంటు ఎలావుంది? పాపం! సరే అని అన కూడదూ?" అన్నది. డాక్టరు మాట్లాడే పరిస్థితిలో లేదు. పల్కకుండా తన రూముకుపోయి కూర్చొని ఆలోచిస్తున్నాడు.

రోజూ అనేక ప్రాణాలు పోవటం చూట్టానికి అలవాటుపడ్డ యీ నర్సులకు, డాక్టర్లకు ఎంత భయంకర పరిస్థితికూడా బాధ కలిగించదు. ప్రాణం విలువే తెలియకుండా పోతుంది. కాని తను క్రొత్తగా యీ వృత్తి ప్రారంభించాడు. కాబట్టి పూర్తిగా హృదయం మొద్దుబారి పోలా. ఒక్కొక్క ప్రాణం పోయినప్పుడల్లా తను చాలా బాధపడతాడు. కాని యిలాంటి హృదయ విదారక దృశ్యం

యింతకుముందు ఎప్పుడూ తను చూడ లేదు.

ఆ అమ్మాయికి దాదాపు ఇరవై నాలుగు సంవత్సరా లుండవచ్చు. రాత్రి పదిగంటలకు వార్డులో చేరేప్పటికి స్పృహలేదు. తను ఇన్‌జెక్షన్ ఇవ్వగానే కళ్ళు తెరిచింది. తెరుస్తూనే ఎదురుగా నిల్చొనివున్న తననే పిచ్చిగా చూసింది. ఆమె తనజీవితంలో అనుభవించిన బాధ నంతా ఆ కళ్ళలోనే దాచుకున్నదా అని పించింది. మరల పాలిపోయి క్షీణించి వున్న పెదాలు కొంచెంగా కదిలాయి. అవి ఏదో చెప్పటానికి ప్రయత్నిస్తు న్నాయి. తను దగ్గరకు వంగి వినటానికి ప్రయత్నించాడు. క్షీ ణ స్వ రం లో 'డాక్టర్...నన్ను...నన్ను...పెండ్లి చేసుకోరూ' అన్నమాటలు విని తెల్లబో యాడు. ఆమె అదే వాక్యాన్ని రెండు మూడు సార్లు వల్లించి మరల మైకంగా పడిపోయింది.

ఆమెకు కొంచెం స్పృహ వచ్చినప్పు డల్లా అదేవాక్యం పలవరిస్తూ వున్నది. డాక్టరుకు ఏమిచెయ్యాలో ఏమనాలో బోధపడటంలేదు. ఆమె యిలా డెలీరి యంలో అనటానికి కారణమేమైంటుందా? అని ఆలోచిస్తున్నాడు.

"డాక్టర్! పదకొండవ నెంబరు బెడ్ వెరీ సీరియస్," అన్న గ్రేసు మాటలకు ఉలిక్కిపడి, యంత్రంలాగ లేచి ఆమె వెంట భారంగా నడిచి వెళ్ళాడు.

* * *

గిరిజ అతి సాధారణ కుటుంబములో, చాలా చిన్న గ్రామంలో జన్మించినా, చిన్నప్పటినుంచి జీవితాన్నిగూర్చి ఎన్నో కలలు కనేది. చాలావరకు తన సమ యాన్ని ఊహాసౌధాలలోనే గడిపేది. తనతోటి పిల్లలతో కలిసి ఎప్పుడూ బొమ్మలాటలుకానీ, అమ్మలాటలుకానీ ఆడేదికాదు. ఆమెకు అలాంటి ఆటలంటే అసహ్యం.

ఊహాసౌధాలంటే సాధారణంగా ఆ ఈడు పిల్లలు నిర్మించుకునేవి కావు. తనూ అందరి ఆడపిల్లల్లాగా అత్త వారింట్లో అంట్లు తోమవలసిందేనా? ప్రొద్దస్తమానమూ యింటి చాకిరీ, అత్త మామల చాకిరీ, భర్తచాకిరీ చేసి పొట్ట నింపుకోవలసిందేనా? అత్తకు మనమ ళ్ళను ఎత్తుకోవాలసివుంటే పిల్లలను కన వలసిన బాధ్యతకూడ తనదే. పిల్లలను కంటూ, వాళ్ళు పెట్టే బాధలతో ఏడ్పు లతో ఓపికలేక చచ్చి, విసుగుతోకూడిన జీవితాన్ని గడపవలసిందేనా? మిగతా సమయాల్ని ఎల్లమ్మ పుల్లమ్మ కబు ర్లతో గడపవలసిందేనా? ఇంతకంటే స్త్రీకి సమాజంలో వేరే స్థానం లేదూ! ఈ పనులన్నీ తనఅమ్మా చేసింది, అమ్మమ్మా చేసింది. తను అలాంటి అతి సాధా రణ జీవితాన్ని గడపలేదు. ప్రపంచంలో నూటికి నూరుమందీ గడిపేలాంటి జీవి తాన్ని తను గడపదు. తనలాంటివారు వెయ్యికి ఒక్కరుకూడ ఉండరు.

ఇలాగ గిరిజ ఆలోచిస్తూ ఉండేది. ఎస్.ఎస్ ఎల్.సి. పాసయిన తరువాత యింకా చదవాలనే ఉద్దేశం వున్నప్పటికీ చదవలేకపోయింది. దానికి కారణం కుటుంబ ఆర్థిక పరిస్థితే. బంధువులకు, కులపువాళ్ళకు ఇష్టం లేకపోయినా ఆమె ఉద్యోగంచేయ నిశ్చయించు కున్నది. ఆమె తల్లిదండ్రులుకూడ అటంకపరచలేదు.

కొద్దిరోజుల్లోనే తెలిసినవాళ్ళద్వారా ఒక ఆఫీసులో ఉద్యోగం దొరికింది గిరిజకు. జీతం నెలకు ఎనభై అయిదురూపాయలు. మద్రాసులో అమ్మా నాన్నల్ని వెంటబెట్టుకుని వెళ్లి ఉంటున్నది

ఆమె మాటల్లోని నిండుతనమూ, చూపుల్లోని గాంభీర్యమూ, నడకలోని ఠీవీ చూసిన ప్రతివారూ ఆమెను గౌరవించకుండా ఉండలేరు. ఆమె అందరితో చాలా ఫ్రీగా మాట్లాడేది. స్త్రీలతో మాట్లాడేటప్పుడు ఎలాఉండేదో అలాగే నిర్వికారంగా పురుషులతో మాట్లాడేటప్పుడుకూడ ఉండేది. కొంతమంది స్త్రీలు పురుషులతో మాట్లాడేటప్పుడు ఎందుకు సిగ్గుపడతారో ఆమెకు అర్థం కాదు. అలాగ కులుకుతూ, కళ్ళుతిప్పుతూ సిగ్గుపడే ఆడపిల్లలంటే ఆమెకు పరమ అసహ్యం.

సిగ్గు అనేది స్త్రీలలోని బలహీనత మాత్రమేనని ఆమె అభిప్రాయం. అందువల్లనే సిగ్గు అభినయించాలంటే ఆమెకు చాలా సిగ్గు. అంటే ఆమె సిగ్గు విడిచిందనికానీ, బొత్తిగా సిగ్గు లేదని కాని అనుకోకూడదు. ఆమెకు ఈ సిగ్గు అభినయించే చాలాఆడవాళ్ళకంటే చాలా ఎక్కువ సిగ్గే. అందువల్లనే ఆమె ఎప్పుడూ చాలా జాగ్రత్తగా, నిర్వికారంగా, గంభీరంగా, వేలన్నుతప్పకుండా జీవితాన్ని లాక్కువస్తుంది.

మూడు సంవత్సరాలు గిరిజ జీవితంలో సాఫీగా గడిచిపోయాయి, ఏ వడుదుడుకులూ లేకుండా. ఈ మధ్యలో ఆమెకు చాలా మంది స్నేహితులు పోగయ్యారు. స్నేహితులతో కులాసాగా కాలం గడుపుతుంది. ఒకవిధంగా తన ఆదర్శాలన్నింటినీ మర్చిపోయిందనే చెప్పాలి. అంటే ఏదో చేయాలి, ఏమో కావాలి అనే కోర్కె తగ్గింది. కాని మొత్తంమీద జీవితంలో ఏదో వెలితి అనుభవిస్తున్నది. అదేదో ఆమెకే అర్థం కాదు ఎంత ఆలోచించినా.

క్రమంగా ఆమె వాస్తవిక జగత్తులోకి వస్తున్నది. జీవితమంటే ఏమిటో అర్థమవుతున్నది. ఒక్కొక్కసారి వంటరిగా కూర్చొని గంటలతరబడి ఆలోచించేది. ఒక స్త్రీ ఒక పురుషుడు ఏ యిద్దరు స్త్రీలలాగానో లేక ఏ యిద్దరు పురుషులలాగానో స్నేహభావంతో ఎందుకు మెలగలేరు? ప్రపంచం అనేక విధాలుగా ఎందుకు ఆడిపోసుకుంటుంది?

తను నాలుగురోజులు నవ్వుతూ

మాట్లాడేప్పటికి రామారావు పెండ్లి చేసుకోమన్నాడు. సుబ్బారావు ప్రేమి స్తున్నానన్నాడు. అతని ప్రేమ క్షణికం కాదట. అతని ప్రేమకు ప్రతిఫలం లభించనిపక్షంలో ఆత్మహత్య చేసు కుంటానని బెదిరించాడు రాజారావు జీవితమంతా బ్రహ్మచర్యం అవలంబిస్తా నని ప్రతిజ్ఞచేశాడు. ఇలాగ తనకు పరిచయమైన ప్రతివాడూ కొంచెం పాత పడగానే తన ప్రేమను ప్రకటించేవారే. ఈ రోజు వాళ్ళంతా పెళ్ళిళ్ళు చేసుకుని కులాసాగా జీవితం గడుపుతున్నారు. అంతేకాదు అందులో కొంతమంది తనను గురించి దుష్ప్రచారం కూడా చేస్తు న్నారు.

ఒకోసారి తనప్రవర్తనే దీనికంతా కారణమేమోననే అనుమానం కలుగు తుంది. కాని తన ప్రవర్తనలో ఎలాంటి బలహీనతా కన్పించదు. ఒకటిమాత్రం ఒప్పుకోక తప్పదు. ఒక్కొక్కడూ తనదగ్గర ప్రేమను ప్రకటించి తిరస్క రింపబడి, ముఖం వేలవేసుకుని వెళ్ళి నప్పుడల్లా తనకేదో తృప్తిగా వుంటుంది. ఒక రకమైన ఆనందం కూడా కలుగు తుంది. బహుశా అందువల్లనే కావచ్చు తారీఖులతోసహా ఎవరిని ఏ రోజు ఎలా ఏడ్పించినదీ యిప్పటికీ తనకు జ్ఞాపకం వుంది.

ఒకోసారి యిదంతా ఆలోచిస్తే బాధగా కూడా ఉంటుంది. తనచేత తిరస్కరింపబడిన వారిమీద జాలి కలుగుతుంది, మళ్ళీ సరిపెట్టుకుంటుంది. తను మాత్రం ఏం చేయకలుగుతుంది? తనకు ప్రేమ అనే ఆ రెండు అక్ష రాలకూ అర్థంతెలిస్తేకదూ ప్రేమించ టానికి? సాధారణంగా నూటికి నూరు మందిలో వుండే ఆ బలహీనత తనలో ప్రవేశించటం అసంభవం. అదేమిటో కాని తనను ఎవరైనా చాలా యిష్టపడు తున్నట్లు బయటపడితే తను సహించ లేదు. అలాంటివారంటే తనకు చాలా అసహ్యం.

ఈ మధ్య రంగారావుతో ఆమెకు కొత్తగా పరిచయమేర్పడింది. అతనిది ఎప్పుడూ నవ్వుతూఉండే స్వభావం. ఎప్పుడూ చాలా కులాసాగా, హుషారుగా కబుర్లు చెబుతుంటాడు. బాగా చదువు కున్నవాడూ, సంస్కారం కలవాడూ కూడా.

గిరిజను నిలేసి, 'నీకు అతనంటే యిష్టమా?' అని అడిగితే చస్తే ఒప్పు కోదు. కాని అతనంటే తనకు యిష్టమా అని అప్పుడప్పుడూ ఆమెకే అనుమానం కలుగుతుండేది. కొంతకాలంపాటు రంగా రావు తనప్రేమను వెల్లడించకపోతే ఎలా పోయి ఎలా వచ్చేదో! కాని ముక్కుకు సూటిగాపోయే రంగారావు ఒకరోజు అడిగేశాడు—

"నీవంటే నాకు యిష్టం, నేనంటే నీకు యిష్టమేనా?" అని.




ఆ ప్రశ్నతో గిరిజ ఉలిక్కిపడ్డది. చాలా సిగ్గు, కోపం కలిగాయి. కాని నిబ్బరించుకొని "లేదు" అన్నది. కాని ఆ "లేదు" అనేటప్పుడు యింతకుముందు కలిగే ఆత్మతృప్తిగాని ఆనందంగాని యీమారు కలగలేదు. ఒకరకమైన బాధ కూడా కలిగింది. తన హృదయాన్నంతా వెతకసాగింది. ఏ మూలనన్నా ఆతనికి స్థాన మున్నదేమోనని.

తలెత్తి చూసింది. రంగారావు లేడు. ఆశ్చర్యం కలిగింది. అంత త్వరగా, తేలిగ్గా వదులుతా డనుకోలా. కొంచెం బుర్రవున్నవాడే అనుకున్నది.

ఆ రాత్రంతా గిరిజకు నిద్రపట్టలేదు. తను చేసింది పొరపాటని హృదయం ఘోషిస్తున్నది. కాని మనస్సు చాలా తెలివైనదానివని వీపు తడుతున్నది.

రెండవరోజు రంగారావు స్నేహితుడు ప్రభాకర్ అతన్ని వెతుక్కుంటూ వచ్చాడు. రాత్రినుండి అతను రూముకు రాలేదట.

ప్రభాకర్ డాక్టరు చదువుతున్నాడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే ఘటం. తూచి తూచి మాట్లాడతాడు. సాధారణంగా యిలా తక్కువ మాట్లాడేవాళ్ళ మాటలు ఎక్కువగా వ్యర్థంపోవు. ఇతరులమీద వీరి ప్రభావం చాలా పడుతుంది. ఇలాంటివారు వీలయినంతవరకు ఇతరులనుండి వినప్రయత్నిస్తూ, తాము మాత్రం చాలా తక్కువ మాట్లాడుతారు.

ప్రభాకర్ ఒకటి రెండుసార్లు రంగారావుతో గిరిజ యింటికి వచ్చాడు. ఆ కొద్ది పరిచయంలోనే చాలావరకు గిరిజను అర్థంచేసుకున్నాడు అందువల్ల రంగారావును తొందరపడవద్దని హెచ్చరించాడు కూడా. మొగవాడు

ఎంత తొందరపడి తన ప్రేమను వెల్ల డిస్తాదో ఆడదాని దృష్టిలో అంత తేలి కయిపోతాడని అతని నమ్మకం.

గిరిజనుండి సరైన జవాబు రాన ప్పటికీ, జరిగిందంతా వూహించు కున్నాడు.

"రంగారావుకు మీరు చాలా ద్రోహం చేసినట్లు తెలుసుకున్నారా? అతన్ని మీరు సరిగా అర్థంచేసుకోలేదు. మరల చస్తే తిరిగి రాడు" అన్నాడు కొంచెం తీవ్ర స్వరంతో.

"దానికి నేను బాధ్యురాలను కాను. ఆడది కొంచెం స్వతంత్రంగా మాట్లాడ గానే అపార్థంచేసుకోవటం, మరలా తమ కేదో ఘోర అన్యాయం జరిగినట్లు ఊహించుకొంటూ ప్రపంచంనుండి పారి పోవడం— అది ఆడదాని తప్పా?" చాలా తీవ్రస్వరంలో అన్నది గిరిజ.

ప్రభాకర్ మౌనంగా కూర్చొని ఆలో చిస్తున్నాడు. స్త్రీ తన ప్రేమను వెల్ల డించదు. పురుషుడ్ని కవ్వించి అతని చేత చెప్పించి మరల తేల్గ్గా ఎందుకు చూస్తుందో? స్త్రీ ఎలాంటి పరిస్థితిలోనూ తానే ముందు బయటపడదా? ముఖ్యంగా తన సంయమశక్తిమీద అంత గర్వమూ, అహంకారమూగల గిరిజ?

'కాఫీ తాగండి తరువాత ఆలో చిద్దురుగాని' అన్న మాటతో ఉలిక్కిపడి యధాలాపంగానే కప్పు చేతిలోకి తీసు కున్నాడు. ఎదురుగా కూర్చుని కాఫీ తాగు తున్న గిరిజ ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తున్నాడు. అతనలా చూడటం గిరిజకు చాలా సిగ్గుగా వున్నది. అటూ యిటూ చూస్తూ అతన్ని మాట ల్లోకి దించ ప్రయత్నిస్తున్నది. కాని మౌనంగా కూర్చొని ఆమె మాటలను మాత్రమే వింటున్న ప్రభాకర్ ముందు ఎక్కువసేపు మాట్లాడలేకపోయింది. టేబుల్ మీదవున్న పుస్తకాన్ని తిరగేస్తూ కూర్చున్నది.

'ఇంక నే వస్తాను' అంటూ జవాబుకు ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు ప్రభాకర్. ప్రభాకర్‌లాంటి మగ వాళ్ళను గిరిజ జీవితంలో మొదటి సారిగా కలుసుకున్నది. ఇంతకు ముందు కలుసుకున్నప్పుడు కొత్త వల్లనూ, రంగారావు కూడా వుండటంవల్లనూ అత నలా మౌనంగావున్నా డనుకున్నది. ఇంకొకసారి ప్రభాకర్‌ను కలుసుకుంటే బాగుండుననిపించింది. మరల కాలుజారు తున్నది. 'జాగ్రత్త' అని లోలోన ఎవరో హెచ్చరిస్తున్నారు.

ఎంత మర్చిపోవాలని ప్రయత్ని స్తున్నదో ప్రభాకర్ అంత జ్ఞాపకం వస్తు న్నాడామెకి. ఆఫీసు పనిలోకికూడ మనస్సు పోవటంలేదు. మరల తన యింటికి వస్తాడా? ఒకవేళ రాకపోతే? రాకపోతే తనకేంలేదు, తప్పక వస్తాడు. ఆఫీసుపనిలో విసుగు కలిగినప్పుడల్లా అరచేతిలో ప్రభాకర్ పేరురాసి చెరుపు

తూన్నది. ఈ వారంరోజుల్లో ఎక్కడ ఏ పేపరు దొరికినా ప్రభాకర్ పేరు రాయడం జరుగుతున్నది. తనలో బల హీనత ఏర్పడుతున్నది. చివరకు తనూ అమ్మా అమ్మమ్మల జీవితాన్ని గడపటానికే తహతహలాడుతున్నది. కాదు. ఎప్పటికీ కాదు. తన ఉన్నత భావాలేమైనవి ?

ఇక ప్రభాకర్ పేరుకూడా ఉచ్చ రించదు. తను తప్పక ఆదర్శమయ మైన జీవితం గడపాలి. అంటే ఏం చేయాలి? ఉద్యోగంలో ప్రవేశించక ముందు ఉద్యోగం చేయటమే జీవితా దర్శ మనుకున్నది. కాని ఇప్పుడు ఏదో అసంతృప్తి తనను వెంటాడుతూంది. ఎనభై అయిదు రూపాయల చాలీచాలని జీతం. పొద్దస్తమానం సిరామరకలలో నిండి నలిగివున్న ఫైల్సు, సిరాబుడ్డి, కలం—యిదేనా తన జీవితం. ఆదర్శ మయ జీవితం ?

కాదు. తను తప్పక పైకిపోవాలి. ప్రైవేటుగా ఇంటరు, బి. ఎ., పాసు కావాలి. తరువాత? కొంచెం ఎక్కువ జీతం యిచ్చే ఉద్యోగం వస్తుంది. సరి, బాగానే ఉంది. ఆ తరువాత? జీతం పెరగటమేనా జీవితాదర్శం ?

కాదుమరి? ప్రభాకర్‌ను పెండ్లిచేసు కుంటే? ఛీ. విసుగుతో మధ్యాహ్నం సగం వరకూ చదివిన నవల తీసుకుంది చేతిలోకి.

మరల ఆలోచన్లు ఈగల్లాగ ముసురు కుంటున్నాయి. అందులోని కథానాయిక స్వభావంకూడ తన స్వభావం లాంటిదే. కాని ఒక భేదం మాత్రం కన్పిస్తున్నది. తన జీవిత లక్ష్యం ఒకటంటూ నిర్ణ యించుకోలేక పోతున్నది. కాని ఆమె మాత్రం తన జీవిత లక్ష్యాన్ని దేశ సేవగా పెట్టుకున్నది. మగవాళ్ళతో ఎంత చక్కగా, ధైర్యంగా కలిసి మెలిసి పనిచేస్తుంది! ఆ మగవాళ్ళు కూడా తనుచూసిన వాళ్ళకు భిన్నం గానే ఉన్నారు. ఎంత చక్కగా దేశ, విదేశాల సమస్యలను గురించి చర్చించు కుంటారు! ఎవరూ ఎవర్నీ అనుమా నించరు అసలు వారు స్త్రీ పురుష భేదాలను గుర్తిస్తున్నట్లే కన్పించరు. తనుకూడా ఏ విప్లవకారుల ముఠాలోనో చేరితే?

కాని తనలో అంత ధైర్యమూ, శక్తివుందా? రాత్రిళ్ళు వంటరిగా నాలుగు గోడల మధ్య ఉండడానికే భయపడు తుంది. అలాంటి ఆమె కొండ గుహల్లో, అరణ్యాల్లో ఉండగలదా?

గిరిజ మొదటినుంచి ఇలాంటి కలల తోటే కాలం గడిపేది. కాని యిప్పుడు బలహీనతను దాచుకోవడానికి పగటి కలలు మరింత ఎక్కువయినాయి. కలలు కనటం తప్పుకాదు. కాని ప్రతి కలా నిజం కావాలని ఆశిసూ వాస వికి

జగత్తునుండి పారిపోవ ప్రయత్నించ టమే గిరిజ చేసినతప్పు.

ఆదివారం వచ్చింది. ప్రభాకర్ వచ్చాడు. గిరిజ గుండెలు వేగంగా కొట్టు కొంటున్నాయి. అతన్ని కూర్చోమంటూ నే పోయి అద్దంముందు నిలబడింది. పౌడర్ కొట్టుకుని, ముంగురులు సరిచేసుకునివచ్చి కూర్చున్నది.

"ఏమండీ, ఎక్కడికేనా వెళ్లుతున్నారా?" అన్నాడు ప్రభాకర్.

"లేదే, ఏమి?" అన్నది గిరిజ, అలా ఎందు కడుగుతున్నారో అర్థంకాక.

"ఆఁ ఏంలేదు. పౌడరువేసుకుని వచ్చారులాగున్నది. అందువల్ల బయటకు వెళ్ళబోతున్నారేమో అనుకున్నాను" అన్నాడు వచ్చే నవ్వు ఆపుకుంటూ

గిరిజకి తల కొట్టేసినట్లయింది. యింకొకరయితే యీపాటికి గెటవుట్ అని ఉండేది. అసలు యింకొకరు మాట్లాడేప్పుడు తనకు పౌడరు వేసుకోవాలనిపిస్తే గదా? చివరకు చేసేదేమీలేక చాలా కొంటెగా మాట్లాడుతాడని గురిపెట్టుకున్నది.

మరల నిశ్శబ్దం. గిరిజ చాలా ఇరుగ్గా ఫీలవుతున్నది. తనకు ఏరోజూ ఎవరి ముందూ సిగ్గు కలగంది ప్రభాకర్ ముందు ఎందుకో అంత సిగ్గు? అతన్ని చూస్తేనే అదోలా వుంటుంది. ఎలా వుంటుందని ఎవరైనా అడిగితే తనకు చెప్పటంరాదు. అతను ఏమన్నా తనకు కోపంరాదు. పైగా అతని ఒక్కొక్క మాట తన హృదయంలో చక్కలిగింతలు పెడుతుంది.

"ఏమిటో చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నారు" అన్న ప్రభాకర్ మాటలకు గిరిజ ఉలిక్కిపడి అతని ముఖంలోకి చూసింది. అతను సిగరెట్టుపొగ ఊదుతూ ఆ అలలలోకే దీక్షగా చూస్తున్నాడు. అతను తనను చూడటంలేదు కాబట్టి అతని ముఖాన్ని చూస్తున్నది. ఇంకా కొంచెంసేపు అలాఉంటే బాగుండుననిపించింది. ప్రభాకర్ కళ్ళలో ఆమె కళ్ళు కలవగానే రెప్పలు సిగ్గుతో బరువుగా వాలిపోయాయి.

క్రమంగా రెండు సంవత్సరాలు రెండు రోజుల్లాగ గడిచిపోయాయి గిరిజకు ప్రభాకర్ దాదాపు ప్రతి ఆదివారం వస్తూనేవున్నాడు. రెండు సంవత్సరాలక్రితం ఒకరికొకరు ఎంత దూరంగా ఉన్నారో ఇప్పుడూ అంతే. ఒకరికంటె ఒకరు చాలా మర్యాదగా, తెలివిగా, తూచితూచి మాట్లాడతారు. కాని ఎంత జాగ్రత్తగా ఉన్నా గిరిజ మాత్రం అప్పుడప్పుడూ మాటల్లో ప్రభాకర్‌కు చిక్కిపోతూనే ఉంది.

ఒకోసారి గిరిజకు తనమీద తనకే జాలికలుగుతుంది. గంటలతరబడి ప్రభాకర్ హృదయంలోని భావాన్ని గ్రహించటానికి ఆలోచించేది. తనను ప్రభాకర్ ఎందుకు యిలా ఏడిపిస్తున్నాడు? తనను



యిలా ఊబిలోకి లాగి ఏడ్పించినందు వల్ల అతనికి కలిగే లాభం ఏమిటి? అతను నిజంగా ప్రేమిస్తున్నాడా? ప్రేమిస్తే యింతకాలం బయటపడకుండా ఉండగలుగుతాడా? అలా ఉంటే బట్టే కదూ తను అతన్ని ప్రేమి... కాదు ఇష్టపడుతుంది. లేకపోతే యీ ప్రభాకర్ అందరిలో ఒకడైపోయేవాడే గదూ?

బహుశా అతను తన స్వభావాన్ని అర్థంచేసుకునే తన ప్రేమను గుప్తపరుస్తున్నాడేమో! అలాగయినా, ఇప్పుడు అతనంటే తనకు పూర్తిగా ఇష్టమని తెలుసుకున్న తరువాతనైనా ఎందుకు బయటపడకూడదు? కొన్నిసార్లు కొన్ని విషయాలలో తనే కొంత సిగ్గుపడింది. అప్పుడుకూడ అతను తనకు ఏమీ అంటనట్లే ప్రవర్తించేవాడు.

ఒకరోజు అతని నిర్లక్ష్యతను చూస్తూంటే ఆమెకు చాలా కోపం, బాధ కూడా కలిగేవి. ఆడవాళ్ళు ఇలా బాధ పడేప్పుడు చూడటం అతనికి సరదా ఏమోనని అనుమానం కలిగేది. తను మాత్రం తక్కువేం తిన్నది? పాపం! ఆ రంగారావు ఎంత బాధ పడ్డాడో? ఎక్కడ ఉన్నాడో, ఎలా ఉన్నాడో

కూడా ఎవరికీ తెలియదు ఎంతటి కపటంలేని మనిషి. అతని ప్రేమనే స్వీకరించి ఉంటే...

తనను దేవతలాగ పూజించి ఉండే వాడు.

చిట్టచివరకు ప్రభాకర్ కేవలం తనను ఏడ్పించటానికే ఇలా స్నేహం చేస్తున్నాడని ఊహించుకుంది. అతను పరిచయమైనా తనను ప్రేమిస్తున్నట్లు కన్పిస్తాడేమోనని గంటలకొద్దీ ఆలో చించేది.

అదీ లేదు. తనకు గుర్తున్నంత వరకు అతని మాటలవల్ల తన హృదయ బలహీనత బయటకుమాత్రం ఎప్పుడూ తనకు చిక్కలేదు.

ఒకరోజు తనకు చాలా ఇష్టమైన చీరె కట్టుకున్నది. ప్రభాకర్ వచ్చినవాడు ఊరుకున్నాడా? "ఈ చీరెలో మీరు చాలా అందంగా ఉన్నాననుకుంటు న్నారు గదూ?" అన్నాడు.

తన హృదయం చాలా బాధపడింది ఆరోజు. ఇంకొకరోజు, "పాపం మీరు చాలా జాగ్రత్తగానే ఉంటారు. కాని అప్పుడప్పుడు మాత్రం మీకు తెలియ కుండానే బయటపడుతుంటారు" అన్నాడు.

పోయిన ఆదివారం రోజు అతను జేబులోనుండి సిగరెట్టుపెట్టె తీసుకునే ప్పుడు ఒక ఫోటో క్రిందపడింది. అది చేతిలోకి తీసుకుని చూసింది. ఒక అంద మైన అమ్మాయి ఫోటో. తను ఫోటో చూస్తూంటే ప్రభాకర్ తన ముఖంలోకి చూస్తున్నాడని గ్రహించుకుని అడి గింది "ఈ అమ్మాయి ఎవరూ?" అని.

"నీలాంటి ఒక స్నేహితురాలు," అన్నాడు.

ఆ మాటలకు తను చాలా బాధ పడ్డది. పలక్కుండా ఫోటో టేబిల్‌మీద పెట్టింది

"ఏం. ఈర్ష్య కలుగుతోందా?" అన్నాడు నవ్వుతూ కళ్ళల్లోకి చూస్తూ.

"నా కెందుకండీ ఈర్ష్య" అంటూ నవ్వ ప్రయత్నించింది.

"అదేమాట నా కళ్ళల్లోకి చూస్తూ చెప్పండి" అన్నాడు. తనకు నిజంగా కోపంకూడా వచ్చింది.

"అంటే మీ అభిప్రాయం?" అన్నది కొంచెం తీవ్రంగానే. కానీ ఆ మాట అనే ప్పుడు అతని ముఖంలోకి కాక ఎక్క డికో చూస్తున్నది.

ఇదంతా ఒకసారి తిరిగి తల్చుకుంటే ఆమెకు ఎప్పుడూ ఎక్కడా ప్రభాకర్ తనను ప్రేమిస్తున్నట్టు కన్పించలేదు.

ఒక్కోరోజు విసుగుపుట్టేది గిరిజకు ఇలా ఎన్నిరోజులు? పోనీ తనే తన ప్రేమను ప్రకటించి అతని అభిప్రాయం అడిగితే? కాని ఒకవేళ ప్రభాకర్ తన ప్రేమను తృణీకరిస్తే? బాధకంటే ముందు అవమానంతో తను ఆత్మహత్య చేసుకోవాలింక. ఎంత బాధనైనా

హృదయంలో దాచుకుని తను బ్రతక గలుగుతుంది. కాని ఒకసారి అవమా నింపబడి తను బ్రతకలేదు. ప్రభాకర్ ఒప్పుకున్నా, ముందు తానే అతన్ని పెండ్లిచేసుకోమని కోరి దాంపత్య జీవితం సుఖంగా గడపగలుగుతుందా ?

ఇలాంటి మానసిక సంఘర్షణలోనే మూడు సంవత్సరాలు దొర్లిపోయాయి. ఇప్పుడు ప్రభాకర్ హౌస్ సర్జనుగా పని చేస్తున్నాడు. గిరిజ జీవితంలో ఏ మార్పూ లేదు. "గొర్రెతోక బెత్తెడే" అన్నట్లు న్నాయి జీతం, జీవితమూనూ.

గిరిజ ఆశలన్నీ నిరాశలుగా మారు తున్నాయి. జీవితంమీదనే విరక్తి కలుగుతున్నది. ప్రభాకర్ మొదటినుండి చివరివరకు తనకు ఒక ప్రశ్నలాగ తయారయ్యాడు. ప్రభాకర్ మనస్సు లోని అభిప్రాయాన్ని గ్రహించేశక్తి తనకులేదు.

చివరకు అతను తనను ప్రేమిం చటంలేదని నిర్ణయించుకొంది. ఎలా ప్రేమిస్తాడు? అతను ఒక డాక్టరు, డబ్బున్నవాడు. పైగా అందగాడిననే ధీమాకూడా ఉంది. మరి తనో, ఒక మామూలు క్లర్కు. చెప్పుకోతగ్గ అందమూలేదు. పెద్దలు సంపాదించిన దైనా ఇంత ఉన్నదా అంటే, అదీ లేదాయె. ఇక తనలో ఏ గుణాన్ని చూసి ప్రభాకర్ తనను ప్రేమిస్తాడు ? ఈ ఆలోచనే మూడు సంవత్సరాల క్రితం తట్టిఉంటే? ఇప్పుడు సమయం మించి పోయింది. అక్కడినుండి వెనక్కు పోలేదు. జీవిత యాత్రలో ఎంతోమంది వ్యక్తులతోటి పరిచయం కలుగుతుంది. అందులో చాలా కొద్దిమంది మాత్రం హృదయ కవాటంవరకూ ప్రవేశిస్తారు. ఆ కొద్దిమందిలో ఏ ఒకరిద్దరో లోపలకు తొంగిచూడ గలుగుతారు. కాని లోప లకు ఒక్కరు మాత్రమే ప్రవేశించ గలరు. ఆ అదృష్టం ఏ కొద్దిమందికో కలుగుతుంది.

రామారావు, సుబ్బారావు మొదలైన వారు తన హృదయకవాటం వరకూ వచ్చికూడా విఫలులై వెళ్ళిపోయారు. రంగారావు తొంగిచూడగలిగాడు. కాని ఈ ప్రభాకర్ సునాయాసంగా లోపల ప్రవేశించటమే కాకుండా హృదయా న్నంతా ఆక్రమించుకున్నాడు

ఈమధ్య ప్రభాకర్ గిరిజ యింటికి రావటం తగ్గించాడు. వచ్చినా ముళ్ళ మీద నిల్చున్నట్లు కన్పిస్తాడు. గిరిజ మీద దయదలచి వస్తున్నట్లుంటుంది అతని మాటల ధోరణి. గిరిజ హృదయం అతను ఇంత నిర్లక్ష్యంగా, నిర్దయగా మాట్లాడుతూంటే బాధతో మూల్గేది. కాని ఆ మూల్గు ప్రభాకర్ చెవులవరకూ పోకుండా అణచిపెట్టేది.

అతను వెళ్ళిపోతుంటే "మరల ఎప్పుడు వస్తారూ" అని అడగాలని పించేది. కాని ఆత్మాభిమానం ఆమె

పెదాలను బంధించేది. అతని రాక పోకలవల్ల తనకు ఎలాంటి ఆనందమూ, బాధ లేనట్లు ప్రవర్తించేది.

ఒకోసారి అతను చాలా తేలిగ్గా చూస్తున్నాడనే భావం రాగానే ఆమెకు అభిమానం వచ్చేది. హృదయానికి దెబ్బతగిలేది. ఈసారి అతను వచ్చి నప్పుడు తానూ చాలా నిర్లక్ష్యంగా ప్రవ ర్తించాలని ఊహించుకునేది. ఒకరోజు వీలయినంతవరకు అవమానపరచి "నీవు ఊహించుకున్నట్లు నీమీద నాకెంతప్రేమ ఒలికిపోవటంలేదులే" అన్నట్లు ప్రవ ర్తించాలనుకుంటుండేది.

కాని ప్రభాకర్‌ను చూడగానే ఆమె కోపమంతా మంచుగడ్డలాగ చల్లబడి పోయేది. దీపంముందు కరిగిపోయే క్రొవ్వొత్తిలాగ ఆమె ఆత్మాభిమానం ప్రభాకర్ మౌనంముందు కరిగిపోయేది.

ఒకరోజు ప్రభాకర్ అకస్మాత్తుగా రాత్రి ఎనిమిది గంటలకు వచ్చాడు. గిరిజ కిటికీదగ్గర కుర్చీలో కూర్చుని ఎక్కడో శూన్యంలోకి చూస్తోంది. ఆమె కళ్ళవెంట నీరు కారుతోంది. ప్రభాకర్ దగ్గేంతవరకూ ఆమె ఈ ప్రపంచంలోకే రాలేదు.

అతను చూడకుండా కన్నీళ్ళు తుడు చుకో ప్రయత్నించింది. "ఏడుస్తున్నా రెందుకండీ?'' అన్న అతని మాటలకు సిగ్గుపడింది.

అతని ముఖంలోకి చూసింది. అదే కొంటెచూపు, చిరునవ్వు, మౌనం. గిరిజ శరీరమంతా అవమానంతో, బాధతో వణికిపోయింది. గుండెల్లో గంగాళాలు కుతకుత లాడుతున్నాయి 'ఛీ, రాక్షసుడా, నా జీవితాన్ని నాశనం చేశావు' అని గట్టిగా అరవబుద్ధయింది. కాని అరవలేదు. వణుకుతున్న పెదాల తోనే ఉద్రేకాన్ని అణుచుకుంది. ఎలా తిడుతుంది? ఏమని తిడుతుంది? ప్రభా కర్ తన పాత్రను చాలా నేర్పుగా నిర్వహించుకున్నాడు. అతను తనకు ఏమన్నా ఆశలు చూపించాడా? ఆశలు చూపలా? చూపాడు కాని నోటితో కాదు, మౌనంగానే...

''మీరూ అందరు ఆడపిల్లల్లాగానే ఏడుస్తారన్నమాట." ఈ మాటల్లోని వ్యంగ్యం గిరిజను చాలా బాధపెట్టింది.

"అంటే మీ అభిప్రాయం?"

''ఆఁ ఏమీలేదు... ఎందుకు ఏడు స్తున్నారా అని ఆలోచిస్తున్నా. నూటికి నూరుమంది ఆడపిల్లల్లో ఉండే బల హీనత మీలోనూ కన్పించటం చాలా ఆశ్చర్యంగానే ఉన్నది సుమా!"

"అదంతా మీకనవసరం. మీరు మీ స్థానాన్ని గుర్తుంచుకొని మాట్లాడండి. ఒక్క విషయం మాత్రం తెలుసుకోవా లని నా మనవి. మీకూ, యీ ఏడ్పుకూ ఏలాంటి సంబంధమూ లేదు."

"నిజంగానా?" అంటూ ఆమె కళ్ళ ల్లోకి ఏదో చదవటానికి ప్రయత్నిస్తున్న



ప్రభాకర్ మీద అసహ్యం, కోపం కలిగాయి.

"మీరేదో అపోహపడుతున్న లాగుంది. మీరు ఊహించేది ఏమాత్రం నిజంకాదని తెలుసుకోవాలని నా మనవి. దయచేసి మీరు మా ఇంటికి రావటం తగ్గిస్తే ఎంతో మంచిది."

"క్షమించండి, పాపం! ఈరోజు మీ మనస్సు మీ వశం తప్పిపోతోందిలా ఉంది. నేను అనవసరంగా మిమ్మల్ని బాధపెట్ట తల్చలేదు కాని వెళ్ళేముందు ఒక్క విషయం మాత్రం చెప్పదల్చు కున్నాను. మిమ్మల్ని నేను ఎప్పుడూ తేలిగ్గా చూడలేదు. అంతేకాదు. నేను మిమ్మల్ని చాలా గౌరవంగా కూడా చూస్తున్నాను. ఎప్పుడయినా మీకు నా అవసరం ఉంటే కబురు చేయండి. వస్తాను. జీవితంలో మీరు ఏదికోరినా చేయటానికి సిద్ధంగా ఉన్నాను."

"గిరిజకు కోపంతో శరీరం వణికి పోయింది. ఎంత గర్వం అనుకుంది!"

"మీరు నాకు చేయగలిగింది, నేను

మిమ్మల్ని కోరదగింది నా కేమీ కన్పించటం లేదు'' అన్నది గిరిజ.

"దానికేం లెండి, మనిషికి మనిషి ఎప్పుడైనా అవసర మౌతాడు'' అంటూ తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు ప్రభాకర్. ఆ చివరి వాక్యాలు వణుకుతున్న కంఠంలోనుండి వచ్చాయి. ముఖంలో, కళ్ళల్లో ఒక రకమైన బాధ కూడా కన్పించింది గిరిజకు.

వెళ్ళిపోతున్న ప్రభాకర్‌ను వెనక్కు పిలుద్దామనుకుంది. కాని అంతలోనే ప్రభాకర్ వెళ్ళిపోయాడు.

నెలరోజులు గిరిజకు చాలా భారంగా భయంకరంగా గడిచిపోయాయి. ప్రభాకర్ వస్తాడని ఎదురుచూసింది. రోజులు పీడకలల్లాగ గడిచిపోతున్నాయి. కొద్దిరోజుల తర్వాత జ్వరం వచ్చింది. వారం రోజుల వరకూ జ్వర తీవ్రత తగ్గలేదు. హాస్పిటల్లో చేర్చారు. ఆ రోజున ఆమెకు పూర్తిగా స్పృహ లేదు.

* * *

"డాక్టర్.... నన్ను... పెండ్లి.... చే...సు...కోరూ" అంటూ డాక్టర్ మధుసూదనరావు చెయ్యి గట్టిగా పట్టుకుంది గిరిజ.

డాక్టరు ఆలోచిస్తున్నాడు. ఈమె రాత్రినుండి ఇలాగే పలవరిస్తున్నది. తెల్లవారుతోంది. కాని ఆమె డెలీరియమ్ తగ్గలేదు సరిగదా ఆమె పరిస్థితి ఇంకా ఘోరంగా ఉంది. ఇప్పుడు తన కర్తవ్యమేమిటి? తను చేసుకుంటానంటే ఇంతలో తన సొమ్ము ఏమి పోతుంది? కనీసం ఆమె ఆత్మశాంతితోనైనా వెళ్ళిపోతుంది. ఒకవేళ ఆమె బ్రతికి బయటపడుతుందా, ఒక ప్రాణదానం చేసినవాడవుతాడు. తరువాత నిజంగానే పెండ్లిచేసుకోమంటే? తను ప్రేమిస్తున్న లలితపనేం కావాలి? లలితను తను ఎంతబాధ పెట్టాడు?' పది, పదిహేను రోజుల నుండి వెళ్ళనేలేదు తను లలితను చూడడానికి.

"డా క్ట...ర్...పెం...డ్లి''అన్న క్షీణస్వరం అతని ఆలోచనలకు అంతరాయం కలిగించింది. ఆమె చెయ్యి అతని చేతిని వదలి మంచంమీద పడిపోయింది తల ప్రక్కకు వాలిపోయింది. ఆమె అశాంతహృదయం పూర్ణశాంతిని పొందింది.

డాక్టరు కళ్ళనుండి రెండు వేడి కన్నీటి చుక్కలు రాలాయి. ఎవరిదో "గిరిజా" అన్న బాధతో కూడిన స్వరంతో ఉలిక్కిపడ్డాడు డాక్టర్ మధుసూదనరావు.

ఎవరది? ప్రభాకరా? డాక్టర్ ప్రభాకర్! అతనికీ ఈమెకూ ఏమి సంబంధం?

గిరిజ చల్లని చేతిని రెండు చేతులతో తీసుకుని ముఖానికి అడ్డుపెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు ప్రభాకర్.




డాక్టరుకు బాధకంటే ఎక్కువ ఆశ్చర్యం కలుగుతున్నది.

ప్రభాకర్ భుజంమీద చెయ్యివేసి ''అదేమిటి ప్రభాకర్! ఎప్పుడూ తొణకనివాడివి అలా ఆడపిల్లలాగా ఏడుస్తున్నావు? ఈఅమ్మాయి నీకు తెలుసా?" అన్నాడు.

"అవును తెలుసు. మేమిద్దరం ఒకరినొకరం ప్రేమించుకొన్నాం. వీణ తీగెలు బిగించినకొద్దీ బాగా పలుకుతుంది. మేం చేసిన తప్పల్లా తెగేంతవరగూ బిగించటమే" అంటూ పిచ్చివాడిలాగ వార్డు నుండి ఊగుతూ వెళ్ళిపోయాడు.

డాక్టరు ప్రభాకర్ వాక్యాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో అదే వాక్యాన్ని వల్లించాడు. "మేము చేసినతప్పు, తెగిన దాకా బిగించటమే" అని, ఒకసారి ప్రభాకర్ వెళ్ళిపోతున్న వైపుకూ, మరల గిరిజవైపు చూసి "తెగిపోయిన తీగలు'' అంటూ ఒక దీర్ఘనిటూర్పు విడిచి, కుర్చీలో కూలబడ్డాడు.





# అగ్నిమాలి

వాసల సుబ్రహ్మణ్యం

ఆ అర్ధరాత్రి సమయంలో

కొండలపక్కన శిథిలావస్థలోవున్న ఒకానొక పూరిగుడిసెలో జరిగిపోయిన విషాదసంఘటన అగ్నిపాలుణ్ణినిలువునా కుంగదీసింది. ఒకరకంగా ఆలోచించి నప్పుడు, యీ విష్ణుమిత్రుడు, తాను సేవిస్తున్న రాజుకు శత్రువు కావటంద్వారా, తనకూ శత్రువే అవుతాడు. కాని, తాను నమ్మిన ఆదర్శం కోసం కత్తిదూసి, యుద్ధరంగంలో గాయపడి ప్రాణరక్షణార్థం ఒకానొక పూరిగుడిసెలోచేరి అక్కడ దుర్మరణం ౹గావటం అంటే; నిజంగా అది చూసేవారి గుండెలను కలకబారించే దృశ్యం!

అగ్నిపాలుడు ఉన్నచోటనే కదలా మెదలక, ముసుగు కప్పబడి వున్న విష్ణుమిత్రుడి ఆకారంకేసి, దారు ప్రతిమలా చూస్తూవుండిపోయాడు. అల్లంత దూరంలో మాహుా, మరి యిద్దరు నౌకర్లూ నిలబడి, ఒకసారి తమ యజమానికేసీ మరొకసారి విష్ణుమిత్రుడి భౌతికకాయానికేసీ చూస్తున్నారు.

చిట్ట చివరకు పెద్దగా నిట్టూర్చాడు

పెంచి రాజునూ రాణినీ తమతోకూడా తెస్తున్నారనీ పెళ్ళిపందిట్లో ఉన్న వియ్యంకులిద్దరికీ చారులు తెచ్చిన వార్త వినిపించారు.

తారాసింహుడు పెళ్ళికొడుకు వేషం అంతా ఊడదీసేసుకుని నరికొత్త పసుపు తాడు మంగళసూత్రం పట్టుకొని నిల్చున్నాడు–నిల్చుంది, ఎదురుచూస్తూ.

శరత్ శరంలాగ వచ్చాడు. మంగళ సూత్రా న్నందుకొని తార మెడలో కట్టాడు. అంతా క్షణాలమీద జరిగింది.

నేను రజనికి తాళికట్టాను, శరత్ నాకు తాళిగట్టాడు. అందే మేం ఇద్దరం శరత్ సొత్తేగదూ? అంటూ తార చుట్టూరా కలయజూసింది.

ఔనమ్మా! ఔను ఔను ఔను!!! అంటూ వచ్చిన దండు అంతా హర్షధ్వానాలు చేశారు. వాళ్ళంతా ఆటవికులూ, కౌముదీరాజ్య ప్రజలే.

రాజూ రాణీ అక్షంతలు వేశారు.

రాహు కేతువులు తెల్లమొహాలు వేస్తూనే ఒకర్నొకరు కొరకొరా చూసుకున్నారు. వియ్యంకులు గింజుకున్నారు–వియ్యం విరిగి కయ్యం లేకుండా కైజార్లు తీసి తమని తాము పొడుచుకోబోతే పట్టుకొని వారించారు. రాహుకేతువుల్ని రాజు క్షమించాడు. మీ అల్లుడిదేగద రాజ్యం, మీరే మునపటిలాగే అన్నీ చూసుకుంటూ సుఖంగా ఉండమన్నాడు.

శరత్‌కి పట్టంగట్టి, రాజు రాణీ తీర్థయాత్రలకు బయల్దేరారు. వాళ్ళతోనే రాహుకేతువులు కూడా వెళ్లారు.

కౌముదీరాజ్యం ఒక్కటైంది. రాజు శరత్‌చంద్రుడు. రజని, తారలు రాణులు. పూర్ణకౌముది రాజధానిగా శరత్ చల్లగా పాలించాడు. కౌముదీ రాజ్యం–బహు చల్లని రాజ్యం!" అంటూ సాగరం కథను ముగించి కూర్చున్నాడు.

"బాగుందిరా అబ్బాయి, మా మంచి కాశీమజిలీ కథ చెప్పావు–ఇటు రజనీ అటు తార మధ్య శరత్‌చంద్రుడూ, వేణుగోపాలస్వామిలాగ ఇటు, అటూ సత్యభామ రుక్మిణీల్తో–అలాంటి వేణుగోపాలుడే కావాలిరా నాయనా!" అంది సోమ్మవ్వ. సాగరం అన్నాడు, "ఆ! ఆఖరికి ఇదా నీ వనేదీనీ!! కథ వింటూన్నట్టే వింటూ ఏదో మంత్రంవేసి నన్ను తన పార్టీలోకి లాక్కుందిగదూ గో... డామిట్! కథ అడ్డం తిరిగింది!"






ఖంగారు ఖంగారుగా భోజనం చేస్తున్న భర్త మానసిక పరిస్థితినీ, మొహంమీద పడుతున్న నల్లని వంకీల జుట్టునీ, అదో విధమైన ఆనందాన్నీ, అందాన్నీ సూచించే అతని రూపాన్ని చూసేటప్పటికి జాలివేసింది నిర్మలకు.

'తాపీగా తినండి. మీకిష్టమని ఈ గోంగూర పచ్చడికూడా చేశాను. మీరలాగ కంగారుగా తిని వెళ్ళిపోతే నా మనసంతా ఏదో బాధపడుతుంది.

'ఒళ్ళమ్ముకున్నాక తప్పుతుందా మరి! ఆ రావణాబ్రహ్మ ఈవేళ ఎలాగైనా నన్ను వదలడులే.'

ఈ రావణాబ్రహ్మ అన్న బిరుదు ఎవరికి చెందుతుందో నిర్మలకి తెలుసు. ఆ పేరు చెప్పితే తన భర్త హోరని వర్షములో తడిసి వచ్చికూడా గడగడా మరచెంబుడు నీళ్ళు తాగుతాడన్న విషయం కూడా తెలుసును. కాని ఎదురుగా తన భర్త ఖంగారుగా భోజనం సరిగా చేయకుండా వెళ్ళిపోతుంటే ఆమె భరించలేక పోయింది. అందులోనూ జరిగిన రాత్రి

అతనసలు భోజనమే చేయలేదు. దానికి కారణమైన కలహమూ, ఆ కలహములో మొండిపట్టు పట్టిన తనపాత్ర నిర్వహణా, ఆ కోపములోనే యిద్దరూ మానేసి, ఒకే పెద్ద మంచంమీద ఒకరికొకరు తగల కుండా ఒకరివైపొకరు తిరగకుండా పడుకొని జరిపిన అసిధారావ్రత నిర్వ హణమూ ఇవన్నీ నిర్మలని పశ్చాత్తపు రాలినిగా భర్తయెడ మరీ సుముఖురా లిగా, ప్రేమచేత, కరుణచేత ఆర్ద్రహృ దయగా చేసివేశాయి. అందులోనూ అంద మైనవాడు, జుట్టు ఆ విధంగా మొహం మీద పడేవాడు, అటువంటివాడు తనకి భర్తఅయి, తన సర్వస్వమూ అయి నప్పుడు-

'మీరు ఆ కూర మరోసారి కలుపు కుంటేకానీ వీలులేదు. నామీద ఒట్టే! బోడి ఉద్యోగం పోతేపోతుంది- దీని తాత లాంటిది వస్తుంది. ఊ, మరి కలపండి' అంది.

ఈసారి విసనకర్ర పుచ్చుకొని విసు రుతూ అతని ప్రక్కన కూర్చుంది. నవ్వుతూ పట్టుదల పట్టుతూ లాలిస్తూ అతనిచేత తిరిగి కూర కలిపించింది. 'అయిన ఆలస్యం ఎల్లానూ అయిందిగా! ఇంకోపావుగంట లేటయితే పీకలుతీస్తారా ఏమిటి? సంసారాల్లో ఎవళ్ళకిమాత్రం ఏదో అవసరాలు రాకుండా వుంటాయా, ఆలస్యాలవకుండా వుంటాయా!' అంటూ నొక్కులు నొక్కుతూ సన్నగా దీర్ఘం తీసింది.

ఈ ఆర్గ్యుమెంటుని ఏ కోర్టులోనూ ఒప్పుకోరని తెలుసును-కాని కలహానం తరం అందులోనూ ఒక రాత్రి రాత్రి అంతా మౌనంగా వుండి, తిరిగి సంధి కలుపుకొన్న తర్వాత భార్యా భర్త లనుభవించే ఆనందం సరిక్రొత్త ప్రేమ లను ఉద్రేకాన్నీ స్వచ్ఛ పరిమళాన్ని కలిగివుంటుంది. అటువంటి పునర్నవమైన ఆప్యాయతతో భోజనం పెట్టుతూంటే, భార్య సన్నని గాజుల చప్పుడుతో విస రుతూ లాలిస్తూ ఉంటే వేరే కాంక్షించే స్వర్గమే లేకపోయింది గంగాధరానికి. ఆఫీసులూ, బాధలూ, సమస్యలూ అన్నీ చప్పున ఫేడౌట్ అయిపోయాయి. ఆ కాస్సేపట్లోను అతనికి నిత్యమూ, సత్యమూనైన బ్రహ్మానందం గోచ రించింది.

ఈ సారి వాళ్ళ కబుర్లు ఒకసారి మనస్సులోంచి సమస్యా సందేహాలు దూరమైపోయిన తరువాత - ఏ అడ్డంకీ లేని నదీ ప్రవాహంలాగా సాగిపోయాయి. వచ్చే సంక్రాంతి పండుగకి మామగారు ఏం బహుమతి యిస్తారో అన్న ప్రశ్న నుండీ, సినిమాలో ఫలానా నటి తాలూకు నటన యెలా వున్నదో, పక్కింటావిడ కొనుక్కున్న క్రొత్త చీరలోని కొత్త ఫ్యాషన్ విశేషమూ, కో-ఆపరేటివ్ స్కీముతో తాము కట్టించబోయే చిన్న

సైజు యింటికి యెన్నిగదులు ఉండాలి అన్నంతవరకు అనవసర అవసర సమాలోచనలన్నీ సాగిపోయాయి. అతను చెయ్యి కడుక్కొని లేచేటప్పటికి ఆమె వక్కపొడుం తీసుకొచ్చి ఇచ్చింది. అతను బనీను ధరించేటప్పటికి దువ్వెనతో వచ్చి అతని పాపిడితీసింది. అతను అమెరికన్ జాకెట్ వేసుకునేటప్పటికి జోళ్ళు రడీగా ఎదురుగా పెట్టింది. అతను ఆమెను ముద్దుపెట్టుకుని 'వస్తాను నిర్మలా' అని యధాలాపంగా అలవాటు చొప్పున గోడమీద టైము చూచేటప్పటికి అతనికి స్పృహ వచ్చినటు-లేక తప్పినట్టు అయింది. కఠిన వాస్తవికత కొరడాతో కొట్టినట్లయింది. అతని నీడ అతని వెనకనే వచ్చి వెన్నులో పొడిచినట్లయింది. ఉన్నపళంగా కుప్పగా కుర్చీలో కూలి 'పదకొండుంబావు!' అన్నాడు. అతని మొహంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. తెల్లబడిన అతని మొహాన్ని, పిచ్చిగా చూస్తోన్న అతని కళ్ళను చూసి అర్థాంగి కంగారుపడింది.

'గంటంపావు లేటు! ఆఫీసుకు వెళ్ళేటప్పటికి యింకో పావుగంటైనా పడుతుంది. ఇంక ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవలసిందే. అసలే కోపిష్టిమనిషి. అందులోనూ దొరల పంక్చుయాలిటీ అంటో చస్తోంటాడు. అసలు మొన్న మీవాళ్లు వచ్చిన రోజున ఆలస్యమైనందుకే మండిపడ్డాడు. తుది హెచ్చరిక అని చెప్పాడు. మీసాలమీద చెయ్యివేసి నా కొంప తవ్వేశావు. ఏ పావుగంటో అరగంటో ఆలస్యం అయితే సర్దిచెప్పుకోవచ్చును. ఇప్పుడేమిటి చెయ్యటం?'

నిర్మలకి ఏమీ తోచలేదు. ససంభ్రమ సవిషాద సశంకిత అయి అలాగ నించుని పోయింది. అతను కణతల్ని రెండు చేతులతోనూ అదిమి పట్టుకొన్నాడు. ఈవిధంగా ఆలస్యంగా ఆఫీసుకు దయచేసి ఆ తప్పుని మళ్ళీ మళ్ళీ చేసి ఉద్యోగం పోగొట్టుకొని, కొత్తదిదొరక్క మాసినగడ్డంతో, లోతుకుపోయినకళ్లతో, రోడ్లుకాస్తూ మిత్రుల్ని అణా, బేడా అడిగి బతుకుతూన్న శంకరం స్మృతిపథంలో మెలిగేటప్పటికి అతనికి ఒక్క నిమిషం ఊపిరాడలేదు. అతన్ని లాలిస్తూ భోజనం పెడుతూ, అరగంటకన్న ఆలస్యం అవడంలోని వైపరీత్యాన్నీ, విపత్తునీ చూడలేకపోయానే అని బాధపడుతోంది ఆమె.

'ఛీ ఛీ—మీ ఆడాళ్ళింతే, వెధవ సొద వేసుక్కూర్చున్నావు. ఇప్పుడు చీవాట్లు తినాలి డిస్మిస్ అంటే గొల్లుమని ఏడుస్తూ రావాలి. రేపటినుండి మెతుకులు కూడా వుండవు.'

'అయ్యో నాకేం తెలుసండీ' అంది నిర్మల.

'ఏం తెలుసు మరి! నీ మొగుడేమైనా కలెక్టరనుకున్నావా? మినిష్టరనుకున్నావా? గుమాస్తా అంటే ఏమిటనుకు




న్నావు? ఎన్నిసార్లు చెప్పాను నీకు తొమ్మిదింటికల్లా వంట అవ్వాలనీ'– కోపంతో కేకలు వేస్తున్నాడు గంగాధరం.

'మరి మీరు తొమ్మిదింటికిగా బియ్యం పట్టించుకొని వచ్చిందీ?' అంది నిర్మల భయంగా.

మొదట తడితడిగా కనబడి తర్వాత జలంసంతరించుకొని బిందురూపం దాల్చి కొని, కనుకొలకులనుండి రెండశ్రువులు నిర్మల కపోలాల మీద మెల్లగా జారాయి. గంగాధరానికి గబుక్కున జాలివేసింది. అతనికి ఏ వూహ తట్టినా ఏ అనుభూతి కలిగినా గబుక్కున కలుగుతుంది. ఏదో కోపంలో అన్నాను నిర్మలా. నీ తప్పేమీలేదు. కాతాకొట్టు తెరిచేటప్పటికి ఈవేళ తొమ్మిదయింది. అవును కాని ఇప్పుడేమిటి చేయడం?'– అన్నాడు గంగాధరం.

నిర్మల తడికళ్లు ఒకసారి మెరిశాయి. మంచుపడుతూవున్న వేకువ పొద్దు మీద చటుక్కున సూర్యకిరణాలు పడ్డట్టు బిక్కుపోయిన ఆమె మొహం ఒక్కసారి వెలుగుతో ఉద్దీప్తమైంది. తన భర్తకి నెల నెలా వచ్చే జీతపురాళ్ళని రక్షించే ఒక ఉపాయం ఆమెకు తట్టిఉండాలి.

గంగాధరం ఆశగా ఆమెకేసిచూశాడు. ఊపిరాడకుండా నదిలో కొట్టుకుపోతున్న అతనికి ఆమెలో స్ఫురించిన ఊహ అనే పడవచెక్కని పట్టుకొని గట్టుకు చేరుకో వాలనుకున్నాడు.

"నాకో ఊహ తట్టిందండీ." అంది నిర్మల. 'నిజంగానా' ఆత్రుతగాఅన్నాడు గంగాధరం.

"నిజమేనండీ. మా స్కూల్లో ఇది వరకు ఓ మేష్టారు వుండేవాడు. ఆయన చాలా కోపిష్టి. పెద్ద పెద్ద మీసాలతో గండుమొహంతో అచ్చంగా పెద్దపులి లాగా వుంటాడు. ఓనాడునేను స్కూల్ కి బాగా ఆలస్యంగా వెళ్ళాను. ఆయన

కశ్లేజ్జిజేసి ఎందుకింత ఆలస్యమయిందని గద్దించాడు. ఒకవేళ ఆడపిల్లనని చేయి చేసుకోకపోయినా అక్కడ ఎండలో ఇసుకలో నుంచోబెడతాడు. మగపిల్లలు ఏడిపిస్తారేమో అని నా భయం. నాకు భయంతో, సిగ్గుతో ముచ్చెమటలు పోశా యంటే నమ్మండి. నాకు చటుక్కున జ్ఞాపకం వచ్చింది. ఆయనకు మాతృ ప్రేమ ఎక్కువనీ, మాతృపూజకన్నా జీవితంలో పరమార్థం మరొకటిలేదనీ – చూడండి మీరేదో కాంప్లెక్సూ, గింప్లెక్సూ అంటారు అలాగ అన్నమాట. అంతే మా అమ్మ ఊరగాయలు కోసం అటక ఎక్క బోతూ నిచ్చెనమీదనుంచి పడిందనీ, ఆమె కాలికి మర్దనా అదీ చేసి ఆవిడకి భోజనంపెట్టి, నే నన్నంతిని వచ్చేటప్ప టికి ఆలస్యమయిందని మాంచి వొడుపుగా అబద్ధం ఆడేశాను. దాంతో అంత పెద్ద పులీ అహింసావాది అయిన మేక అయి పోయాడనుకోండి. నన్ను దగ్గరకు పిల్చి నా తల నిమిరి, విద్యార్థులందరికీ నన్నొక ఆదర్శం కింద చూపించి గౌర వించాడు మా మేష్టారు."

ఆమె ఆగింది భర్తకేసి భావయు క్తంగా చూస్తూ. పాపం భయావస్థలో నున్న గంగాధరానికేమి స్ఫురించలేదు.

"ఈ కథకి నా ఏడుపుకీ సంబంధం ఏమిటీ?" అన్నాడు విసుగ్గా.

భర్త తెలివితేటల్ని గురించి కొంచెం నిరసనగా, జాలిగా నవ్వి, విడమర్చి ఇలా చెప్పింది నిర్మల: "చూడండి, మీ 'బాస్' లో ఎక్కడో వీక్ పాయింటు ఒకటి ఉంటుంది. దానిమీద మీరు 'ప్లే' చెయ్యాలి. ఎంత కోపంలో ఉన్నవాడైనా అతనికి ఇష్టమైన, ఆప్యాయమైన ప్రసక్తి తీసుకవస్తే చటుక్కున మెత్తబడిపోతాడు, మా మేష్టారులాగా. ధైర్యం తెచ్చుకోండి, ఆలోచించండి.

గంగాధరానికి ఆ మధ్య తోటి గుమాస్తా ఒకడు చెప్పిన విషయం సమ యానికి జ్ఞాపకం వచ్చింది. ఒక్క ఉదు టునలేచి ఆమెని కావలించుకొని "మే ప్రెషస్! నువ్వు నిజంగా నన్ను రక్షించ డానికి వచ్చిన దేవతవు. అందుకే కార్యేషు మంత్రీ, కరణేషు దాసీ (పాపం తిరిగేశాడు కంగార్లో) అన్నారు పెద్దలు. మా అధికారికి ఓ పెద్ద వీక్‌నెస్ ఒకటి వుంది. అదేమిటంటే ఆయనకి చాలా కాలం పిల్లలు లేరు. ఈ మధ్యే మూడు నాలుగేండ్లక్రితం ఒక పిల్లాడు కలిగాడు. ఆయనకి పిల్లలు అంటే ఎంతో పిచ్చట. ఆ రోజుల్లో మిఠాయీ బొమ్మలు కొని చుట్టుప్రక్కల ఉన్న పిల్లలకు వారం వారం పంచిపెట్టేవాడుట. ఇప్పటికీ ఈయన ఉన్న వీధిలో ఏ పిల్లవాడికి జబ్బు చేసినా ఈయన స్వయంగా వెళ్ళి కష్ట సుఖాలువిచారించి అవసరమైతే స్వయంగా డాక్టర్ని కూడా తీసుకువెళతాడుట. ఎవ రికీ కానీ రాల్చనివాడు నిరుపేదు అనాథ శిశురక్షణాలయానికి రెండు వందలు –




టూ హండ్రెడ్ – అరగ్గానే ఇచ్చిపారేశాడుట. ఏదీ, నా అమెరికన్ షర్టు ఇలా పడెయ్యి; ఓహో బ్యూటిఫుల్ ఐడియా" అంటూ అతనోవిధమైన నాట్యం చేశాడు.

"మీరు షర్టు తొడుక్కునే ఉన్నారండీ" అంది నవ్వుతూ నిర్మల. గోదుమరంగు పాంటుమీద షార్క్‌సిన్ బ్లౌజువేసుకొని, జుట్టు అందంగా మొహంమీద పడుతుంటే సైకిలెక్కి సంతోషంగా వెళ్లే భర్తను చూసి నిర్మల మళ్ళీ ఒకసారి సరిక్రొత్తగా ప్రేమించినంత ఆనందమును, గర్వమూ పొందింది.

గంగాధరం వచ్చినట్లు తెలిసిన మేనేజరు తన గదిలోంచి గంగాధరాన్ని పిలిచాడు. మాంచి ధీమాగా, ఏ సంకోచమూ లేకుండా వెళ్ళే గంగాధరాన్ని చూచి సోదర గుమాస్తాలంతా తమ కళ్లని తామే నమ్మలేక ఒక్కసారి కళ్ళు నులుముకు చూశారు. వినయంగా మేనేజర్ ముందు నిలబడ్డాడు గంగాధరం.

'నీ ప్రవర్తన నాకర్థం కావటంలేదు. నీకు బొత్తిగా భయమూ? భక్తి లేకుండా పోయాయి. ఇది ఆఫీసనీ, ఇక్కడ నీవు జీతగాడివనే స్పృహకూడా నీకు లేనట్లుంది. ఇదివరకు నీకు మూడుసార్లు వార్నింగు ఇచ్చాను. నా మాట నీకు లక్ష్యం ఉంచేగా. ఇంక నీ విషయంలో కన్సిడరేషన్ ఏమీ చూపలేను. ఇంక

నువ్వు ఫలితం అనుభవించక తప్పదు' అని కోపంగా నిక్కచ్చిగా ఆరోహణా వరోహణలు పాటిస్తున్న గొంతుతో మీసం కొనల్ని మెలివేస్తూ కళ్ళెర్రచేస్తూ మాట్లాడే మేనేజరును చూస్తుంటే. తీవిగా వెనకాలే నడచివెళ్ళి "జింకని అమ్మని నోటకరచుకొనే పులిలోని ఒడుపూ, నిశ్చయమూ గంగాధరానికి స్ఫురించే టప్పటికి అతని గుండె కొన్ని సెకనులు పనిచెయ్యలేదు. భయం భయంగా వణికే గొంతుని సరిచేసుకుంటూ ఇలా అన్నాడు.

'చిత్తం...ఏక్సిడెంటు జరిగిందండీ ...తమరు క్షమించాలి.'

'ఏక్సిడెంటా?' ఎగాదిగా చూచాడు మేనేజరు 'నువ్వు బాగానే వున్నావే' అన్నాడు.

'ఆఫీసుకి ఆలస్య మవుతుందేమో నని తొందరగా వస్తున్నానండి. చటుక్కున దారికడ్డంగా ఒక చిన్నపిల్లవాడు వచ్చాడండి. సైకిలు ఆ కుర్ర వాణ్ణి ఢీకొన్నదండి.'

ఈసారి అధికారి మొహం మారిపోయింది. ఆ తరువాత, ఆవేదనా మొహంలో కనబడ్డాయి. 'ఏమైంది... ఏమైంది' అన్నాడు.

'తలకి, కాలికి గాయాలు తగిలాయండి. ఒకటే రక్తమండి. తక్షణం నా జేబురుమాలు తలకికట్టి ఆ కుర్రవాణ్ణి ఎత్తుకొని హాస్పటల్‌కి వెళ్ళానండి. అక్కడ చికిత్సచేయించి కట్టుకట్టించి డాక్టరుగారు ఫరవాలేదన్న తరువాత ఆ కుర్రవాడింటికి ఫోనుచేయించి మరీ వచ్చానండి. ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకొని...'

'ఏం డేంజరు లేదుగదా. డాక్టరు గట్టిగా చెప్పాడా' ఫైర్ అలారంలా మోగింది అతని గొంతు.

'మరేం ఫర్వాలేదండి. అశ్రద్ధ చేయకుండా వెంటనే వైద్యం చేయించాకదండీ. సెప్టిక్ అవకుండా పెన్సిలిన్ ఇపీ అపీ ఇంజెక్షన్‌లు ఇచ్చాడండి డాక్టరు.'

'ఆ కుర్రవాడు కళ్ళుతెరిచి మాట్లాడుతున్నాడా?'

'చిత్తం... మొదట్లో కొంతసేపు తెలివిలేదండి. ఇప్పుడు మా అమ్మ కావాలి? అని అంటున్నాడండి. ఈపాటికి తల్లిదండ్రులు అక్కడికి వెళ్ళేవుంటారండి!'

మేనేజరు మొహంలోని బాధ క్రమేణా తగ్గింది. 'మీరంతా వట్టి బ్రూట్స్, సైకిల్ ఎక్కితే ఏదో పెద్ద నిషా వచ్చేస్తుంది కాబోలు మీ అందరికీ. రోడ్డుమీద పిల్లలు-అమాయకులైన పిల్లలు-ఉంటారని ప్రాథమిక జ్ఞానంకూడా పోతుంది కాబోలు. ఇకనైనా జాగర్తగా మసులుకో. నిన్ను క్షమించాను. నువ్వు వెళ్ళి నీపని చూసుకో. నా మనసంతా అదోలా అయిపోయింది.' అన్నాడు మేనేజరు.

శాల్యూట్ చేసి వెనక్కి తిరిగి తోటి గుమాస్తాల మధ్యకి వచ్చి పడ్డాడు గంగాధరం. సగర్వంగా సహోనంగా "ఏంజరిగింది ? ఏం జరిగింది?" అంటూ చుట్టూ చేరి అడిగారు అందరూ. 'జాయ్ పేడు గంగాధరం ఏమిటనుకున్నారో,' అంటూ నవ్వుతూ ఫైల్సు తీసే గంగాధరాన్ని ఏదో మహిమాన్వితుడిలాగా, హఠాత్తుగా అణిమాది సిద్ధులు లభించిన యోగీశ్వరుడిలాగ వెఱ్ఱిగా చూశారు. మనసులోనే నిర్మలని తలచుకొని ధన్యవాదాలర్పించాడు గంగాధరం.

ఈ ప్రమాదవార్త విని సగం డీలా అయిన మేనేజరు కాస్సేపట్లో తిరిగి కోలుకొని, ఒక్కసారి నిట్టూర్చి, తన పనిలో నిమగ్నుడయ్యాడో లేదో, గణగణ మని టెలిఫోను మోగింది. తాపీగా చెవిదగ్గర పెట్టుకొని 'హలో' అన్నాడు అవతల కొననుండి కంగారుగా భార్య గొంతు "ఏమండీ మీరేనా, అయ్యో అర్జంటుగా రండి. ప్రమాదం అండి. అబ్బాయికి ప్రమాదం జరిగిందండీ, ఎవడో సైకిల్ మీదనుంచి పోనిచ్చాడండీ. తలంతా రక్తమండీ, త్వరగా రండీ.'

మేనేజరు గుండె ఆగి తిరిగి ఎగిరి గొంతుకలోకి అడ్డంగా వచ్చేసింది.

అతని మొహం తెల్లబడిపోయింది. మాట వణికింది 'ఎవడా వెధవ_ఆసైకిలు తొక్కినవాడు?' అన్నాడు.

'ఆ దుర్మార్గపు వెధవ సైకిలు ఆపకుండ దిగకుండా రయ్యిమని తొక్కుకొని పారిపోయాడండీ. వాడికాళ్లు విరగ త్వరగా రండీ.'

మేనేజరు చేతులూ కాళ్లూ ఆడలేదు. "బతికే ఉన్నాడా" అని ఒక్క కేక పెట్టాడు ఫోనులోకి.

"అవేం మాటలండీ మీరు మరీనూ తలమీద గాయంపడింది అంతే. గాయం

కడిగి గుడ్డతో కట్టాను. మన డాక్టరుకు ఫోనుచేస్తే లేడు. ఇంకొక డాక్టరిని ఎవరి నైనా వచ్చేటప్పుడు తీసుకురండి. నెత్తు రింకా కొంచెంగా వస్తూనే ఉంది. ఆలస్యం చెయ్యకండి' అంది ఆవిడ.

మేనేజరు కిప్పుడు శ్వాస ఆడింది. కాని క్షణంలో అతని మొహం కోపంతో కందగడ్డలా అయిపోయింది కోటు చేత్తో తీసుకొని ఆఫీసుగదిలోంచి ఇవతలికి వచ్చి గంగాధరంకేసి విషం కక్కుతూ చూశాడు.

'ఏయ్ యిలా రా.'

ఆ పిలుపుకి, చూపు గతుక్కు మన్నాడు గంగాధరం. 'సార్' అన్నాడు దగ్గరగా వచ్చి.

"నువ్వెవరి మీదనుంచి పోనిచ్చావో తెలుసునా సైకిల్ని..."

'గంగాధరం ఏమిటన్నట్లు వెర్రిగా చూశాడు.'

'మా అబ్బాయి మీదనుంచి, లేక లేక కలిగిన ఒక్క కొడుకుమీద నుంచి. మా ఆవిడ ఇప్పుడే ఫోన్‌చేసింది. పైగా ఆగకుండా పారిపోయావుట. నీ అంత నీచుడూ, దుష్టుడూ, అల్పుడూ, అధ ముడూ ప్రపంచంలో ఉండడు, నా మీద నీకున్న గ్రడ్జి మూలాన్ని చెయ్యాలని చేసినట్టు కనబడుతోంది. నిన్ను అరెస్టు చేయించాలి, న్యాయానికి. కాని నీ పాపం నిన్నే కొడుతుంది. నిన్ను డిస్మిస్ చేశాను. పో - ఆఫీసులోంచి పో-' అంటూ మేనే జరు ఊగిపోయాడు కోపంతో.

గంగాధరం ఏమి అర్థంకాక గుటక మింగాడు. 'సార్' అనబోయాడు.

నువ్వేం చెప్పనక్కర్లేదు. ఇంకొక నిమిషం ఎదురుగా ఉంటే నిన్నేంచేస్తానో నాకే తెలీదు. ఏమయ్యా హెడ్‌గుమాస్తా ఇతనికి ఏదయినా ఇవ్వవలసినది ఉంటే తక్షణం ఇచ్చి పంపెయ్యి. మళ్ళీ నా కళ్ళకి కనబడ్డావంటే అరెస్టు చేయిస్తాను జాగ్రత్త అంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ అధికారి వెళ్ళిపోయాడు.

కాసేపటికి వెర్రివాడులాగా, సర్వం పోగొట్టుకొన్న వాడిలాగా మూర్తీభవిం చిన శోకంలాగ వచ్చిన గంగాధరాన్ని చూసి కళవళపడింది. నిర్మల అతని నోటినుండి జరిగిన కథ విని నిశ్చేష్టురా లైంది. జాలిగా. తల రెండుచేతుల్తో పట్టుకొని కుర్చీలో కూర్చున్న గంగాధ రాన్ని, అతని అందమైన మొహంమీద పడే నల్లని వంకీలజుట్టుకీ చూసేటప్ప టికి ఆమె కనుకొలకుల్లో తెల్లని నీటి బిందువు తళతళ లాడింది.





మంజుశ్రీ

# కాంతోబాటు నడుగురు

మహానగరం వర్షం కురవబోతూన్నది.

నాలుగు రోడ్ల కూడలి.

పెన్ షాపుదగ్గర కృష్ణమూర్తి నిలుచుని ఉన్నాడు.

ఐదు నిమిషాలు పట్టింది. దుకాణదారు తన కలం బాగుచేసి ఇచ్చాడు.

'బిల్' అందుకున్నాడు.

కాగితం లేదన్న సమస్య తీరిపోయింది.

ప్రొప్రయిటర్ దగ్గరనుంచి ఒత్తునుకు పుస్తకం తీసుకున్నాడు. బిల్ వెనుక వ్రాశాడు–"తార."

కళ్ళలో మెరిసినట్లయింది. దానితో మనసులో తాను ఎల్లప్పుడూ ఎవరికైతే శుభం కోరతాడో ఆ మూర్తి. పెద్ద పూలజడ, కళ్యాణ తిలకం. దగ్గరగా వచ్చింది చిట్టచివరిసారి. కళ్ళల్లో ఏడుపుతో కూడిన నవ్వు. చిన్నపిల్లవాడికి బోధిస్తున్నట్లుగా చెప్పింది :

"ఇలా చూడమ్మా కృష్ణా! ఎందుకలా తలవంచుకుంటావు? నేరం చేసినవాడిలాగా ఇదేం కొత్తకాదు. చరిత్రలో ప్రేమించుకున్న వాళ్ళెవరూ పెండ్లిచేసుకోరు. అప్పుడు కథలే ఉండవు." పెదవులు నొక్కిపట్టింది. విషాదంగా నవ్వింది. చనువుగా తన చేయి 'తన' చేతిలోకి తీసుకుంది. ఇలా చెప్పింది:

"నన్ను మరచిపోవు. నాకు తెలుసు.

నా కప్పుడప్పుడు నీ యోగక్షేమాలు వ్రాస్తూ ఉండు. నెలకు ఒకటిచొప్పున వ్రాయి. కాదూ రెండు నెలలకు ఇదిగో ఈ కలం తీసుకో. నేను క్షణం క్షణం గుర్తుండటానికి."

తీసుకున్నాడు. అందుకోలేడు. ఆ వెలుగు తనదికాదు. దూరంగా దూరంగా మెరుస్తున్న చుక్క అయింది. ఆమె. ఆమే. తార.

ఎన్ని పుస్తకాలపైన వ్రాశాడో!

ఎన్ని చోట్ల శ్రీరామకు బదులు వ్రాశాడో తార. తార. తార.

తన జీవితాన్ని తెగిపోయిన ఏకతార చేసిన తార.

ఆమె ఇచ్చింది ఆ కలం గుర్తుగా, తనకు. తన ప్రాణం.

ప్రాణంలానే చూసుకున్నాడు.

దాని 'నిబ్' బాగుచేయించేందుకు తెచ్చాడు, ఇవాల్టికి. కోపంగా వ్రాసింది ఉత్తరం, బొత్తిగాసమాధానం వ్రాయటం లేదని. సమాధానం వ్రాసేందుకు, ఈమధ్య వ్రాయనంటున్నది. అందుకే ఇక్కడికి వచ్చాడు. ఖరీదైన కలం. ఆవాళ పెండ్లిరోజున తన కెన్నో బహుమతులు వచ్చినవి. ఆ సాయంకాలం తాను ఈ బహుమతిని తన కిచ్చింది. "వెళ్ళిపోతున్నాను, అత్తారింటికి. తప్పదు కదా. ఉత్తరాలు వ్రాస్తూఉండు. ఇదిగో ఇది తీసుకో. ఇంతకంటే ఏం ఇచ్చేం దుకూ తోచటంలేదు." ఆమె నవ్వే దిగులుగా ఉంది.

తీసుకున్నాడు. అదుగో. అదే ఈమధ్య వ్రాయనంటూంటే, 'తార'కు ఉత్తరం వ్రాయాలి వ్రాయకపోతే ఏం బాగుం టుంది? అని తీసుకుని వచ్చాడు. రేపు ఉత్తరం వ్రాస్తాడు. "ఈమధ్య ఒంట్లో ఏమీ బాగుండటంలేదు ఆకలిలేదు. రుచి లేదు. ఇక్కడ ఈ ఊళ్లో ఉద్యోగం మానేస్తామని ఉంది. ఊనికి బరువుగా ఉంది." అనేనా? మనసులో అలా వ్రాస్తాడే కానీ ఛీ ఛీ! అసలు అలా వ్రాయడు. అలా వ్రాస్తే ఆమె మనస్సు నొచ్చుకోదూ. కంట నీరుపెట్టుకోదూ. ఆమె కంటనీరు పెట్టుకుంటే ఇంకేమైనా ఉందా? తన మనసు బావురుమంటుంది. "కులాసాగా ఉన్నాను బాగా సినిమాలు చూస్తున్నాను. (వట్టిదే!) హాయిగా ఉంటున్నది. కిటికీలోంచి వెన్నెల వస్తున్నది. గోడమీది తొట్లలో చామంతి పూలు పూస్తున్నాయి. ఇప్పుడు రాత్రి పదిగంటలు. గుర్తుపట్టావా? నువ్విచ్చిన కలంతోనే ఈ అక్షరాలు వ్రాస్తున్నాను. ఎంతమంచిదో ఈ కలం, నీలాగా! ఎంత స్నేహమో ఈ కలంతో నాకు" అంటూనే వ్రాస్తాడు. ఇవి అబద్ధాలు కావా? నిజమే! అబద్ధాలే ఎప్పుడూ అందంగా ఉంటాయి. అందాన్ని ఆరాధిస్తాము. అంచేత అబద్ధాలను!

అదుగో ఆ కలమే ఇప్పుడు మళ్లీ వ్రాస్తున్నది. 'తార' 'తార' అని.

డబ్బు ఇచ్చేశాడు కృష్ణమూర్తి.

ముందుకు అడుగిడబోతుండగా పెద్ద చినుకొకటి వచ్చి మీదపడింది. తల పైకెత్తి ఆకాశంకేసిచూస్తే, పెద్ద ఏనుగుల గుంపు స్వేచ్ఛావిహారానికి బయలు వెడలినట్లు మబ్బులు. బస్‌స్టాప్ చేరే లోపల తడిసిపోకపోతే ఇంటికి చేరి పోవచ్చు. కాని ముందుకడుగిడబోతే- అంతలోనే జల్లు.

తరవాత ఎడతెరిపిలేని వాన. తొండాల్లోంచి నీళ్ల చిమ్ముతున్నట్లు. గాలి హోరు. దీపాలు వెలిగాయి ఆరి పోయినవి. రోడ్లమీద చెట్లకొమ్మలు విరిగి పడుతున్నాయి. దీపాలు వెలుగు తున్నాయి, ఆరిపోతున్నాయి.

ఫుట్‌పాత్ పక్కనే గలగలశబ్దం చేసు కుంటూ నీళ్ళు పారుతున్నాయి. సిమెంటు రోడ్లు అందంగా ఉన్నాయి. ఇంత నగరంలోనూ, రోడ్లమీద ఒక్క పురుగు కనబడటంలేదు. ఆకాశంలో ఎవరో బాణసంచా పేలుస్తున్నారు. బంగారపు విండ్లు విరిచిపారేస్తున్నారు. ఎంత బావుందో వాన.

అందరూ ఇళ్ల చేరుకున్నతరువాత కురవకూడదు!

అందరూ ఒకే సమయానికి ఇళ్ల చేరుకుంటారని భగవంతుడికి నమ్మక మేమిటి? అందుచేతనే వాన ఎప్పుడు పడితే అప్పుడే వస్తుంది.

కృష్ణమూర్తికి ఏమీ తోచటంలేదు. బిల్ కాగితమంతా నిండిపోయింది తారలతో 'నిబ్' బాగుచేయడానికే పది రూపాయల 'బిల్' చేశాడు. అందుచేత కుర్చీలో కూర్చోబెట్టాడు, ప్రొప్రయిటరు. బయట వాన కురుస్తున్నది. జోరున వాన. హోరున వాన. బోరున కురుస్తున్నది.

గూళ్ళలోని పక్షుల్లాగా రోడ్లపైన ఎదురుగా కొట్లలోని మనుషులు ఆత్రంగా చూస్తున్నారు. ఎవరో పట్టి బంధించినట్లు సిటీబస్సులుకూడా ఆగిపోయినవి. "అఖిల లోకమ్ము ఉదకమయత్వ మొదవె" అన్నట్లుగా ఉంది.

కృష్ణమూర్తికి విసుగ్గా ఉంది. ఇంత లోనే హోరు తగ్గింది. జోరుతగ్గింది. దీపాలు మిలమిలా మెరుస్తున్నాయి. వాన ఆగిపోయింది. తుడిచిపెట్టినట్లుగా ఉన్నాయి రోడ్లు.

ఒక్కొక్కరే రెక్కలార్చుకున్న పక్షుల్లా మనుషులు రోడ్డుమీదికి వస్తున్నారు. ఎలక్ట్రిక్ తీగెల వెంబడి నీళ్ల చుక్కలు చుక్కలుగా కొంత దూరం ప్రయాణంచేస్తూ రాలి పోతున్నాయి. దీపాల కాంతుల్లో నీటి చుక్కలు మెరిసిపోతున్నాయి. చెట్లమీద పక్షులు రెక్కలార్పుకుంటున్నాయి. సైకిళ్ళూ, బళ్ళూ, రిక్షాలూ, మళ్ళీ రోడ్ల పైన మనుషులూ పారుతున్నారు. నీళ్ళు పారటం తగ్గిపోయింది. ఆకాశంలో మేఘాలు చెదిరిపోలేదు. మనుషులు

నడుస్తున్నారు. రిక్షాలూ, కార్లూ తప్పించుకుంటూ కృష్ణమూర్తి నడుస్తున్నాడు.

హోటల్లో భోంచేసి పోవాలి. ఈ లోపున మళ్ళీ వాన రావచ్చు.

రావచ్చునేమిటి? వస్తుంది.

వానలో తడవటమంటే తగని భయం కృష్ణమూర్తికి.

అందుచేత ఈపూట భోజనం మానేస్తే అన్న ఊహ తట్టింది.

రిక్షాలో ఎక్కి బస్‌స్టాప్‌కు పోతే?

ఇన్ని ఆలోచనలు.

పోస్టాఫీసుకు వెళ్ళి ఉత్తరం వ్రాసి పడేస్తే. కాదు స్థిమితంగా వ్రాయాలి. కృష్ణమూర్తి ఆలోచిస్తూ నడుస్తున్నాడు మళ్ళీ వానవచ్చింది.

మహానగరం, వేలం హాలులో చిక్కుబడి పోయాడు రతన్‌లాల్, మార్వాడీ! వాన కురుస్తున్నది. ఎడతెరిపిలేని వాన.

సాయంకాలం ఆరుగంటలు, ఏడు గంటలు, ఎనిమిదిగంటలు. ఇంటిదగ్గరకు ఆ పెద్దమనుషులు వచ్చిఉంటారు. వాళ్ళకు కారుంది, వాళ్ళు వస్తారు. తనను పిసినారి అని అందరూ అంటారు. అంటే అన్నారు. లేకపోతే ఇంత డబ్బు ఎలా కూడబెట్టేవాడు తాను. అప్పులివ్వటం, ఎదైనా తాకట్టుపెట్టుకుని వడ్డీ పెరగటం, అసలుకన్నా, వాళ్ళు అప్పు తీర్చలేకపోవటం, ఆ వస్తువు తనది కావటం. అట్లా ఎన్ని? రేడియోలు, గడియారాలు, కంచాలు, చెంబులు, సోఫాలు, ఇంకా ఇంకా. అదే తెలివి. డబ్బు ఖర్చుపెడుతూ కూడబెట్టలేం. కూడబెట్టమంటేనే ఖర్చుబెట్టక పోవడం. తాను ఇంతడబ్బు కూడపెట్టీ కారు కొనలేదని అయినవాళ్ళు తనకు వినపడే లాగానే అప్పుడప్పుడు నవ్వుకుంటూ వుంటారు వాళ్ళకేంతెలుసు ఎప్పుడో, ఎవరో, కారుకూడా తనదగ్గర తాకట్టు పెడతారు. తరువాత విడిపించుకోలేరు. అప్పుడు తనకు చౌకగా కారు వస్తుంది. 'సెకండ్ హాండ్' ది కొనాలన్నా బోలెడు డబ్బవుతుంది. వాళ్ళకు తెలీదు. డబ్బు కూడబెట్టడం గొప్ప తెలివి తేటలతో కూడుకొని ఉన్నపని, వాళ్ళకు తెలీదు. వాళ్ళకు తెలీకపోతే తెలీకపోయె. ఇప్పుడు ఇంటికెలా పోవాలి. ఈ వానలకు అర్థంలేదు. పాడువాన. టాక్సీకూడా చుట్టుపక్కల లేదు. కొంచెం ఇప్పుడిప్పుడే తగ్గుతున్నది వాన.

రతన్‌లాల్ మహా విసుక్కుంటున్నాడు. అవతల పెద్దమనుషులు ఈపాటికి తన ఇంటికి వచ్చి ఉంటారు. ఈ వ్యవహారం పైసలయితే, తనకు చాలా లాభం గిడుతుంది. భగవాన్! రిక్షా అయినా కనబడదే. కొంచెం జోరు తగ్గినట్లుగా ఉంది.

"ఏయ్ రిక్షా?"

వాడికెంత గర్వమో!

అవును, ఇప్పుడు పదిమంది




విలుస్తారు. విచిత్ర మేముంది? రూపాయి కావాలిట వాడికి.

ఏం చేస్తాం మరి కర్మ. రతన్‌లాల్ ఏడ్చుకున్నాడు.

రూపాయి పోతున్నదే ఎట్లా.

"ఎందుకోయ్ రూపాయి, ఇంత అన్యాయమా మరీ."

వాడు శాంతంగా సమాధానం చెప్పాడు.

"అన్యాయమేముంది బాబూ! జోరున వానకురుస్తూంది! ఈ వానలో ఎవరొస్తారండీ!"

"ముప్పావులాకు రావోయ్."

"రాను బాబూ."

"కలికాలం. అంతా అన్యాయమే" అని గొణుక్కున్నాడు రతన్‌లాల్. రిక్షావాడన్నాడు: "వాన కురుస్తున్నది బాబూ లేకపోతే అరణాలకే తొక్కుతాను. రెక్కలకష్టం సూడాలి బాబూ ధర్మ పెబువులు. ఈ సలికి సచ్చిపోతాను. సప్పగా తడిసిపోతాను బాబూ."

ఒళ్ళంతా దహించుకుపోయింది రతన్‌లాల్‌కు. తనకు కారు లేకపోవడం ఎంత తెలివితక్కువ పనయిపోయింది, అనుకున్నాడు మనస్సుకి విపరీతమైన కష్టమూ తోచింది.

"సరేపోనియ్" అన్నాడు ఎంతో అయిష్టంగా.

రిక్షావాడి ముఖం వెలిగిపోయింది. పరమోత్సాహంతో నీళ్ళను చప్పుడు చేసుకుంటూ తొక్కుకుపోతున్నాడు. వాన కురుస్తూంది. ఎలక్ట్రిక్ దీపాలు మసక మసకగా కనపడుతున్నాయి. రిక్షాపోతూన్నది. రోడ్డుమీద ఒక్క పురుగూ లేదు. ఒక్కొక్క చోట చక్రాలు నీళ్ళను కోసుకుంటూ పోతున్నాయి. గలగలా పారుతున్నాయి. రతన్‌లాల్‌కు చాలా అసంతృప్తిగా

ఉంది. బూట్ పైన నీళ్ళు పడుతున్నాయి. రిక్షావాడు పూర్తిగా తడిసిపోతున్నాడు. రిక్షా పోతూనేఉంది. రతన్‌లాల్‌కు కోపంగా ఉంది.

రిక్షా ఓ చోట వంకరగా తిరిగి ఇంకో వీధిలోకి పోతున్నది. చిన్నచిన్న కాఫీ హోటళ్ళ రెండూ, ఓ కిళ్ళీబడ్డీ, దూరంగా పార్కూ, ఒక పక్కగా ఆడపిల్లల కాలేజీ, ఓ ఫర్లాంగు దూరంలో మునిసిపాలిటీవాండ్లు కట్టించిన క్వార్టర్లూ—మధ్య కూడలి. రిక్షా అక్కడ తిరుగుతున్నది మలుపు, ఫుట్‌పాత్ పక్కనే రిక్షా ఆపాడు రిక్షావాడు. రతన్‌లాల్‌కు చాలా కోపం వచ్చింది. రిక్షావాడు రిక్షా దిగి పోయాడు. వాన కురుస్తూనే ఉంది. "ఎందుకు దిగావు? ఏమి వచ్చింది నీ రిక్షాకు? లేక నీకేమైనా వచ్చిందా? పోనీ త్వరగా ఇంటికి పోవాలి. నేనుకూడా తడుస్తున్నాను" అంటున్నాడు రతన్‌లాల్ కోపంగా. రిక్షావాడు రోడ్డుమీద ఫుట్‌పాత్ పక్కనేఉన్న ఏదో వస్తువును చప్పున పైకి తీశాడు. రతన్‌లాల్‌కు కోపం తగ్గిపోయింది. "ఏమిటేమి" టన్నాడు, కంగారుగా, ఆశగా, అసూయగా. రిక్షావాడు రతన్‌లాల్ చేతికి ఒక మంచి "పెన్" ఇచ్చాడు. నిర్వికారంగా రిక్షా తొక్కుకుంటూ ముందుకు సాగి పోయాడు. వానకురుస్తూనేఉంది. ఎలక్ట్రిక్ దీపాలక్రిందుగా రిక్షా పోతున్నది. వాన జోరు కొంచెం తగ్గింది.

రతన్‌లాల్ మనస్సులో వెయ్యి ఆలోచన పెద్దలు ఆశ నోరు తెరుచుకున్న తిమింగలంలా అతణ్ణి మింగుతూంది. రతన్‌లాల్ మింగుడు పడ్డాడు. వెయ్యి ఆలోచనలు ఉక్తిప్రత్యుక్తులు మనస్సులో. "పాపం ఎవరో పారేసుకున్నారు" అన్నాడు రిక్షావాడు నీళ్ళ చప్పుడుతో కలిసిపోయే మాటలతో.

రతన్‌లాల్ మాటాడలేదు.

ఏమీతోచలేదు ప్రతిదీపం క్రిందనూ క్షణంసేపు చూస్తున్నాడు ఆకాశాన్ని.

మనస్సులో మెరుపు మెరిసింది.

"ఎంతో ఖరీదుకాదు, నాలుగైదు రూపాయలు అవుతుంది" అన్నాడు రతన్‌లాల్.

"అంతేనా" అన్నాడు రిక్షావాడు.

రతన్‌లాల్ గుండెలో వెయ్యి కుశంకలు పుట్టుకువచ్చినై. అసంతృప్తి మూలిగింది. గాంభీర్యం చెక్కుచెదరకుండా "అంతే" నన్నాడు. వాన తగ్గి కురుస్తూఉన్నది,

రిక్షా పోయిపోయి ఇనుప కటకటాల పాతబంగళా ముందు ఆగింది

"ఇక్కడే" అని రతన్‌లాల్ రిక్షా దిగాడు.

"లోపలకురా పాపం తడుస్తావు" అన్నాడు రిక్షావాడితో.

రతన్‌లాల్ చూశాడు. తన ఇంటి ముందుకారులేదు. గేటుదగ్గర పెద్ద లైటు వేసి ఉంటుంది. ఇంటావిడ, మర్యాద

కోసం మళ్ళీ తియ్యలేదు. రతన్‌లాల్‌కు కోపం వచ్చింది. మెట్లు ఎక్కి పైకి వచ్చాడు. లైటు తీసేశాడు. కోపంగా అరిచాడు ఇంటావిడ నుద్దేశించి "లైట్ తీసెయ్యడం మరచిపోయావా?" రిక్షా వాడు వెనకనే వచ్చాడు. రూపాయి వస్తోంది ఇప్పుడు లేకు. రతన్‌లాల్ భార్యను పిలిచి రూపాయి తెమ్మన్నాడు. ఆమె గ్రహించింది. వరండాలో రిక్షా వాడు నిలుచుని ఉన్నాడు నీళ్ళుకారుతూ. ఆమె ముఖం వెలుగుతున్న దీపం కాస్త ఆరిపోయినట్లయింది. రూ పా యా ? ఆమెకూ కోపం వచ్చింది.

రతన్‌లాల్ వరండాలోకి వచ్చాడు.

రూపాయి ఇచ్చాడు. రిక్షా వాడు సంతోషపడ్డాడు కాని కదల్లేదు. రతన్ లాల్ అన్నాడు, "ఏమోయ్ నువ్వేం చేసుకుంటావు యీ కలం? మా పిల్లవాడు కలం కొనిపెట్టమని రోజూ పోరు తున్నాడు. నేనే మరిచిపోతున్నాను, ఏదో ఉంటుంది. మూడు నాలగు రూపాయలు చేస్తుందేమో ఇది. అంటే అసలు ఖరీదన్నమాట. చాలా పాతబడి పోయింది. అవునులే, యీవిషయాలన్నీ నీకేమి తెలుస్తాయి. ఓ రూపాయి ఇస్తాను నాకిచ్చేస్తావా?" అంటూ రతన్‌లాల్ స్నేహపిచ్చిలంగా నవ్వాడు.

ఇంకో రూపాయి. రిక్షావాడికి గుండెల్లో సంతోషం కలిగింది. తన అదృష్టం, లేచినవేళ అనుకున్నాడు. ఆశ పుట్టింది. తనుకూడా తెలివికలవాడే అని నిరూపించుకోవాలి. అంత తేలిగ్గా లొంగిపోతాడా. గర్వంకూడా కలిగింది.

"మూడు రూపాయలివ్వండి బాబూ. తళతళా మెరిసిపోతుంటేను. కొత్తదే!" అన్నాడు.

"అయితే తీసుకపో."

రిక్షావాడికి తెలిసిపోయింది తను ఉట్టి తెలివితక్కువవాడు. తెలివి చూపించుకోబోతే ఇంతే అవుతుంది.దెబ్బతిన్నాడు. రతన్‌లాల్ చేతిలోనుంచి ఆ కలాన్ని అందుకోబోయాడు.

రతన్‌లాల్ అన్నాడు. 'నువ్వేం చేసుకుంటావ్ దాన్ని, నీకు తెలీదు. ఎవరో అర్డో, పాపవలాయో పెట్టి నీచేతుల్లోనుంచి తీసుకుంటారు. పోనీ రెండు రూపాయలిస్తాను. ఇచ్చేసిపో. మా పిల్లవాడు పోరుపెట్టుతున్నాడు. లేకపోతే నేను తీసుకోకపోదును."

రిక్షావాడు "సర్లెండి బాబయ్యా" అన్నాడు.

"మూడు రూపాయలే!" ఒక్కసారి రిక్షా లాగినందుకు. రిక్షావాడికి పట్టరాని ఆనందం కలిగింది.

తలుపుచాటునుంచి ఇంటావిడ చూస్తూ ఉంది.

రిక్షావాడు ఆ సంతోషంతో వరండా మెట్లు జారిపడబోయాడు. పడలేదు. రోడ్డుమీద రిక్షా గణగణ గంటచప్పుడు చేసుకుంటూ పోతున్నది. ఇంటావిడతో

రతన్‌లాల్ తనకవాళ ఎనభై రూపాయల లాభంగురించి చెప్పతూ, ఆమె రెండు రూపాయల దుఃఖాన్ని పోగొట్టుతున్నాడు, విడమరిచి చెప్పతూ.

వాన వెలిసింది

చెట్ల ఆకులపైనుంచీ నీటిబొట్లు రాలుతున్నాయి, ఒక్కొక్కటిగా. రోడ్డుమీద దీపాలకాంతి ప్రతిఫలిస్తున్నది. జన సమ్మర్దమూ తగ్గిపోయినది. ఆకాశం తెరిపిగా ఉంది.

ఏడ్చి ఏడ్చి అలసిపోయిన పసిపాప నిద్రలా మహానగరంకూడా ప్రశాంతంగా ఉంది. రాత్రి ఒకవంతు గడిచింది.

మహానగరం. అందులో ఓమూల పాతబంగళా, ఆ పాతబంగళాలో కారు గేరేజి ఉంది.

ఆ కారు గేరేజిలో రామారావు కాపుర ముంటున్నాడు. అంటే, మార్వాడీ సేటు గారు మిక్కిలి దయకలవాడై గేరేజి ప్రక్కనే ఇంకోగది లాంటిది కట్టించి దాన్నీ, గేరేజీని నలభై రూపాయలకు రామారావుకు అద్దెకిచ్చాడు.

రామారావు కిందటినెల అద్దె బకాయి పడ్డాడు.

రామారావు భయపడ్డాడు. ఒకవంతు రాత్రి గడిచిన తరువాత "సేట్‌గారు తనను పేరెట్టి పిలవడం రామారావుకు దిగులైంది. రామారావు ఇదివరలో ఎప్పుడూ బకాయిపడలేదు. క్రిందటి నెలలో భార్యను పుట్టింటికి పంపించాడు. అందుకని యీ నెల అద్దె యివ్వలేక పోయాడు. రామారావు గదివాకిలిదాటి బయటకు వచ్చాడు. సేట్ వరండాలో నిలుచుని పిలుస్తున్నాడు

రామారావు వరండాలోకి వచ్చాడు.

"చూశారా, రామారావుగారూ? ఈ కలాన్ని చూడండి జాగ్రత్తగా చూడండి. ఎంత ఖరీదవుతుందేమిటి?"

రామారావుకు ఆనందమైంది. అద్దె విషయం అడిగేందుకు కాదు సేట్ పిలిచింది రామారావు ఉత్సాహంగా చూశాడు. అలాంటి కలం రామారావు ఎప్పుడూ చూచి ఎరుగడు. పరిశీలించి చూశాడు బాగా తెలిసినవాడిలాగా. "అబ్బా చాలా ఖరీదవుతుందండి. ఇలాంటివి అసలు ఇప్పుడు దొరకనే దొరకటం లేదు" అన్నాడు. సేట్‌కు చాలా సంతోష మైంది

"ఎనభై రూపాయ లవుతుంది" అన్నాడు సేట్. రామారావు ఉత్సుకతతో చూశాడు దానివైపు.

''దొరికింది" అన్నాడు సేట్.

రామారావు అదిరిపడ్డాడు. తనది చాలా విలువైన వస్తువు ఏదో పోయి నట్లుగా వ్యధ కలిగింది అతడికి

చెప్పలేని అసూయ కలిగింది.

సేట్ చెప్పకుని పోతున్నాడు. రిక్షా వాడు చూశాడట ముందు. దాని ఖరీదు నాలుగు రూపాయలకంటే ఎక్కువ ఉండ




దని చెప్పాడట తాను. వాడు రెండు రూపాయలకు ఇచ్చాడట తాను వాన కురవకముందే ఇల్లు చేరుకుని ఉన్నట్లయితే ఈ కలం యీవాళ తనకు చిక్కేది కాదు ఇంత పెద్ద వానకురవటం, తాను బజారులో చిక్కుపడిపోవటం, తనకు ఇంటిదగ్గర పని వుండటంవలన రిక్షా వాడు రూపాయడిగినా, తాను ఒప్పుకుని రావడం, వచ్చినందుకు రోడ్డుమీద ఇంత మంచి కలం పడిఉండటం రిక్షావాడే చూచి తీసుకున్నా తనకు రావలసి ఉండటం అంతా చెప్పాడు.

రామారావుకు ఎంతో బాధకలిగింది.

సేట్ ఎంతో తృప్తిగా ఉన్నాడు. రామారావు యోగక్షేమాలు అడిగి కనుక్కున్నాడు. రామారావుకు మంటగా ఉంది. అసహ్యంగా ఉంది. అసూయగా ఉంది. బాధగా ఉంది. కోపంగా ఉంది. సేట్‌కు నవ్వువస్తున్నది. తలుపుచాటున ఇంటావిడ నిలుచుని ఉంది. ఆమె కళ్లు ఉజ్జ్వలంగా ఉంటాయి ఎప్పుడు అని సేట్ హృదయం పలుకుతున్నది. సేట్ తృప్తిగా మాట్లాడుతున్నాడు.

రామారావు సేట్‌దగ్గర సెలవు తీసుకొని తన గదిలోకి వెళ్ళాడు. పడుకున్నాడు. నిద్ర రావటంలేదు. మనసు పరిపరివిధాల పోతున్నది. పరమేశ్వరునికి దరిద్రుల ఎడలగల నిర్దయకు అతని మనస్సు మిక్కిలి నొచ్చుకోసాగింది. రామారావుకు యీ సంఘటన చాలా విచిత్రంగా ఉంది. అదృష్టం అనేది నిజంగా ఉన్నదనిపిస్తున్నది. ఈ సంఘటన తన చెవినిబడకపోతే చాలా బావుండేది. ఆ కలం తనకు దొరికితే తన నుండి సేట్ గుంజుకున్నట్లుగా బాధపడసాగాడు రామారావు. మాటిమాటికి

భగవంతుడి ఎడల అతడి మనస్సు అప్రసన్నం కాసాగింది. రామారావుకు కథలు వ్రాసే అలవాటుంది. చాలసేపటి వరకు యీ సంఘటనను గురించే ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మహానగరం.

వానకురిసి వెలిసింది.

ఒకానొక పేటలో ఒక గల్లీలో ఒక చోట కల్లు దుకాణం ఉంది.

ఒక్క గంటలో మూడురూపాయలు సంపాదించిన రిక్షావాడొకడు ఆ సంతోషం పట్టలేక ఆ కల్లుపాకలో కూచిని కడుపు నిండా తాగుతున్నాడు.

ఇంకా సేపటికి వాడు ఇంటికి పోతాడు మధ్యలో వాన కురిసింది కాబట్టి చౌకయిపోయిన మల్లెదండల్ని పొద్దుపోయి ఇంటికిపోతూ ఏ బ్రిడ్జిమీదనో వాడు కొనవచ్చు. కొన్ని నిమిషాలో ఇంటికి పోయి పెళ్ళాన్ని కొట్టవచ్చు. వాడిపెళ్లాం ఏడవనూ వచ్చు.

రామారావు రోడ్డుమీద దొరికిన కలాన్ని గురించి కథ వ్రాసి ముందు ముందు పదిరూపాయలు సంపాదించుకో వచ్చు. భగవంతుని దయావిహీనతకు నొచ్చుకుంటూ కూడా!

అదేనగరంలో మరోచోట, మరో పేటలో రాత్రి పొద్దుపోయిన తరువాత కృష్ణమూర్తి తారకు ఉత్తరం రాదామని కలంకోసం వెతుకొని అది పోయిందని గ్రహించుకొని బావురుమని ఏడ్చి ఉండవచ్చు. తనకళ్లలో దూరం దూరంగా ప్రకాశిస్తున్న తారను తలచుకుని ఆమె యిచ్చిన కలాన్ని తాను హోటల్లో భోజనం చెయ్యడానికి వెళ్లేటప్పుడో, భోంచేసి వచ్చేప్పుడో పోగొట్టుకొన్నందుకు ఆ రాత్రంతా కుమిలిపోనూవచ్చు.

పాపం కృష్ణమూర్తి దిండులో తల దాచుకుని తారను గురించే ఆలోచించుకొంటున్నాడు.

సేట్ రతన్‌లాల్ ఎవరో తనదగ్గర 'కారు' తాకట్టుపెట్టి డబ్బు అడుగుతున్నట్లు కల కంటున్నాడు.

రిక్షావాడి భార్య 'తాగొచ్చావా సచ్చినోడా' అని, నోటికివచ్చినట్టల్లా తిడుతూంది.

రామారావు కథ వ్రాసుకుంటున్నాడు ఆ రామారావును నేనే.



బ్యాంకు : వాతావరణం పొడిగా ఉన్నప్పుడు మీకు గొడుగును అరువిచ్చి, వాన మొదలైనప్పుడు దాన్ని తిరిగి ఇవ్వమని మిమ్మల్ని అడిగే సంస్థ.

—రాబర్ట్ ఫ్రాస్ట్.



(గత సంచిక తరువాయి)

ఖాజా ఇలా చెప్పాడు:

మహారాజా, నా కుడిపక్కన నిలబడిన వాడు నా పెద్దన్న. ఎడమపక్కన ఉన్నవాడు నాచిన్నన్న. ముగ్గురిలోకీనేనే చిన్నవాణ్ణి. పర్షియాలో వర్తకుడుగా ఉండిన నా తండ్రి నా పధ్నాలుగోయేట చనిపోయాడు. ఆయనకు ఉత్తరక్రియలు అయిన అనంతరం నా అన్నలు ఒకనాడు నాతో "మనం మన తండ్రి ఆస్తిని పంచుకుని ఎవరివంతు వారు యధేచ్ఛగా అనుభవింతాం," అన్నారు.

"అన్నల్లారా, ఇవేం మాటలు. నేను మీ దాసుణ్ణి. సహోదరుడి హక్కులు కోరను. తండ్రిగారు పోయినా, తండ్రిలాంటివాళ్ళు మీరిద్దరూ ఉన్నారుగదా! నా కింత రొట్టెపడేస్తే, నా జీవితమంతా మీకు సేవచేస్తాను. వాటాను నేనేం చేసుకుంటాను? మీరు తినగా మిగిలినది తింటూ మీ వెంటే ఉంటాను. నేను చిన్నవాణ్ణి. నాకు చదువు సంధ్యలు రావు. నాకు ఏదీ చేతకాదు. నాకు చదువు చెప్పించండి. అదే నేను కోరేది!" అన్నాను.

"నువు దరిద్రుడివై, బిచ్చమెత్తుకోవటమేగాక మాచేతకూడా అంత పని చేయిస్తావు!" అన్నారు మా అన్నలు.

నేను మారు మాట్లాడక ఒక మూల పడుకుని ఏడుస్తూ, నా అన్నలు నాకన్న పెద్దవాళ్లుగదా, నా మంచికోసమే నన్ను కోప్పడ్డారనీ, నేను ఏదైనా వృత్తి నేర్చు

కుంటే బాగుంటుందని అనుకుంటూ నిద్ర పోయాను.

మర్నాడు ఉదయం కాజీగారి బంట్రోతువచ్చి, నన్ను న్యాయస్థానానికి పిలుచుకుపోయాడు. అక్కడ మా అన్న లిద్దరూ ఉన్నారు.

"మీ తండ్రి ఆస్తిలో నీ వాటా ఎందుకు తీసుకోవు?" అని కాజీ నన్ను అడిగాడు.

మా అన్నలతో అన్నమాటే కాజీ తోనూ అన్నాను.

మా అన్నలు ఆయనతో, "అది చిత్త శుద్ధిగా అన్నమాటే అయితే, మా తండ్రి ఆస్తిమీద తనకు ఏ హక్కూ అవసరం లేదని రాసి ఇవ్వమనండి!" అన్నారు.

అప్పుడు కూడా నాకు, వాళ్లు పెద్ద లనీ, నా మంచికోరే చెబుతున్నారనీ, నా తండ్రి ఆస్తిలో వాటా తీసుకుంటే అదంతా ఖర్చయిపోయిందనీ అనిపించి, కాజీగారిముద్రకింద నాహక్కులు వదులు కున్నాను. మా అన్నలు తృప్తిచెంది ఇంటికి తిరిగివచ్చారు.

ఇది జరిగిన మర్నాడు వాళ్లు, "తమ్ముడూ, నువ్వు ఉంటున్న భాగం మాకు కావాలి. నువు వేరే ఇల్లు అద్దెకు తీసుకుని, అందులో ఉండు" అన్నారు.

నేను మా తండ్రి ఇంట ఉండటం వాళ్ళ కిష్టంలేదని నా కప్పుడు తెలిసి వచ్చింది. నేనేమీ చెయ్యలేక, వెళ్ళిపోవ టానికి నిశ్చయించాను.

జీవించి ఉండగా మా తండ్రి వర్తకం నుంచి తిరిగివచ్చినప్పుడల్లా తాను అనేక దేశాలనుంచి తెచ్చిన అపూర్వవస్తువులు నాకు కానుక ఇచ్చేవాడు. ఎలాగైనా కడగొట్టుబిడ్డమీద మమకారం హెచ్చుగద. ఇప్పుడు నే నా వస్తువుల నన్నిటినీ అమ్మి కొంత ధనం సమ కూర్చుకుని, దానితో వ్యాపారం సాగించాను. ఒకప్పుడు మా తండ్రి నాకొక తాతారు యువతిని బానిసగా ఇచ్చాడు. మరొకసారి నాకొక మంచి గుర్రపుపిల్లను కొనిపెట్టాడు నాకున్న కొద్దిడబ్బుతోనే నేను దాన్ని మేపుతూ వచ్చాను.

చివరకు మా అన్నల ద్రోహబుద్ధి మూలాన నేను మరొక ఇల్లు కొనుక్కొని, అందులోకి మారాను. ఈ కుక్కకూడా నా వెంట వచ్చింది. ఇంటికి కావలసిన వస్తువులనూ, ఇద్దరు ఆడబానిసలనూ కొనుక్కున్నాను. ఈ ఖర్చులన్నీ పోగా మిగిలిన డబ్బుతో ఒక బట్టలకొట్టు పెట్టి, దేవుడిపై భారంవేసి ప్రశాంతంగా కూర్చు న్నాను నా అన్నలు నాకు ద్రోహం చేసినా, నేను జరిగినదానికి వగవలేదు. దేవుడు నన్ను దయతో చూశాడు.

మూడేళ్ళలో నా దుకాణం ఎంతో అభివృద్ధిచెందింది. నాకు మంచి పరపతి ఏర్పడింది. గొప్పగొప్ప ఇళ్ళకు ఏ బట్టలూ, ఉడుపులూ అవసరమైనప్పటికీ అవి నా దుకాణంనుంచే వెళ్ళేవి. నాకు మంచి లాభాలు వచ్చేవి. నేను సంపన్నుణ్ణి

అయాను. నేను గంటగంటకూ భగవంతుణ్ణి స్మరిస్తూ, సుఖంగా జీవిస్తున్నాను.

ఒక శుక్రవారంనాడు నేను ఇంటి వద్ద ఉన్నప్పుడు నా బానిస ఒకడు వస్తువులు కొనటానికివెళ్ళి, ఏడుస్తూ తిరిగి వచ్చాడు. ఏమయిందని అడిగాను. వాడు కోపంగా, "మీకేం? మీ రిప్పుడు సుఖంగానే ఉన్నారు. తరవాత దేవుడి ముందు ఏం సంజాయిషీ ఇస్తారు?" అన్నాడు.

"నీ కేమన్నా దయ్యం పూనిందిరా?" అన్నాను.

"మీ పెద్దన్నను ఒక యూదువాడు చౌక్‌లో పెడరెక్కలు విరిచి కట్టి నిలబెట్టి, కర్రలతో, కొట్టుతూ 'నాడబ్బు ఇవ్వకపోయావో, నిన్నుకొట్టిచంపుతాను నా డబ్బు పోయినా, దేవుడు నేను చేసిన పనిని మెచ్చుకుంటాడు.' అంటున్నాడు. నీ అన్నకు ఈ గతి గలిగితే నువు పట్టించుకోకుండా ఉన్నావు ఇది సబబా? లోకం ఏమంటుంది?'' అన్నాడు బానిస.

ఈ మాటలు విని నా రక్తం భ్రాతృప్రేమతో పొంగింది. నేను చౌక్‌కు పరిగెత్తుతూ, డబ్బుతో వెంటనే రమ్మని నా బానిసతో చెప్పాను. నే నక్కడికి చేరి, నా బానిస చెప్పినమాటవాస్తవమనితెలుసుకొన్నాను. మా అన్నను న్యాయస్థాన భటులు కొట్టుతున్నారు. వాళ్లను ఒక్క క్షణం ఆగమని, యూదువాడితో, "మా అన్న ఏ మహాపరాధం చేసినందుకు ఇలా చావగొట్టిస్తున్నారు?" అన్నాను.

'నువు అతని పక్షమైతే, అతని బదులు డబ్బంతా చెల్లించి మరీ ఇంటికి నడు" అన్నాడు యూదువాడు.

"ఏం డబ్బు? పత్రం చూపించు, డబ్బిస్తాను," అన్నాను.

పత్రం న్యాయాధికారివద్ద ఉన్నది. ఇంతలో నా బానిసలు రెండు డబ్బు సంచులతో వచ్చారు. నేను యూదువాడికి వెయ్యి వెండికాసులిచ్చి, నా అన్నను విడిపించాను. అతకు వొంటిమీద బట్టలేక, తిండిలేక, నీరులేక అత్యంత దీనావస్థలో ఉన్నాడు. నేను అతన్ని మా యింటికి తెచ్చి, స్నానంచేయించి, కొత్తబట్టలు కట్టించి, కడుపునిండా భోజనం పెట్టాను. మా తండ్రికిగల అంత ఆస్తి అంతా ఏంచేశాడో అడిగితే నొచ్చుకుంటాడని అడగలేదు. మహారాజా, ఇద్దరూ ఇక్కడే ఉన్నారు. నేను చెప్పిన దానిలో అబద్ధం ఏమన్నా ఉన్నదేమో అడగండి.

సరే, కొద్దిరోజుల అనంతరం, మా అన్న గాయాలు మానినాక, నేను నా అన్నలిద్దరితో, "మీకు నగరంలో పరపతి పోయింది. అందుచేత మీరు కొంత కాలం దేశాటనచేసి, జరిగినదంతా మరిచిపోవటం మంచిది," అన్నాను.

వాళ్ళిద్దరూ ఏమీ జవాబు చెప్పలేదు. నేను గుడారాలూ, వాహనాలూ సంపా

దించి ఇరవై వేల వెండికాసులకు వర్తక సరుకులు కొని, వారి ప్రయాణానికి ఏర్పాట్లుచేశాను. బొఖారాకు వర్తక బిడారు ప్రయాణమవుతూ ఉంటే మా అన్నలను వారి వెంట పంపాను.

ఆ బిడారు ఏడాది తరవాత తిరిగి వచ్చింది. కాని మా అన్నలు జాడలేదు. ఒక మిత్రుడిమీద ఆనపెట్టి వారిసంగతి అడిగితే, అతను ఇలా చెప్పాడు.

"బొఖారా చేరిన తరవాత మీ అన్న ఒకడు డబ్బంతా జూదంలో పోగొట్టు కున్నాడు. ఇప్పుడు తాను ఆజూదగృహం లోనే కసువు ఊడుస్తున్నాడు. జూద గాళ్లకు అడ్డమైనచాకిరీ చేస్తున్నాడు. రెండో వాడు ఒక నల్లమందు వ్యాపారికూతుర్ని మరిగి, దానికోసం తన డబ్బంతా తగలేసి, నల్లమందు దుకాణంలో నౌకరుగా ఉంటున్నాడు. ఈసంగతి బిడారు వర్తకులు నీతో ఎలా చెబతారు?"

నా మిత్రుడు ఈ వార్త చెప్పేసరికి నేను మానసికంగా కుంగిపోయాను. నాకు ఆకలి, నిద్రా కూడా దూర మయాయి. దారి ఖర్చులకు కొంతడబ్బు చేతపట్టుకుని వెంటనే బొఖారాకు బయలు దేరాను. అక్కడ వాళ్లను వెతికి పట్టు కుని, నా బసకు తెచ్చాను. వాళ్లకు స్నానంచేయించి, కొత్త బట్టలిచ్చాను. కాని వాళ్లు బాధపడతారనీ, జరిగినదాన్ని గురించి పల్లెత్తుమాట అనలేదు. నేను వాళ్లకోసం మళ్ళీ వర్తకపు సరుకులు కొని వాళ్లతోసహా తిరుగు ప్రయాణం అయాను.

మేం నిషాపూర్ చేరవచ్చాం. నేను వాళ్ళను సరుకులతోసహా ఒక గ్రామంలో వదిలి, రహస్యంగా మా ఇంటికి తిరిగి వచ్చాను—నేను తిరిగి వచ్చానన్న సంగతి ఎవరికీ తెలియరాదని నా ఉద్దేశం

రెండురోజులు గడవనిచ్చి, నా అన్నలు తిరిగి వస్తున్నారనీ, మర్నాడు నేను వాళ్ళను కలుసుకుంటున్నాననీ పదిమందికీ తెలిపాను. మర్నాడు ఉదయం నేను బయలుదేరబోతూ ఉండగా, ఆ గ్రామంనుంచి ఒక రైతు వచ్చి పెద్దగా అరవసాగాడు వాడి గొంతు విని నేను బయటి వచ్చేసరికి వాడు ఏడుస్తున్నాడు.

"ఎం ఏడుస్తున్నావు?" అని వాణ్ణి అడిగాను.

"నీ అన్నలు నా కొంప నిలువునా దోచారు. నువు తెచ్చి వాళ్ళను నా మీద పెట్టకపోతే ఇలా జరక్కపోవును," అన్నాడు వాడు.

"ఏం జరిగింది?"

"రాత్రివేళ దొంగల ముఠావచ్చి వాళ్ళ సరుకులతోబాటు నా ఇల్లుకూడా కొల్లగొట్టారు."

నాకు వాణ్ణిచూస్తే జాలివేసింది. "మా అన్నలు ఎక్కడ?" అని అడిగాను.

"నగరం బయట దిగాలుపడి కూర్చు

న్నారు. వాళ్ల వంటిమీద సరియైన బట్టలు కూడా లేవు"

నేను వెంటనే రెండు జతల దుస్తులు తీసుకుని బయలుదేరి వెళ్ళి, వాటిని వాళ్ళ చేత తొడిగించి, వాళ్ళను ఇంటికి తెచ్చాను.

దొంగతనం మాటవిని ఇరుగుపొరుగు వాళ్ళు చూడవచ్చారుగాని నా అన్నలు మొహంచెల్లక బయటికి పోలేదు ఇలా వాళ్ళు నా ఇంట దాగివున్న అనంతరం నేనిలా ఆలోచించాను. వాళ్లు ఇలా ఎంత కాలం దాక్కుంటారు? నేను వాళ్ళను సముద్రవర్తకంమీద తీసుకుపోవటం సాధ్యపడుతుంది.

ఈ మాటే వాళ్ళతో అంటే మౌనంగా ఉండిపోయారు

నేను మరొకసారి సముద్రవర్తకానికి ఏర్పాట్లుచేసి కొంత సరుకుతో బయలుదేరుతూ, వాళ్లను కూడా వెంటబెట్టుకున్నాను. ప్రయాణం విజయవంతంగా సాగటానికిగాను దానధర్మాలు చేసి, సరుకు నౌకకెత్తించి, లంగరు ఎత్తాం. నౌక బయలుదేరే సమయానికి ఈకుక్క ఒడ్డున పడుకుని నిద్రపోతున్నది. అది కళ్లు తెరిచి చూసేసరికి నౌక నడి ప్రవాహంలో ఉన్నది కుక్క వెంటనే నదిలోకిదూకి, ఈదుకుంటూ నౌకకేసి వచ్చింది. నేను దాన్ని నౌకలోకి చేర్పించాను.

నదీప్రయాణం ఒక నెలపాటు క్షేమంగా జరిగింది. నా చిన్నన్నకు నా బానిస పిల్లపై ఎలాగో మనసయింది. అతను ఒకనాడు మా పెద్దన్నతో, "మన తమ్ముడికి ఇంతగా ధనపడటం చాలా అవమానకరంగా ఉన్నది. ఈ పీడ ఎలా విరగడ అవుతుంది?" అన్నాడు.

"నా మనసులో ఒక ఆలోచన ఉన్నది. అది అమలుచేస్తే గొప్పగా ఉంటుంది," అన్నాడు నా పెద్దన్న.

ఇద్దరూ కూడబలుక్కుని నన్ను నిర్మూలించి, నా సొత్తూ, ఆస్తీ కాజేయ నిశ్చయించుకున్నారు.

ఒకనాడు నేను నా పడకగదిలో నిద్రపోతున్నాను. నా బానిస నా కాళ్లు పట్టుతున్నది. అప్పుడు నా చిన్నన్న తొందరగావచ్చి నన్ను నిద్రలేపగొట్టాడు. నేను ఉలిక్కిపడిలేచి, పడవపైభాగానికి వెళ్ళాను. ఈ కుక్కకూడా నా వెంట వచ్చింది. నా పెద్దన్న పడవ అంచుల మీదుగా నదిలోకి చూస్తూ, నన్ను పిలిచాడు.

నేను అతన్ని సమీపించి, "మీ కేమీ జరగలేదుగద?" అని అడిగాను.

"ఈ వింత చూడు, జలదేవతలు చేతులలో ముత్యపు చిప్పలూ, పగడపు కొమ్మలూ పట్టుకుని, ప్రవాహంలో నృత్యాలు చేస్తున్నారు. ఇలా జరుగుతుందని మరెవరన్నా చెబితే నేను చచ్చినా నమ్మి ఉండను," అన్నాడతను.

అతను నిజమే చెబుతున్నాడనుకుని,

వింత చూడడానికి నేను కూడా అతని మీదుగా వంగాను. ఎంతచూసినా నాకేమీ కనబడలేదు. అతను "కనిపించిందా? కనిపించిందా?" అని అడగసాగాడు. ఏమైనా ఉంటేగా కనపడటానికి?

ఈ యుక్తితో నన్ను అన్య మనస్కుణ్ణి చేసిన పీడక నా చిన్నన్న నావెనకవచ్చి ఎంత బలంగా తోశాడంటే, నేను నీటిలో పడిపోయాను. పడవ ముందుకుపోతుంటే ప్రవాహం వెంట నేను వెనక్కు తోసుకుపోయాను.

నేను మునుగుతూ తేలుతూ కొంత దూరం వెళ్ళి అలసిపోయి, చావు తప్ప దనుకుని భగవంతుణ్ణి స్మరించాను. ఇంతలో నాచేతికి ఏదో తగిలింది. చూస్తే ఈ కుక్క! నన్ను వాళ్ళు నదిలోకి తోసేసినప్పుడు ఇదికూడ దూకి, నా వెంట ఈదుతూ వచ్చిఉంటుంది. నేను దాని తోక పుచ్చుకున్నాను. భగవంతుడు నన్ను కాపాడటానికి దాన్ని పంపాడు ఏడు పగళ్లూ, రాత్రులూ ఇలా గడిపి చివరకు తీరం చేరుకున్నాం.

నేను ఒడ్డుకు దొర్లి, వెల్లికిలా పడు కుని ఒక రోజల్లా నిద్రపోయాను. రెండోరోజు కుక్క మొరగటం విని కళ్లు తెరిచాను. నా ప్రాణం దక్కినందుకు దేవుడికి ధన్యవాదాలు చెప్పు కు ని, చుట్టూచూస్తే దూరాన ఒక నగరం కని పించింది. కాని దాన్ని చేరుకునేటందుకు నాకు శక్తి ఏదీ? కొద్దిదూరం పాకుతూ ఆగుతూ, మళ్ళి పాకుతూ సాయంకాలా నికి ఒక కోసు దూరం వెళ్ళాను. నగరా నికివెళ్లేదారిలో మధ్య ఒక గుట్ట ఉన్నది. రాత్రికి అక్కడ ఆగాను

తిరిగి ఉదయం అయేసరికి నగరం చేరాను. బజారులో రొట్టెల దుకాణాలూ, తినుబండారాల దుకాణాలూ కనపడేసరికి నా దగ్గర డబ్బు లేనందుకు ఎంతో విచారం కలిగింది. (ముష్టెత్తటం నాకిష్టం లేదు.) ఈ సారి కనిపించే దుకాణంలో అడిగి చూతాం అనుకుంటూ ముందుకు పోయాను. చిట్టచివరకు నాకు మిగిలి ఉన్న కాస్త శక్తి ఉడిగిపోయి, ఆకలి దహించసాగింది.

నా ప్రాణాలు పోతున్నాయనిపించే సమయానికి ఇద్దరు యువకులు చెట్టా పట్టాలు పట్టుకుని, పర్షియను దుస్తులు ధరించి నా కళ్ళపడ్డారు. దుస్తులనుబట్టి వాళ్లు నా దేశస్థులని తెలుసుకోగానే నాకు ప్రాణం లేచివచ్చింది. నాకు తెలిసిన వాళ్లేనేమో! వాళ్ళతో నా కష్టాలు చెప్పు కోవచ్చు ననుకున్నాను తీరా వాళ్లు నా దగ్గరికి వచ్చేసరికి, వాళ్ళు నా అన్నలే! నాకు చాలా సంతోషమయింది. నేను అపరిచితులముందు చెయ్యి చాచవలిసిన అగత్యం తప్పింది. అయితే అప్పటికి వాళ్ల దుర్మార్గం నేను తెలుసుకుని ఉండ లేదు.

నేను వాళ్ళను సమీపించి వందనం చేసి, మా పెద్దన్న చెయ్యితీసుకుని



ముద్దు పెట్టుకున్నాను. వాళ్ళు నన్ను గుర్తించి పెద్దగా అరిచారు. నా చిన్నన్న నన్ను బలంకొద్దీ కొట్టాడు. ఆ దెబ్బకు నేను తూలిపడిపోయాను. మా పెద్దన్న అయినా నా పక్షం వహిస్తాడని అతని బట్ట పట్టుకున్నాను. అతను నన్ను బలం కొద్దీ తన్నాడు. ఇద్దరూ నన్ను చావచితక గొట్టారు. నేను ఎంత వేడుకున్నా వదిలారుకారు

చుట్టూ జనంమూగి, నేను చేసిన ద్రోహం ఏమిటని అడిగారు.

"ఈ దొంగముండాకొడుకు మా తమ్ముడి నౌకరు. యజమానిని నీళ్ళలోకి తోసి, వాడి ఆస్తి అంతా కాజేశాడు. వీణ్ణి వెతుకుతుంటే ఇక్కడ దొరికాడు," అన్నారు నా అన్నలు. తరవాత వాళ్ళు నాకేసి తిరిగి, ''దుర్మార్గుడా, మా తమ్ముణ్ణి చంపాలన్న పాపిష్ఠి ఆలోచన నీ కెందుకు కలిగింది? వాడు నీకేం ద్రోహం చేశాడు? తన వ్యవహారాలన్నీ నీ చేతిలో పెట్టాడు కదా!" అన్నారు. ఇలా అని వాళ్ళు తమ బట్టలు చించుకుని తమ తమ్ముడి కోసం దొంగ ఏడుపులు ఏడుస్తూ, నన్ను క్రూరంగా కొట్టి, తన్నారు.

ఇంతలో నగరపాలకుడి సైనికులు వచ్చి, "ఇతన్ని ఎందుకు తంతున్నారు?" అని అడిగారు. వాళ్ళు నన్ను చెయ్యి పట్టుకుని న్యాయాధికారివద్దకు తీసుకు పోయారు. నా అన్నలుకూడా నా వెంట వచ్చి, న్యాయాధికారిదగ్గిర ఆ కథే చెప్పారు వాళ్ళు న్యాయాధికారికి లంచం పెట్టి, ప్రాణానికి ప్రాణం అని తీర్పు ఇయ్యమన్నారు.

"నువ్వేం చెప్పుకుంటావు?" అని న్యాయాధికారి నన్ను అడిగాడు. తిన్న

దెబ్బలతోనూ, ఆకలితోనూ కుంగిపోయి నేను ఏమీ చెప్పలేకపోయాను తల వంచుకుని, మౌనంగా నిలబడ్డాను. అది చూసి న్యాయాధికారి నన్ను నేరస్థుడుగా భావి చాడు కాబోలు, నన్ను మైదానానికి తీసుకుపోయి కొరత వెయ్యమని తీర్పు ఇచ్చాడు.

మహారాజా, నేను డబ్బుపోసి యూదు వాడి బారినుంచి వీళ్లిద్దరినీ విడిపించాను. వీళ్లు డబ్బుపోసి నా ప్రాణం తీయించ పూనుకున్నారు. ఇద్దరూ ఇక్కడే ఉన్నారు నే నేమన్నా వెంట్రుకవాసి అబద్ధం చెప్పానేమో అడగండి

సరే, నన్ను మైదానానికి తీసుకపోయారు. కొరడా చూడగానే నా పని ముగిసిందనుకున్నాను. నా కోసం ఏడ్చే టందుకు ఈ కుక్కతప్ప ప్రపంచలో ఇంకెవరూ లేరు. అది అందరికాళ్ళముందు పొర్లిగింతాలుపెట్టి మొరుగుతున్నది. కొందరు రాళ్ళతోనూ, కొందరు కర్రల తోనూ దాన్ని కొట్టారు అది మాత్రం అక్కడినుండి పోలేదు. నేను కాజాకేసి తిరిగి, "ఈ క్షణంలో నన్ను కాపాడ గలిగినది నువ్వు ఒక్కడివే. ఈ నిర్దోషికి అడ్డుపడగలవారూ, రక్షణ ఇవ్వగల వారూ ఇంకెవరూ లేరు!" అని బలి కాబోయేవాడి ప్రార్థన చదివి, తూలి పడి పోయాను.

దైవ నిర్దేశంవల్ల ఆ దేశపు రాజుకు పక్షపాతంవచ్చి, ఎన్ని చికిత్సలకూ లొంగలేదు. "బొపధాలకన్నా పుణ కార్యాలు మేలు పేదలకు దానధర్మాలు చేసి ఖైదీలను విడిచిపుచ్చండి,"అని ఒక సాధువు చెప్పాడు తక్షణమే రాజుగారి వార్తాహరుడు ఖైదుకు పరిగెత్తి వెళ్లాడు. మరొకడు కాకతాళీయంగా మైదానానికి వచ్చి, అక్కడ చేరిన గుంపును చూసి, ఎవరినో కొతరవేస్తున్నారని గ్రహించి, గుర్రంమీద పరిగెత్తుకుంటూ వచ్చి, "రాజుగారు ఈ స్థితిలో ఉండగా మీరు మనిషి ప్రాణం నిలువునా తీయబోతు న్నారా?" అని భటులను మందలించి, నన్ను విడిపించాడు.

ఇది చూసి నా అన్నలు మళ్ళీ న్యాయాధికారి వద్దకు వెళ్ళి, నన్ను చంపించమని ఒత్తిడి చేశారు. అదివరకే వారి డబ్బుతిని ఉన్నవాడు కావటంచేత ఆయన, "మీరు నిశ్చింతగా ఉండండి. నేడు ఇతన్ని ఎవరికీ తెలియకుండా కారాగృహంలో ఉంచి, ఆకలిదప్పులతో చచ్చేటట్టు చూస్తాను,'' అన్నాడు.

వాళ్లు నన్ను పట్టుకుని న్యాయస్థానా నికి తెచ్చి, ఒక మూల ఉంచారు.

నగరంవెలపల ఒక కోసు దూరంలో ఒక కొండ ఉన్నది. సాలోమన్ కాలంలో అక్కడ భూతాలు ఒక లోతైన, ఇరు కైన బావి తవ్వాయి దాన్ని సాలొమన్ ఖైదు అంటారు. రాజుగారికి అమితంగా కోపం తెప్పించినవారిని ఈ బావిలో పెట్టేవారు. నా అన్నలూ, న్యాయాధి

కారి భటులూ రాత్రి ఎవరికీ తెలియకుండా నన్ను ఆ కొండవద్దకు తీసుకుపోయి, భద్రంగా ఆ బావిలో ఉంచి తిరిగి వెళ్ళారు.

మహారాజా, కుక్క నా వెంటనే వున్నది. నన్ను బావిలో పెట్టినప్పుడు అది బావి ఒడ్డున పడుకున్నది బావిలో కొంతసేపు నాకు స్పృహలేదు. తిరిగి స్పృహ వచ్చాక నేను తాళం అయిపోయాననీ, గోతిలో ఉన్నాననీ అనిపించింది. ఆ సమయంలో ఇద్దరు మనుషులు ఏదో మాట్లాడుకుంటూ ఉండటం నాకు వినిపించింది. ఆ మాట్లాడేది చచ్చినవారిని విచారణకు పిలిచే దేవదూతలనుకున్నాను తరవాత ఏదో దించినట్టు అలికిడి అయింది చుట్టూ తడివితే ఎముకలు తగిలాయి మరుక్షణం ఎవరో నములుతున్న చప్పుడు వినిపించింది.

"ఎవరు నువు? దయచేసి చెప్పు," అని కేకపెట్టాను.

వాళ్ళు నవ్వి,''ఇది సాలోమన్ ఖైదు. మేం ఖైదీలం," అన్నారు.

"అయితే నేను బతికి ఉన్నానా?" అని అడిగాను.

"ఇంకా బతికే ఉన్నావు. కాని త్వరలో చచ్చిపోతావు,'' అన్నారు వాళ్లు మళ్ళీ నవ్వి.

"మీరేవిటి తింటున్నారు? ఏమైతేనేం? నాకూ్కడా కొంచెం పెట్టండి మీకు పుణ్యం ఉంటుంది'' అన్నాను.

"వాళ్ళు గ్రహించి కసురుకున్నారు. కాని నాకేమీ పెట్టలేదు. తినటం అయిపోయాక వాళ్ళు నిద్రపోయారు. నేను మూర్ఛపోయి, ఏడుస్తూ భగవంతుణ్ణి గురించి కలకన్నాను

మహారాజా, నా అన్నల ధర్మాన నేను ఏడురోజులు సముద్రంలోనూ, తిండి లేకుండానూ ఉండి, తిండికి మారుగా దెబ్బలుతిని, అలాంటి ఖైదులో పడి, విమోచనమార్గం ఊహకైనా అందని దశకు వచ్చాను. ప్రాణాలు వెళ్ళిపోతున్నాయి. ఆరిపోయే ముందు దీపం మధ్య మధ్య వెలిగినట్టుగా, ప్రాణాలు పోతూ మధ్య మధ్య తిరిగి వస్తున్నాయి. అప్పుడప్పుడూ అర్ధరాత్రి వేళ ఎవరో వచ్చి ఒక రొట్టెముక్కా, నీళ్ళకూజా తాడుతో దించి, కేకపెట్టుతున్నాడు. నాకు సమీపంలోనే ఉన్న ఖైదీ లిద్దరూ వాటిని లాగేసుకుంటుకుంటున్నారు పైనుంచి ఇదంతా చూస్తున్న కుక్క ఇదే విధంగా తన యజమానికి కూడా కొంత అందజేయాలని భగవత్ప్రేరణవల్ల అనుకున్నది.

అది అలా అనుకుని నగరానికి వెళ్ళి, ఒక రొట్టెల దుకాణంలో పేర్చిఉన్న రొట్టెల దొంతర్లుచూసి, ఎగిరి ఒక రొట్టెను నోట కరుచుకుని పరిగెత్త సాగింది. దాన్ని రాళ్ళతో కొట్టుతూ

మనుషులు వెంటపడ్డారు. కానిఆదిరొట్టెను మాత్రం వదలక, తన రొట్టెకోసం వచ్చే ఇతర కుక్కలను తప్పించుకుని, బావి వద్దకు వచ్చి, రొట్టెను లోపల పడేసింది. దాని మొరుగుడు విని చుట్టూచూస్తే మసకచీకట్లో నా పక్కన పడిఉన్న రొట్టె కనిపించింది. దాన్ని తీసుకున్నాను.

నాకు రొట్టె పడేసి కుక్క నీటికోసం బయలుదేరింది. ఏదో గ్రామంలో ఒక ముసలిదాని గుడిసె ఉన్నది. వాకిలివగ్గిర నీళ్ళకుండ ఉన్నది. ముసలిది నూలు వడుకుతున్నది. కుక్క కుండను నోటితో తీసుకోబోయింది. అది జారిపడి పగిలింది. ముసలిది కర్ర తీసుకుని కుక్కని కొట్టబోయింది. కుక్క ఆమె బట్టలను పట్టుకుని, ఆమె కాళ్ళకేసి ముట్టె రుద్ది, తోక ఆడించి, కొండవేపు దౌడు తీసింది. వెంటనే తిరిగివచ్చి అది తాడు లాగి, బొక్కెనలాగి, ముసలిదాని బట్ట లాగి, అది దీనంగా ఏడ్చింది. కుక్క ప్రవర్తన భగవదనుగ్రహంచేత ముసలిదానికి అర్థమయింది ఆమె బొక్కెనా, తాడూ తీసుకుని కుక్కవెంట బయలుదేరింది.

కుక్క ముందు నడిచి దారిచూపుతూ ముసలిదాన్ని కొండవద్దకు తెచ్చింది

కుక్క యజమాని బావిలో ఉండి ఉంటాడనీ, వాడికి నీరు కావలసి ఉంటుందనీ ఊహించి ముసలిది బొక్కెనతో నీళ్ళు లోపలికి దించింది. నను రొట్టె కొంచెం తిని, నీరు తాగి, నా ఆకలి దప్పులు శమింపజేసుకున్నాను సమయానికి అందిన ఈ సహాయానికి దేవుడికి కృతజ్ఞత చెప్పుకుని, భగవంతుడు ముందు ఏంచేస్తాడో చూడటానికి ఒక మూల చేరినాను. ఇదేవిధంగా కుక్క నాకు రొట్టే, ముసలిదాని ద్వారా మంచి నీరూ అందిస్తూ వచ్చింది.

కుక్క రోజూ ఒకేవిధంగా రొట్టె ఎత్తుకు పోవటం గమనించి రొట్టెలవాళ్ళు దానిమీద జాలిపడి, కనిపించి నప్పుడల్లా రొట్టె పడెయ్యసాగారు. ముసలిది నీళ్ళు అందివ్వటం మరచిపోతే కుక్క వెళ్ళి ఆమె కుండలు పగలగొట్టేది. ఈ విధంగా ఈ కుక్క నేను చావకుండా చూసి, అస్తమానమూ బావి అంచునే ఉంటూవచ్చింది.

ఇలా ఆరు మాసాలు గతిచాయి. కాని శుభ్రమైన గాలీ, వెలుతురూ రానిచోట అంతకాలం ఉంటే ఏమవుతుంది? నాకు చర్మమూ, ఎముకలూ మాత్రమే మిగిలాయి. జీవితం దుర్భరం అనిపించింది. దానినుంచి విముక్తి కలిగించమని దేవుణ్ణి ప్రార్థించాను.

ఒకరాత్రి మిగిలిన ఇద్దరు ఖైదీలూ నిద్రపోతూంటే, నేను ఏడుస్తూ, మృత్యువును పంపమని దేవుణ్ణి వేడుకుంటున్నాను. నాలుగోజాములో నాకొక చిత్రం కళ్ళపడింది: బావిలోకి ఒక



మోకు వేల్లాడుతున్నది. ఒక కంఠం విని పించింది. "నిర్భాగ్యుడా! ఈ మోకు నీ చేతులకు గట్టిగా బంధించుకొని బయట పడు!"

ఈమాటలు చల్లగా చెవికిసోకగానే నా అన్నలు నా మీద ఇంత కాలానికి దయ దలచారనీ, వారిలో భ్రాతృవాత్సల్యం పుట్టుకొచ్చి, నన్ను విముక్తుణ్ణి చెయ్యటా నికి వచ్చారనీ అనుకున్నాను. ఎంతో ఆనందంతో ఆ మోకును నా నడుముకు గట్టిగా బిగించుకున్నాను. ఎవరో నన్ను పైకి లాగారు. ఆ చీకట్లో, నన్ను పైకి తీసిన మనిషిని పోల్చలేకపోయాను.

"పద. ఇక్కడతాత్సారం చెయ్యటం మంచిది కాదు," అన్నాడతను. నాలో త్రాణ లేదు. దీర్ఘకాల నిర్బంధం వల్ల నాకాళ్లు కొయ్యబారి పోయాయి. చేతనయినట్టుగా కొండకిందికి దొర్లాను. కొండకింద రెండు గుర్రాలు జీనులతో సహా సిద్ధంగా ఉన్నాయి. నన్ను కాపా డిన మనిషి నన్ను ఒక గుర్రంమీద ఎక్కించి, తాను రెండో దానిమీద ఎక్కి దారితీశాడు.

పోగా పోగా మాకు ఒకనది తగిలింది. తెల్లవారుతున్నది. నగరంనుంచి పది, పన్నెండు కోసులు వచ్చేశాం. అప్పుడు నేను ఆ యువకుణ్ణి స్పష్టంగా చూశాను. అతను ఆయుధదారిగా కనిపించాడు. అతను నాకేసి ద్వేషంతో చూసి, జాడు కరుస్తూ, కత్తిదూసి తన గుర్రాన్ని నా వైపు లంఘించి, నాకేసి కత్తివిసిరాడు.

నేను గుర్రంమీదనుంచి కిందపడి, నన్ను కరుణించమని వేడుతూ, "నేను ఏ పాపమూ ఎరగను. అయ్యా, నన్నెం దుకు చంపుతారు? అలాటి చోటునుంచి కాపాడారుగదా, ఈ నిర్దయ ఏమిటి?" అన్నాను.

"నిజం చెప్పు, ఎవరు నువు?" అని అతను అడిగాడు.

"నేను ప్రయాణీకుణ్ణి. అకారణంగా అష్టకష్టాలూ అనుభవించి, మీ దయవల్ల ప్రాణాలతో బయటపడ్డాను," అన్నాను. ఇదేవిధంగా మరికొన్ని దీనాలాపాలు ఆడినమీదట అతని హృదయం కరిగింది.

అతను కత్తి ఒరలో పెట్టేసి, "దైవ నిర్ణయం ఎలాఉంటే అలా కానీ. పద, నేను నీ ప్రాణం తియ్యను ఇక్కడ తారట్లాడటానికిలేదు," అన్నాడు.

ఇద్దరమూ గుర్రాలమీద చురుకుగా కదిలాం. అపరాహ్ణం మూడుగంటలకు మాకు ఒక దీవి తగిలింది. అక్కడ యువకుడు గుర్రందిగి, నన్నుకూడా దించాడు. గుర్రాలమీదినుంచి జీనులుతీసి, వాటిని మేతకు వదిలాడు; తన ఆయుదాలు తీసి అవతలపెట్టి నాతో, "నిర్భాగ్యుడా, ఇప్పుడు ని కథ చెప్పు. నువు ఎవరో నాకు తెలియాలి," అన్నాడు.

నేను నా పుట్టుపూర్వోత్తరాలూ, అనుభవాలూ వివరంగా చెప్పినమీదట అతను దుఃఖించి, "యువకుడా, నా కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పాడు.

"నేను జాయిర్ బాద్ రాజు కుమార్తెను ఆ సాలోమన్ ఖైదులో ఉన్న యువకుడు ఒహర్ ముండ్ మా ప్రధానమంత్రి కుమారుడు. ఒకనాడు రాజు రాజభవనం ముందుండే మైదానం మీద "పోలో" ఆడటానికి అనేకమంది రాజులనూ, రాజకుమారులనూ ఆహ్వానించాడు. నేనూ, మాఅమ్మ అయిన రాణీ పై అంతస్తు నుంచి ఆట చూస్తున్నాం. మా చుట్టూ దాసీలున్నారు. ఆటగాళ్ళందరిలోకీ అందగాడు మా మంత్రి కుమారుడు. అతను తన గుర్రాన్ని ఎంతో నేర్పుతో నడుపుతూ చక్కగా ఆడుతున్నాడు అతన్ని చూస్తూంటే నా మనసు వివశమయింది. అతన్ని మోహించాను. కాని ఈ సంగతి చాలా కాలం దాచి ఉంచాను. తరవాత నాలో ఆరాటం మరీఎక్కువై, నా రహస్యాన్ని నా దాసీకి చెప్పి, దాని సహాయం కోసం ఎన్నో కానుకలు ఇచ్చాను. అది ఏదో యుక్తి చేసి ఆ యువకుణ్ణి నా మందిరానికి చేర్చింది.

"అతనుకూడా నన్ను ప్రేమించాడు. చాలారోజుల పాటు మా ప్రేమ కలాపం సాగింది. కాని ఒకనాటి అర్థరాత్రి అతను నా మందిరం ప్రవేశిస్తూ ఉండగా కావలివాళ్లు పట్టుకుని, రాజు వద్దకు తీసుకుపోయారు. రాజు అతనికి మరణదండన విధించబోయాడు, కాని సభికులందరూ అభ్యంతరం చెప్పిన మీదట అతన్ని సాలోమన్ ఖైదులో పడేసేటట్టు తీర్పు ఇచ్చాడు. అతని వెంట ఉన్న రెండో యువకుడు అతని ప్రాణస్నేహితుడు ; అతను పట్టుబడిన సమయంలో అతనివెంట ఉన్నాడు.



ఇద్దరినీ సొలోమన్ కూపములో పెట్టారు. ఇది జరిగి మూడేళ్లు అయింది ... నా ఆ రాత్రి ఆ యువకుడు రాజభవనం ఎందుకు ప్రవేశించాడో ఎవరికీ తెలీదు నా మానం దక్కింది నన్ను ఈశ్వరుడు దయజూసినందుకు నేను ఖైదీలిద్దరికీ రొట్టే, నీరు అందిస్తున్నాను. నేను ఎనిమిది రోజుల కొకసారి వెళ్లి ఎనిమిది రోజులకు సరిపడే ఆహారమూ, నీరూ వారికి అందిస్తూ ఉంటాను

"నిన్న రాత్రి కలలో ఎవరో నన్ను, త్వరగా బయలుదేరి గుర్రంమీద వెళ్లమనీ, తాడు సహాయంతో ఖైదీలను బయటికి తీయమనీ హెచ్చరించారు. నేను ఉలికిపడి నిద్రలేచి, ఎంతో ఆనందించాను. మగవేషం వేసుకున్నాను. డబ్బు తీసుకున్నాను. రెండు గుర్రాలు వెంటబెట్టుకుని కూపానికి బయలుదేరి వచ్చాను. నీ అదృష్టం బాగుంది. నువు బయటపడ్డావు నేను ఇలా చేసినట్టు ఎవరికీ తెలీదు. నీ అదృష్టదేవతే నన్ను పంపిందేమో ! కాని దురదృష్టం నాది. ఇప్పుడు ఏంచెయ్యటానికీ లేదు."

ఈ విధంగా తన కథ ముగించి ఆమె తన గుడ్డమూటనుంచి కొన్ని రొట్టెలూ, మాంసమూ పైకి అయితే ముందుగా చక్కెర నీటిలో ఏదో మందు కలిపి నా చేత తాగించింది. తరవాత నాకు ఆహారం పెట్టింది. కొంచెం సేపు అయాక నన్ను నది వద్దకు తీసుకుపోయి, నా జుట్టూ, గోళ్లూ కత్తిరించి, స్నానం చేయించి,

తాను తన ప్రియుడి కోసం తెచ్చిన దుస్తులు నాచేత తొడిగించి, నన్ను కొత్తమనిషిని చేసింది. నేను కాజాకేసి తిరిగి, ఆమె మేలుకొరకు ప్రార్థన చేశాను.

ఆమె నేను చేసేదంతా శ్రద్ధగా గమనించి, నా ప్రార్థన ముగియగానే, "ఏమిటి నువు చేసినది ?" అని అడిగింది.

"సృష్టికర్త అయిన సర్వేశ్వరుణ్ణి ధ్యానించి, నన్ను నరకకూపంనుంచి బయటపడేసినందుకు ఆయనకు ధన్యవాదాలు చెప్పుకున్నాను. నీ వంటి అందగత్తె హృదయం నాపట్ల ఆయనే అనుగ్రహించాడు అన్నాడు.

నువు ముసల్మానువన్నమాట. నీ భక్తి నాకు చాలా ఆనందాన్ని కలిగించింది. నీ ప్రార్థనలు నాకు కూడా నేర్పు అన్నదామె.

మా మతాన్ని అవలంభించే ఇచ్ఛ ఆమెలో కలిగినందుకు దేవుణ్ణి మెచ్చుకుని, మా మతాన్ని ఆమెకు ఉపదేశించి, ఆమెచేత అనిపించాను.

తరవాత ఇద్దరమూ గుర్రాలెక్కి బయలుదేరాం. ఆ రాత్రి మేము మజిలీ చేసినప్పుడు ఆమె నానుంచి ఎన్నో మతవిషయాలు ఆసక్తితో అడిగి చెప్పించుకున్నది.

(సశేషం)

---

పిల్లవాణ్ణి మనిషిగా చేయడానికి తల్లికి ఇరవై యేళ్లు పడుతుంది,
అతడ్ని మరో స్త్రీ ఇరవై నిముషాల్లో 'ఫూల్' ను చేస్తుంది.

— రాబర్ట్ ఫ్రాస్ట్.



# సెంటిమెంటల్ ఫూల్

పవని నిర్మల ప్రభావతి

"రమకు ఐదోనెల వచ్చిందట. పది రోజుల్లో, బొంబేనుంచి రమనిక్కడికి పిల్చుకువచ్చి, భారీఎత్తున సీమంతం చేస్తారుట. వాళ్లమ్మగారు చెప్పిందీరోజు—బట్టల షాపులో కనిపించి!'' అంది రాజేశ్వరి ఆఫీసులో అడుగుపెడుతూనే.

"ఏమిటీ? రమకే! ఐదోనెలే!" అంది రాధిక మూర్ఛపోయి సర్దుకుని.

"ఏం? రమ ఆడదికాదా! పెళ్లయ్యాక పిల్లలు పుట్టడమూ ఓ ప్రత్యేక విశేషమే?" అన్నాను రాధికవేపు కోపంగా చూస్తూ.

"ఓ అతి యదార్థవాదీ...ఐమీన్...అతివాదీ! నోరుమూసుకో! అందరు ఆడవాళ్లూ పెళ్లాడడమూ. పిల్లల్ని కనటమూ సహజమైన సంగతే కావచ్చుగానీ, రమలాటి "పవిత్ర ప్రేమికురాలు" పెళ్లాడటమే ఒక వింత అయినప్పుడు, పిల్లల్ని కనటం.. ఐమీన్...ఆ భర్తతో కాపురం చెయ్యటం వండర్ కాక మరేమిటి?" అంది రాధిక.

వీళ్లంతా ఇలా రమను ఉబ్బించి, ఉబ్బించి ఆమె నంది అంటే నంది అనీ,

పంది అంటే పంది అనీ పక్క తాళంవేసి, ఆమె "పర్స్"తో సినిమాలూ, షికార్లూ, పార్టీలూ, పిక్నిక్‌లూ చేసారు! ఆమె "ప్రేమ" ను గురించి ఆమెకంటె ఎక్కువగా ప్రచారం చేసారు. ఊరంతా ఒక దారి అయితే, ఉలిపికట్టిది మరోదారి అన్నట్లు...నేనొక్కర్తెనే వేరుగా మిగిలిపోయాను, ఆనాడూ, ఈనాడూ...నా ఆలోచనలు గతంలోకి మళ్లాయి. ఓ లక్షాధికారి కూతురు. కారూ, బంగళా, వగైరా హంగులన్నీ వున్న "కథానాయిక!" కాలేజిలోకి ఆమె అడుగు పెట్టడమంటే. నింగిమీద చందమామ, నేలమీదకి దిగివచ్చినట్లే! నోట్సులిస్తామంటూ ఎగబడివచ్చే కుర్రాళ్లను, క్రీగంటి చూపులతో కటాక్షించేది. "ఈ చీరెఎంత బాగుంది రమా! నువ్వు కాబట్టి కొనగలిగావు! నీ ఒంటిరంగుకు ఎంచక్కా నప్పింది!" అని కొంగుపట్టుక తిరిగే అమ్మాయిలను మరి కాస్త ఊరిస్తూ రోజుకోరకం చీరె, బ్లౌజు మాచింగ్ నగలు, చెప్పులు ధరించివచ్చేది

రమంటే నాకు ప్రత్యేకమైన ద్వేషమేమీలేదు. కానీ ఆమె ప్రదర్శించే "అహం" భరించలేకపోయేదాన్ని. ఆ అహానికి, నా ఆత్మాభిమానం ససేమిరా "దాసోహం" అనేదికాదు? డబ్బూ, అంతస్తూ అంతలా ఎగ్జిబిట్ చేసుకొనే వాళ్లంటే నా కసహ్యం! ఆ డబ్బునీ, అనవసరపు టీవినీ, అంతలా ఆరాధించి పాదాక్రాంతమైపోయే రాధిక, రాజేశ్వరి, రాణి, విమల లాటి వాళ్లంటే నాకు ఎలర్జీ!

"ఈరోజు రమ తన కుక్క "టామీ" బర్త్‌డే పార్టీ ఇస్తోందిట! అందర్నీ రమ్మంటోంది. అటునుంచటు సినిమా ప్రోగ్రాం వుందిట. నే వెళ్తున్నా... నువ్వూ రావోయ్ నిర్మలా!" అంది రాజేశ్వరి.

"ఊహూ! ఈరోజు నాకు తీరదు."

"అంతలా తీరని పనులేమిటో! రమ కుక్క టామీ ... రాధిక మాటలకు అడ్డొస్తూ అన్నాను "రమ కుక్క టామీ బర్త్‌డే పార్టీకంటే పెద్ద పనులేవున్నాయి నాకు ఇంటిదగ్గర. మా చెల్లాయికి రెండు జాకెట్లు మిషన్‌మీద కుట్టివ్వాలి. మా పెద్ద తమ్ముడి నిక్కర్లకూ, చొక్కాలకూ బొత్తాములు కుట్టాలి..."

"...మీ నాన్నగారి ధోవతులు ఇస్త్రీ చెయ్యాలి.." వెటకారంగా అంది రాణి.

"ఇక మాట్లాడకు. నీకు రమ అంటే జలసీ! ఆమె అంతస్తుచూచి ఈర్ష్య. ఛీ! ఛీ! నీలాటి నారోమైండెడ్ ఫ్రెండ్‌తో స్నేహం, నాకే అవమానం!" అంది మళ్లీ!

రమకూడా అకారణంగా నామీద కొంచెం కోపం ఏర్పడింది.

"నిర్మలకు అహంకారం. నిర్మలది ఒంటెత్తు గుణం. నిర్మల అమ్మమ్మల్లా ప్రవర్తిస్తుంది!" అంటోందిట అందరితో!

అవును. ఆత్మాభిమానానికి, అహంకారానికీతేడాతెలియనివాళ్లతోవాదించటం నిష్ప్రయోజనం. మనకు లేకపోతే పోయే, ఎదుటివాళ్లకు డబ్బుంటే.. వాళ్లను ఆకాశానికెత్తి, పాదాలు ఒత్తే మనస్తత్వం లేకపోవటమే ఒంటెత్తుగుణం అయితే, అది నానరనరంలోనూ, ప్రతి రక్తకణంలోనూ జీర్ణించుకుపోవాలి. వాస్తవాన్ని గుర్తించటమే "అమ్మమ్మ" బిరుదుకు అర్థమైతే, ఊహాలలో, భ్రమలలో బ్రతికే ఈ కన్యలకంటే-ఆ అమ్మమ్మలు లక్షరెట్లు మేలుకాదూ!

రమ గురించిన కథలు ఒక్కొక్కటిగా ప్రచారంలోకి రావటం మొదలెట్టాయి. శరత్‌బాబు అనే ఓ కుర్రాడు (పెద్ద బిజినెస్ మాగ్నెట్ కొడుకు) రమకు రెండువందల రూపాయలు ఖరీదు చేసే దంతపు తాజ్‌మహల్ బహూకరించి తన ప్రేమ వ్యక్తంచేశాడట రమ తిరస్కరించిందిట! కాలేజిలో చదువుతున్న మోహనరావు రమకు ప్రేమలేఖ వ్రాస్తే, జవాబుగా, అతగాణ్ణి చెప్పుచ్చుక కొట్టినంత పనిచేసి, ప్రిన్సిపాల్‌కు రిపోర్టు ఇచ్చి, అతగాడిచేత అపాలజీ చెప్పించి, ఆ రోజంతా కాలేజిని సంతలా మార్చేసింది. ఎందరో కుర్రాళ్లు రమ చూపులకోసం పడిగాపులు పడుతున్నారు..అందరినీ ఊరిస్తూ..ఎవరికీ అందకుండా .. లెక్చరర్స్‌కూ - ప్రిన్సిపాల్‌కూ, కాలేజికీ, ఓ సమస్య అయి కూర్చింది రమ.

ఉబుసుపోకకు అన్నట్లు మొదలెట్టిన నా రచనా వ్యాసంగం, నే నూహించనంతటి వేగంగా, నాకు పేరునూ, కొద్దిపాటి డబ్బునూ తెచ్చిపెట్టడం ప్రారంభించింది. సరదాగా కథలు వ్రాయాలని మొదలెట్టిన నా కలంలో..నా చుట్టూరా వున్న సమాజంలోని సమస్యలూ, లోపాలోపాలూ, అక్షర రూపంలో సాక్షాత్కరించటం మొదలెట్టాయి. కొద్ది నెలల్లోనే అన్ని పత్రికలలో నా కథలు రావటంతో కాలేజిలో నాకో గుర్తింపూ, గౌరవం వచ్చాయి! లెక్చరర్లు మెచ్చుకుంటున్నారు. స్టూడెంట్లు మెచ్చుకుంటున్నారు. (అయినా ఎవరూ నన్ను ప్రేమిస్తున్నట్టు గానీ, కట్నం లేకుండా పెళ్లాడతామని గానీ అన్న గుర్తు లేదు!)

అప్పుడు రమ దృష్టి నామీద పడింది! నా స్నేహం కావాలనిపించింది. ఖరీదైన చీరెలానే, ఖరీదైన వాచీలానే, రచయిత్రితో స్నేహం అన్నది. తనకో "అలంకారం" అనిపించి ఉండవచ్చు!

"నిర్మలా! ఎవరితో చెప్పుకోను నా బాధ, నువ్వు రచయిత్రివి."

"రవిగాంచనిచో కవిగాంచు నెయ్యెడన్" అంటారు. నువ్వు ఆలోచించగలవు. నా వ్యధ అర్థంచేసుకోగలవు.. నాకథ వ్రాయనూగలవు!" అం దొరోజు హఠాత్తుగా!

ఊహించని ఈ సన్నివేశానికి

ఆశ్చర్యపోయాను. రమకు వ్యథలా? ఆమెకో కథా?

"నాతోబాటు మా ఇంటికి రా! ఈ ఒక్కసారికీ, ప్లీజ్, కాదనకు!" అంది రమ ప్రాధేయపడుతూ. చేతగానినటుడు, సీరియస్ డైలాగులు చెప్పినట్లు, ఎప్పుడూ తీవి ప్రదర్శించే రమ, అలా బేలగా నన్ను ఆహ్వానిస్తుంటే!

ఇక రాననటం సభ్యత అనిపించు కోదు. రమ వెంట కారులో వెళ్ళాను. అధునాతనంగా అన్ని సౌకర్యాలతో ఉన్న ఆ బంగళాలో రమకోసం మేడమీద మూడు గదులూ, ఎన్నో వసతులూ కేటా యించబడ్డాయి. ఆమెచదువూ, పడకా, స్నానం, భోజనం, ఫ్రెండ్స్‌తో పార్టీలూ కేరింతలూ అన్నీ అక్కడే జరిగిపోతుం టాయి. కాలుకదిపితే, కార్పెట్ మీదా, తప్పితే కారులో! పడుకుంటే, ఫోమ్‌బెడ్ మీదా, ఫోమ్‌బెడ్‌లాటి సోఫామీదా! రమ కొచ్చిన కష్టమేమిటో బోధపడటం లేదో పట్టాన నాకు! సుఖాలు ఎక్కు వయ్యాయేమోనని అనిపించింది కూడా!

''నిర్మలా! ఇందాకా రమ కేవలం నవ్వుతూ, తుళ్లుతూ, తీవి ప్రదర్శించే అమ్మాయి అని మాత్రమే అందరిలా నువ్వు అనుకున్నావు కదూ! కానీ ఈ అమ్మాయి హృదయంలో ఎంత వ్యధ దాగి వుందో నీకు, నీకే కాదు ఎవరికీ తెలీదోయ్!" అంది రమ, ఉపోద్ఘాతంగా ఫోమ్ బెడ్‌మీద కూర్చుని. క్రిందినుంచి నౌకరు మాకోసం తెచ్చిన "ఓవల్టిన్" సిప్‌చేస్తూ.

నేను మాట్లాడలేదు కొన్ని సందర్భా లలో మాటలకంటే మౌనమే మంచి "ఎఫెక్ట్'' తీసుకువస్తుంది

"ఇది చూడు. .ఉదయిస్తున్న సూర్య బింబం. . . అరుణోదయం . . . పెయిం టింగ్!'' అంది ఆమె బెడ్‌కు తలవేపు, టేబిల్ మీదున్న పెయింటింగ్ కేసి చూపిస్తూ

"చాలా బావుంది! నువ్వు వేసావా!" అన్నాను.

"ఊహూం! మురళి వేశాడు! పోయిన సారి నా బర్త్‌డే కానుకగా ఇచ్చాడు!" అంది నిట్టూర్చుతూ.

"ఎవరు?'' అన్నాను.

''అదే అసలు కథ!'' అంది రమ, బెడ్‌మీద బోర్లా పడుకుని, డన్‌లప్ పిల్లోని గుండెలక్రిందికి లాక్కుంది. ''మురళి మాకు దూరపు బంధువుల అబ్బాయి. రెండేళ్లక్రితం. . శలవుల్లో, వాళ్ల వూరు వెళ్ళాం, నేను మా మమ్మీ, డాడీ! ఓ పదిహేను రోజులు వాళ్లింట్లోనే వున్నాం. మురళి చెల్లాయి మల్లిక చాలా మంచిది. ఆమె అంటే మురళికి చాలా ప్రేమ! ఎంత ప్రేమ అంటే...మల్లికను బ్రతిమాలి రోజూ సినిమాకో, షికారుకో పిల్చుకువచ్చేవాడు! మేం ముగ్గురం సినిమాకు వెళ్లేవాళ్లం. ." రమ క్షణ కాలం ఆగింది.



నాకిక్కడ ఓ సందేహం వచ్చింది. మల్లిక–తమవెంట వుంటే, పెద్దలకు అనుమానం రాకుండా వుంటుందని మురళి–మల్లికమీద అంత అభిమానం కురిపించాడేమో! ఆంధ్రదేశంలో ఎంత మంది అన్నయ్యలు, తమ స్వంత చెల్లాయిలను తమవెంట సినిమాలకూ, షికార్లకూ పిల్చుకెడుతున్నారు! రమతో చనువు పెంచుకోవటానికి, మల్లికను ఉపకరణంగా ఉపయోగించుకున్నాడేమో మురళి! అలాగే మల్లికను "సేఫ్టీ గార్డ్"గా ఉపయోగించుకొందేమో రమ.

నా ఆలోచనల్ని చెదరగొడుతూ రమ అంది "శలవులైపోయాక, ఇక్కడికి వచ్చాక, మురళి రూపం నా హృదయంలో గాఢంగా ముద్రింపబడి వుందని గ్రహించాను. అసలు మురళి పేరు మురళీకృష్ణ. అరుణ కిరణాలు చిత్రిస్తూ, ఈ "అరుణోదయం" పెయింటింగ్ కానుకగా ఇచ్చాడు మురళి."

నా కీక్షణంలో ఎంతో గర్వంగా వుంది! నేను రచయిత్రిని కాబట్టి రమ నాతో ఇంత ఆత్మీయంగా తన కథ, వ్యథ వెల్లడించుకొంటోంది! ఆమె హృదయాన్ని రచయిత్రిగా గెలుచుకున్నాను. కథ వ్రాసి, మరింతగా గెలుచుకుంటాను.

"మురళి అయిదారుమార్లు ఇక్కడికి వచ్చాడు. కానీ, మమ్మీకీ, డాడీకి, మా స్నేహం నచ్చలేదు. కారణం మురళీ

వాళ్లకు మాకున్నంత డబ్బులేదు. హోదా లేదు. అంతస్తు లేదు. మురళి నాకంటె తక్కువ చదువుకున్నాడు, చదువు మానేశాడు కూడాను. దానికితోడు వాళ్ల ఆస్తి అంతా ఏదో కోర్టు వ్యవహారాల్లో చిక్కుకుందిట! డాడీకి, మమ్మీకి, నన్ను ఏ ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టర్‌కో, కోటీశ్వరుడికో ఇవ్వాలని అభిప్రాయం!"

నిజమే! కారులో తిరిగే అమ్మాయికి, హెలికాప్టర్‌లో తిప్పే భర్త రావాలను కోవటంలో, ఆమె తలితండ్రుల తప్పేమీ లేదు!

"అందుకే మమ్మీ, డాడీ, మురళితో మా బేబీకి పెళ్లి సంబంధాలుచూస్తున్నాం" అని చెప్పి, పరోక్షంగా 'నువ్వు ఆశ పెట్టుకోకు!' అని చెప్పారు, నాతో. బేబీ! నీమీద ఎన్నో ఆశలు పెట్టుకుని వున్నాం! మమ్మల్ని బాధించకు. నీమేలు కోరేవాళ్లమేగానీ, నీకు చెడు చేసేవాళ్లం కాదుగదమ్మా!" అన్నారు. . .నేనేం చెయ్యను? మురళిమీద ప్రేమ వదులుకో లేను! మమ్మీ, డాడీ మనసు నొప్పించ లేను. .తెగించి మురళిని చేసుకోలేను. . కారణం . . . అతగాడికి ఆస్తి – ఎంత మిగులుతుందో. .ఎలా తెలుస్తుంది?"

నా కిదంతా గందరగోళంగా వుంది. మా నాన్నకు చిన్న ఉద్యోగం. ఆయన తెచ్చే జీతం, మా కుటుంబ పోషణకు సరిపోదు! నా చదువు పూర్తయితే, నేనూ ఉద్యోగంచేస్తే, చెల్లాయినీ. తమ్ముళ్లనీ చదివించాలి. "పెళ్లి సంబంధ చూడండి అమ్మాయికి!" అంటుంది అమ్మ అప్పుడప్పుడూ, నాన్నతో.

"చూద్దాంలే! చదువు పూర్తికానీ" అంటారు నాన్న. నాన్న కట్నాలు ఇచ్చుకోలేరు. ఆ వాస్తవం. నాకూ, నాన్నకూ, అమ్మకూ, అందరికీ తెలుసు. అలాటప్పుడు "నేను ఉద్యోగం చేస్తా నమ్మా! నాకిప్పుడే పెళ్లివద్దు!" అంటాను. పెళ్లిమీద కోరిక లేకుండా పోలేదు. ఇన్ని నవలలు, సినిమాలు చూస్తూ, అవన్నీ శృంగారాన్ని అన్నివిధాలుగా విప్పి చెబుతుంటే, "శృంగారం" అంటే ఏమిటో తెలియని అమాయకురాలిలా ఎలా చెప్పుకోగలను? నా సమస్య లివి! నా చుట్టుప్రక్కలా ఇలాటి సమస్యలే ఇంచుమించు . . . కానీ, ఫోంబెడ్‌మీద పడుకుని, నౌకర్లు వేళకు అన్నీ అమరుస్తుంటే, ఆర్థిక ఇబ్బందులన్నవి కలలో కూడా లేక, ఒకానొక కుర్రాడిమీద–వయసుచేసే గారడీగా కలిగిన ఆకర్షణను, అదో సమస్యగా చిత్రించు కుంటున్న రమ కథ ఎలా మొదలెట్టాలి!

"మొన్ననోసారి ఏమైందో తెలుసా నిర్మలా!" ఖంగుమంది రమ కంఠ స్వరం. త్రుళ్లిపడి అడిగాను "ఏమైంది?"

"మమ్మీ, నేనూ సినిమాకు వెళ్లాం! మురళికూడావచ్చాడు. (మాతో కాదులే!) మమ్మీ నన్ను హెచ్చరించింది "వాడితో మాట్లాడకు" అని. మాట్లాడ

లేదు నేను. నాలో నేను ఎంత బాధపడి పోయానో తెలుసా!"

నేను పలకలేదు.

"మొన్న నోరోజు, నే నొక్క_తైనే కారు డ్రైవ్‌చేసుకుంటూ వెడుతుంటే, మురళి కనిపించాడు. కారు ఆపాను. ఎంచేతో మాట్లాడాలనిపించలేదు మళ్ళీ! కారు స్టార్ట్‌చేసి వచ్చేశాను "

"కారు ఆపినదానివి, అతగాడితో, 'ఇలా నీతో పెళ్లి మావాళ్లకిష్టంలేదు. అంచేత నామీద ఏలాటి ఆశలు పెంచుకో వద్దు' అని స్పష్టంగా చెప్పేసెయ్యలేక పోయావా!'' అన్నాను కాస్తంత అసహనంగా.

"ఊహూ! అలా చెబితే ఎలా? ఏమనుకుంటాడు. ఇటు మావాళ్ల వాత్సల్యం, అటు ప్రేమబంధం!'' అంది నిట్టూర్చుతూ.

"సరే రమా! కథ వ్రాయటం సంగతి అలా వుంచు నీ అసలు కథకో ముగింపు వుండాలిగా. మురళి ఆర్థిక స్తోమతు మీ అంతస్తుకు తగిందిగా లేదు. ఆ విషయంలో నీకూ కొన్ని భయాలు వున్నాయి. రేపొద్దున - ఈనాటి నీ సౌకర్యాలు అతగాడు అమర్చలేకపోతే బాధపడతావు అవునా! ఇక-మీ అమ్మానాన్నల ఇష్టప్రకారం వాళ్లు కుదిర్చిన సంబంధం అంగీకరించు. వాళ్లకు తృప్తి కలిగించినదాని వౌతావు. ఈపాటిత్యాగం కూతురిగా నువ్వు చెయ్యొవచ్చు'' అన్నాను.

"అంతేనంటావా?" ఆలోచిస్తూ అంది రమ.

"అంతే!''

"అయితే ఈమారు మావాళ్ళు చెప్పే మనువు ఒప్పుకోమంటావా?"

"ఆహాఁ! నిక్షేపంగా!"

"నాలాటి ప్రేమ పరాజిత... అయిన దౌర్భాగ్యపు ఆడపిల్ల కథ వ్రాయాలి నువ్వు!"

"అలాగే!"

"నా వేదనను స్పష్టంగా వ్రాయాలి.. ఈ పెయింటింగ్ ఇస్తూ ప్రేమగాచూసిన మురళిచూపులు, జీవితాంతం నాగుండెల్లో దాగివుంటాయి...ఒకరోజు— ఓ గులాబి నాచేతికిస్తూ, అతగాడు నవ్విన నవ్వు, నా హృదయాంతరాళాల్లో—- మత్తు కలిగిస్తూనే వుంటుంది! మురళికి లైట్ గ్రీన్‌కలర్ ఇష్టం! అంచేతే, నారూంలోని ప్రతివస్తువూ, కార్పెట్, కర్టెన్స్, పిల్లో కవర్స్, బెడ్‌షీట్స్, ఎలక్ట్రిక్‌లైట్లు, ఒకటేమిటి, అన్నీ లైట్‌గ్రీన్ కలర్‌లోనే వుండేలా మార్చుకున్నాను. ఇవన్నీ నువ్వు గుర్తుంచుకోవాలి!"

గబగబ లేచి వచ్చేశాను. ఇంకాసేపు వుంటే, రమ చెప్పేదేమిటో మెదడు గ్రహించలేని స్థితికి వచ్చేస్తాననిపించింది! దోవపొడుగునా ఆలోచించాను. రమ కథ ఎలా మొదలెట్టాలి? ఈ ప్రేమలమీద

నాకు నమ్మకమూలేదు, అనుభవమూ లేదు. భోజనంచేసి పడుకున్నాను మా ఇంటికి మూడు ఇళ్ళ అవతలవున్న ముస్లిమ్స్ ఇంట్లోనుంచి ఏదో గోల, అరుపులూ, ఏడుపూ.. అమ్మ లేచి వాకిట్లోవరకూ వెళ్ళింది. "అబ్బా! ఖర్మ ఈదేశంలో.. ఆడపిల్లగా పుట్టడమే ఎంతో దౌర్భాగ్యం!" అంటోంది బాధగా !.

"ఏమిటమ్మా !'' అన్నాను

"ఏంలేదులే. పడుకో. పరీక్షలొస్తున్నాయి..తెల్లారుఝామున లేస్తావుమళ్ళీ!" అంది నాతో చెప్పటం ఇష్టంలేక, మాట మార్చుతూ. కానీ అదేమిటో నాకుతెలుసు ముప్పైఏళ్ళకు పైగా వయసుండీ, అన్ని రకాల దుర్వ్యసనాలూ వుండి, దుక్కలా వుండే ఖాదర్ కూ, సున్నితంగా తమలపాకు తీగెలావుండే పదమూడేళ్ల ఫాతిమాకు పెళ్ళిచేసారు ! పధ్నాలుగో ఏడు రాకముందే, ఫాతిమా రజస్వల అయింది! వెంటనే కాపురానికి తీసుకొచ్చారు! ప్రతి రాత్రి ఆ అమ్మాయి, ఆ గదిలో ఖాదర్ చేతులలో, చేతలలో నరకయాతన పడుతోంది! "మా(! మై మర్ జాతీహూ( !'' అంటూ కేకలువేస్తుంది! వినిపించుకొనే నాధుడెవడు? అత్తా, మామా, ఆ పిల్లనే తిడతారు, కొడుకుని అల్లరిపెడుతోందని! అమ్మా, నాన్నా, ఆ పిల్లనే తిడతారు "మా పరువు తీస్తున్నా" వని ! అర వ్వద్దనీ-సహించమనీ, ఖాదర్ కొడతాడు!

ఈ సంగతులన్నీ మొన్ననో రోజు, నేను కాలేజీకి వెళ్తుంటి, తా ఎల క పించిన ఫాతిమా రహస్యంగా, అమాయకంగా కళ్లుతిప్పుతూ చెప్పింది! పరికిణీలు కట్టుకొనే వయస్సైనా దాటని ఫాతిమా, ప్రకృతి పరిణామాల్లో ఒకటిగా సమర్త అయిన ఫాతిమా, పధ్నాలుగేళ్ళు నిండకుండానే ఇల్లాలై, బాధలతో అలమటిస్తూ, తల్లి కాబోతోంది !

ఫాతిమా కథ ఎవరు వ్రాస్తారు ? ఆమె సమస్య ఎవరు తీరుస్తారు ? ఫాతిమాల్లాంటి వేలాది,లక్షలాది,హిందూ, ముస్లిమ్ కన్యల కథలకు ముగింపేమిటో ఎవరు చెప్పగలరు?.

ఫాతిమా సమస్యతో పోల్చుకుంటే, రమ ప్రేమ ఒక సమస్యా ? అది కథా వస్తువా ? అరుణలాటి విలాస జీవితాల ప్రేమల కథలు వ్రాస్తూ, నాకు దేవుడిచ్చిన ఈ రచనాశక్తిని కలుషితం చేసుకోనా ? అలా వ్రాయటం... పాపం కదూ ? బాధ్యతా రాహిత్యం కాదూ ? సంఘవిద్రోహక చర్య కదూ ?.

ఆలోచిస్తూనే నిద్రపోయాను.

మర్నాడు కాలేజీలో అడుగెట్టగానే, రాధిక ఆతురతగా ఎదురొచ్చింది "నిన్ను కారులో పిల్చికెళ్ళి, రమ ఏం చెప్పింది?'' అంది. "ఏమీ చెప్పలేదు ; చెప్పేందుకు ఏమున్నాయి ?" అన్నాను. ఇతరుల రహస్యాలు తెలుసుకోవాలని ఎందుకింత ఆరాట పడతారో రాధికలాటివాళ్ళు !

''నువ్వు రచయిత్రివి · తన కథ



వ్రాస్తావేమోనని చెప్పివుంటుంది అవునా?" అంది రాజేశ్వరి.

"కథేమిటి?'' అన్నాను అమాయకత నటిస్తూ.

"వేధవ్వేషాలు వెయ్యకు. మురళి గురించి చెప్పలేదూ! మురళి బహూకరించిన 'అరుణోదయం' పెయింటింగ్ గురించి అతగాడి నవ్వుగురించీ, మాపులను గురించీ, తన మానసిక సంఘర్షణను గురించీ చెప్పలేదూ। మా అందరికీ చెప్పింది, నీకు చెప్పలేదంటే నమ్మమంటావా?"అంది రాధిక! నిర్ఘాంతపోయాను. నా గర్వం ఎగిరిపోయింది! ఇంతమందికి తన రహస్యం చెప్పుకోవటంలో రమ ఉద్దేశ్యం ఏమిటి? రమకోరుతున్నదేమిటి? సానుభూతా! అందరినుండీ సామూహికమైన సానుభూతా?.

''పాపం! చాలా బాధపడుతున్నావు! నీ ప్రేమ పవిత్రమైనది! నువ్వు మనసు సర్దుకుని, మీ అమ్మా నాన్నల కోసం, మాకోసం, ఎవరినో ఒకరిని పెళ్లాడు!" అని అందరూ చెబితే, అందరికోసం

త్యాగం చేసినట్లు, పెళ్ళాడుతుందా? మురళితో ఆమె వర్ణించే "ప్రేమ" ఓ "ఫూలిష్ సెంటిమెంట్" మాత్రమే నేమో!

నా ఊహ తప్పుకాలేదు మర్నాటి నుంచి రమ తనకోసం వస్తున్న పెళ్ళి కొడుకులసంఖ్య చెబుతూనేవుంది బాహాటంగా! "వాడికి కారులేదు. వీడికి నౌక్కుల క్రాపులేదు. మరొకడికి ఒక్క బంగళా అయినాలేదు. మురళిని మర్చిపోలేకుండా వున్నాను" అంటూనేవుంది మధ్య, మధ్య.

చివరకు, ఆమె తలిదండ్రులకూ, అందరికీ నచ్చిన సంబంధం ఖాయం అయింది. ఆ రోజే ఆమెబర్త్‌డే! మమ్మల్నందరినీ పార్టీకి ఆహ్వానించింది. నన్నైతే మరీ మరీ పిలిచింది.

"బాంబేలో భారీ ఎత్తున బిజినెస్ వుంది.. ఈయనే నా క్కాబోయే శ్రీవారు" అని ఫొటోచూపింది చాలా బావున్నాడన్నాం అందరం. "ఏదోలే, తప్పదుగా పెళ్ళి" అని నిట్టూర్చింది. పార్టీ బ్రహ్మాండంగా ముగిశాక. "పెళ్ళాడటమంటే, మమ్మీ, డాడీలకోసం చేస్తున్నానుగానీ... నా భర్తను సుఖపెట్ట లేనేమో! మనసు ఒకచోట, మనిషి ఒకచోటలా వుంటుందేమో నా జీవితం" అంది.

అందరూ ఓదార్చారు. మనసు సర్దుకోమని చాలా సానుభూతితో చెప్పారు. నా కేమిటో వెగటుగావుంది. సినిమా చూస్తున్నట్లుంది. రమలో నిజంగా మురళి పట్ల అంతటి ప్రగాఢమైన అనురక్తి వుండివుంటే, ఆమెకున్న అవకాశాలకు, తన తలిదండ్రుల్ని ఎదిరించి మురళిని పెళ్లాడేది. లేదా మంకుపట్టుబట్టి పెళ్ళాడేది

కానీ_రమలో మురళికి డిగ్రీలులేవన్న కొరవవుంది. తమ అంతస్తుతో సరితూగ లేడన్న భయంవుంది. తన కోర్కెలు తీర్చలేడన్న శంకవుంది. ప్రేమ అన్నది సినిమాలానో, హాబీలానో అనుకుని, ఫలానా నవలలో, ఫలానా సినిమాలో_ ఇలాటి ఘట్టంలో, ఆ కథానాయిక ఇలా చేసిందన్న ఆలోచనతో, సెంటిమెంటల్‌గా... ఓ కథ సృష్టించుకుంది!

ఆమె ప్రవర్తన హర్షించలేను!

నెలరోజుల్లో, రమ పెళ్ళి చాలా ఆడంబరంగా జరిగింది. మురళి కూడా పెళ్ళికివచ్చి, ఏవో బహుమతులు ఇచ్చి వెళ్ళాడుట. రమ, ఆమె భర్త, హనీమూన్‌కువెళ్ళిపోయారు. ఆ తర్వాత బొంబాయి వెళ్ళారు

నా కాలేజి చదువు పూర్తయింది. ఎందరికాళ్లో పట్టుకుని, ఎన్నోముడుపులు చెల్లించుకుని, ఈ ఆఫీసులో నాకు ఉద్యోగం వేయించారు నాన్న. ఎనిమిదో నెల జరుగుతుండగా, హఠాత్తుగా నెప్పులు వచ్చి, ఫాతిమా ను జనరల్ హాస్పిటల్‌కు తీసికెళ్లారు. స్పృహ తెలిసివున్నంత




వరకూ, నరకయాతన పడి, స్పృహ తప్పిపోయాక, కడుపులో బిడ్డ చచ్చిపోవటంవల్ల, సరైన వైద్య సౌకర్యం అందనందువల్లా, ఫాతిమా చనిపోయింది: ఆ అమ్మాయి పడినబాధ అమ్మ వర్ణిస్తూ నాన్నతో చెబుతుంటే, విన్న నాకు, నాలుగురోజులు నిద్రపట్టలేదు' వేలాది ఫాతిమాల కథల ముగింపేమిటో–కాస్త హెచ్చుతగ్గుగా బోధపడింది. మరో జుగుప్సాకరమైన విషయం, ఫాతిమా చనిపోయిన నెలలోపలే ఖాదర్, ఫాతిమా చెల్లెలు... పన్నెండేళ్ళ పిల్లని పెళ్ళాడాడు... ఆ అమ్మాయి ఇంకా రజస్వల కాలేదు కాబట్టి, కాపురానికి పిల్చుకు రాలేదు! బహుశా ఆ అమ్మాయీ, కాపురానికి వచ్చి... ఫాతిమాలా అంత మొందిపోవటమో, ఆయుష్షు మొండిదైతే, జీవచ్ఛవంలా బ్రతకటమో...

నాకూ ఐదారు సంబంధాలు వచ్చాయి.

నా జీతంమీద ఇంటిఖర్చు, చెల్లాయి, తమ్ముళ్ళ చదువులూ ఆధారపడివున్నాయి! మొదట్లో "అమ్మాయికి పెళ్ళి చేద్దాం!" అంటూండిన అమ్మకూడా "దానికేం తొందర పెళ్ళికి? మొన్ననేగా పదిహేడో ఏడువస ," అంటోంది ఇరుగుపొరుగు

నాకు ఇరవై ఆరు వచ్చినా, ముప్ఫై ఆరు దాటినా, అమ్మ, నాన్న తమంత తాముగా పెళ్ళిచెయ్యరు. నేను తెగించి చేసుకోలేను. నామీద ఆధారపడివున్న ఈ కుటుంబంకోసం,త్యాగమని మొదటా ఖర్మ అని తర్వాతా అనుకుంటూ ఇలాగే ఉద్యోగం చేస్తూండిపోతాను. తప్పదు! ఇది సామూహికమైన, సాంఘిక పరమైన స్వార్థం! జీవన ప్రమాణాలు విచిత్రంగా

మారిపోవటంతో, ఏర్పడిన స్వార్థాలు ఇవి! నాలాటి వేలాది, లక్షలాది ఆడపిల్లలు, ఈ తరంలో ఇలాటిపరిస్థితులకు బలికాక తప్పదు!

ఇప్పుడు రమకు ఐదోనెల! ఆమె తన భర్తతో హాయిగా జీవితం గడుపుతున్న దనేందుకు నిదర్శనం! కాకపోతే, దానికీ "శరీరం ఆయనది.. మనసు ఇవ్వలేదు. ఇవ్వలేను!" అని ఇంకా ఇతరులను మభ్య పెట్టాలని చెప్పవచ్చు రమ.

కానీ రమలాటి వారి కథలలో— వ్రాయటానికి నవరసాలలోని ఏ రసం వుంది గనుక? పిచ్చి సెంటిమెంటు తప్ప!

* * *

"ఇంతకూ సీమంతానికి నువ్వు రావా ఏమిటి?'' అంటోంది రాధిక! ఒక్కసారిగా, రమను గురించి ఆలోచిస్తున్న నేను వాస్తవ ప్రపంచంలో పడ్డాను

"రాకపోవటమేం? పిలిస్తే తప్పక వస్తాను. రమ ఎలావుందో చూడాలన్న కుతూహలం నాలో వుంది.

సీమంతం చాలా ఆర్భాటంగాజరిగింది. రమ ఆరోగ్యంగా, చలాకీగా, మరింత అందంగావుంది. పరిపూర్ణత గోచరించిందామెలో. మాతో మాట్లాడుతూనే, మధ్య మధ్య, భర్తకూర్చుని వున్న గదిలోకి వెళ్లి, ఏదో మాట్లాడి, నవ్వుతూబయటకు వస్తోంది.

నన్ను చూసి, నా దగ్గరగా వచ్చి, హఠాత్తుగా మూడ్ మార్చుకుంటూ "నా కథ రాయలేదు కదూ నువ్వు! ఇదంతా సంతోషమనే అనుకుంటున్నావా? మమ్మీ, డాడీని మనసు నొప్పించలేక పెళ్ళాడాను! నన్ను నమ్ముకున్న ఆయనను నొప్పించలేక అడ్జస్ట్ అవుతున్నాను. ఫలితంగా తల్లిని కాబోతున్నాను.. ఇంతటి మానసిక సంఘర్షణ పడుతున్న నాకథ రాయకపోతే పోయావు... నాలాటి అమ్మాయిల కథ ఎప్పుడైనా రాస్తే ఏం పేరు పెడతావో అదైనా చెప్పు!" అంది నిష్ఠూరంగా...

"అమరప్రేమ" అంది రాధిక.

''భగ్నప్రేమ" అంది రాజేశ్వరి.

"సంఘర్షణ...ఎస్. కరెక్ట్!సంఘర్షణ అనే పెట్టుంది" అంది విమల.

"ఊహూఁ!" అన్నాను ఏదో ఆలోచిస్తూ...

"ఆ పేర్లేవీ నచ్చలేదా! నువ్వు చెప్పు నీ కథకు పేరు!" అన్నారంతా...

"సెంటిమెంటల్ ఫూల్స్!" అప్రయత్నంగా పైకి అనేశాను!

ఆ తర్వాత నాకు జరిగిన మర్యాద లేమిటో వేరుగా కలపీయనక్ఖర్లేదనుకుంటాను!



# కథాసరిత్సాగరం

పాపా ౧౦

( గత సంచిక తరువాయి )

## 10

### జాలరి వీరడి కథ

"ఏదో చిన్న గొడవ జరిగితే వెంటనే మర్చిపోవాలిగాని, యింకా అదొక లాగుంటే యెలాగ చెప్పు? గోదా! ఎప్పటికప్పుడు మనసు తేలిక చేసు కుంటూ తాజాపడితేనేగదా క్షీర సాగరం చిలికి అమృతాన్ని పట్టగలం! పని కల్పిస్తే మెదడు చురుకెక్కి మనసు తేలికపడుతుంది; అందుకేదైనా కథ చెప్తే నీకాస్త మెరుగ్గా ఉంటుంది. చెప్తున్నాను...," అంటూ సాగరం గోదావరి కళ్లల్లోని వీణను మీటుతున్నట్లు చూస్తూ ప్రారంభించాడు......

'సాగరం ఒడ్డునే పాతిగ్గడపల చిన్న జాలారిపేట; వీరడు పసందైన బెస్త; వేటకుపోతే వలనిండా వెండికాసులే! మనసులోని మనను 'సెన' లాంటి పెళ్లాం ఎంకి; ఆరేళ్ల-అప్పడు, మూడేళ్ల-ముత్తేలు! ఏడాది ముద్దుల్ల పాపడు-జెల్లడు. అంతా కలిసి ముచ్చటైన పెట్టి పడవలాంటి జీవనం గడుపుతున్నారు.

ఆ రోజు ముగ్గురు గుంటనాగమ్మల్నీ ముద్దులాడి, ఎదురొస్తున్న ఎంకి కళ్లల్లో కళ్లెట్టి వీరడు "యెల్లొస్తాను పిల్లా!" అనడం, "ముగ్గుర్నిగన్న ముసిల్దా న్నింకా పిల్లా అంటం మానవుగదా మరి!" అంటున్న యెంకితో, "నువ్వేద ముసిల్దానివే పిల్లా! మంచి ముత్తెంలాగ నా కళ్లకెప్పుడూ కొర్రమీను కన్నె కన కానివే!" అని వీరడు అంటూ అడు గేయడం, "సేమంగా యెల్లి లాబంగా రా మాఁవా!" అని యెంకి అనడం మామ్మూలుగానే జరిగింది. రోజూలాగే తూరుపు దిక్కుకి యెంకి మూడుసార్లు చేతులెత్తి మొక్కడం కూడా. తిరి గొచ్చేదాకా నమ్మకం ఉండదు. సవుద్రం మీది బతుకంత!.

జట్టుతో వీరడు కొంతమేరసాగి, అందర్లాగే చీలి, వలవిసిరాడు ఉన్న ట్టుండి ఆకాసం మబ్బులట్టి, గాలి రివట్లతో ప్రారంభమై సముద్రం కలత పట్టింది. వలకూడ లాగేలోపలే వీరడి పడవ గాలితోపుడుకి కెరటాల తాకిడికీ చాలా చాలా దూరదూరం లోపలికి తోసుకుపోయింది. సుడిగాలికి ఉవ్వెత్తున లేచిన కెరటాల శిఖరం విరిగిపడుతూ వీరడి పడవను ఒక రాళ్లగుట్టకు కొట్టి ముక్కలుచేసింది. వీరడు వలను

మాత్రం పట్టువదలలేదు. వలతో రాళ్ల గుట్టమీద ప్రాణాల్తో పడ్డాడు.

అనుకోవడమేగాని, చూసినవాళ్లు లేరు—సముద్రం నట్టనడి నెక్కడో ముత్యాలగుట్ట ఉందని. రాళ్ల సందు ల్నిండా ముత్యాలు కోకొల్లలుగా ఉన్నాయి. ముత్తెపు చిప్పలు అలల తాకిడికి తట్టుకొంటూ ఇరుకుల్లో కదుల్తు న్నాయి.

చీకటైంది. తెల్లారింది. ఎర్రనెండ కాసింది, పొద్దుగూకింది, పొద్దుపొడి చింది. నడినెత్తిని కాల్చే ఎండ! వీరడి కడుపులో కాల్చే ఆకలి! బయటపడే ఆసాలేదు, బతికే ఆసాలేదు గాని ఆకలి తీర్చుకోకతప్పదు.

వీరడు వలవిసిరాడు, లాగాడు, ఒకే ఒక్కటి చాలా పెద్ద చేప. చేపలాగే కనిపించలేదు — పడింది. మగ చేప. అచ్చంగా తనలాగే కనిపించింది వీరడికి, నల్లగా నిగనిగ లాడుతూ కాళ్లూ చేతులూ ఆడిస్తూ వొదిలిపెట్టమనీ, యింకేదో చెప్పుకుంటున్నట్లూ దాని కళ్లతో చెబు తూంది. వీరడికి దాన్ని తినాలనిపించ లేదు. సముద్రంలోకి వదిలేశాడు... మరి ఆకలి??

మళ్లీ వలవిసిరాడు. ఈసారి రెండు చేపలు పడ్డాయి. మొదట పడ్డ మగచేపతో బాటు—దాని పెళ్లాం కాబోలు—ఆడచేపా, అంటిపెట్టుకొని జతలా పడ్డాయి ఆ రెండూ చేపలేకావు, పెళ్లికొత్తలో తానూ ఎంకీ లాగే కనిపించాయి. వీరడు ఆ రెంటినీ తిరిగి కెరటాల్లోకి తోశేడు... మరి ఆకలి ??...బతికుంటే ఎప్పటి కైనా ఏ పడవైనా కనిపించకపోదు. యింకేవైనా పడొచ్చు, తిందాం అను కుంటూ మళ్లీ మూడోసారి వలవిసిరాడు.

ఈసారి కొంచెం ఎక్కువ బరువుగా వచ్చింది. ఆ రెండు పెద్దచేపలతో మూడు పిల్లచేపలు మొత్తంగా పడ్డాయి. అవి సాక్షాత్తు వీరడు, ఎంకి, ముగ్గురు పిల్లల్లాగే ఉన్నాయి! ఒక్కో చేపనూ వేళ్లతో రాస్తూ ముద్దులాడాడు వీరడు. "వెళ్లండర్రా! సుఖంగా ఉండండి" అంటూ వాటిని సముద్రంలోకి పంపిం చేశాడు. వలవిసిరి పారేశాడు దూర దూరపు కెరటాల్లోకి...యీసారి ఆకలి చచ్చి ఉంటుంద—అనిపించలేదు.

కొద్దిసేపటికి పెద్ద విచిత్రం జరిగింది. ఎన్నడూ చూడని పెద్ద పెద్ద చేపలూ, చిన్నవీ వంజిరాలూ, పొలసలు, టేకులు, కొర్రమీనులు, పండుమీనులు, సొవళ్లు, సందువాలు యివీ అవీ అన్నీ యెన్నో కోటానుకోట్లు మీదకొచ్చాయి. సముద్రుడు పంపించాడా అన్నట్లు గుంపులు గుంపులుగా కట్టకట్టుకుని సముద్రంమీద తీరంవేపు పెద్ద వంతె నగా నిలిచాయి. రాములోరు కట్టిన వారధిలాగ గుట్టదగ్గిర్నుంచి.

ఇదంతా సముద్ర మహారాజు దయ, ఎంకి మొక్కిన మొక్కుల బలం, లేదా



మచ్చ్యాల దయ! అని వీరడు అనుకుంటూ గుట్టమీద ముత్యాల రాసుల్లో పట్టినన్ని మొలగుడ్డలో కట్టుకొని ఆ చేపల వంతెనమీద నడుస్తూ వెళ్లాడు. తీరం చూపు మేరలో ఉందనగా ఏదో ఉట్టి పడవ తెడ్డుతో కొట్టుకొస్తుంటే దాన్లోకి దూకి తీరం చేరుకునా౧డు. ఇంటికెళ్లాడు. తర్వాత అంతా సుఖంగా ఉన్నారు. వీరడు ఎప్పటిలాగ వేటకు వెళ్తూనే ఉన్నాడు. చేపలు పడుతూనే ఉన్నాడు—ఇదీ జాలరి వీరడి కథ... అయితే కొన్ని తీరని సందేహాలు ఉండి పోయాయి—

కృతజ్ఞత లేకుండా వీరడు చేపల్ని పట్టటం ఎందుకు మానలేదు ?

'అలాంటి' చేపలే ఎందుకు పడ్డాయి ? లేదా అలాగెందుకు కనిపించాయి వీరడికి ?

కనిపిస్తే మాత్రం వాటి నెందుకు తినగూడదు ? బతికుంటే బయట పడొచ్చుగద ?

ఆ చేప లెందుకు వంతెన కట్టాయి ? సముద్రుడు పంపాడా ? వీరడిలో దేన్ని చూసి సంతసించి ? వాడి జీవకారుణ్యానికా ?

ఆ చేపలే వొదిలిపెట్టినందుకు ప్రత్యుపకారం చేశాయా ? బతికి బయటపడితే చేపలవేట మానడని, వృత్తిచేత జాలరి అని తెలీదా ?

పోనీ ఆ చేపలు జాలిపడ్డాయా ? ఎవరిమీద జాలిపడి ? ఎందుకు ?— ఈ ప్రశ్నలకి సమాధానాలు తెలిసుండీ చెప్పకపోతే తల నూరుముక్కలౌతుంది సుమా !" అని బేతాళుడు విక్రమార్కుడితో అన్నాడు. విక్రమార్కుడు ఏం సమాధానాలు చెప్పేడో నేనిప్పుడు చెప్తూ కూర్చోలేను. నీకు ఎలాగతోస్తే అలాగ వాటికి సమాధానాలు రాయి గోదా... గౌతమీ !" అంటూ ముగించి సాగరం బజారుకెళ్లాడు.

* * *

బజార్లో పెద్దకొట్టు పాపరాజు పిల్చి "బాబూ ! మరేం అనుకోక, ఆడు వొట్టి దొంగెదవ, దళారీగాడు" అంటూ శ్రీకంఠం ఇచ్చిన ఎడ్రసు ముక్కతీసి. "ఇది నా దగ్గిరుంటే ఎప్పుడే పాడుబుద్ధి పుట్టిస్తాదో, ఇంద ! ఎందుకైనామంచిది నీ దెగ్గిరుంచు !" అని దాన్ని సాగరానికిచ్చాడు.

* * *

"మీ మేనమామ చేసేపనేమిటి ?" అడిగాడు సాగరం.

"చెప్పను !... ఏమని చెప్పను?... ఒకటిగాదు — అంతా ఏదో వ్యాపారం అంటారు..."

"చీకటి వ్యాపారానికి దళారి డివిజన్...అన్నమాట !..." అని సాగరం అంటూంటే...

"అన్నీ మర్చిపోనివ్వండి. నాలో నేను సిగ్గుపడిపోతున్నాను. నా తాలూకు వాళ్లు,— నా గతం, అన్నిటినీ మర్చిపోనివ్వండి..." అంటున్న గోదావరిని దగ్గిరగా తీసుకుంటూ సాగరం, "మర్చిపో గౌతమీ ! మర్చిపో –ఏదీ ?..." అంటూ గోదావరి కళ్లల్లోకి చూశాడు...






నరసింహారావు ఆ ఆఫీసులో చేరి రెండు సంవత్సరాలయింది. అతి కష్టంమీద ఆ వుద్యోగం సంపాదించాడు. ఎన్నో ఆఫీసులు తిరిగి, ఎంతోమందిని దర్శించి, నానా అవస్థలూ పడితేనేగాని ఆ వుద్యోగం దొరకలేదు. బి.యే. ప్యాసయినా, తనకన్న తక్కువ చదువుకున్న వాళ్లు ఎక్కువ జీతం సంపాదించుకుంటూ వున్నా, చాలాకాలం వుద్యోగం లేకుండా అవస్థపడి వుండటంచేత, ఏదో ఒక వుద్యోగంలో, ఎంతో కొంత జీతంమీద చేరితేనేకాని లాభంలేదనీ, ఒకసారి యెక్కడో ఒకచోట చేరితే, తరువాత క్రమంగా పైకి పోవచ్చుననీ, అతడు ముప్పయి రూపాయిల జీతానికే- పాపం ఆ వుద్యోగంలో చేరాడు.

ఆ ఆఫీసులో చేరేటప్పటికి, అంతకు పూర్వమే అయిదుగురు గుమాస్తాలు వున్నారు. నరసింహారావు ఆరోవాడు. ఇతను చేరిన తరువాత, యీ రెండేళ్ళలోనూ ఇద్దరు గుమాస్తాలు అక్కడ పని మానుకొని, ఎక్కువ జీతాలమీద ఇంకెక్కడో చేరారు. ఆ ఇద్దరూ పని మానుకున్నప్పుడు, నరసింహారావు తన యజమాని దగ్గరకు వెళ్ళి తనకు కొద్దిగానైనా, జీతం ఎక్కువ చెయ్యమని అర్థించాడు, కాని, ఆ కొరకరాని కొయ్యా యజమాని దగ్గర అదేమీ లాభించలేదు.

నరసింహారావు చేస్తున్న పనికి తాను ఇచ్చే జీతమే చాలా ఎక్కువన్నట్లు మాట్లాడాడు ఆ యజమాని.

నరసింహారావుమాత్రం, యీ అభిప్రాయంతో ఎంతమాత్రమూ ఏకీభవించకపోయినా, ప్రస్తుతం ఆ వుద్యోగం వదిలిపెట్టివేస్తే, తాను చేతిలో వుద్యోగం ఏమీలేక అవస్థపడవలసి వస్తుందని, కిక్కురుమనకుండా వూరుకున్నాడు.

బియ్యం ధర పెరిగింది నెయ్యిధర హెచ్చింది. గుడ్డల ఖరీదు ఒకటికి నాలుగు రెట్లయింది. ఇంటి యజమాని ఇంకొక నాలుగు రూపాయలు ఎక్కువ ఇస్తే సరి, లేకపోతే ఇల్లు ఖాళీచెయ్య

మన్నాడు. నరసింహారావు జీతంమాత్రం ఎదుగూ, బొదుగూ లేకుండా అలాగే వుంది. పగలు ఆఫీసులో పనిజేస్తూ వున్నంతసేపూ, చాలా తక్కువ జీతానికి, విపరీతంగా ఎక్కువ చాకిరీ చేస్తున్నానే అనే రోషంతోనూ, ఇంట్లో వున్న కాస్సేపూ, ఇంటిఖర్చుకు సరిపోయే మాత్రమేనా సంపాదించలేకపోతున్నానే అనే బెంగతోనూ నరసింహారావు తపనపడిపోతున్నాడు.

నరసింహారావు భార్య చాలా మర్యాద తెలిసిన మనిషి కనక, తనచేతనైనంత వరకు మగని మనస్సుకు కష్టం కలిగించకుండానే సంసారం గడపడానికి ప్రయత్నిస్తోంది. కాని అది ఒకమాత్రాన సాధ్యమా. యాభైరూపాయల ఖర్చు యాభైరూపాయలే. ముప్పయిరూపాయిల సంపాదన ముప్పయిరూపాయిలే

ఈసారి ఎలాగయినాసరే యజమానితో మాట్లాడి జీతం యెక్కువ చేయించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

యజమాని దగ్గరకు వెళ్ళాడు. కొంచెంసేపు నిలుచున్నాక, "ఏమిటి?" అని అడిగాడు యజమాని.

కొంచెం తడబడి మెల్లిగా గొంతు సవరించుకొని "వస్తువులఖరీదులన్నీ చాలా పెరిగిపోయాయండి" అన్నాడు.

ఆ యజమాని, దేవాంతకుడు. నరసింహారావు ఏమి అడగదలచుకున్నాడో గ్రహించి, ముందరి కాళ్ళకి బందంగా "అవును, చాలా పెరిగిపోయాయి. ఆఫీసు ఖర్చులు కొంత తగ్గించుకోవాలని ఆలోచిస్తున్నాను. ఏమి పాలుపోవటంలేదు" అన్నాడు.

నరసింహారావుకి, గొంతులో ఏదో అడ్డంపడినట్లయింది—కాని గొంతు సవరించుకొని, మరి కొంచెం ధైర్యం తెచ్చుకొని "నాకు జీతం బొత్తిగా చాలటంలేదండి. ఇంక్రిమెంటు ఏమైనా ఇస్తేగాని, బొత్తిగా గడిచేటట్టులేదు. మీ ఆఫీసులో చేరి రెండేండ్లయింది పైగా, నేను చాలా కష్టపడుతున్నాను కూడాను. ముగ్గురు మనుష్యుల పని నేను ఒక్కణ్ణిని'' అని అన్నాడు, నరసింహారావు మొహం చూస్తూ.

"నరసింహారావు, ఆఫీసు ఖర్చు చాలా ఎక్కువ అయిందని ఇప్పుడే కదా, నీకు చెప్పాను. నువ్వు ఒక్కడివీ ముగ్గురు గుమాస్తాల పని చేస్తున్నానంటున్నావ్. ఆ తక్కిన ఇద్దరూ ఎవరో చెప్పు-వాళ్ళని తీసిపారేస్తాను. ఆఫీసు ఖర్చు కొంతేనా తగ్గుతుంది" అన్నాడు యజమాని.

నరసింహారావు నోట మాటలేక అలాగే నిలుచున్నాడు.

---




"పెద్దకొడుకు రామకృష్ణ, సూటిగ పోయే మనిషి కావడంతో, వాడు తన చెప్పుచేతల్లో వుండడన్న అనుమానం యేర్పడింది, పార్వతమ్మకి. అతడి వివాహ విషయం ప్రస్తావనకి వచ్చినపుడు ఆ కాస్త అనుమానం నిజంగా రూపొం దింది.

"ఒరేయ్ రామం. సరోజని పెళ్ళి చేసుకుంటావని, యెంతో ఆశతో మా అన్నయ్య యెదురుచూస్తున్నాడ్రా! వాడి ఆశను నిరాశ చెయ్యకు. అయినా, సరోజకేం? లక్షణంగా వుంటుంది..." అంది ఓ రోజు పార్వతమ్మ.

"మరీ బావుందమ్మా! వాళ్ళ ఆశల్ని తీర్చడానికి, నా ఆశల్ని నాశనం చేసు కుంటానటమ్మా! సరోజను పెళ్ళిచేసు కోవడం నా కిష్టంలేదని యెప్పుడో చెప్పాను. ఈ విషయంలో నన్ను మరి విసిగించకు..." ఖచ్చితంగా చెప్పేశాడు రామకృష్ణ.

ఆ రోజునించే పార్వతమ్మ ఒక నిర్ణయానికొచ్చింది, రామకృష్ణ తన అజమాయిషీలో వుండడని.

అందుకనే రామకృష్ణ నచ్చిన అమ్మాయినే అతనికి ముడిబెట్టి, తెలివిగా అతణ్ణి వేరే కాపరం పెట్టించిన ఘనత పార్వతమ్మకే దక్కుతుంది. జీవితంలో, తను సాధించిన విజయాల్లో అదొకటని ఆమె గర్వపడిందంటే, అందులో అతిశయోక్తి లేదు. అయితే, దీనివల్ల రామకృష్ణకి కొత్తగా యెదురైన సమస్యలేం లేవు. హాయిగానే వున్నాడు.

పార్వతమ్మ భర్త, ముకుందరావు. ఆయన చాలా అమాయకుడు. అమాయకత్వంలోనే మంచితనమూ వుంటుంది కదా మరి! భర్త మంచితనాన్నీ, అమాయకత్వాన్నీ ఆధారంచేసుకొని, అతణ్ణి కేవలం ఓ మట్టిబొమ్మగాచేసి ఇంటి పెత్తనాన్ని చేజిక్కించుకుంది పార్వతమ్మ. ఇతరులు, యీ విషయంలో యేమనుకున్నా, ఆమెకి చీమకుట్టినట్టయినా వుండదు. అసలు, ఆమె పట్టించుకోదగ్గంత ముఖ్యవిషయం అది కాదని, ఆమె లోలోన యెన్నోసార్లు అనుకుంది కూడాను.

రెండో అబ్బాయి శేఖరం అంటే, పార్వతమ్మకి వల్లమాలిన వాత్సల్యమూ, అభిమానమూను! అందుకు ముఖ్యకారణం వాడు ఆఖరి అబ్బాయనీ కాదు—అతి మంచివాడనీ కాదు. ఆమె మాటకి వాడెప్పుడూ ఎదురు చెప్పలేదన్న విషయమే పార్వతమ్మ వాడిపట్ల అంతటి అప్యాయతని నింపింది.

శేఖరంకి లౌకికం బాగా తెలుసు. ఏ ఎండకి, ఆ గొడుగును పట్టగల సమర్థుడు. అందుకే, తల్లి మనస్తత్వాన్ని యిట్టే ఆకళింపు చేసుకొని, ఆమె అభిమానాన్ని సంపాదించాడు.

"ఒరేయ్ శేఖరం, నేనో అమ్మాయిని చూశాను. ఆమెని నువ్వు పెళ్ళిచేసుకోవాలి. మీ అన్నయ్యలా నువ్వూ కాదంటే నేను యిరుకునపడ్డమేకాదు, నలుగురి ముందూ నగుబాటు పాలవుతాను! ఏమంటావ్" అంది ఓరోజు.

శేఖరం చిన్నగా మందహాసం చేశాడు.

"నువ్వు నచ్చాక, నేను కాదనడం యెప్పుడైనా వుందమ్మా? నిశ్చయించెయ్..." అన్నాడు హుషారుగా.

పార్వతమ్మ వుబ్బొంగిపోయింది. శేఖరం మీదుండే విశ్వాసం, నమ్మకం, యినుమడించాయి ఆమెలో 'నిజంగా యిటువంటి కొడుకులుంటేనే తలిదండ్రులకి మనశ్శాంతి వుంటుంది...' అని లోలోన అనుకుని మురిసిపోయింది

శేఖరం పెళ్ళి, వైభవోపేతంగా జరిపించింది పార్వతమ్మ. ముకుందరావు యే విషయాన్నీ అంతగా పట్టించుకోలేదు. అందరికిమల్లే, రామకృష్ణకీ శుభలేఖ వెళ్ళింది. అయితే, రామకృష్ణ




వాలేదు. పెద్దకొడుకు యెందుకు రాలేదన్న బాధగాని, కించిత్ ఆవేదనగాని, పార్వతమ్మకి లేవు రాకపోవడమే మంచిదనుకుంది. ఆమె పట్టుదల అటువంటిది మరి! కాని ముకుందరావు అలా సరిపెట్టుకోలేకపోయాడు.

"పెద్దబ్బాయి లేకుండా, చిన్నవాడి పెళ్ళి జరిపించేశావ్. ఇదేం సబబుగా లేదు పార్వతీ!" వుండబట్టలేక అన్నాడు ముకుందరావు.

ఎదురు ప్రశ్నలు వేసే అలవాటు యేనాడూ లేని భర్త, యీ రోజు అలా అడగడం, ఆశ్చర్యంగానే కనిపించింది, పార్వతమ్మకి. ఆమె మొహంలో రంగులు మారినయ్. "వాడు రాకపోతే, మనం మాత్రం యేంచేస్తామండీ? 'నువ్వు రాకపోతే పెళ్ళాగిపోతుంది ... తప్పకుండా రావాలి' అని ప్రాధేయపడతామా యేవిటండీ!" విసురుగానే అంది.

ముకుందరావుకి, భార్య ధోరణి నచ్చలేదు అతనికి యిదేం కొత్తకాదు. అలవాటుపడిపోయాడు మరి! "స్వయంగా వెళ్ళి చెప్పకపోతే, వాడు మాత్రం యెట్లావస్తాడు?" మళ్ళీ అన్నాడు ముకుందరావు

పార్వతమ్మ మూతి విరుచుకుంది. "పోనిద్దురూ; వాడు రాకపోతే, ఒరిగిపోయిందేమీలేదు. పెళ్ళి ఆగిపోలేదు కదా?" నిర్లక్ష్యంగా అంది.

ముకుందరావు, బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు.

"కన్నతల్లివి నువ్వు, అట్లా అనడం సబబుగా లేదు పార్వతీ..." వాడు మనకి విరోధికాడుకదా!" సౌమ్యంగా అన్నాడు "ఆ! కన్నతల్లినన్న గౌరవం వాడికి లేనపుడు, నాకుమాత్రం వాడిపట్ల యెందుకు వాత్సల్యం వుండాలి? చిన్నబ్బాయిని చూడండి...వాడికి నేనంటే

యెంత గౌరవమో చెప్పలేం. నేను చెప్పినదాన్ని తు.చ. తప్పకుండా చేస్తాడు. ఎప్పటికయినా వీడే మనల్ని ఉద్ధరిస్తాడండీ." అంది పార్వతమ్మ ఖంగుమనే స్వరంలో.

"నీ అభిప్రాయాన్ని నేను విమర్శించనుగాని, పెద్దవాడు మాత్రం మనకేం అన్యాయం చేశాడని? నిజానికి మనమే వాడిపట్ల క్రూరంగా ప్రవర్తించామేమో! ఆ కారణంగా వేరే కాపరం పెట్టించి, మనకి దూరం చేసుకున్నాం."

భర్త మాటలకి, పార్వతమ్మకి చప్పున ఆవేశం ముంచుకొచ్చింది.

"అంటే మీ ఉద్దేశం-వీటన్నింటికీ కారకురాల్ని నేననేనా? మీకు ఆ అభిప్రాయమే వుంటే, ఖచ్చితంగా చెప్పేయండి. నా దారేదో నేను చూసుకుంటాను," వుద్రిక్తతతో అంది.

ముకుందరావు చల్లబడిపోయాడు. అతనిలోని బలహీనత అదే. భార్య గట్టిగా మాట్లాడితే, అతని నోట మాటరాదు.

"అబ్బ! ఈపాటిదానికే ఆవేశం తెచ్చుకుంటావేవిఁటి? పోనీలే, ఇంక ఆ విషయమే ప్రస్తావించొద్దు," నిస్పృహతో అనేసి వూరుకున్నాడు.

ముకుందరావుది యెప్పుడూ యిదే ధోరణి. అందుకే, పార్వతమ్మది పై చెయ్యి అయ్యిందంటేఆశ్చర్యమేముంది?

* * *

రోజులు గడుస్తున్నయ్ ... ముకుందరావురిటైరయ్యాడు. ఇల్లునడిపే బాధ్యత తనకి నమ్మకస్తుడైన శేఖరం చేతిలో పెట్టింది. పార్వతమ్మ శేఖరం, తల్లికి కృతజ్ఞతచెప్పుకున్నాడు, "అమ్మా. నామీద నీకున్న వాత్సల్యం, నమ్మకం కొద్దీ, నాకి పెద్ద బాధ్యత అప్పజెప్పావు. అయితే నేనెంతవరకు నా బాధ్యతను నెరవేర్చగలనో, అది కేవలం నీ ఆశీస్సు బలంమీదే ఆధారపడుంటుంది" అన్నాడు.

పార్వతమ్మ, మరింత వుప్పొంగిపోయింది. తనంటే, వీడికి యెంత గౌరవం?...అనుకుని మురిసిపోయింది. మెల్లగా మందహాసంచేసింది.

"నా ఆశీస్సులు, నీ వెంట యెప్పుడూ వుంటాయిరా! మన ఇంటిని నువ్వు తీర్చి దిద్దుతావని, మన కుటుంబ గౌరవానికి యేవిధమైన భంగంరాకుండా చూస్తావన్న విశ్వాసం నాలో వుంది. నా విశ్వాసాన్ని చెదరగొట్టవన్న ధైర్యం కూడా వుంది."

"నువ్వెంత మంచిదానవమ్మా..." అన్నాడు శేఖరం.

పార్వతమ్మ యెటువంటి అనుభూతిని పొందిందో, ఆమె మనోభావాన్ని తెలుసుకుంటేనేగాని, చెప్పడం కష్టం. ఆమె నిండుగా నవ్వుకుంది.

ముకుందరావు మాత్రం భార్య చర్యను హర్షించలేకపోయాడు. అలాగని, ఆమెతో వాదన పెట్టుకోలేదు. అసలు, ఆ ప్రస్తావనే ఆమె సమక్షంలో తీసుకు

రాదల్చలేదు. ఓ నిట్టూర్పు విడిచి వూరు కున్నాడు

*　　*　　*

శేఖరం చేతిలో యిప్పుడు పుష్కలంగా డబ్బు ఆడుతోంది. బ్యాంకులో వున్న డబ్బు అతణ్ణి వూరిస్తూ, వూహాలోకాలకు తీసుకువెడుతోంది. నిజంగా యిటువంటి అవకాశం తనకి వస్తుందని, అతడు యేనాడూ వూహించలేదు. అన్నయ్యకి రావల్సిన అవకాశం, తనకి వచ్చింది. అదే తన అదృష్టం...అందుకు తల్లిని మనసులో యెంతగానో అభినందించుకున్నాడు.

శేఖరంకి యిప్పుడు స్నేహితులు యెక్కువయ్యారు. క్లబ్బులకి వెళ్ళడం, క్రమంగా పేకాట, త్రాగుడు అలవాటయ్యాయి. భార్య, భర్త పరిస్థితిని చూసి కోపగించుకుంటే, మంచి మంచి చీరలు, కొత్తరకం టాయిలెట్లూ తెచ్చి ఆమె కోపాన్ని కరిగించడం అలవర్చుకున్నాడు శేఖరం. ఆమె, తనకి దక్కుతున్న రకరకాల చీరల్ని టాయిలెట్సునీ చూసుకుని మురిసిపోయేదే గాని, తన తృప్తిచాటున భర్త పతన మౌతున్నాడన్న నిజాన్ని గ్రహించలేక పోయింది. అసలు ఆ ఆలోచనకి పోనివ్వ లేదామె మనస్సు. ఇహపోతే, పార్వతమ్మ వూహకి, యివన్నీ చాలా చాలా దూరంగానే వున్నయ్.

*　　*　　*

క్రమంగా బ్యాంకులోని డబ్బు, కరిగి పోయింది. శేఖరం అలవాట్లు మాత్రం మిగిలిపోయాయి! భార్యని సంతృప్తి పర్చడానికి తెచ్చే చీరలు, టాయిలెట్ సామాన్లు కూడా, తప్పనిసరిగ ఆగి పోయాయి. అవి లేకపోతేపోయె...కాని భర్త చీదరించుకుంటూ, తనని మరీ హీనంగా చూస్తూ మాట్లాడ్డం, 'రాధ' సహించలేకపోయింది. తను యిన్నాళ్ళూ వుపేక్షించి, చాలా పొరపాటుచేసినట్టు, అప్పుడు అనిపించేసరికి, ఒక్కసారి కళ్ళుతిరిగినట్టయ్యిందామెకి. వుపేక్షించ కూడదనుకుని అత్తయ్యతో చెప్పింది.

పార్వతమ్మ, నమ్మలేదు. రాధమీద నిప్పులు కురిపించినంత పన్జేసింది.

"ఏమిటే రాధా, నువ్వు చెప్పేది? నీకేం మతిపోలేదుకదా? శేఖరం, నా బంగారు శేఖరం భ్రష్టుడవుతున్నాడా? నువ్వు చెబితేమాత్రం నేను నమ్ముతానను కుంటున్నావా? వాడిమీద నీకు కోపం, కసీ, వుంటే, యిదికాదే పగతీర్చుకునే పద్ధతి...! ఈ రోజు అన్నావు... వూరుకున్నాను...ఇంకెప్పుడూ అనకు. జాగ్రత్త" అంటూ చీవాట్లు పెట్టింది.

రాధ, నిర్ఘాంతపోయి, నిస్సహాయు రాలై, మౌనంగా యేడ్చింది. 'ఏమిటో ఆ కన్నతల్లి నమ్మకం! చెప్పినా నమ్మక పోతే చేసేదేముంది?' అనుకుంది... తను నలుగురిలో అప్రతిష్ట పాలవ్వక ముందే, తనవాళ్ళింటికి జారుకోవాలను

కుంది. తరువాత రావొచ్చనుకుంది. అంతకుమించి మరో మార్గం ఆమెకి అగుపి చలేదు. భర్త మామూలు స్థితిలో వున్నపుడు అడిగింది.

"ఓసారి మావాళ్ళందర్నీ చూసి రావాలనుందండీ! మీరు వెళ్ళమంటే వెళ్ళొస్తాను..." అని.

"సరే!" అన్నాడు శేఖరం. భార్య దూరంగా వుండటమే యిప్పుడు మంచి దనిపించిందతనికి

అంతే! రాధ బైలుదేరి కన్నవా రింటికి వెళ్ళిపోయింది.

రాధ వెళ్ళాక, ఇంటిపనుల్లో కొంత శ్రద్ధ తీసుకోవల్సిన అవసరం, పార్వ తమ్మకి తప్పనిసరి అయ్యింది.

ఆ రోజు రాత్రి పన్నెండు గంటలకి తలుపు తట్టిన చప్పుడైతే తీసింది పార్వతమ్మ. ఎదురుగా శేఖరం! ఆమె వూహించని తీరులో తూలుతూ నడుస్తూ లోపలికొచ్చాడు. పార్వతమ్మ, హతాశు రాలయ్యింది. తనని దాటుతూ వెళ్తు న్నప్పుడు ఓ విధమైన మత్తు వాసన ఆమె నాశికారంధ్రాల్ని గుప్పుమనిపించే సరికి, గతుక్కుమంది పార్వతమ్మ. క్షణంలో సగంసేపు ఆమె గుండె ఆగి పోయినట్టనిపించింది. ఆమె ఆశలన్నీ మంచులా కరిగిపోయినయ్ ... కొడుకు పట్లగల విశ్వాసం, నమ్మకం, ఛిన్నా భిన్నమయ్యాయి. రాధ చెప్పింది, నిజమేనా? ... "ఏవిట్రా శేఖరం యిదంతా?" తలుపు వేసుకుని, కొడు కుని వెన్నంటుతూ అంది. ఆమె స్వరంలో కించిత్ యేడుపు ధ్వనించింది.

"అనవసరంగా...నన్ను విసిగించ కమ్మా ... నువ్వెళ్ళి పడుకో..." అన్నాడు శేఖరం తన గదికేసి పోతూ. అతని మాటలు తడబడుతుండటం గమనించింది పార్వతమ్మ,

పార్వతమ్మ, నీరైపోయింది. అవయ వాలన్నీ వశం తప్పుతూవుంటే, మంచం మీద వాలింది. ఆమెకి నిద్ర రావడం లేదు. దూరంలో యెక్కడో ఒంటిగంట కొట్టారు. ఆమె మెదడులో రైళ్ళు ఢీ కొంటున్నట్లయ్యింది. భగవాన్! యెందు కిలా జరిగింది?...అనుకుంది యెన్నో సార్లు కాని, జవాబు...?

ఇంటి ఆర్థికస్థితి అర్థమయ్యాక, పార్వతమ్మకి పిచ్చెత్తినట్టయ్యింది. ఇల్లు గల ఆసామి, రెండునెలలనుంచి ఇంటి అద్దె బాకీపడినట్టు చెప్పినపుడు పాల వాడు, కిరాణా కొట్టువాడు తమ బిల్లులు చెల్లించమని నిలదీసి అడిగినపుడు, పార్వతమ్మకి నిజం తెలిసింది. ముకుంద రావు అవమానంతో కృంగిపోయాడు.

"చివరికి యే స్థితి వచ్చింది?" రుద్ధ స్వరంతో అన్నాడు.

పార్వతమ్మకి తల కొట్టేసినంత పనయ్యింది. ఆమె అభిమానం మరీ దెబ్బతింది. శేఖరంని నిలదీసి అడిగింది.

"బ్యాంకులో డబ్బుండగా, యింత



మందికి బాకీపెట్టే ఖర్మేం వచ్చిందిరా?" అంది.

శేఖరం, మొహం దించుకున్నాడు. తల్లికేసి చూడలేకపోయాడు.

"బ్యాంకులో డబ్బు లేదమ్మా!..." మెల్లగా అన్నాడు. ఎప్పుడో ఓసారి యీ నిజాన్ని చెప్పక తప్పదనుకుని చెప్పేశాడు.

నిర్విణ్ణురాలైన పార్వతమ్మ, తను నమ్మే స్థితిలో లేనట్టుగ 'ఆ' అని మాత్రం అంటూ, నిర్జీవంగా క్షణం వుండిపోయింది.

"బ్యాంకులో డబ్బు లేదా? అంత డబ్బు యేమయ్యిందిరా?" ఆవేశాన్ని ఆరికట్టుకోలేక అంది కోపంగానే.

"ఔనమ్మా; అంత డబ్బూ అయిపోయింది. ఇంకా చాలామందికి బాకీ పడ్డాను..." పశ్చాత్తాపంతో చెబుతున్నట్లు చెప్పాడు.

అంతా వింటున్న ముకుందరావు, నిస్పృహతో ఓ నిశ్వాసాన్ని విడిచాడు.

"అనుకున్నంతా అయ్యిందన్న మాట!" అన్నాడు, దిగాలుపడి.

భర్త మాటలు, వాడి శూలాల్లా పార్వతమ్మ గుండెల్లోకి దూసుకుపోయినయ్. ఇంతవరకూ, ఒకర్ని అనడమేగాని, ఒకరిచేత మాటపడి యెరుగదామె. అటువంటి పార్వతమ్మకి భర్త మాటలు, బాధ కలిగించాయి. అంతకంటె, పరిస్థితులు వెక్కిరిస్తూ గుండెల్ని పిండిచేశాయి. అందరూ తననే వేలెత్తి చూపుతున్నట్టనిపించింది. శేఖరం కేసి, కళ్ళెఱ్ఱజేసి వురుముతూ చూసింది

"త్రాష్టుడా! నువ్వేదో మమ్మల్ని వుద్ధ

రిస్తావని కదరా నీ చేతిలో పెట్టాను అధి కారాన్నీ, డబ్బునీ! ఎంతపని చేశావురా? ఇంతకంటె నన్ను నరికి పారేసినా, విచారించి వుండేదాన్ని కాదురా." రుద్ధ స్వరంతో అంది.

శేఖరం కళ్ళు చెమ్మగిల్లాయి. "నిజమేనమ్మా! నువ్వెంతో నమ్మకంతో యీ ఇంటి సర్వస్వాన్నీ నా చేతిలో పెట్టావు. కాని, డబ్బు మహా పాపిష్టి దమ్మా! నన్ను మార్చివేసింది...పతనా వస్థకి తీసుకుపోయింది. నా గౌరవం, యీ ఇంటి గౌరవం, డబ్బు, అన్నీ పోయాయి. చివరికి, నా ఆరోగ్యాన్ని పాడుచేసుకున్నాను. నా భార్యను దూరంచేసుకున్నాను. ఇంక నా జీవితం నిరర్ధకమమ్మా! నువ్వేకాదు. కట్టుకున్న భార్య రాధ కూడా నన్ను క్షమించదు.." అంటూ మరేం మాట్లాడకుండా చర చరా బైటికి నడిచాడు శేఖరం. అతనిలో యేవిధమైన ఆవేశం వచ్చిందో, యెవరూ వూహించలేరు.

"బాబూ శేఖరం, యెక్కడికిరా... ఎక్కడికి...?" అంటూ పార్వతమ్మ యెంతగా అరుస్తున్నా, శేఖరం వెనక్కి తిరిగి చూల్లేదు.

పార్వతమ్మ బావురుమంటె, ముకుంద రావు బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. అతని కళ్ళనించి అశ్రువులు జలజలా రాలినయ్.

శేఖరం తిరిగి యింటికి రాలేదు. రెండ్రోజులు..మూడురోజులు గడిచాయి. తను నమ్మిన శేఖరం యెందుకిలా చేశాడు? ఇప్పుడెక్కడికి పోయాడు? తాము యిప్పుడెక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి? ... ఇవే పార్వతమ్మ ఆలోచనలు.

* * *

రామకృష్ణ నాలుగోరోజు వచ్చాడు. "జరిగిందంతా విన్నానమ్మా! తమ్ముడు యెక్కడికి పోయాడో ఆరా తీద్దాం. మీరింక యిక్కడ వుండటంలో అర్థం లేదు. మనింటికి పోదాం పదండి..." అన్నాడు.

పార్వతమ్మకి తల కొట్టేసినంత పనయ్యింది ఎవర్నయితే తాను అస హ్యించుకుందో, ఎవర్నయితే తాను కావాలని కసితో దూరంచేసిందో, ఆ కొడుకు ఇంటికే వెళ్ళడమా? తనలో తనే ప్రశ్నించుకుంది. వెళ్ళక యెక్కడుం టుంది? ఏంతింటుంది?...ఆమెకి ఏడు పొచ్చింది. కళ్ళు చెమ్మగిల్లాయి. క్షణం యేమీ మాట్లాడలేని స్థితిలో వుండి పోయింది.

ముకుందరావు, భార్య మనోస్థితిని అర్థంచేసుకున్నాడు. ఆమెపై కోపం రాలేదు. జాలి కలిగింది.

"పార్వతీ, నువ్వు యిప్పుడు ఆలో చించాల్సిందేమీలేదు. అంతా ముగిసిన తరువాత కూడా నీలో అహం వుందని పించుకోకు. పెద్దబ్బాయి స్వయంగా

వచ్చి పిలుస్తున్నాడు. వాడితో వెళ్ళడం మినహా మనకి మరో గత్యంతరం లేదు. నువ్వు నమ్మిన నీ ముద్దుల కొడుకు మనకేం మిగిల్చాడని? బైలుదేరు," అన్నాడు ముకుందరావు.

పార్వతమ్మకి దుఃఖం ముంచు కొచ్చింది.

"ఇదంతా నా ఖర్మండీ! చివరిదశలో యిటువంటి పరిస్థితి రావడంకంటె, చావొచ్చినా బావుండేది..." అంది రుద్ధ స్వరంతో, యింక పరిస్థితులతో రాజీ పడలేక.

రామకృష్ణ, చప్పున అందుకున్నాడు. "ఛా! అవేం మాటలమ్మా! చావెందుకు రావాలి? మిమ్మల్ని పోషించగలిగే తాహతు నాకు లేదనుకుంటున్నావా! పోనీ, తమ్ముడు మళ్ళీ ఓ మార్గాన పడే వరకూ నా దగ్గరుండండి," అన్నాడు.

ముకుందరావు మళ్ళీ అన్నాడు. "పార్వతీ, గతాన్ని మర్చిపో! వర్త మానంతో రాజీపడ్డం నేర్చుకో! పరాయి వాడింటికి మనం వెళ్ళడంలేదు. మనం కన్నకొడుకు యింటికే పోతున్నాం. పద..." అన్నాడు లేస్తూ.

"దీనికంతటికీ కారకురాల్ని నేనే... పాపిష్టిదాన్ని.." కళ్ళొత్తుకుంటూ అంది, పార్వతమ్మ.

ముకుందరావు, పొడిగా నవ్వేడు. "కాదు పార్వతీ! నువ్వుకాదు కారణం... నేను! ఎందుకో తెలుసా? ఇంటి యజమాన్ని అయ్యుండి కూడా, ఇంటి పెత్తనాన్ని నీ చేతిలో పెట్టాను. నువ్వేం చేసినా, మౌనంగా వూరుకున్నాను. అదే నా తప్పు" అన్నాడు గంభీరంగా.

పార్వతమ్మ మాట్లాడలేదు. "పోనీ లెండి నాన్నా! తప్పు యెవరిదైనా, సరి దిద్దుకోవడంలోనే వుంది ఘనత. జరి గిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మనం చెయ్యాల్సింది, తమ్ముడి కాపురాన్ని సరి దిద్దడానికి ప్రయత్నించడం. ఇవన్నీ తర్వాత ఆలోచిద్దాం. మీరు బైలు దేరండి...మీ కోడలు యెదురుచూస్తూ వుంటుంది. రిక్షాలు తీసుకొస్తానుండండి." అంటూ బైటికి నడిచాడు, రామకృష్ణ.

"రామకృష్ణ వుత్తముడని, నాకు మొదట్నించీ నమ్మకమే పార్వతీ! ఇప్పటికయినా నువ్వు అర్థంచేసు కున్నావా?" అన్నాడు, ముకుందరావు.

ఔనన్నట్టుగా తలూపింది పార్వతమ్మ. ఆమెలోని అహం నశించినట్టుగ మొహంలో ఆగ్రహంపాలు తగ్గి పోయాయి.

రిక్షాలు తీసుకొచ్చాడు, రామకృష్ణ. పార్వతమ్మ సామాను సర్దడంలో నిమగ్నురాలయ్యింది. ముకుందరావు. పెద్దకొడుకుకేసి చూసి, తృప్తిగా నవ్వు కున్నాడు.

# పరోక్షపు [illegible]

"ఒరేయ్! తమ్ముా, రేపు మీ బడికి మెడికల్ చెకప్ చేయిద్దామనుకొంటున్నాను పనిలోపని, మరదల్ని కూడా పంపిస్తావా" అడిగాడు సుందరం తమ్ముడు ప్రకాశాన్ని.

"నాకు ఈ చెకప్‌లు నచ్చవు. వాటిమీద గురిలేదు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది" విసుగ్గా అన్నాడు ప్రకాశం.

"అలా కాదురా' స్త్రీ గర్భవతిగా వున్నప్పుడు వైద్య పరీక్ష చేయించాలి ఏవన్నా కాంప్లికేషన్స్ వున్నట్లయితే, సర్దుకోవటానికి మందులు ఇస్తారు. దీనివల్ల తల్లికి కులాసాగా వుంటుంది." పుట్టే బిడ్డకూడా ఆరోగ్యంగా ఉండటానికి అవకాశం ఉంటుంది.

"ఏమయినా, నాకు ఇష్టంలేదురా, మమ్మల్ని ఇలా వదిలేయ్.''

"సరేలేరా, నీ ఇష్టప్రకారమే చేయి."

మూర్ఖుడు, చదివాడు ఏంలాభం. అనుకొన్నాడు సుందరం తమ్ముడు ప్రకాశం గురించి.

''అమ్మా, నీ కోడల్ని రేపు డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి పరీక్షచేయిద్దామనుకొంటున్నాను. అప్పుడే నాలుగోనెల నడుస్తోంది. అవసరమయితే మందులు ఇస్తారు. దీనివల్ల కులాసాగా యుంటుంది. పుట్టబోయే బిడ్డ ఆరోగ్యంగా వుండటానికి అవకాశం వుంటుంది" అన్నాడు సుందరం తల్లియె భోజనం చేస్తూ.

"నీది మరీ విడ్డూరంరా. ఈ పరీక్షలు అవీ అనవసర ప్రయాస. డబ్బు దండుగ కూడాను. అయినా, నాకు తెలీకడుగుతాను, ఏం పరీక్షలు చేయించుకొని, టానిక్కులు, మందులు తిని మిమ్మలందర్ని కన్నానురా. ఏం! మీరందరు ఆరోగ్యంగాలేరా?... ఈ చదువులు మిమ్మల్ని పాడుచేశాయి. ప్రతిదానికి డాక్టర్లు, మందులు..."

'అలాగేనమ్మా; నీవు చెప్పినది సబబుగా వుంది. అలాగే చేస్తాను అయినా నీ మాట కాదన్నదెప్పుడు."

---




ఆమె సన్నగా, నాజూగ్గా ఉంది. ప్రథమ వీక్షణంలోనే మరులుగొల్పే అద్భుతమైన అందం ఆమెది.

ఆమె గుండ్రటి నేత్రాల చురుకైన కోరచూపులు; ఆమె సొగసైన, బలమైన రొమ్ముల వంపులు; కామానికి కాలుదువ్వే ఆమె నడకతీరు; ఆమె చిరునవ్వులోని వెన్నెల హాయి; ఆమె కనుబొమల కదలికలోని కవ్వింపు – ఇవన్నీ చాలు, ఎంత శుద్ధ బుద్ధావతారాన్ని అయినా ఇట్టే ప్రేరేపించి, గుండెలో గిలిగింతలు పెట్టడానికి.

ఇనుపగుండెగల జనరల్ మనస్సు నీటిలో ఇసుక గడ్డ అయింది. ఆ నర్సు దగ్గరకు వచ్చినప్పుడల్లా, అతని హృదయంలో చిన్న కల్లోలం చెలరేగ సాగింది. చిన్నగాయాన్ని నయం చేయించుకోవడానికి అతను ఆ హాస్పిటల్‌కు వచ్చాడు. ఆగాయం నయమైంది. అయితే ఇప్పుడు ఆయన గుండెకే గాయం ఏర్పడింది. ఆమె పొగలేని నిప్పులా ప్రవేశించి, అతని హృదయాంతరాళంలో కారుచిచ్చును పుట్టించింది.

ఆమె ఏదో మిషమీద మాటిమాటికీ అతని దగ్గరకు వచ్చేది. మళ్లీ అంత లోనే మాయమయ్యేది. ఆమె వాణికే పెదవులనుంచి వెలువడే నిశ్శబ్దమైన ఆదేశాలకు అర్థాలు చెప్పుకోవడం అతనికి సాధ్యపడటంలేదు.

అయితే అతనికి ఆట్టే-టైంలేదు. ఆ హాస్పటల్‌ను రేపే విడిచిపెట్టి, తన కాంపుకు వెళ్లాలి.

అతను కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. ఆవరణలో ఉన్న విద్యు దీపాలు గడిచిపోతూన్న రాత్రినుంచి హాస్పటల్‌ను కాపలా కాస్తున్నాయి. గాయాలు తగిలిన సైనికుల మూలుగులు సన్నగా వినవస్తున్నాయి. జనరల్ శరీర మంతా తీవ్రమైన కోర్కెతో కుతకుత లాడిపోతూన్నది.

నర్సు అతనికి ఆహారాన్ని తెచ్చింది.

కొద్ది క్షణాలపాటు జనరల్ ఆమె కేసి తేరిపార చూశాడు ముగ్ధుడై. "నేను రేపు వెళ్లిపోతున్నాను" అన్నాడు జనరల్.

మెరుపులా మెరిసే ఆమె కళ్లపై హఠాత్తుగా చీకటి తెరవాలింది.

"నాకు తెలుసు" అన్నదామె నిర్జీవ మైన నవ్వుతో.

"నీకు తెలుసా?"

అతనికేసి ఓరగా చూసి, కాఫీ కలప సాగింది నర్సు.

కాఫీ అతని ముందుపెట్టి, గదిలో నుంచి బయటకు వెళ్ళబోయింది నర్సు.

"చూడు! నువ్వు నాతో వస్తావా?" అన్నాడు జనరల్.

"ఎక్కడకు?"

"నా క్యాంప్‌కు."

"ఎందుకూ?"

నర్సు కళ్ళు పెద్దవైనాయి; పెదవులు వణుకుతున్నాయి.

"ఆ మాత్రం తెలియదా? రా! కనీసం ఒక్కరాత్రికి."

"నేనెట్లా వచ్చేది? నాకు ఉద్యోగ ముంది."

"సెలవు తీసుకోవచ్చుగా!"

"ఏమైనా, ఒకనర్సు జనరల్ క్యాంప్ లోకి ఎట్లా రాగలుగుతుంది?"

"మగవాడివేషంలో నువ్వు వస్తే, ఎవ్వరూ గుర్తుపట్టరు."

ఆమె కొద్దిక్షణాలపాటు మౌనంగా ఉంది. ఆమె తన అందాన్ని దాయడానికి ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది.

"నాకు సెలవు దొరుకుతుందా?" అన్నదామె.

"ఆ విషయం నాకు వదులు."

రెండురోజుల తర్వాత, తన క్యాంపులో జనరల్ ఆదుర్దాగా ఎదురు చూస్తున్నాడు. అర్థరాత్రివేళ, నర్సు మగవాడివేషంలో అతని క్యాంప్‌లోకి

వచ్చింది. జనరల్ ఆమెను ఆహ్వానిం చాడు. ఆమె నవ్వుతూ కూర్చుంది.

కొద్ది నిముషాలపాటు ఇద్దరూ పరస్పరం చూసుకొంటూ మౌనంగా ఉన్నారు. రాత్రి నిశబ్దత మత్తుగా ఉంది. హఠాత్తుగా జనరల్ అన్నాడు.

"ఆ రూమ్‌లోకి వెళదాం."

ఆమె చిరునవ్వును పల్చగా దొర్లిం చిందిగానీ, కుర్చీలోంచి రవ్వంత కదల్లేదు.

"ప్లీజ్! రా."

ఆమె ఇంకా కుర్చీలోనే కూర్చుంది.

"ఏమిటి సంగతి? ఏంకావాలి?"

"నాకు కావాల్సింది మీరు ఇస్తారా?"

"తప్పకుండా."

ఆమె మొహం మెర్క్యూరీ దీపంలా వెలిగింది.

"చెప్పు, ఏం కావాలో!" అన్నాడు జనరల్ మళ్ళీ.

"ప్రత్యేకంగా ఏమీలేదు. మీరు ఇన్ని యుద్ధాలలో ఎట్లా గెల్చారో తెల్సుకోవా లని ఉంది. అంతే!"

"అంత పెద్ద ప్రశ్నకు సంగ్రహంగా ఎట్లా సమాధానం చెప్పేది?"

"ఏమీలేదు. శత్రువుమీద రేపో ఎల్లుండో దాడి జరపబోతున్నారని తెల్సింది దాన్ని మీరెట్లా ప్లాన్‌చేస్తు న్నారో వినాలని ఉంది."

'అంటే నా యుద్ధవ్యూహాన్ని తెల్సు కోవాలని ఉందా నీకు?"

"ముమ్మాటికీ అంతే!"

జనరల్‌కేసి ఆమె సూటిగా చూసింది.

జనరల్ నిర్ఘాంతపోయాడు. సందే హంలేదు. ఆమె శత్రువు ఏజంటే!

యుద్ధవ్యూహాన్ని తెల్సుకొని నువ్వేం చేస్తావు?"

"నేను చేసేదేంలేదు. వఠినే తెల్సు కొందామని, కుతూహలంకొద్దీ అడుగు తున్నాను."

"నేను యుద్ధవ్యూహాన్ని ఎప్పుడూ వెల్లడించను."

"ఇతర్ల పడక గదుల్లోకి నేనెప్పుడూ పోను."

ఆమె నిర్మలమైన నేత్రాలు ఉల్లా సంగా ఉన్నాయి.

పిడికిలి బిగించాడు జనరల్. ఆమె కేసి అప్రతిభుడై చూడసాగాడు.

"యుద్ధవ్యూహాన్ని వెల్లడించేదాకా, పడకగదిలోకి రావన్నమాట?"

"ఉహూఁ!" అన్నదామె నవ్వుతూ. గోడకు కోటును తగిలించిందామె.

ఆమె మెల్లగా వివస్త్ర కాజొచ్చింది. ఆమె శరీరపు అందానికీ, లావణ్యానికీ, వంపులకూ జనరల్ మంత్రముగ్ధుడవు తున్నాడు. అతనిలోని కోర్కె మనస్సు మీద కొరడా దెబ్బలు కొడుతోంది.

"ఒకవేళ నేనునిన్ను బలవంతంచేస్తే?"

"నేను అరుస్తాను. అది మీ పరువు మర్యాదలకు మంచిదికాదు."

కొన్ని నిముషాలపాటు ఘనీభవించిన వాడై, కోపోద్రేకాలతో భృకుటి ముడిచి చూడసాగాడు.

"అయితే, సరే!" అంటూ, డ్రాయరు తెరిచి, యుద్ధవ్యూహం తాలూకు మ్యాప్‌నుఆమెకిచ్చాడుజనరల్.

ఆమె అత్యంతాసక్తంగా ఆ మ్యాప్‌ను స్టడీచేయసాగింది.

"అయితే లోపల కెళదాం, రా".

కొద్దినిముషాల్లో వస్తాను. ముందుగా బాత్‌రూంలోకి వెళ్ళిరావాలి."

బాత్‌రూమ్‌ను ఆమెకు చూపెట్టి, తన బెడ్‌రూంలోకి జనరల్ వెళ్ళాడు.

ఆమె వెంటనే టేబుల్ దగ్గరకు వెళ్ళి, ఏదో వ్రాయసాగింది.

ఆ తర్వాత బాత్‌రూంలోకివెళ్ళి, కొద్ది నిముషాల తర్వాత బయటికొచ్చి, జనరల్ గదిలోకి ప్రవేశించింది.

మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది.

* * *

అర్ధగంట తర్వాత జనరల్ తన బెడ్‌రూంనుంచి బయటికొచ్చాడు. ఆమె కూడా వచ్చింది. నిప్పుసెగ తగిలిన పువ్వులా వుందామె.

కరుడుకట్టిన క్రూరత్వంతో జనరల్ మొహం భయంకరంగా ఉంది.

ఆమె పేలవంగా చిరునవ్వునవ్వింది. ఏదో చెప్పబోయింది. అంతలోనే రివాల్వర్ గర్జించింది. ఆమె తలమీద జనరల్ పేల్చాడు.

"డర్టీ స్పై" అన్నాడు జనరల్.

రక్తపు మడుగులో నర్సు శరీరం కుప్పగా కూలిపోయింది. నిశ్శబ్దంగా కుర్చీలో కూర్చుని ఆమె శవంకేసి నిర్లిప్తంగా చూడసాగాడు జనరల్.

హఠాత్తుగా టేబుల్‌మీద ఉన్న ఉత్తరం జనరల్ కంటబడింది.

"డియర్ జనరల్! ఇప్పటికి నన్ను గుర్తుపట్టివుంటారు నేనింకా ఎక్కువ కాలం బతకనని నాకు తెలుసు. అందుకు నేను చింతించడంలేదు. చావు అందరికీ వస్తుంది. అది మీ ద్వారా వస్తూన్నం దుకు ఒకరకంగా నా అదృష్టమనే చెప్పాలి. మిమ్మల్ని చిన్న సహాయం అర్థిస్తున్నా. అది ఎనిమీ జనరల్‌ను మామూలుగా అడిగేదికాదు. మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నా కాబట్టి, ధైర్యంచేసి అడుగుతున్నాను. నా దేశానికి నా శవాన్ని దయవుంచి పంపగలరా? నా యీ అంతిమ కోర్కెను మీరు మన్నించాలని ప్రార్థిస్తున్నా—అభాగ్యురాలైన మీ స్నేహితురాలు, ఆడియో.''

ఆ నర్సు శవం ఆమె చేరింది.

అంతకుముందే ఆ నర్సు తనదేశానికి ఒక వార్త పంపించడం జరిగింది; "రహస్య సమాచారం నా శరీరంమీద ఉంటుంది. బాగా శోధించండి."

ఆమె శవాన్ని ముక్కలుగా కోయగా, జనరల్ బాత్‌రూంలో ఆమె మింగిన పేపరు దొరికింది.

ఆ పేపరులో యుద్ధవ్యూహం నవిస్తరంగా ఉంది.



# విపులాచపృథ్వీ

ఇచ్ఛాపురపు రామచంద్రం

గడియారపు ముళ్లవంక చూస్తూ కూర్చున్నాను

పెద్దముల్లు ఆరుమీద ఉంది. అది పన్నెండు వద్దకి వచ్చేసరికి–చిన్నముల్లు నత్తనడకలు నడుస్తూ ఐదుని చేరుకుంటుంది.

ఐదయితే ఆఫీసునుంచి విముక్తి.

ఆఫీసులో చివరి అరగంటా మరీ మెల్లగా గడుస్తుంది కాబోలు ః మిగిలిన గుమాస్తాలు నాలా గడియారంవైపు చూడటంలేదు. అలాగని పనీ చెయ్యడం లేదు; ఏదో కాలక్షేపం చేస్తున్నారు–ఆఫీసుకి అలవాటయినవాళ్లు కనుక.

నేనీ ఉద్యోగంలోచేరి వారంరోజులు కూడా కాలేదు. అందుకే ఆఫీసు వాతావరణమూ, మనుషులూ కొత్త. అలవాటు పడటానికింకా కొంచెం కాలం పడుతుంది. అంతవరకూ ఒక విధమయిన బెరుకుతనం తప్పదు. అందుచేత ఆఫీసునుంచి ఎంతట బయటపడతామా అని ఆత్రుత. అందుకే గడియారపు ముళ్లకి కళ్లంట పెట్టుకుని కూర్చోడం. నిజానికి–చేయవలసిన పనికూడా ఏమీలేదు

"ఏమిటాలోచిస్తున్నారు?"

అతని పేరు...అనంతరావు. ఇంకా నేను మిగిలినవాళ్ల పేర్లకి బాగా అలవాటు పడలేదు.

"ఏమీలేదు" అన్నాను.

"పదండి. అలా వరండాలోకి వెళ్ళి రోడ్ వ్యూ చూద్దాం."

సందేహిస్తూ ఉండిపోయాను.

ఉద్యోగంలో కొత్తగా చేరినవాడిని. ప్రొబేషనరీ పిరియడ్‌లో ఉన్నాను. కనీసం కన్‌ఫరమ్ అయ్యేవరకూ జాగ్ర

త్తగా ఉండాలని పెద్దల ఉవాచ. ఉద్యోగం ఖాయపడటమనేది ఆఫీసరు వారి కృపాకటాక్ష వీక్షణాలమీద ఆధార పడిఉంటుంది మరి. జాగ్రత్తగా ఉండ వలసిన పరిస్థితి.

"ఫరవాలేదు బాస్ అట్టే దుర్మార్గుడు కాడు. నడవండి."

నడిచాను.

వరండాలోకివచ్చి పారపిట్ వాలుని ఆనుకుని నిలుచుని రోడ్డువైపు చూడ సాగాను. అనంతరావు నా భుజంమీద చెయ్యి వేశాడు

"ఏమీ అనుకోకపోదే ... లంచ్ టైములో...క్యాంటిన్ యివతల...విశ్వ పతి మిమ్మల్నేమడిగాడు ?" లాలనగా అడిగాడతను.

భయం వేసింది.

ఉద్యోగంలో చేరేముందు ... కొన్ని ఆఫీసుల గురించి వినిఉన్నాను.

గుమాస్తాలలో గ్రూపులుంటాయిట ; ఏ గ్రూపు కా గ్రూపు తమ సంఖ్యని పెంచు కోవాలని శతవిధాల ప్రయత్నిస్తాయిట. అటువంటి చీలికలవల్ల అన్నీ అనర్థాలే. ఒకరికీ మరొకరికీ పొత్తదు. ఈ ఆఫీ సులోకూడ అటువంటి దురాచారం ప్రబలి ఉందా? అలాగ అయితే విచారించవలసిన విషయమే.

గు మా స్తా లు - జాగ్రదావస్తలో ఎక్కువభాగం గడిపేది ఆఫీసులోనే. (కార్యాలయాలలో నిద్రపోయే గుమా స్తాలమీద వేసే కార్టూనలో అసత్యమే ఎక్కువ. ఆఫీసులో నిద్రపోయేందుకు సదుపాయాలు చాలా తక్కువ. పది మందీ గోలచేస్తూంటారు. పైగా కర్ర కుర్చీలు. నల్లులు. వీటితో నరమానవుడికి నిద్రపడుతుందా ?) కనుక కార్యాల యంలో మంచి వాతావరణం ఉండాలి. స్నేహ సౌహార్దాలు వెల్లివిరుస్తూఉండాలి. అంతేకాని శత్రువులమాదిరిసంచరించడం మంచిదికాదు.

కొంపతీసి–విశ్వపతిగారూ, అనంత రావూ–యిద్దరూ నన్ను ఆ గ్రూపుల్లోకి తీసుకోవాలని ప్రయత్నించడం లేదుకద? అదే నిజమయితే నా కర్తవ్యమేమిటి?

" విశ్వపతి మిమ్మల్నేమిటడిగాడు లంచ్ టైములో?" రెట్టించా డనంతరావు.

"ఏమీలేదండీ" అనేశాను.

రహస్యాలపట్ల కుతూహలంఉండటం బలహీనతే అవుతుంది.

అతను కొంచెం నొచ్చుకున్నట్లు న్నాడు. "నన్ను మీరు మరోలాభావించ కండి. నిజంగా నేను శ్రేయోభిలాషినే. ఎక్కడినుంచో వచ్చి ఒంటరిగా ఉంటు న్నారిక్కడ ఒకే ఆఫీసులో పనిచేసే వాళ్ళం. ఆ బంధం...అనుబంధం ... అందుకే మీగురించి శ్రద్ధతీసుకోవడం."

"చాలా కృతజ్ఞతలు. విశ్వపతిగారు కూడా మన కలిగే ... " చిరునవ్వు నవ్వాను.

"మనిషినిస్వార్థం ఎంతకయినా దిగ

జార్చుతుందనుకుంటాను. తప్పదు. పరిస్థితులు - స్నేహంకంటె బలీయం ఐపోతూంటాయి. అపరాధంవ్యక్తిదికాదు. పరిస్థితులదే''.

"మీరు నాకోసం అనవసరంగా ఎక్కువ ఆత్రత పడుతున్నారనుకుంటాను. విశ్వపతిగారు నాకు దుర్మార్గులలా అనిపించలేదు. అసలు-నేనూ ఆయనా అధికంగా ఏమీ మాట్లాడుకోలేదు. నన్ను వారింటికి టీకి పిలిచారంతే."

నా మాటతో ఆశ్చర్యంగా - అనంతరావ్ ఆత్రుత అధికమైపోయింది!

"మీరు అంగీకరించారా?"

''నాకు కొంతవరకు సభ్యత తెలుసు. సాటి ఉద్యోగి ఆదరంగా పిలిస్తే కాదనగలిగేంత కుసంస్కారం నాకు లేదు."

''ఔను. మీరు అతి మంచివారు. సుతిమెత్తనివారు. అందుకే మీ గురించి యింతగా పట్టించుకోడం..."

అతని వైఖరి నాకు నచ్చలేదు. ''విశ్వపతిగారు నన్ను పిలిచింది టీకే తప్ప యుద్ధానికి కాదు. నాకేదో ఆపద సంభవించబోతున్నట్లు మీరు భయపడుతూ నన్ను భయపెడుతున్నారు."

"నిజంగా మీరు ఆపదలోనే చిక్కుకోబోతున్నారు. చూడండి మాధవ్... మీరు విశ్వపతిగారింటికి టీకి రానని చెప్పెయ్యండి."

''ఎందుకని?''

"అదంతా పెద్ద కథ. ఇప్పుడు తెమలదు. రేపు చెబుతాను..."

గడియారం ఐదుగంటలు కొట్టింది- హాలు దాటికూడా వినిపించేలా.

విశ్వపతిగారు మావద్దకి వచ్చారు

అనంతరావు జారుకున్నాడు.

"మా యింటికి వెళ్దాం వస్తారా?''

అడిగాడు విశ్వపతి.

నా మెదడు స్థంభించిపోయిం దొక్క-క్షణం.

చేయరాని నేరం చేస్తున్నట్లు భావన.

సంఘర్షణ.

"క్షమించండి. ఇవాళ హఠాత్తుగా ఒకపని తగిలింది. రేపు వస్తాను...తప్పకుండా." చివరిపదాన్ని నొక్కి-పలికాను.

ఆయన ముఖంలో నిరుత్సాహం.

కన్నులలో నిరాశ పరచిన నీడలు.

నేను వారిని బాధపెట్టానని సుస్పష్టమైంది.

''సరే, రేపు తప్పకుండా వస్తారు కదూ?" అర్థించినట్లే అడిగాడు.

''తప్పకుండా" తలవంచుకున్నాను.

ఆ క్షణాలలో నన్ను నేనే క్షమించుకోలేకపోయాను.

* * *

మనుష్యులను విశ్వసించే ప్రవృత్తే నాది. అవిశ్వాసానికి యీషణ్మాత్రమైనా తావీయను. మరోలా రుజువయ్యే వరకూ మనిషిని నమ్మడమే న్యాయమనే సిద్ధాం

తాన్ని నేనామోదిస్తాను. అమలుజరుపు తాను. మనిషి-మనిషిని నమ్మకపోతే మనుగడ కష్టసాధ్యమౌతుంది.

నకు విశ్వపతిగారి మీదకానీ అనంతరావు మీదకానీ అవిశ్వాసం లేదు.

ఇద్దరినీ విశ్వసించాను. ఎటొచ్చీ అనంతరావు మా యిద్దరిమధ్యా దూరం పెంచే ప్రయత్నంచేశాడు. దానికి కారణము కథా ఉన్నాయన్నాడు.

మిస్టరీ విడాలి.

అనంతరావే విప్పాలి.

అంతవరకూ హృదయం డోలాయమానం కాకతప్పదు.

సస్పెన్సు విడితే తప్ప – అటు విశ్వపతిగారూ, యిటు అనంతరావుగారూ– వీళ్లగురించి నేనొక నిర్ధారణకు రాలేను

ఎదురుచూస్తున్న లంచ్ టైము రానేవచ్చింది.

పేరుకి లంచ్ బ్రేక్ కానీ – నిజానికి గుమాస్తాలప్పుడు తీసుకునేది కాఫీ మాత్రమే.

కాఫీ సేవించి – సిగరెట్ అంటించి– మొదలుపెట్టాడు అనంతరావ్.

"జీవితంగురించి మీ ఉద్దేశమేమిటి ?"

"అంటే ?" అయోమయంగా చూశాను. నిజంగా అనంతరావు ప్రశ్నలోని అంతరార్థం నాకర్థంకాలేదు.

"జీవితం ఎలాగడిస్తే బాగుంటుందనుకుంటున్నారు ?"

"సుఖంగా, సమస్యారహితంగా..."

"అవునా ? .." విజేతలా నవ్వి – అంతలోనే సీరియస్సయిపోయి, "అన్ని సమస్యలకీ, దుఃఖాలకీ మూలంసంసారం అంటే మీరు ఏమంటారు ?" అని ప్రశ్నించాడు.

"సగం సత్యంకావచ్చు."

"థాంక్యూ ఫిఫ్టీ పర్సంటైనా ఏకీభవించారు సంసారం అనేది సాగరం. సముద్రంలో ఎంతటి యీతగాడయినా అలసిపోయి అంతరించిపోవలసిందే తప్ప అవతలి ఒడ్డు చేరలేడు అలాగే సంసారంలో సుఖంకూడా..."

కొంచెం విసుగేసింది

బహుశా నా ముఖంలో ఆ భావం ప్రతిఫలించిందేమో !

"క్షమించండి నేను కొంచెం రచయితని అందుచేత..." నవ్వేసి– "ఊఁ, సూటిగా చెప్పేస్తాను విశ్వపతిగారికి ఆరుగురమ్మాయిలు," అన్నాడు అనంతరావ్

"ఐతే ?" నిజంగానే అర్థంకాలేదు నాకు.

"చంపారు. ఇంకా కుండబద్దలు కొట్టినట్లు చెప్పమంటారా ?" సిగరెట్ అంటించాడు అనంతరావ్. రచయిత టెక్నిక్ నామీద ప్రదర్శిస్తున్నాడు ; జాలిపడ్డాను నా గురించి అతనికి తెలియదు మరి. కథలే సాహిత్యమైతే– నేను

సాహిత్య సాగరమథనంలో కాకలు తీరినవాడినే.

"నేటి సమాజంలో ఆడపిల్లల తండ్రుల అగచాట్లు మీకు తెలుసను కుంటాను."

"ఊఁ."

"ఈ వ్యవస్థలో ఆడపిల్లల తండ్రి. వాళ్ల పెళ్లిళ్లకోసం ఎన్ని అవస్థలయినా పడాలి. మధ్యతరగతి మనిషి - సమస్యల పుట్ట."

"ఊఁ."

"ఏమిటండీ మీ అమాయకత్వమూ మీరూనూ! నయమే. నేను ముందు చెప్పకపోతే మీరు తప్పకుండా విశ్వపతిగారు పన్నేవలలో చిక్కుకునే వారే!"

"వల!"

"కాకపోతే? రంగులవల... మీరు తప్పకుండా ఆ వలలో పడిపోయేవారే!" అసమర్థుడైన రచయిత వ్రాసిన కథలో సంభాషణని తలపింపజేస్తూంది అనంత రావ్ ధోరణి. ఈ నాన్పుడంతా అతను సస్పెన్సుగా భ్రమపడటంలేదుకద?

"మీరు బ్రహ్మచారులు. ఆయన కారుగు రమ్మాయిలున్నారు. కనుక... యీ క్వేషను సరిపోలా?" నవ్వాడు అనంతరావ్. "ఆయన ఆహ్వానంలోని అంతరార్థం ఇదే. తరవాతమీఇష్టం..." ఒక క్షణం ఆగాడు. "మీరు నమ్మలేక పోతున్నారుకదూ?"

మౌనందాల్చాను.

విశ్వపతిగారిమీద ఆ క్షణంలో చాలా సానుభూతి కలిగినమాట నిజం. ఆడపిల్లలు కలవారి అవస్థలు నేను విన్నాను

విశ్వపతిగారి తప్పేమయినా ఉంటే- అది అందరు పిల్లల్ని కనడమే. అందుకు పూర్తిగా ఆయన ఒక్కరే బాధ్యులు అయి ఉండకపోవచ్చును. ఆ పరిస్థితు లెటువంటివో? అప్పటికి కుటుంబ నియం త్రణంగురించి యింత ప్రచారం జరిగి ఉండకపోవచ్చును. ఏదేమయినా విశ్వపతిగారు ఆరుగురమ్మాయిల తండ్రి. అమ్మాయిలకి పెళ్ళిచేసేందుకు ప్రయ త్నించడంలో ఆయన అపరాధమేమీ లేదు

"మాధవ్! మీరింకా చిన్నవాళ్ళు. జీవితం ఎంజాయ్ చెయ్యాలంటే బ్రహ్మ చారిగానే సాధ్యం. జీవితమంటే సుఖ పడటం. సమస్యలని తలకు చుట్టుకోడం కాదు. వివాహం అంటే - పరిష్కారం దొరకని దీర్ఘసమస్యే అందుచేత వీలయి నంతవరకూ వివాహానికి దూరంగా ఉండ డమే వివేకం."

అనంతరావు జీవితానికిచ్చిన నిర్వ చనం నాకు నచ్చలేదు. సమస్యలులేనిదే జీవితమేమిటి? ఎవరో ఆంగ్లరచయిత అన్నట్లు-"వాటీజ్ లైఫ్ ఇఫ్ నాట్ కేర్స్ అండ్ ఆంగ్జయిటీస్?"

అయినా జీవితమనేది నిర్వచనాని కందేది కాదనుకుంటాను. ఎవరి

జీవితానికి వారే నిర్వచనం యిచ్చుకుంటే కొంత న్యాయంగా ఉంటుందేమో! ఇది నా ఉద్దేశం.

లంచ్ టైము దాటింది.

సీటులోకి నడిచాను.

ఐదారు గజాలదూరంలో - ఒక మూలగా విశ్వపతిగారు కనిపించారు.

ఆయన నెలా ఉన్నారు?

ఆరుగురు అమ్మాయిల కన్న తండ్రిలా.

ఆయన నొసటిపైని ముడతలు?

సమస్యలలా.

ఆయన ముఖం?

మధ్యతరగతి మనిషి జీవితం తాలూకు ప్రతిబింబంలా.

జాలివేసింది.

అనంతరావు మిస్టరీ విప్పేశాడు.

ఇక ఆలోచించుకోవలసింది నేనే.

సాయంత్రం వారింటికి వెళ్ళాలా, వద్దా?

వస్తానని వాగ్దానంచేశాను. నిన్న డిసపాయింట్ చెయ్యడమే క్షమించరాని నేరం.

పైగా-యివాళ 'తప్పకుండా' వస్తానని చెప్పాను కనుక- వెళ్ళితీరవలసిందే.

ఈ విషయంలో యింకా ఆలోచన కాని, యింకొక నిర్ణయంకాని ఉండ కూడదు.

మెదడు కొంచెం తేలికపడినట్లనిపించింది.

ఫైలందుకుని డ్రాఫ్ట్ తయారుచేయ సాగాను.

పదిహేను నిముషాలకు ఆ పని అయిపోయింది.

మళ్ళీ విరామం.

మళ్ళీ ఆలోచనలు.

ఆలోచనలు కూడా ఒకవిధమైన వ్యసనమే అనుకుంటాను సాధారణంగా రచయితలీ వ్యసనంలో చిక్కుకుంటారు ఐతే - వారు ఆలోచనల కొకరూపం యిచ్చి - కాగితంమీద పెట్టేసి — తేలిక పడతారు. విపరీతంగా చదివే పాఠకులకి ఆలోచించే వ్యసనం అలవడుతుంది తప్ప - ఆలోచనలభారం వదిలించుకునే మార్గం ఉండదు. బహుశా యిదే కారణ మేమో - ఎక్కువ చదివినవారు రచయితలు కావడానికి.

నా కనుల వెనక దృశ్యాలు కదులుతున్నయ్.

విశ్వపతి గారింటికి వెళ్ళాను - ఆయనతో.

ఆ యిల్లెలా ఉంటుంది?

పేదరికానికి ప్రతిబింబంలా.

ఆ యిల్లాలు?

సమస్యలకి సమగ్రచిత్రంలా.

ఆ పిల్లలు?

ఒక్కొక్కరూ ఒక్కొక్క గడ్డు సమస్యలా.

నేను యింట్లోకి నడుస్తాను.



మొదట ఆ యింటి యిల్లాలు నన్ను చూస్తుంది.

ఆశతో ఆమె కళ్ళు మెరుస్తాయి ఒక్కసారి.

కొన్ని నిముషాలు.

ఆ గదిలో ఒంటరిగా మిగులుతాను నేను.

ఒక అమ్మాయి వస్తుంది - చేతిలో కాఫీగ్లాసుతో.

అమ్మాయి చాలా దీనంగా ఉంటుంది.

ఆమె కన్నులనిండా నీళ్ళుంటాయి.

కన్నులలో నీళ్ళతోపాటు-కట్టుకున్న చీరలోని చిరుగులనికూడా దాచుకుందుకు వ్యర్థప్రయత్నంచేసి ఓడిపోతుంది.

జాలిగా నవ్వుతాను.

నన్ను పెళ్ళిచేసుకుని నా జీవితాన్ని మా నాన్న సమస్యనీ -గట్టెక్కించరూ అని ప్రాధేయపూర్వకంగా అడుగుతుంది.

నేనేదో చెప్పబోయేంతలో విశ్వపతి గారక్కడికి ప్రవేశిస్తారు.

అవకాశాన్ని వృధాపోనివ్వకుండా అందుకుంటారు. "నేను బహు బీదవాడిని. గంపెడు ఆడపిల్లలు. వీళ్ళ పెళ్ళిళ్ళ గురించి తలుచుకుంటూంటే గుండె బ్రద్దలైపోతూంది. కుటుంబానికి కడుపు నిండా అన్నంపెట్టడమే అతికష్టమౌతూంటే-కట్నాలిచ్చి పెళ్ళిళ్ళుచెయ్యటం నా తరమా ?

ఆ రోజులలో...నాకేమీ తెలియదు. ముందుచూపు లేకపోయింది. అరుగురాడ

పిల్లల్ని కన్నాను. అప్పటికి కుటుంబ నియంత్రణం గురించి ప్రచారంలేదు.

గత జల సేతుబంధనం అంటారా? ఔను. ఇప్పుడు-పశ్చాత్తాపపడటంకంటె ఏంచేయగలను?"

ఆయన కన్నులనిండా నీరు!

గొంతునిండా దుఃఖం!!

"మాధవ్!-"

ఆలోచనలు తెగిపోయాయి.

తలఎత్తి చూశాను.

విశ్వపతిగారు.

"ఇంటికి వెళ్దామా?" ఆత్రతగా అడిగారు.

గడియారం చూశాను.

ఐదు దాటుతోంది.

కప్‌బోర్డుకి తాళంవేసి- "పదండి-" అన్నాను.

విశ్వపతి గారిల్లు అఫీసుకి మరీ దూరమేమీ కాదు.

రిక్షా పిలుస్తానంటే నేనే వద్దన్నాను.

ఇద్దరమూ వారిల్లు చేరుకున్నాం.

ముందరి గది నీటుగానే ఉంది.

నేను వస్తానని ముందు తెలుసు కనుక దాన్ని అలా ఉంచారేమో!

నన్నొక కుర్చీలో కూర్చోబెట్టి లోపలికి వెళ్లారు విశ్వపతిగారు. నేనున్న గదికానుకుని పక్కనే ఒక గది ఉంది. రెండుగదులకీ మధ్య కిటికీ.

"చెప్పు...నువ్వనుకున్నట్లున్నాడా? నీకు నచ్చాడా?"

అది విశ్వపతిగారి స్వరం.

"ఊఁ."

తుళ్ళిపడ్డాను.

కిటికీలోంచి రెండు కళ్ళు నన్ను పరీక్షగా చూస్తున్నాయి.

విశ్వపతిగారి యీ ఏర్పాటు సబవుగా తోచలేదు.

ఆయనమీద కొంచెం కోపంవచ్చింది.

లేచి-వెళ్ళిపోవాలనిపించింది.

ఇంతలో పద్దెనిమిదిదాటిన ఒక అమ్మాయి కాఫీతో వచ్చింది. ఆమె వెనుక విశ్వపతిగారు.

"అమ్మాయి రత్న. పి. యు. సి. పాసైంది. ప్రైవేటుగా బి. ఏ. కి కడుతూంది."

"నమస్కారం."

నేనూ నమస్కారం చేశాను.

రత్న నా వంక అదోలాచూసి వెళ్ళిపోయింది.

ద్వారందగ్గర ఎవరో నిలుచున్నారు. విశ్వపతిగారి భార్య.

విశ్వపతిగారు గొంతు సవరించుకున్నారు. "క్షమించు మాధవ్. నీకు చెప్పకుండా ఒక పనిచేశాను."

"ఏమిటి?"

"అదుగో... ఆవిడ మా శ్రీమతి. ఒట్టి పిచ్చిమాలోకం అంటే తప్పులేదు. మాకు ఆరుగురాడపిల్లలు. ఆ విషయం తలుచుకుని ఆవిడ ఒకటే కుమిలిపోతుంది."

"ఆ రోజులలో కుటుంబనియంత్రణం..."

"ఇప్పటంత ప్రచారం లేకపోయినా ఆనాడూ ఉండేది కుటుంబనియంత్రణం. నేను ఆపరేషన్ చేయించుకుంటాననే అన్నాను. కాని-ఆవిడ వీలుకాదంది."

"నిజమే బాబూ, నేనే వద్దన్నాను. కన్నమ్మకి కన్నకొద్దీ వాపు అంటారు. నిజమే. నేను ఒక మగనలుసుకోసం కొట్టుకుపోయాను." కల్పించుకుంది విశ్వపతిగారి శ్రీమతి.

"ఆడ అయితే ఏమిటి? మగ అయితే ఏమిటి ?''

"నీ మాటా నిజమే. కాని...యింటికి నిండుతనం రావాలంటే ఆడపిల్లా, మగపిల్లవాడూ ఉండాలి ఎవరు లేక పోయినా లోటే."

కాదనలేకపోయాను.

కన్నీటితో అందామె. "ఆరుగురు ఆడపిల్లలనిచ్చిన భగవంతుడు ఒక్క మగపిల్లవాడి నివ్వలేకపోయాడు. అది మా దురదృష్టం."

ఆవిడ బాధని అర్థంచేసుకుందుకు ప్రయత్నిస్తూ ఉండిపోయాను.

''అందుకని ... కొడుకులాటి ఒక అబ్బాయిని తీసుకువచ్చి యింటికి పరిచయం చెయ్యమని తినేస్తూ వచ్చింది. నా కంటికి నువ్వు చాలా మంచివాడివని పించింది. ఇంటికి పిలిచాను," అన్నారు విశ్వపతి.

"ఏం బాబూ, నేను నిన్ను పెంపకం కోరడంలేదు. ఊరకే నిన్ను అబ్బాయీ అని పిలుచుకుంటాను. నన్ను అమ్మా అని పిలవగలవా ?"

అంతా విచిత్రంగా ఉంది

ఆరుగురమ్మాయిలు నిత్యమూ అమ్మా అని పిలుస్తూనే ఉంటారు. అయినా యీవిడకి తృప్తిలేదు. ఒక అబ్బాయికూడా అమ్మా అని పిలిస్తేతప్ప ఆమెకు నిండుగా తోచదు. ఎంత సున్నితమైన మనస్తత్వం !

"నువ్వు చాలా మంచివాడివని నీ ముఖమే చెబుతోంది. ఇన్నాళ్ళూ నే నెదురుచూసింది నీలాటి అబ్బాయి కోసమే !_ ఏం? నేను కోరరాని కోరిక కోరుతున్నానా ? అప్పుడప్పుడు మా యింటికి వస్తూ - నన్ను అమ్మా అని పిలుస్తే...చాలు..."

''తప్పకుండా ... " మెల్లగా అన్నాను.

ఆమె కన్నులు సంతృప్తితో వెలిగాయి.

"కృతజ్ఞతలు అన్నయ్యా ... " ఆమె రత్న.

"అ...న్న...య్యా-''

"అన్నయ్యా !-"

"అన్నయ్యా !-"

"అన్నాయ్ !-"

"అన్నా !-''

ఆరుగురు పిల్లలూ ఒక్కసారి నన్ను అన్నయ్యా అని పిలిచారు.

ఉక్కిరి బిక్కిరైపోయాను - వారి అభిమానంలో.

---

# అగ్ని పరీక్ష

## మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"అప్పుడె లెచారెం?"

"యెక్కడికెళ్ళావు?.. ఆ డాక్టరు దగ్గరకే కదూ!"

" "

"అక్కడేం పని?" తీక్షణంగా అడిగాడు.

"సుజాతకు ఫోనుచేశాను"

"నీ ఆటలు నాదగ్గర సా? చారిణీ. వెళ్ళు. వెళ్ళవే, నా ఉండొద్దు." మెడపట్టుకుని గెంటాడు. గుమ్మంలో కూర్చున్నాడు.

"అమ్మా! ఇంట్లోనివారు బయటి! బయటివారు ఇంట్లోకి రావద్దు. ఇది ఆజ్ఞ. భారత ప్రభుత్వపు ఆజ్ఞ..." నవ్వుతూ లుంగీ పంచె యెత్తి పట్టి, ప్రచార్లు మొదలుపెట్టాడు. సరళ బేలగా చూడసాగింది. రెండు, మూడు గంటల క్రితం యెంతో సానుభూతిగా మాట్లాడిన భర్త నిర్దాక్షిణ్యంగా నిందిస్తుంటే అసహాయంగా చూడటం తప్పితే ఏంచేయగలదు!

తొందరగా డాక్టరుకు చూపించండమ్మా." డాక్టరుగారి పనిమనిషి సలహా ఇచ్చింది.

"డాక్టరుకన్నా, భూతవైద్యుడే నయము. గాలి, ధూళి సోకితే ఇంతే." డ్రైవరు సలహాఇచ్చాడు, కారు తుడుస్తూ.

"అంతే అయిఉంటుంది అబ్బాయి. ఈ మతిభ్రమణం మా ఇంటా వంటా లేదు." సుందరమ్మ మాట కలిపింది.

"యెవరికే మతిభ్రమణం."

"నీ...కాదురా... యెవరికోనట..." ఆమె వణికిపోతూ వేపచెట్టు మొదట్లో కూర్చుంది సరళ అలాగే నిల్చుంది. అరగంట తరువాత సుజాత వచ్చింది, భర్తతో. ఆడబడుచును చూడగానే బావురుమంది సరళ.

"ఊరుకో.ఊరుకో వదినా.."అన్నది కన్నీరు ఆపుకుంటూ.

విష్ణూ! యెలా వచ్చావు! కర్ఫ్యూ లేదూ, వాళ్లకు తెలియదేమిటి, తహసీల్ దారి?

విష్ణు, పరీక్షగా, తీక్షణంగాచూచాడు. మాసినజుత్తు, పెరిగిన గడ్డం, లోతుకు పోయినదవడలు, చిరుగులుపట్టిన బట్టలు, ఎలుగు గొడ్డులా ఉంది ఆకారం.

"సుజా! ...వచ్చావా. నీకంటే

ఉంచింది. అయితే యేం- ఎంత అంద మైన ముఖం! నవ్వితే చాలు బుగ్గలు సొట్టలుపడతాయి — కాని నవ్వదుగా; యేమయినాసరే ఈ ఉత్తరం మాధురికి చదివి వినిపించాల్సిందే! అప్పటికీ నవ్వక పోతుందా!

ఎంతో ఆసక్తితో ఆ రసవత్తరమైన ఘట్టాలన్నీ రాసుకోవటం మొదలెట్టాడు.

రాసుకోవటం పూర్తిఅయినాక చంద్ర బాబు ఉత్తరమంతా మళ్ళీ మొదట్నుంచీ చివరివరకు యింకోసారి చదివి, దాన్ని కవరులో పెట్టి అంటించేశాడు. ఫొటో మాత్రం పైన వుంచేశాడు.

ఇహ అయిదో ఉత్తరం!

విలాసం ఇంగ్లీషులో టైపుచేసివుంది. నీలం కవరు.

ఇలాంటి ఉత్తరాల్లో తలవని తలం పుగా చాలాసార్లు చాలా రసవంతమైన వాక్యాలు లభించాయి. చాలామంది భక్తులు తమ అడ్రన్ టైప్ చేయించిన కవర్లు భార్యలకిచ్చి వస్తూవుంటారు. టైపిస్టు గరల్స్ కూడా తమ ప్రియులకు అప్పు డప్పుడు అద్భుతమైన ఉత్తరాలు రాస్తూ వుంటారు.

చంద్రబాబు మళ్ళీ యింకాస్త జరదా బుగ్గను బిగించాడు.

పెద్ద మెరుపు మెరిసింది! కిటికీ తలుపు మూశాడు. నాలుగో ఉత్తరం మత్తు ఇంకా అతన్ని పూర్తిగా వదల్లేదు. ఎంత ప్రత్యక్షమైన వర్ణన! అది చదివి వినిపిస్తే మాధురి యీసారి తప్ప కుండా...

అయిదో ఉత్తరం తెరిచాడు.

"అనంగ్!

నువ్వు వస్తావని తెలిసి సంతోషంతో ఉప్పొంగిపోతున్నాను. ఎప్పుడెప్పుడు వస్తావా అని ఆశతో ఎదురుచూస్తున్నాను. ఇంక నేను ఇక్కడ ఉండలేను. నువ్వు ...న్న తీసికెళుదూ — నీ కాళ్ళమీద పడ ... నీ ఇష్టంవచ్చిన చోటుకు తీసు కెళ్లు. నువ్వు ఎక్కడ ఎలా ఉంటే నేనూ నీతోపాటు అలాగే వుంటాను. నన్ను ఈ నరకంలోంచి మాత్రం తప్పించు. నువ్వు ఆలస్యం చెయ్యవద్దు. ముసిలాడు నిన్ననే డ్యూటీలోకి వెళ్లాడు. మూడు రోజులు దాకా రాడు. రేపు సాయంత్రంకాని, ఎల్లుండి ఉదయంకాని నువ్వు తప్పక రాగలవని ఆశపడు ...టాను,

అనేక వేల ముద్దులతో—

నీ, ప్రియమైన—మాధు!

ప్రచండమైన ధ్వనితో బైట ఎక్కడో పిడుగుపడి...



# న్యాయం ధర్మం

ధనికొండ హనుమంతరావు



ఉద్యోగం లేకపోయినా పెద్దలు సంపాయించి ఇచ్చిన ఆస్తిపాస్తులతో చీకూ చింతా లేకుండా కాలక్షేపం చేయగలుగుతున్నా. ఐతే వేరే పనేమీలేదని, ఇతరుల పనుల్లోకి తలదూర్చటం నాకు మొదటి నుంచీ తలనొప్పిగానే వుండేది. ఎందువల్లనో కాని ఆ 'ఇతరులు' కూడా నన్ను బాధించేవారు కాదు. బహుశా వారి రాజకీయాలకు నేను పనికిరాని వాణ్ణనే నిశ్చయానికి వారు వొచ్చి ఉండాలి.

ఒకనాడు హఠాత్తుగా వెంకయ్య నా కోసం ఎంతో ఆత్రుతతో వొచ్చాడు. పరిచయమున్నా, స్నేహంలేని వ్యక్తి వొచ్చాడంటే పెద్ద పనిపెట్టుకొనే వొచ్చి వుంటాడనేది స్పష్టంగా తెలుస్తూనేవుంది. మర్యాదచేసి కూర్చోమన్నాను. కాని ఎంతో వినయ విధేయతలతో నమస్కరించి నిలబడేవున్నాడు. నాకు తెలియని గొప్పతనాన్ని దేన్నో వెంకయ్య నాకు స్పష్టీకరిస్తున్నాడనే గర్వంతో కూడిన ఆనందం నాలో తొణికిసలాడింది. అతన్ని బలవంతాన కూర్చోబెట్టి నా ఆనందాన్ని తగ్గించుకోవటం ఉచితంగా తోచలేదు.

"ఏమిటి విశేషం?" అన్నాను.

"మీరు న్యాయం ధర్మం చెపుతారని వొచ్చాను," అన్నాడు వెంకయ్య.

ఏ పైకమో అప్పు అడుగుతాడేమోనని భయపడుతూన్న నాకు, పరమానందమైంది. వూళ్ళో పేరువున్న వ్యవహారవేత్త, ఎన్నో తీర్పులు చెప్పగలిగిన సమర్థుడు–వెంకయ్య నాదగ్గిర న్యాయం,

ధర్మం దొరుకుతుందని రావటమంటే, ఇన్నాళ్ళుగా నేను గుర్తించలేని ఒక అజ్ఞాతశక్తిని మేల్కొల్పినట్లయింది.

దూరం ఆలోచిస్తే నాకు తెలివి తేటలకు తక్కువేముంది? నా స్నేహితుల్లో చాలామంది పూర్వీకుల ఆస్తిని తగలేశారు. నేనుమాత్రం ఆస్తిని పెంచలేక పోయినా ఉన్నదాన్ని జాగ్రత్తగా పట్టు కొస్తూనే వున్నాను. అదీగాక నేను తెలివి లేనివాణ్ణనేమాట ఎవ్వరూ ఎప్పుడూ అనుకోలేదు; నేనే నమ్మలేనుకూడాను. న్యాయం ధర్మం చెప్పగలశక్తి నాలో అణిగిమణిగి వుంది; దాన్ని నే నింత వరకూ గుర్తించలేదు. ఏ అనామకుడో యీమాట అంటే నేను లెక్కచేసి వుండే వాణ్ణికాదు. సర్వ సమర్థుడు వెంకయ్యే ఆమాట అంటే నాలోని శక్తిసామర్థ్యాలు చాలా గొప్పవై ఉండాలి. నేను పెద్ద మనిషిని. కనుకనే వెంకయ్యలాటివాడు నా సహాయాన్ని అర్థించాడు. నాకు వొళ్ళు పరవశమై 'అసలు సంగతేమిటి?' అన్నాను.

''మన శంకరయ్య లేడండీ – వాడి విషయం...''

''అదే ఏమిటంట?'' అన్నాను ఉద్రేకాన్ని తగ్గించుకొని; ఎందుకంటే ఏ పొలం తగాదాయో ఐతే కొట్లాటలు వరకూ వెళ్ళటంకద్దు; మధ్యలో తల దూర్చి తరువాత కట్లు కట్టించుకోవటం నాకు ఇష్టంలేదు!

''ఏంలేదండీ–మూడేళ్ళక్రితం శంకరయ్యదగ్గర నాలుగొందలు అప్పు తీసు కున్నాను. ఈ నాటికి అది వడ్డీతో ఐదు వొందల పైచిలు కయింది. ఇప్పుడు ఆ డబ్బంతా కక్కమంటాడు. నాకు మరో రెండునెలలన్నా వ్యవధి యిప్పిస్తే కాని నేను తీర్చలేను...తమబోటి పెద్దలు చెపితేకాని అతను వొప్పుకునేట్టులేదు. నన్ను యీ ఆపదనుంచి కాపాడండి.''

వెంకయ్య చెప్పింది చాలా సబబుగానే తోచింది. ఉన్న పళాన కక్కమంటే యెవడితరమౌతుంది? కొద్ది వ్యవధి ఇస్తే –శంకరయ్యచేత నేను—నాలాటి పెద్ద మనిషి—యిప్పించగలుగుతే వెంకయ్య ఒక వొడ్డున పడతాడు. ఇందులో మాట సహాయంచేస్తే స రి పో తు ం ది. అది న్యాయంకూడాను. ఐతే శంకరయ్యతో కొంత ఘర్షణపడి వ్యవహారం ముదిరాకనే వెంకయ్య నా దగ్గిరికి వొచ్చివుంటాడు. ఈ చెడిన వ్యవహారాన్ని ఒక మార్గాన పెట్టటం కష్టమే! కాని నాలో నాకు లేని నమ్మకాన్ని వెంకయ్య ప్రవేశపెట్టాడు. ఆ నమ్మకంతోనే నేను యీ సమస్యను విడదియ్యగల శక్తిని పొందానేమో?

కాని వెంకయ్య నా తీర్పును శిరసా వహించేందుకు సిద్ధమేఐనా మరి శంకరయ్య సంగతేమిటి? వెంకయ్య నాలో చూడగలిగిన సద్గుణపరంపరను శంకరయ్య గుర్తించాలికదా! అలా కాని పక్షంలో వెంకయ్య నాకు అంటగట్టిన

పెద్దమనిషితనం, న్యాయధర్మ పరిశీలన వగైరాలకు పెద్ద దెబ్బ తగులుతుంది: అంటే శంకరయ్యను ఏదోవిధంగా మన దారికి లాక్కొని కేవలం నా గొప్ప తనాన్ని ఒప్పుకునేందుకు ప్రయత్నం చేయాలి వెంకయ్యకు సహాయం చేయ టం మాట అటుంచి, నా న్యాయబుద్ధిని విస్తరించటానికే నేను విశ్వప్రయత్నం చేయవలసివుంది. అది తప్పనిసరిగానే తోచింది.

"మరి శంకరయ్య మన మాట వింటాడా?"అన్నాను, సందేహానికివొచ్చే సమాధానంలోనే ముందు కార్యక్రమాన్ని నిర్ణయించుకునేందుకు వీలుగా.

"వింటాడా—అని మెల్లిగా అంటు న్నారా? మీఅంత పెద్దమనిషి చెప్తే కాదనేందుకు శంకరయ్యకు గుండేనా?"

బాగానేవుంది. గొప్పతనమనేది గుర్తించబడకుండా ఎలావుంటుంది కనుక? ఐతే యీ శంకరయ్యకోసం నేనే వెళ్ళటం హాస్యాస్పదం; అది కేవలం వెంకయ్యను వెనకేసుకొని వెళ్ళ టమే అవుతుంది. న్యాయం, ధర్మం చెప్ప వలసినవాడు ఆ విధంగా ప్రవర్తించడు కదా! అదీగాక శంకరయ్య నేను చెప్పిన తీర్పును ఒప్పుకుతీరుతాడని వెంకయ్య అంటున్నాడేకాని, తీరా అక్కడికి వెళ్ళాక యెదురుతిరుగుతే ఆ అవమానా నికి నేను యెంతగానో బాధపడాల్సి వుంటుంది. కనుక శంకరయ్యే నాదగ్గరికి రావటం అన్నివిధాలా అందరికీ మంచిది. నా మాట ఒప్పుకునేందుకు సిద్ధపడితేనే తప్ప శంకరయ్య నాదగ్గరికిరాడు; శంక రయ్య నా దగ్గరికి వొచ్చేట్లుచేయటం వెంకయ్యవిధి; ఇది నాపెద్దమనిషితనాన్ని నిరూపించేందుకుకాదు—వెంకయ్యకు స్వలాభం యేడిసింది కనుక:

"శంకరయ్యను ఇక్కడికి పట్టుకొని రాగలవా మరి?" అని అడిగాను.

"తమ సెలవైతే క్షణంలో రాడూ?"

"సరే ఐతే—"

వెంకయ్య విప్పారిన మొహంతో వెళ్ళిపోయాడు. నేను ఆలోచనతో పడ్డాను.గొప్పవాడి గొప్పతనాన్ని ముందు గుర్తించేది ఇతరులు. ఎవడికైనాసరే తన మొహంతప్ప ఇతరుల మొహాలన్నీ కని పించినట్లే— తన శక్తి సామర్థ్యాలుతప్ప ఇతరుల శక్తి సామర్థ్యాలే ముందుగా కనిపిస్తవి. నేటికి నా నిజమైన విలువ బైటపడే వాతావరణం ఏర్పడబోతున్నం దుకు ఎంతో గర్వం కలిగింది.

శంకరయ్యతో ఏవిధంగా మాట్లా డాలో ఆలోచించుకోకముందే శంకరయ్య వొచ్చాడు; వొస్తూనే నమస్కరించాడు. అరె! నా మాట అంటే వీళ్ళకు ఎంత గౌరవం—నేనంటే ఎంత అభిమానం! ఒళ్ళు తెలియనంతపనై తమాయించు కున్నాను

"ఏం శంకరయ్యా-బాగున్నావా?"

అన్నాను, ముందు కాస్త దువ్వి మచ్చిక చేద్దామని.

"తమ దయవల్ల బాగానేవున్నా నండీ" అన్నాడు శంకరయ్య. "ఎందుకో పిలిపించారట—" అన్నాడు వెంటనే— నేను చెప్పబోయ్యేది శిరసావహించేందుకు సిద్ధంగా ఉన్నవాడల్లే.

"ఏం లేదు—మన వెంకయ్య విషయం—" అని నీళ్ళు నమిలాను.

"ఏం చెయ్యమంటారు? ఎన్ని వాయిదాలు ఇచ్చినా బాకీ చెల్లించటం లేదు. డబ్బుకు కిటకిటగా వుంది. అతని అవసరాన్ని నేను తీర్చాను; మరి నా అవసరానికి లేకుండా పోతే ఎట్లా చెప్పండి—మీరే న్యాయం ధర్మం చెప్పండి" అన్నాడు శంకరయ్య వినయంగా.

నేను చెప్పబొయ్యే న్యాయం, ధర్మం కోసం వాదిప్రతివాదులు నిలబడిఉండటం చూసేప్పటికి, నా గొప్పతనం అర్థమై తల దిమ్మెక్కింది. ఎలాగైనాసరే శంక రయ్యకు నచ్చచెపితేనేకాని నా ధర్మబుద్ధి నిరూపణ అవదు.

"అదిసరే, శంకరయ్యా—ఎలాగూ మూడేళ్ళు ఆగావు. మరో రెండునెలలు ఆగు—"

"ఇంకానా?" అన్నాడు శంకరయ్య నిట్టూరుస్తూ.

"రెండు నెలలకు పంటవొస్తుంది. తీర్చుకుంటాను" అన్నాడు వెంకయ్య.

"ఔను—ఉన్నపళాన ఎలా కుమ్మ రిస్తాడు చెప్పు. పంటరాగానే తీరుస్తాడు. వెంకయ్య పెద్దమనిషి." అన్నాను. వెంకయ్య పెద్దమనిషితనం నాకు అంత బాగా తెలియకపోయినా ఆ వినయ విధేయతలూ, నాబోటి పెద్దలపట్ల అతను చూపే గౌరవమర్యాదలూ చూస్తే అర్థ మౌతూనేవుంది!

"డబ్బుకు చాలా కిటకిటగా వుంది. వెంకయ్య అవసరాన్ని నేను తీర్చాను. నా అవసరానికి కాకుండాపోయింది—" అని శంకరయ్య చప్పరించాడు.

నా మాటను తోసేస్తాడేమో ననే భయం నన్ను ఆవరించింది. అందుకని అన్నాను: "వెంకయ్య చాలా పెద్దమనిషి. కలిసిరాకపోవటంవల్ల నీ బాకీ తీర్చలేక పొయ్యాడు. నీడబ్బుకేమీభయంలేదులే."

"రేపు పంటలోమాత్రం యిస్తాడని యేమిటి?" అని శంకరయ్య సవాల్ చేశాడు.

కాస్త సందుపెట్టినందుకు నాకు పర మానందమైంది. ఆలస్యం చేయకుండా అవకాశాన్ని వినియోగించాను.

"నాబోటి పెద్దమనిషిదగ్గిర మాట అన్నాక తప్పుతాడా వెంకయ్య?" అన్నాను. వెంకయ్య పెద్దమనిషితనానికి సపోర్టుగా నా పెద్దమనిషితనాన్ని నిల బెట్టాను—మరి అంతకన్న మార్గంలేదు.

ఈలోగా సాంబయ్య ఎప్పుడొచ్చాడో కాని అతని గొంతు వినేదాకా నేను గుర్తించనేలేదు.



పో లి క లు

"ఆయన అంతగా చెపుతూంటే 'సరే' ననవేం, శంకరయ్యా?" అన్నాడు సాంబయ్య. నా పెద్దమనిషి తనాన్ని పరాయివాడైన సాంబయ్య కూడా గ్రహించినందుకు నాకు పరమానందమైంది.

"సరే తమబోటి పెద్దలమాట కాదనేందుకు నే నెంతవాణ్ణి? పైకం రెండు నెలల్లో యిప్పించాల్సిన భాధ్యత తమది."

"ఓ! అలాగే" అన్నాను. ఇంత తేలిగ్గా పరిష్కారమౌతుందని నేను ఎన్నడూ అనుకోలేదు. వ్యవహారవేత్త అవటం యెంతసులభమో అర్థమైంది. నేనుకూడా, వూళ్ళో వ్యవహారాలకు మధ్యవర్తిత్వాన్ని వహించేందుకు అర్హత వున్నవాణ్ణే! ఐతే నేడే ఆ అర్హతను శంకరయ్యా, వెంకయ్యా కలిసి నిరూపించారు.

"ఏం వెంకయ్యా?" అన్నాను.

"రక్షించారు, స్వామీ?" అన్నాడు వెంకయ్య తృప్తిగా.

"మరి సెలవా?" అని శంకరయ్య నమస్కరించి వెళ్ళిపొయ్యాడు.

వెంకయ్య యెప్పుడు జారుకున్నాడో తెలియదు. మొత్తంమీదలోకకల్యాణార్థం ఒక గొప్పపనిని చేసిన తృప్తితో మనసు నిండిపోయింది నా ఆధిక్యతను తెలుసుకో గలిగిన జ్ఞానకాంతి నాకు దక్కింది. అలాగే ఆలోచిస్తూ పడకకుర్చీలో కళ్ళు మూశాను.

* * *

క్రమంగా యీ తీర్పునుగూర్చి మరిచిపొయ్యాను. మరెవ్వరూ నాతీర్పుల కోసం రాకపోవటమే దీనికి కారణమై వుండొచ్చు.

ఒకనాడు ఉదయానే శంకరయ్య





పోలికలు

ప్రత్యక్షమయ్యాడు. మరో తీర్పుకోసం వొచ్చాడేమో ననుకున్నాను.

"చూడండి—వెంకయ్య వ్యవహారం!" అన్నాడు. మొహం చిటచిటలాడుతోంది. ఏదో రసాభాస అయి వుంటుందని అర్థమౌతూనేవుంది. నేను చెప్పిన తీర్పుకు రెండునెలల వయసు దాటిందనికూడా ఇప్పుడే తెలుసుకున్నాను.

"ఏమైందీ—" అన్నాను.

"పంటరానూవచ్చింది—అమ్మకొని తిననూ తిన్నాడు—"

నాకు వొళ్ళుమండింది. వెంకయ్య ఇంత నీచంగా ప్రవర్తిస్తాడనుకోలేదు. ఏదో మంచివాడని, పెద్దమనిషని నేను అతని పక్షాన పోరాడి వ్యవధి ఇప్పిస్తే యీవిధంగా దుర్వినియోగపరుస్తాడనుకోలేదు శంకరయ్య నిజంగా పెద్దమనిషి కనుకనే నేను చెప్పిన తీర్పుకు బద్ధుడై వున్నాడు. నా తీర్పును తృణీకరించి, నన్ను అవమానించిందల్లా-వెంకయ్య!

"కనుక్కుంటాను.ఆగు," అన్నాను.

"కనుక్కోవటంకాదు..తేల్చెయ్యండి."

"సరే" అన్నాను తప్పక.

వెంకయ్యకోసం కబురు చేశాను, రాలేదు. ఎన్ని కబుర్లుచేసినా టలాయిస్తున్నాడు. అతను రాకపోవటమే అతని కల్మషాత్మకు నిదర్శనం శంకరయ్య పోరు జాస్తయింది. మరో మార్గం లేక నేనే వెంకయ్య ఇంటికి బయలుదేరాను.

అష్టకష్టాలూ పడి వెంకయ్యను వెదికి పట్టుకున్నాను.

"ఏం ఇలాచేశావ్?" అన్నాను, కోపంతో.

"ఏం చెయ్యమంటారు—పంటలో అనుకున్నంత రాలేదు. ఇంటి ఖర్చులు అనుకోకుండా పెరిగిపోయినవి. పై పంటలో తప్పక తీరుస్తాను " అన్నాడు.

ఇదేమిటి-ఇలా చేస్తాడని నే నెన్నడూ అనుకోలేదు. యీ సంగతి శంకరయ్యకు చెప్పి వొప్పించటం సాధ్యమా? యీ రెండునెలల గడువుకే నా చాకచక్యా న్నంతట్నీ ఉపయోగించాను. ఇప్పుడు మళ్ళీ గడువిప్పించటం నాకు తలకు మించినపని. పోనీ ఆ ప్రయత్నం తరువాత చేయవచ్చు. ముందు యీ వెంకయ్య ప్రవర్తనగూర్చి విచారణ జరగాల్సిందే!

''ఇదేం బాగా లేదు, వెంకయ్యా-'' అన్నాను కాస్త మెత్తగానే; కారం రాచుకున్నట్లు ప్రవర్తిస్తే అసలుకే మోసం వొస్తుందనే భయంతో ముళ్ళమీద ఆరేసిన బట్టను తీసేప్పుడు ఉపయోగించే జాగ్రత్తను మరిచిపోలేదు.

"శంకరయ్యను ఒప్పించగలమా?"

"తమబోటి పెద్దలుచెపితే తప్పక ఒప్పుకుంటాడు..." అని నసిగాడు.

ఏమని చెప్పి ఒప్పించేది? నన్ను పెద్దమనిషిగా, మధ్యవర్తిగావుంచి యీ స్థితికి దింపారు. ఇంకా గడువు ఇప్పిస్తే మిగిలివున్న యీ కాస్త పెద్దమనిషితనం కూడా హరించుకొని పోతుంది.

వెంకయ్యమీద విసుక్కున్నాను. కోప్పడ్డాను. రెండుమూడు దూషణ వాక్యాలుకూడా ఉపయోగించాను. కాని వెంకయ్యలో చలనంలేదు; వొంచిన తల ఎత్తలేదు. నోరు నొప్పిపెట్టి ఇంటిదారి పట్టాను.

శంకరయ్య నాకోసమే కాచుకొని కూర్చున్నాడు. అసలే విసుగ్గావున్న సమయంలో యీ భ్రాష్టుడు ఎదురవటం వొంటిమీద గొంగళిపురుగులు పాకట మల్లేనేవుంది. ఐనా తమాయించు కున్నాను,

''ఏమైంది?'' అన్నాడు శంకరయ్య.

"పైపంటకు ఇస్తానంటాడు!" అన్నాను.

"ఏమండీ—మీరు చెప్పబట్టి వూరుకున్నాను. ఏంచేశాడో చూశారుగా! పెద్ద మనిషన్నారే."

"మరి ఏంచేద్దామంటావు?" అన్నాను రాజీగా.

"నా పైకం ఇప్పించండి-"

"ఎలాగంట?"

"ఎలాగో నాకేంతెలుసు? మీ అవస్థలు మీరు పడి నా బాకీ ఇప్పించివేయండి. తమ బాధ్యతమీదనే నేను వూరుకున్నాను కదా?"

"పైపంటదాకా ఆగటంతప్ప మరో మార్గం ఏముంది?''

"మార్గం మీరే ఆలోచించండి. రెండు రోజుల్లోగా నాకు పైకంకావాలి-"

నాకు భ్రమతది.

''ఐతే నన్ను యిచ్చుకోమంటావా యేం?" అన్నాను. నే నిస్తే కాదనడని తెలియక కాదు. అతని వుద్దేశ్యం అదే నేమోనని!

"నాకు అనవసరం. ఎవరైనా కాని వ్వండి. ఇవ్వాల్సిందే! నాకు పైకం

ముట్టచెప్పవలసిన బాధ్యత తమమీద వుంది—"

"నామీదా? యేదో తగాదాపడితే సర్దేందుకు చూశాను కాని, నాకు బాధ్య తేమిటి?'' అన్నాను.

''బాధ్యత మీరు తీసుకున్నారు. కనుకనే ఆనాడు నేను వూరుకున్నాను. లేకుంటే నా అవస్థ నేను పడేవాణ్ణి-''

"అందుకని నన్ను యిచ్చుకో మంటావా?"

"నేను అనను, కాని నాకు పైకం ముట్టచెప్పండి. పెద్దమనుషులకు ఒకే నాలుక కదా?—''

నా పెద్దమనిషితనాన్ని శంకించటం వరకూ వ్యవహారం ముదిరింది.

"శంకరయ్యా! వెంకయ్య పైకం ఇచ్చేట్లుగా ప్రయత్నంచేస్తాను కాని అది కాకపోతే నీ అవస్థ నువ్వేపడి మీరిద్దరూ కట్టకట్టుకొని గంగలో దూకండి, అంతే కాని నేనేంచేసేది?" అన్నాను.

"ఈనాడు మీరు చేతులు కడుక్కుంటే సరిపోతుందనుకున్నారా? ఆనాడు మీరు మాట అడ్డంవేయకుంటే నేను యేం చేసుకునేవాణ్ణో మీకు అనవసరం. మీ బాధ్యతను ఇంత తేలిగ్గా మరిచిపోతా రనుకోలేదు-"

నాకు కారం రాచినట్లయింది.

"ఏమిటి నీ వుద్దేశ్యం?" అన్నాను నిలవదీసి.

''ఏ పెద్దమనిషికన్నా చెప్పండి-యే మంటాడో!" అన్నాడు శంకరయ్య.

నేనే ఒక పెద్దమనిషినై వుండి, ఇంకో పెద్దమనిషికోసం వెళ్ళటంకన్న తల వొంపులు వుండబోదు. ఐతే లోగడ పెద్దమనిషితనాన్ని డబ్బు ఖర్చులేకుండా సంపాయించాను. ఇప్పుడు ఆ పెద్దమనిషి తనాన్ని నిలబెట్టుకునేందుకు వెంకయ్య బాకీని నేనే చెల్లించవలసిన పరిస్థితి యేర్పడింది.ఎప్పుడైతే 'డబ్బు' ఇందులో ఇరికిందో కాస్త దూరంగా వుండటమే శ్రేయస్కరంగా తోచి "అది నావల్ల కాదు-" అన్నాను.

''ఆ రోజున సాంబయ్యగారుకూడా వున్నారు. ఆయన్ని చెప్పమనండి,'' అన్నాడు శంకరయ్య.

"ఆ య న చె ప్ప ట మే మి టి ?" అన్నాను కోపంతో వొణికిపోతూ.

"ఆనాడు ఆయనకూడా వున్నారుగా? మీరేదో వొరగబెడతామని చేసిన వాగ్దా నాన్ని ఆయన మరిచిపోయి వుండరు-"

"నాకు యెవరి అభిప్రాయాలతోనూ పనిలేదు," అని, జవాబుకు యెదురు చూడకుండానే లోనికి వెళ్ళిపోయాను.

అరగంటగడిచేప్పటికి,సాంబయ్యతో సహా శంకరయ్య యింటిముందుదిగాడు. ఇందాకటి మంట తగ్గకముందే మళ్ళీ రభస ప్రారంభం.

"ఏ మ ం డీ , సాంబయ్యగారూ?" అన్నాను.

"ఏంలేదు ..ఆనాడు జరిగినదానికి సాక్ష్యంగా శంకరయ్య నన్ను తీసు కొచ్చాడు."

''చూడండి-ఆ డబ్బు నన్ను ఇచ్చుకో మంటాడు; యిదేం న్యాయం స్వామీ?" అన్నాను.

"మీ రివ్వటం కాదుకానండి, ఇప్పిం చాల్సిన బాధ్యత మాత్రం తమదే!"

నాకు చచ్చినంత పనైంది. రెండు ఆబోతులమధ్య యిరుక్కున్న లేగదూడ స్థితిలో పడ్డాను.

"అలాగైతే పైపంట దాకా ఆగ మనండి," అన్నాను, ఓడిపోయే కేసును ఏదోవిధంగా సరిచేసేందుకుగాను ప్రయ త్నించే లాయర్ లాగు.

"ఎట్లా? మీరు రెండు నెలలు వాయిదా ఇప్పించారు అంతవరకూ ఆగనే ఆగాడు," అన్నాడు సాంబయ్య.

అటుతిరిగీ ఇటుతిరిగీ ఇది నా మెడకే చుట్టుకుంది. తీర్పు చెప్పిన న్యాయాధి కారికి ఆ తీర్పును అమలు జరిపేందుకు పోలీసుల సహాయం ఉంటుంది. నాకు అలాటి అవకాశాలేమీ లేవు.

"నన్ను ఏం చేయమంటారు?" అన్నాను సగం చచ్చి.

"అతనిచేత ఇప్పించండి, లేదా ఆ పైకం మీరే ఇచ్చుకొని వెంకయ్య దగ్గర వసూలు చేసుకోండి,'' అన్నాడు శంక రయ్య.

నిస్సహాయంగా సాంబయ్య మొహం వొంకచూశాను. సాంబయ్య "అంతే" అన్నట్లు తల ఆడించాడు.

వెంకయ్య దగ్గిర వసూలుచేసి ఇవ్వటం నాకు మించినపని! శంకరయ్య లాటి వాడికే సాధ్యపడలేదు. పోతే నేను ఇచ్చుకోడం ఒక్కటే మిగిలింది. సాంబయ్యలాటి వాడుకూడా శంకరయ్య వైపే మొగ్గుతున్నాడు. వూళ్లో ఇంకెవరి దగ్గిరకి వెళ్ళినా ఇంతకు మించిన న్యాయం దొరుకుతుందనే నమ్మకం నాకు కలగటంలేదు. పైపెచ్చు నేను చేసిన వెధవపనినికూడా విమర్శిస్తారు. నా పెద్దమనిషితనాన్ని నిలబెట్టు కునేందుకుగాను రభసకాకుండా చూసు కోవటం అవసరమైంది.

"సరే, చూస్తాను," అన్నాను.

"చూడటంకాదు; రెండురోజుల్లో నా పైకం ఇప్పించాలి-" అని ఇద్దరూ వెళ్ళి పోయారు.

'ఇప్పించాలి' అంటే 'ఇవ్వు' అన టమే! రెండురోజుల్లోనూ వెంకయ్య వెంటపడ్డాను కాని ప్రయోజనం లేక పోయింది. చూస్తుండగానే గోళ్లూడగొట్టి నట్లు, శంకరయ్య ఐదువందలూ వసూలుచేసుకొని వెళ్ళాడు.

వారం గడవకముందే వెంకయ్యా శంకరయ్యా ఎంతో స్నేహంగా జల్సాగా పట్టణానికి బయలుదేరారని తెలిసింది. అది మొదలు ఇంత ఖరీ దైన యీ పెద్దమనిషితనాన్ని-న్యాయం, ధర్మం తెలిసిన నేను మరెన్నడూ దాన్ని వినియోగించకూడదని నిశ్చయించు కున్నాను.




మధూకర్ మనసు నీటిపై తేలుతున్న కాగితపు పడవలా ఎంతో తేలిగ్గా, హాయిగా ఉంది.

అప్పుడే సర్వర్ తెచ్చిపెట్టిన వేడి టీని కొద్దిగా చప్పరించాడు.

అతని తలలో,... నిన్నటి...,

ఇంటర్ యూనివర్సిటీస్ ఫుట్‌బాల్ పోటీల్లో... తను కాప్టన్‌గా ఉండి... మెరుపులా ఉరుకుతూ ఆడుతూంటే—

ఆ చప్పట్లు... ఆ ఈలలు... ప్రేక్షకులనుండి ఉరకలేస్తూ పొంగే ఆ ఉత్సాహం - ఓహ్...,

తను గెలిస్తే—

ఎందరు తనను వాళ్ళ భుజాలపై కెక్కించుకున్నారని... ఎవరెవరో వచ్చి తనను అభినందించారు. ఎందరో కరచాలనం చేశారు. ఎందరో ఎన్నెన్నో రకాలుగా—

అసలు తన జట్టు గెలవడానికి తనే కారణమన్నారు.

ఎన్ని పొగడ్తలు... ఎన్ని ప్రశంసలు... ఎన్ని శుభాకాంక్షలు... ఓహ్ ఆ క్షణం... ఎంత మధురంగా ఉంది.

పేపర్లవాళ్ళు ప్రత్యేకంగా అడిగి తన ఫోటో తీసుకున్నారు... రేపటి పత్రికలో...చివరి పేజీలో కెప్టెన్ మధూకర్ అని... తన ఫోటో—

ఇంకా లోతుగా ఆలోచించలేక పోయాడతను. అప్పటికే ఏడులక్షల రూపాయల లాట్రీ వచ్చినట్టుగా ఫీలై గబగబా వేడి టీ నంతా కొట్టేశాడు.

కప్పును టేబిల్ పై పెడుతూ ఎదురుగా చూస్తే_అతననెవరో అప్పుడే జైల్లోనుండి పారిపోయొచ్చిన మనిషిలా ఉండి తనవంకే తీక్షణంగా... శిలలా చూస్తున్నాడు.

ఎందుకలా చూస్తున్నాడు—

వ్చ్... ఎందుకో.

సిగరెట్టు వెలిగించుకుని టైం చూచుకున్నాడు.

రాత్రి పన్నెండూ నలభై.

గిరాకీ లేని హోటల్ నిశ్శబ్దంగా ఉన్న సానికొంపలా ఉంది. "కౌంటర్‌లోని మనిషి పుట్టిన నాటినుండీ నిద్రపోనట్టు చాలా గంభీరంగా కునికిపాట్లు పడుతున్నాడు.

యివ్వాల్టితో కాలేజీ ఐపోయి– యిహ రేపటినుండి సెలవులు... తను తనూరి కెళ్ళిపోయి... రేపటి పేపర్లోని తన ఫోటోని నాన్నకు చూపించి... అబ్బ ఆ క్షణాల్లో—

వ్చ్... యింకా మూడ్పావు గంటుంది బండికి.

మళ్ళీ తలెత్తాడు. వాచీ చూచి...ఎదురుగా ఆ మనిషి... యింకా అలాగే చూస్తూ తనటు చూడగానే చూపులు త్రిప్పుకుని చేతిలోని దినపత్రికను విప్పుకుని—

వీని మొహానికి ఓ పేపరు కూడానా చేతిలో.

కొత్తగానే ఉంది పేపరు... రేపటిది కాదుగదా... యిప్పటికే మార్కెట్‌లోకి వచ్చి ఉంటుందా...వాన్నడిగి చూస్తేనో తన ఫోటో—

వాడినా అడిగేది... వాని కుక్క మొగమూ వాడూ.

కావలిస్తే అసలు తను తన ఫోటోనూ చూచుకోకుండానైనా ఊరుకుంటాడు గాని వాడినిమాత్రం అడుగడు–దట్సాల్.

ఎందుకు.

ఎందుకో అలా అనిపిస్తోంది వాన్ని చూస్తూంటే– అంతే.

సిగరెట్టు అలా పూర్తవుతూండగా ఎదురుగా కూర్చున్నవాడు మధూకర్‌నూ అతని వెంబడున్న సూట్‌కేస్‌నూ పదే పదే తిరగేసిచూచి చరచరా వెళ్ళిపోయాడు బయటికి.

యింకో పావుగంటసేపు గడిపి మళ్ళీ ఓసారి గడియారం చూచుకుని బిల్లు చెల్లించి సూట్‌కేస్‌తో సహా బయటికొచ్చాడు మధూకర్.

బయట రోడ్డుమీద జనం లేనేలేదు. ఫుట్‌పాత్ ప్రక్కగా ఓ టాక్సీఆగిఉంది. దాని దగ్గరే ఓ ముగ్గురు నిలబడి తన వంకే చూస్తున్నారు...

అప్పటినుండీ తన ఎదురుగా కూర్చుని చూచిన మనిషీ ... యింకో యిద్దరు అలాంటి ఉక్కు మనుషులే—

ఎందుకు వాళ్ళలా చూస్తున్నట్టు తన దిక్కు—

"ఏయ్ మిస్టర్—యిట్రా"అన్నాడు అందులోనుండి ఒకడు.

ఎవరిని – తననేనా.

చుట్టూ చూశాడు. ఎవరూ లేరు దాపులో... అంటే తననే.

మెల్లగా నడిచాడు కారు దగ్గరికి.

యింతా తీక్షణంగా చూస్తున్నారు దగ్గరికొచ్చిన దయ్యాన్నో, దేవుణ్నో చూస్తున్నట్లు.

"ఈ కారెక్కు..."

"ఎందుకు..."

"ఎక్కంటున్నాను—" జేబులో నుండి కత్తి తీశాడు.

"నీకేం వరవాలేదు, నిన్నేంచేయం. కూచో—" డోర్ తెరిచాడు.

భూమి పుండులోకి దిగిపోతున్నట్లని పిస్తోంది మధూకర్‌కు. చెమటలు పడుతున్నాయి. ఎక్కి కూర్చున్నాడు కారు బాణంలా దూసుకుపోయింది.

"ఎందుకు నన్ను..." ఏదో అనబోయాడు.

"షటప్..."

ఏమిటిది .. వీళ్ళెవరు... ఎందుకు తననిలా తీసుకుపోతున్నారు— తన దగ్గర డబ్బులేదు. తను ఆడదికాదు.

"ఆ ఊరిపేరేమిట్రా—" డ్రైవ్ చేస్తున్న వాడడిగాడు యింకొకడ్ని.

"కూనూరు ... నువ్వు పోనీ నాకు తెలుసా ఊరు... ఊఁ... లెఫ్ట్—"

జానపద సినిమాలు ఏకదాటిగా జ్ఞాపకమొస్తున్నాయి మధూకర్‌కు... అతనికంతా పిచ్చి పిచ్చిగా ఉంది.

ఓ అరగంట తర్వాత కారు ఓ చిన్న ఊరును చేరుకుంది.

రోడ్డువారగా బోర్డ్— 'కూనూరు' అని.

ఊళ్ళోకి వెళ్ళింతర్వాత జండా దగ్గర చుట్ట తాగుతూ కూర్చున్న ఎవడో కావలి మనిషి ముందర సర్రున కారాపి హడల గొట్టి— "యిక్కడ రావూరు ఎంకయ్యిల్లేది" అన్నాడు డ్రైవింగ్ సీట్లోని మనిషి.

రావూరు ఎంకయ్యెవడు— మధూకర్ మెదడు తిమ్మిరెక్కుతోంది.

"గదేంది దొర...గా పచ్చబంగళ"

కారు పక్షిలా పరుగెత్తి ఆగింది, బంగ్లా ముందర.

ఒకడుగబగబాదిగి బజర్ నొక్కాడు. రెండు నిముషాల తర్వాత ఎవరో వచ్చారు లోపల్నుండి.

"ఎంకయ్యగారున్నారా?"

"ఆఁ..."

"రమ్మను"

వచ్చిన మనిషి లోపలికెళ్ళిపోయాడు వెనక్కు తిరిగి.

తర్వాత ఎవరో మీసాల మనిషివస్తే "మీవాడ్ని తీసుకొచ్చామండీ వెంకయ్యగారూ - వెంటనే మీరు ప్రకటించినట్టుగా వెయ్యి రూపాయలిప్పించండి—"

"మావాడేనా... ఏడీ—"

"రండి... కార్లో కూర్చున్నాడు."

వెంకయ్య ఎవరూ... అతని వాడెవడూ... ప్రకటనేమిటీ... వెయ్యి రూపాయలేమిటీ — డ్రైవర్ సీట్లో ఉన్న పేపరును అందుకుని గబగబా విప్పాడు మధూకర్.

చివరి పేజీలో—

ఫుట్‌బాల్ ఛాంపియన్ అన్న హెడింగ్ క్రింద ఎవని ఫోటోనో పడి— దాని ప్రక్కనే "కనబడుటలేదు" ప్రకటనలో తన ఫోటో...

ఆ పరిస్థితిలోనూ మధూకర్‌కు ఆగనంత నవ్వొచ్చింది.

---




ఇచ్ఛాపురపు రామచంద్రం

ఆఫీసులో అడుగు పెట్టి వెంటనే నేను చేసిన మొదటిపని రోజ్ గదిలోకి నడవడం. రోజ్ రిసెప్షనిస్టూ, పి. బి. యక్స్. ఆపరేటరూను. అతిథులను ఆహ్వానించడమూ, ఫోన్‌కాల్స్ ఎవరివి వారికి అందించడమూ – యిలాగ జోడు గుర్రాల స్వారీ చేసే అమ్మాయి.

రోజ్ – పేరుకి తగిన అమ్మాయి. అచ్చంగా గులాబిరేకులా సున్నితంగానూ సుందరంగానూ ఉంటుంది. ఎప్పుడూ తాజాగా ఉన్నట్లే కనిపించగలిగే నైపుణ్యం ఉందామెకి. ఆఫీసు మీద కంప్లయింట్ చేయడానికి వచ్చిన ఉగ్ర నరసింహమూర్తి కూడా రోజ్ చిరునవ్వు పలకరింపులతో శాంతించి తీరుతాడు. రిసెప్షనిస్టుకి అన్నివిధాల అను

వయిన అమ్మాయి రోజ్. ప్రెట్టి రోజ్.

"ప్లీజ్ బి సీటెడ్..." నన్ను చూసి ఆహ్వానించింది.

"మిస్ రోజ్ ! నీతో కొంచెం పని ఉండి వచ్చాను."

"చెప్పండి రావ్ జీ." చనువుగా అందామె.

"ఇవాళ నాకొక కాల్ రావచ్చు. పర్సనల్... చాలా ముఖ్యమైనది..."

ఆమె దెబ్బతిన్నట్లు తలవంచుకుని– "నేను సిన్సియర్‌గానే పనిచేస్తాను సార్," అంది బాధపడినట్లు సూచిస్తున్న కంఠంతో.

"సారి రోజ్. నా ఉద్దేశం నిన్ను బాధించాలని కాదు. నువ్వు చాలా సిన్సియర్ అని నాకు తెలుసు కాని...ఇవాళ నేనెదురుచూస్తున్నది చాలా ముఖ్యమయిన వర్తమానం గురించి. అందుచేత– ఆత్రతకొద్దీ... అంతే. సమయానికక్కడ మెసంజర్ లేకపోతే..."

"నేనే వచ్చి మీకు చెబుతాను. ఏం?"

"థాంక్యూ. నీకు శ్రమా బాధా కలిగిస్తే..."

"లేదు రావ్‌జీ." ఎప్పటిలా చక్కగా చిరునవ్వు నవ్వింది.

నిజంగా తాను ఏమాత్రమూ నొచ్చుకోనట్లే ధన్యవాదాలు చెప్పింది

బయటకు వచ్చాను రోజ్ చిందించిన అందమయిన మందహాసం నాలో రేకెత్తించిన మైకంనుంచి పూర్తిగా తేరుకోకుండానే.

మేడ మెట్లెక్కి – రూము చేరుకున్నాను.

అప్పటికే టేబులుమీద కొన్ని కాగితాలు నా ఆమోదముద్రల కెదురు చూస్తున్నాయి. వాటిని ఎర్ర నాలుక (అర్జంట్ ఫ్లాప్) చుట్టుకుని ఉండలేదు కనుక వాటి సంగతి వాయిదా వేశాను. పని చెయ్యాలనిపించడంలేదు. మనస్సు మరోచోట లగ్నమై ఉంది. పోస్టుపోన్‌మెంట్ కూడా ఒకవిధమయిన స్ట్రాటజీయే; అరుదుగా అదీ పనిచేస్తుందన్న మానేజ్‌మెంట్ ఉవాచను గుర్తుతెచ్చుకుని సరిపెట్టుకున్నాను. పోనూ, ఎక్కువమంది సబార్డినేట్సు లేకపోయినా నా పదవికున్న బాధ్యత తక్కువ కాదు. అందుచేత–ఆర్డర్స్ వేసేముందు వొళ్ళు దగ్గర పెట్టుకుని మరీ చూడాలి. లేకపోతే పరిణామాలు భయంకరంగా తయారౌతాయి.

సిగరెట్ అంటించాను.

ఆ పొగలు చూస్తూ కొంతవరకూ కాలాన్ని జయించాను.

తరువాత – ఆ కాగితాలు చూడడం కంటె గత్యంతరం లేకపోయింది. కొంచెంకదిపేసరికి కొండచిలవల్లా చుట్టుకుని నన్నాక్రమించుకోసాగాయవి. నన్ను నేను మరచిపోయాను. ఆ కాగి

తాల బిగికౌగిలిలో ఎంత సేపుండి పోయానో తెలియదు.

"సార్ !" స్వింగ్ డోర్స్ తెరచుకుని వచ్చారు మెసంజర్. "రోజమ్మగారు మీకు ఫోన్ కాల్ వచ్చిందని చెప్ప మన్నారు."

కుర్చీలోంచి స్ప్రింగ్‌లా గెంతి - పరుగులాటి నడకతో ఆ గది చేరు కున్నాను.

రోజ్ రిసీవరందించింది

"థాంక్యూ ఎ లాట్."

రిసీవరందుకున్నాను

"యస్... రావ్‌నే... మాధవీ."

"ఊఁ, మీరు అర్జంట్‌గా రావాలి."

"అబ్బాయా అమ్మాయా ? నలుపా, తెలుపా ?" ఆత్రంగా అడిగాను.

'దయచేసి మీరు వెంటనే రండి"

ఫోను పెట్టేసిన శబ్దం.

ఆ కంఠంనిస్సందేహంగా మాధవిదే.

ఆమె గొంతు గద్గదికంగా ఉంది. ఏం జరిగిందని ?

తంబి కాకుండా ఆమె ఎందుకు శ్రమపడి ఫోను చెయ్యవలసి వచ్చింది.

మాధవి ప్రసవించిందా? అబ్బాయా, అమ్మాయా ?

అంతకంటె ముఖ్యం- బేబీ నలుపా, తెలుపా?

ఎవరి పోలికలు ? మాధవివా, తంబివా ?

ప్రశ్నల పరంపర.

ఒక్కదానికీ సమాధానం తెలియ దిప్పుడు

హాస్పిటల్‌కి వెళ్లాలి. స్వయంగా తెలుసుకోవాలి. అంతకంటే మరోమార్గం లేదు.

అన్నిటికంటె ముఖ్యమైన ప్రశ్న- బేబీ నలుపా, తెలుపా ?

మనసు ఆత్రంగా కొట్టుకుపోతూంది.

ఆ ప్రశ్నకు సమాధానంమీద ఒక జీవితపు విజయమూ ఓటమీ ఆధారపడి ఉంటాయి.

ఇంతకీ తంబి ఏమైపోయాడు ?

ఇటువంటి సమయంలో మాధవిని ఒంటరిగా వదిలి అతనేం చేస్తున్నట్లు?

గుండె స్పీడు పెంచేసుకుంటూంది క్షణ క్షణానికీ.

పర్మిషన్ కన్వే చెయ్యమని రోజ్‌కి చెప్పి- కాలింగ్ కారు తీసుకుని హాస్పి టల్‌కి బయలుదేరాను స్వీట్స్ కొని తీసుకువెళ్దామా అన్న ఆలోచన వచ్చింది కానీ కారాపడం యిష్టంలేదు. వీలయి నంత తొందరగా హాస్పిటల్‌కి చేరు కోడమే నా ధ్యేయం

రెండు ఫర్లాంగులు వెళ్ళానో లేదో ట్రాఫిక్ జామ్ !

అసలే ఆత్రతగా ఉన్న నన్ను జామ్ మరీ చీకాకు పెట్టింది, కారులు తీర్చి నిలచి ఉన్నాయి కార్లూ తదితర ప్రయాణ సాధనాలూ. వెనక్కిపోయే అవకాశం లేదు. కనీసం పావుగంటో




అరగంటలో గడిస్తే తప్ప ట్రాఫిక్ క్లియర్ అయ్యే సూచనలు లేవు.

గ్రీన్ సిగ్నల్ కోసం చూస్తూ ఇంజి నాపాను.

ఆలోచనలు– తంబి గురించి

తంబి తండ్రి కావడం అనేది చాలా తమాషాగా ఆశ్చర్యంగా అనిపిస్తూం టెందుకనో.

నిజమే.

తంబి జీవితమే ఓ తమాషా.

విషాద భరితమయిన విచిత్రం.

హైస్కూల్లో చదువుకుంటున్న రోజు లవి ఓ సాయంత్రం... చీకటిపడే వరకూ ప్లేగ్రౌండ్‌లోనే ఉండిపోయాను.

"తారు డబ్బా!"

"సిరా బుడ్డి!"

"మాలకాకి..." "మసిబొగ్గు..."

పదిమంది పిల్లలు గొంతెత్తి అరుస్తున్నారు గుండ్రంగా గుడికట్టి. వాళ్ళ అరుపుల మధ్యగా ఎవరిదో ఏడుపు ఉండుండి వినపడుతుంది. నేను చోద్యం చూస్తూ నిలబడిపోయాను. కొంచెం సేపటికి గుంపు చెదిరిపోయింది. చొక్కాతో కళ్ళు తుడుచుకుంటూ వెక్కివెక్కి ఏడుస్తూ, మిగిలిపోయాడో అబ్బాయి. ఇంతవరకూ అతన్నాటలు పట్టించిన అబ్బాయిలు అతనికి సరి అయిన పేరులే పెట్టారనిపించేటట్టు న్నాడు.

నాకు జాలివేసింది. ఎందుకో తెలియకుండానే అతనిక్కి దగ్గరగా చేరాను. నన్ను చూసి బెదిరిపోయాడు. చెయ్యి పట్టుకోబోయాను

"వద్దు... నన్ను ముట్టుకోకు. నా నలుపు నీకంటుకుంటుందేమో!"

గుండెలలో దేవినట్టయిందతని మాట

లకి, "ఫరవాలేదు కానీ ముందు నువ్వు ఏడుపు మానెయ్." జాలిగా అన్నాను.

అతని దుఃఖం కట్టడానికి చాలా సేపే పట్టింది.

"నీ పేరేమిటి?" మెల్లగా అడిగాను.

"భాస్కరమ్–" వెక్కిళ్లొచ్చుపడ్డాయి. "కాని–నన్నెవరూ అలా పిలవరు."

"ఇంట్లోనా?"

"అక్కడా నన్నెవరూ నా పేరుతో పిలవరు."

నా హృదయం జాలితో తొణికిసలాడింది. భాస్కరం నాకంటె చిన్నవాడే ఒకటో రెండో సంవత్సరాలు. నేను సెకండ్‌ఫారమూ అతను ఫస్ట్ ఫారమూ.

జాలినుంచి స్నేహం పుడుతుంది కాబోలు!

నేనూ అతనూ స్నేహితులం ఐపోయాము– ఆ క్షణాలలో అలాగ.

"మనం స్నేహంగా ఉందాం. ఏం?" అని నేనడిగేసరికి భాస్కరం నన్ను నమ్మలేనట్లు కళ్లు పెద్దవిచేసి చూశాడు.

మరీ జాలివేసిందతని పరిస్థితిమీద.

అతనిపట్ల–అవ్యక్తమైన ఆప్యాయత వెల్లివిరిసింది నాలో.

సాయంత్రం స్కూలు వదలగానే యిద్దరమూ కలుసుకునేవాళ్లం.

"ఏటివొడ్డుకి వెళ్దామా?"

"చీకటిపడనీ."

"ఎందుకూ?"

"నేను రోడ్డుమీద వెళ్తూంటె నన్ను నలుగురూ ఎలాగో చూస్తారు. నాతో తిరిగితే నీవంక కూడా అలాగ హేళనగా..." అనేవాడు.

నాకు మాత్రం భాస్కరంతో తిరగాలనిపించేది. కారణం యిది అని నాకూ తెలియదు. అతనిమీద స్నేహభావం కంటె జాలే ఎక్కువకాబోలు...అతనేం చెప్పినా కాదనాలనిపించేది కాదు.

క్యారమ్స్ ఆడుకుని – చీకటిపడుతూంటే యిద్దరమూ షికారు బయలుదేరేవాళ్లం. దీపాలు లేక చీకటిగా ఉన్న చోట నడుస్తూంటే "నేన్నీకు కనిపిస్తున్నానా?" అని దీనంగా అడిగేవాడు. బదులు చెప్పడానికి నా నోరు ఓ పట్టాన పెగిలేది కాదు.

"ఏమిటి నీ ప్రశ్న?" చిరాకుపడేవాడిని అతనిమీద.

"అదికాదు. మా యింట్లో– చీకట్లో నేను కనపడనంటారు. అందుకని..."

నాకు ఏడుపే వచ్చేది.

భాస్కరం చేతిని గట్టిగా పట్టుకుని "నాకు చక్కగా కనపడుతున్నావు వాళ్లే అబద్ధమాడి ఉంటారు," అ వాడిని

"నిజంగా నువ్వెంత మంచివాడి రామారావ్!" పొంగిపోయేవాడు.

భాస్కరం అల్పసంతోషి. నిఃచెబితేనే అంత మురిసిపోతారా ఎ రయినా!

మా స్నేహం వయసు పోసు కుంటూంది.

భాస్కరం నా కంటికి నల్లగా కని పించడంలేదు. మామూలుగానే కని పిస్తున్నాడు. నిరంతర సాహచర్యం వల్లా స్నేహం వల్లా అయి ఉండవచ్చు.

అతను వయసుకి మించిన మాటలు మాట్లాడేటట్లనిపించేది నా కప్పుడప్పుడు. చాలా ఎదిగిపోయినట్లు చిత్రంగా గంభీ రంగా మాట్లాడేసేవాడు. నాకు మతి పోయినట్లుండేది వినడానికి.

ఓనాడు హటాత్తుగా అన్నాడు— నన్నిక భాస్కరం అని పిలవకు."

"ఏం ?"

."ఆ పేరు నా పేరులా ఉండదు."

"మరెలా ఉంటుంది ?''

"కొత్తగా. ఎవరిదో పేరులా."

"అయితే— ఏమని పిలుస్తే నీకు బాగుంటుంది?"

"నల్లతంబి అని."

"నల్లతంబి !"— "ఛీ ! బాగులేదు. అదేం పేరు?"

"మా చిన్న మావయ్య— మద్రాసు మావయ్య చెప్పాడు. నా కాపేరే బాగుం టుందట. అరవంలో నల్లతంబి అంటే మంచి తమ్ముడని అర్థమట...''

"కాని..."

"'ఏం ? నేను నీ తమ్ముణ్ని కానూ ?"

"......"

"ఓ మాట చెప్పేదా ?" రహస్యం చెప్పబోతున్నట్లు చూశాడు.

"చెప్పు—"

"నాకు అమ్మ లేదు. తమ్ముడులేదు. కాని— అన్నవి నువ్వున్నావ్.

నాకే అమ్మ ఉంటే— నేను నల్లగా ఉన్నా ముద్దుగా బుజ్జీ అని పిలిచేదేమో! అన్నయ్య ఉంటే ప్రేమగా తంబీ అని పిలిచేవాడే కద ?"

"ఐతే ఏమంటావు ?"

"నన్ను నల్లతంబీ అని పిలవ్వూ ? నేను బాధపడను. అసలు నువ్వెలా పిలి చినా నాకెంతో బాగుంటుంది నిజంగా.''

"......"

"నాకు పేరుపెట్టిన అమ్మా లేదు, నాన్నా లేడు. మావయ్యగారింట్లో గతి లేక బతుకుతున్నాను. వాళ్లందరికీ నేనంటే చులకన. నల్లగా ఉంటానని హేళన, అసహ్యం. చివరికి టీచర్లు కూడా నన్ను బ్లాక్ బాయ్ అంటారు. నన్నెవరూ దగ్గరకి రానివ్వరు— నువ్వు తప్ప.''

కన్నీళ్లతో భాస్కరం చెబుతూంటే నేను కూడా ఏడుపాపుకోలేకపోయాను. మనసు ద్రవించిపోయింది.

అతని అభ్యర్థనను తిరస్కరించలేక పోయాను.

గొంతు వణుకుతూంటే "నల్లతంబీ!" అని పిలిచాను తొలిసారిగా.

అతను నన్ను ఆప్యాయంగా చుట్టుకు పోయాడు.

"అన్నయ్యా! నువ్వు నాకు జీవితాంతమూ ఉండిపోవాలి."

"తప్పకుండా." వాగ్దానం చేశాను.

*  *  *

నల్లతంబి తెలివయినవాడే. ఏదయినా యిట్టే గ్రహించేవాడు కాని— మార్కులు మాత్రం బాగా వచ్చేవి కావు బొటాబొటిగా పాసుమార్కులు తెచ్చుకునేవాడు. ఓ సారి ఆ విషయం ఎత్తాను.

"ఏం చేసేది? పుస్తకం తెరిస్తే చాలు క్లాసురూము గుర్తుకొస్తుంది బ్లాక్ బోర్డ్ నన్ను వెక్కిరిస్తున్నట్లెదురౌతుంది. బ్లాక్ బోయ్ అని మాస్టారు పిలుస్తున్నట్లని పిస్తుంది. నలుగురు కుర్రాళ్ళు నన్ను నల్లవెంకన్నా అంటున్నట్లు వినిపిస్తుంది. ఇక చదువు సాగదు. పుస్తకంమీద దృష్టి నిలవదు. పాఠాలు బుర్ర కెక్కవు."

జాలివేసేది.

నల్లతంబిని రక్షించాలని ఆవేశపడే వాడిని. కాని— ప్రపంచమంతా అటు. నేనొక్కడినీ నల్లతంబి వైపు. అంత ప్రపంచంనుంచి అతన్ని కాపాడడం నా ఒక్కడి తరమూ ఔతుందా?"

''పగలు— నన్ను చూసినవాళ్ళు నవ్వుతారు. రాత్రి నన్ను చూస్తే దొంగేమో అనుకుంటారు. మరెలాగ నేను తిరిగేది?''

శూలాల్లాగా, శరాల్లాగా గుచ్చుకునే వతని మాటలు నా గుండెలలో. అత న్ననునయించాలన్న సంగతే మరచి పోయేవాడిని తీవ్రమయిన సంఘర్షణకు లోనవుతూ.

*  *  *

సమాధానం చెప్పలేని ప్రశ్నలు వేసేవాడు.

ఓసారి రోడ్డుమీద నడుస్తున్నాం అతనూ నేనూ.

నలుగురు పోలీసులు కాపలాగా అటూ యిటూ ఉండి— దొంగలను కాబోలు నడిపించుకు వెళుతున్నారు.

"ఆ దొంగలని చూడు."

"చూశాను."

"అందరూ నల్లటివాళ్ళే!"

"......"మౌనం దాల్చాను—కాదన డానికాస్కారం లేక.

"సాధారణంగా దొంగలందరూ నల్లగానే ఉంటా రెందుకని?"

"దొంగలలోనూ తెల్లటివాళ్లుంటారు. కాకపోతే మన ప్రాంతంలో నల్లటి మనుషుల సంఖ్యే ఎక్కువ కనుక— దొంగల లోనూ తెల్లటివాళ్ళు అరుదుగా కని పిస్తారు అంతేకాని మనిషి రంగుకీ అతని స్వభావానికి ఏవిధమయిన సంబంధమూ ఉందనుకోను." కావాలనే కంఠంలోకి కర్కశత్వం అరువు తెచ్చుకున్నాను.




కనీసం అలాగయినా అతని ఆలోచనా ధోరణికి ఆనకట్ట వేయడం సాధ్యపడుతుందేమో అని.

"నీకు నేనంటే యిష్టం. అందుచేత పక్షపాతంతో నా నలుపు రంగుని సమర్థించబోతావు—"

"అదేమీలేదు. నేను నమ్మిన నిజాన్నే చెప్పాను."

"సరే. నువ్వు నమ్మని నిజాన్ని చెబుతాను విను." అంటూ ప్రారంభించాడు. ఉదయం నేను లేచేసరికే యిల్లు గందరగోళంగా ఉంది. కారణం— రాత్రి మ్మా మామయ్య జేబులోంచి పదిరూపాయల నోటు మాయమైందట. మామయ్య జాగ్రత్తమనిషి కనుక ఆ నోటు యింకెక్కడా కాక యింట్లోనే పోయిందని తేల్చి చెప్పాడు.

ఇంటిదొంగ ఎవరని ఆరాలు తీయడం జరిగింది. దొంగతనం జరిగిన తీరునిబట్టి నౌకర్లూ ప్రైవాళ్ళూ కాక యింట్లో పిల్లలే తీశారన్న నిర్ధారణకు వచ్చాడు మామయ్య.

శేఖరం బావ—మంజుల—నేను—మా ముగ్గురిలోనూ ఎవరో తేలాలన్నాడు మామయ్య. చివరకు ఎవరిని దొంగగా తేల్చాడో తెలుసా?"

"శేఖరం అయి ఉంటాడు. సిగరెట్లు కాలుస్తాడు. క్లాసులెగ్గొట్టి సినిమాలకి వెళ్తాడు. అటువంటి పనులకి డబ్బులు సవ్యమైన మార్గంలో రావు. అందుచేత శేఖరం—"

"కాదు—"

"మంజులా?"

"ఊహుఁ." అతని కళ్ళల్లో నీరు తిరిగింది. "నేనుట! ఎందుకంటే నేను దొంగలాగే ఉంటానట! నా రంగూ రూపూ అవే చెప్తాయట నేను దొంగ వెధవనని.

ఒరేయ్! నాకు తెలుసురా— నువ్వొట్టి దొంగవెధవ్వి. పచ్చి కేడీవి. అమావాస్యనాడు పుట్టావురా...అందుకే నల్లగా ఉన్నావు. దొంగతనం నేర్చావు. నాకు తెలుసు... నువ్వు గజదొంగ వౌతావు— అంటూ నా వీపు వాతలు తేలేలా బెత్తంతో బాదాడు మావయ్య."

"తంబీ!"

"నిజంగా నేను దొంగతనం చెయ్య లేదు. మావయ్య అన్నట్టు అమావాస్య నాడు పుట్టడమూ నల్లగా ఉండడమూ నిజమేమో కాని- దొంగబుద్ధులు నేర్చు కోడం మాత్రం అబద్ధం. నేనెంత ఏడ్చినా ఎవరు నమ్ముతారు? ఎలా నమ్ముతారు? నేను నల్లగా ఉంటాను. అంచేత నేనేం చెప్పినా నమ్మరు. శేఖరం తెల్లగా ఉంటాడు. అంచేత వాడి మాటలే నమ్ము తారు.

తంబి మనసు నాకు తెలుసు.

నేను తప్ప మరో మనిషంటేనే పుట్టెడు భయం. ఆత్మన్యూనతా భావంతో- మరో మనిషితో మాట్లా డ్డానికే జంకుతాడు. ఆశ్రయం యిచ్చిన ఆ యింట్లో- తంబి దొంగతనం చెయ్యడు గాక చెయ్యడు.

ఆ నమ్మకం నాకుంది. కాని-ప్రపంచా న్నెలా నమ్మించగలను?

"పోన్లే తంబీ. నిజం యివాళ కాక పోతే రేపయినా బయటపడక మానదు..."

"కాని- యివాళ నేను పడిన నిందా, దెబ్బలూ వీటి సంగతేమిటి? నల్లగా— ఉండబట్టే కదా అనవసరంగా..."

"ఆ నలుపు నీ వొంటిది కాదు. వాళ్ల మనస్సుది." తంబి చేతిని మృదువుగా నొక్కి— "కాఫీ తాగి పోదాం పద," అన్నాను.

ఇద్దరమూ టిఫిన్ ముగించి రోడ్డు మీదకు వచ్చాం.

చిన్న గుంపు- ప్రొసెషన్‌లా రోడ్డు ఆక్రమించుకుని వస్తోంది.

గుడ్డమీద ఏవో అక్షరాలు... పాటలు... అరుపులు...

దగ్గరయ్యాక తెలిసింది. వాళ్లు కుష్ఠు రోగులు!

ఏసుక్రీస్తుమీద పాటలు పాడుతూ సామూహికంగా యాచిస్తున్నారు.

ఇద్దరమూ చూస్తూ నిలబడ్డాం.

వాళ్ళు మమ్మల్ని దాటిపోయారు. మేము నడవసాగాము.

"రామారావ్!"

"ఊఁ."

"కుష్ఠువాళ్ళని చూశావుకదూ..."

"ఊఁ."

"నల్లటివాళ్ళకే ఆ జబ్బు వస్తుందా?"

"నాకు తెలియదు."

"ముష్టివాళ్లు కూడా ఎక్కువగా నల్ల గానే ఉంటారు."

"నువ్విలాటి పిచ్చిమాటలు మాట్లా డితే నాకు కోపం వస్తుంది."




అతనికి సమాధానం చెప్పలేక- కోపం తెచ్చుకున్నాను.

తంబి యిటువంటి గడ్డుప్రశ్నలే వేసేవాడు. నేనతనికంటె పెద్దవాడినే అయినా ఆ ప్రశ్నలకి సరయిన జవాబులు చెప్పగలిగే తెలివితేటలు నాకు మాత్రం ఎక్కడివి?

తంబితో నేను స్నేహంగా ఉండడం మా యింట్లోవాళ్ళకి నచ్చేదికాదు.

"ఆ కర్రిమొద్దుతో నీకు సఖ్యమేమిటి? నీ క్లాసూ కాదు, కులమూ కాదు," అనేవారు. నేను సమాధానం చెప్పేవాడినికాను. నాలుగుసార్లు చెప్పి విసుగెత్తి మావాళ్లే ఊరుకున్నారు.

స్కూలులో కూడా నేనూ తంబీ కలుసుకుండే కుర్రవాళ్లు గేలిచేసేవారు. బ్లాక్‌బోర్డూ, ఛాక్‌పీసూ అంటూ. నేనేమీ తెల్లగా ఉండను. నలుపు కాదంతే. చామన చాయ. తంబి పక్కనుంచే నేను తెల్లగా కనిపిస్తాను కాబోలు. ఎవరి మాటలో విని తంబి స్నేహాన్ని వదులుకోవడం నాకిష్టంలేదు. నేను కొంచెం మొండివాడిని మొదటినుంచీ.

మా పక్కింటివాళ్ళకి చక్కని పాప ఉంది.

రబ్బరు బొమ్మలా ముద్దుగా బొద్దుగా ఉంటుంది.

ఆ పాపంటే నాకు చాలా యిష్టం. పెద్ద కళ్ళతో తమాషాగా చూస్తుంది. చిక్కని జుత్తు- వంకులు తిరిగి, పాప కదులుతూంటే ముఖంమీద పడుతూ ఉంటుంది. మూతి నిజంగా చిన్న సున్నాలా ఉంటుంది. అప్పుడప్పుడు ఆ పాపకి ఛాక్‌లెట్లిస్తూ ఉంటాను. అందుచేత నేను పిలిస్తే పరుగెత్తుకొస్తుంది. నా తరవాత చిన్నపిల్లలిక లేరు మావాళ్ళకి. ఆ పాపను చెల్లిగా భావించుకుంటాను. బంగారుపాప అని పేరు కూడా పెట్టాను నేను.

ఓసారి ఆ పాపతో ఆడుకుంటు న్నాను- యింటిముందు రోడ్డుమీద. నా చుట్టూ తిరుగుతూ ఆడుతూంది పాప.

తంబి వచ్చాడు. పాపని తదేకంగా చూశాడు.

"పాపనెత్తుకుని ముద్దుపెట్టుకోవాలని ఉంది" అన్నాడు.

"అలాగే."

"పాపా!" చిటికె వేస్తూ పిలిచాను.

తిరుగుతున్నదల్లా ఆగి దగ్గరకు వచ్చి నా చెయ్యి పట్టుకుంది.

"అన్న!" తంబిని చూపాను.

ఒక్కసారి చూసి దృష్టి తిప్పేసు కుంది.

"నువ్వంటే ముద్దు— ముద్దిస్తాడు.. వెళ్ళు—" ఎత్తుకుని తంబికందించ బోయాను. నా చేతులలోంచి జారిపోయి- నన్ను విదిలించుకుని పరుగెత్తింది తూనీగలా.

"పాపా!" గట్టిగా పిలిచాను.

నాకు తెలుసు- యీ సంఘటన తంబిని తక్కువేమీ బాధపెట్టదు.

"నేను లాను-" సమాధానం చెప్పేసి తుర్రుమంది.

దీనంగా నిలబడ్డాడతను పాప వెళ్ళిన దిక్కే చూస్తూ.

"పాప ఎంత అందంగా ఉంటుందో అంత పెంకిది. పైగా— కొత్త."

"అదికాదులే. ఈ పాపే కాదు, ఏ పాపా నా దగ్గరకు చేరదు."

"అలా మాట్లాడకు. నాలుగురోజులు అలవాటయితే—"

"ఎన్నాళ్ళయినా అంతే. దేవతా పాపలు రాక్షసుల దగ్గరకి వస్తారా!"

ప్రశ్నార్థకంగా చూశాను.

"తెల్లటివాళ్ళు దేవతల అంశ, నల్లటి వాళ్ళది రాక్షసుల అంశ."

"ఎవరు చెప్పారు?"

"నాకు తెలుసు."

'ఇలాటి పిచ్చివిషయాలు నీకింకా ఎన్ని తెలుసు? చెప్పు."

"అమృతం తెల్లగా ఉంటుంది. అది తాగడంవల్ల దేవతలు తెల్లగా ఉంటారు. దేవతల పాపలు కూడా తెల్లగా ఉంటారు—"

"ఐతే యికనేం? ఓ కొన్నుడు అమృతం సంపాదిద్దాం."

"ఎక్కడ?"

"ఏ మందులషాపులోనో దొరక కదూ?"

"దొరకదు." నిరాశ నిండిన స్వరంతో అన్నాడు.

"ఏతే యిక దానిగురించి ఆలో చించడం అనవసరం. లోపలికి పద, క్యారమ్స్ ఆడుకుందాం."

ఇంకా ఆ విషయం వదలలేదు తంబి. "ఓ విధంగా- పాప నన్ను ముట్టుకోనీక పోవడమూ మంచిదే."

"—" నేనేమీ అనలేదు.

"బంగారు బొమ్మలాటి పాప—



నేను ముట్టుకుంటే నల్లబడిపోతుందేమో! అంత చక్కని అందమే. సందేహం లేదు. నాలాటి నల్లటివాడు దగ్గరకు వస్తేనే మాసిపోతుంది."

నేను మౌనంగా ఉండిపోయాను. ఒక్కొక్కప్పుడు ఏ మాటా చెయ్యలేని పని మౌనం చేయగలదు.

"నీకు కోపం వచ్చిందా?"

"నాకున్న [illegible]తె ఒక మనిషివి నువ్వు. స్నేహితుడివీ, సోదరుడివీ అన్నీ నువ్వే. నీకు కోపంవస్తే నేనే నల్ల సముద్రంలోనో పడి చచ్చిపోవాలంతే, మరో తోవ లేదు." దీనంగా అన్నాడు.

"ఐతే నేను చెప్పినట్లు విను."

"చెప్పు."

"బుద్ధిగా, నాతో వచ్చి క్యారమ్స్ ఆడు."

తంబి నా చెయ్యి పట్టుకుని నడిచాడు.

ఇద్దరమూ క్యారమ్స్ ఆటలో మునిగిపోయాం.

తంబికీ నాకూ ఎవరూ విడదీయలేనంత స్నేహం అయిపోయింది.

అప్పుడప్పుడు నేనతనికి చదువు చెప్పేవాడిని.

తంబిని నిజంగా తమ్ముడిలాగే చూసుకునేవాడిని.

విచిత్రంగా— ప్రపంచానికి నల్లగా కనిపించే తంబి— నా కంటికి అలాగ అనిపించేవాడు కాదు. పైగా అందంగా కనిపించేవాడు.

కొంచెం జాగ్రత్తగా చూడగలిగితే— అతని ఉంగరాలజుత్తు ఎంత చక్కనిది? తరువాత— అతని శరీరం దృఢమైనదీ, సౌష్ఠవమైనది, కండలు తిరగకపోయినా— ఎలా ఉండవలసిన అవయవాలు అలా ఉండి శరీరం సౌష్ఠవంగా ఉండేది.

ఎందుకనో యివన్నీ మిగిలినవారి కళ్ళకు కనిపించవు. చూడగానే కనిపించేదతని నలుపు నిజమే, ఆ నలుపు నిగనిగలాడదు. అందంగా ఉండదు. ఆ నలుపు— అందాన్ని చంపే నలుపు తప్ప పెంచేది ఎంతమాత్రమూ కాదు. అంతమాత్రాన అతన్ని మనిషిగా పరిగణించకపోవడం ఎంత అన్యాయం? ఎంత గుడ్డితనం!?

అతని అత్తయ్యా, మామయ్యా,... బావా,— అందరికీ తంబి అంటే హేళనే. అనాథ బాలుడిలాగా పెరుగుతున్నాడా యింట. తల్లీ తండ్రీ ఉంటే తంబికి యిన్ని కష్టాలూ, అవమానాలూ ఉండకపోయేవేమో!

ఇద్దరమూ పెరిగి పెద్దవాళ్ళమౌతున్నాం.

తంబి హైస్కూలు తరగతులు దాటేవాడు.

* * *

(సశేషం)






ష్ణమూర్తి ఆఫీసుకు వెళ్తూ, వెళ్తూ ఆ దృశ్యం చూసి ఆగిపోయాడు. మరీ స్కూలు ముందు ఆవరణలో రు కుర్రాళ్ళు కొట్టుకుంటున్నారు. కి పదేళ్ళ వయస్సుంటుందేమో.

అందులో ఒకడు లావుగా, ఎర్రగా దొరబాబులా వున్నాడు. రెండోవాడు నల్లగా, అమాయకంగా, దరిద్రదేవత కొడుకులా వున్నాడు.

కృష్ణమూర్తి చూస్తుండగానే ఆ

ఎర్రటి కుర్రాడు, నల్లటి కుర్రాడ్ని కొట్టి క్రింద పడేశాడు. వాడి పెదవి చితికి నెత్తురు కారుతోంది. వాడు అసహాయంగా ఏడుస్తూ తిడుతున్నాడు. చుట్టూ వున్న పిల్లలు వినోదం చూస్తున్నారు.

కృష్ణమూర్తికి ఆ నల్లటి కుర్రాడి మీద జాలివేసింది. ఆ ఎర్రటి కుర్రాడి మీద కోపం వచ్చింది. గబగబా వెళ్ళి ఇద్దర్నీ విడదీశాడు.

"ఎందుకోయ్! వాడ్ని కొడుతున్నావ్?" అన్నాడు దబాయింపుగా.

"నన్ను తిట్టాడండీ," అన్నాడు ఎర్రటి కుర్రాడు.

"ముందు నన్ను 'నల్లకోతి', 'నల్ల కోతి' అని ఎగతాళి చేశాడండీ," అన్నాడు నల్లటి కుర్రాడు ఏడుస్తూ.

"తిడితే కొడతావా? మాష్టారికి చెప్పాలి గాని" అంటూ "పద హెడ్మాష్టారి దగ్గరికి—" అని లాక్కెళ్ళాడు ఎర్రటి కుర్రాడ్ని. నల్లటి కుర్రాడు ఏడుస్తూ వెంట వచ్చాడు.

హెడ్‌మాష్టారు - రామాచారి కృష్ణమూర్తికి బాగా తెలిసినవాడే. ఆయన అంతా విని ఆ ఎర్రటి కుర్రాడ్ని కేక లేసి, నల్లటికుర్రాడిని ఓదార్చి, ఇంకెప్పుడూ కొట్టుకోగూడదని బుద్ధిచెప్పి పంపించాడు.

"అన్యాయం మాష్టారూ! ఆ ఎర్రటి కుర్రాడు వట్టి పొగరుబోతులా వున్నాడు. నాలుగు తగలనియ్యాల్సింది," అన్నాడు కృష్ణమూర్తి.

"పోనీలే కృష్ణమూర్తీ! పిల్లలు. తిట్టుకుంటూవుంటారు. కొట్టుకుంటూ వుంటారు. మళ్ళీ ఒకటైపోతారు గూడా. మనం చూసీ, చూడనట్లు పోవాలి," అన్నాడు హెడ్‌మాష్టారు నవ్వుతూ.

కృష్ణమూర్తి నవ్వలేదు. ఎర్రటి కుర్రాడిమీద కోపం తగ్గనేలేదు. ఎవరో బాగా డబ్బున్న బాబులా వున్నాడు. అసలు వాడి పొగరంతా డబ్బుందనే. ఇలా చూసీ, చూడనట్లు పోతే లాభం లేదు. మళ్ళీ, మళ్ళీ ఏడిపిస్తూనే వుంటాడు. కొడుతూనే వుంటాడు. పాపం ఆ నల్లటి కుర్రాడు ఏం చెయ్యగలడు. వాళ్ళ నాన్న కూలీనో లేక రిక్షా తొక్కే మనిషో అయివుంటాడు. కొడుకుని చదివించడమే గొప్ప విషయం. ఇక వీడు తగువులు తీసుకొస్తే? అసలా చదువే వద్దని, బడి కాస్తా మాన్పించి ఏ చిల్లర కొట్లోనో, లేక ఏ వర్కుషాపుకో తోసేస్తాడు, అనుకున్నాడు.

"అలా పోనిస్తే లాభంలేదు మాష్టారూ! గట్టిగా బుద్ధి చెప్పాలి. మళ్ళీ పొగరుమోతుతనం చూపించకుండా, మీదపడి పిల్లల్ని కొట్టకుండా చెయ్యాలి." అన్నాడు కృష్ణమూర్తి.







"ఏం చెయ్యాలంటావు ?" అన్నాడు హెడ్‌మాష్టారు.

"వాళ్ళ నాన్నని పిలిపించి చెప్పండి. ఆయనే బాగా తగలనిస్తాడు," అన్నాడు కృష్ణమూర్తి.

"ఒక పని చేస్తావా కృష్ణమూర్తీ !"

"ఏమిటో చెప్పండి."

"వాళ్ళ నాన్నగారి దగ్గరికి నువ్వే వెళ్ళి చెప్పు. పాపం తన్నులు తిన్నాడే కుర్రాడు వాడిని గూడా వెంట తీసుకెళ్ళు. బాగుంటుంది," అన్నాడు హెడ్ మాష్టారు.

"అలాగే ! వాళ్ళ నాన్న అడ్రసు చెప్పండి" అన్నాడు పెన్ తీసి.

హెడ్‌మాష్టారు చెప్పాడు.

కృష్ణమూర్తి ముఖం నల్లగా మాడిపోయింది. అతను అడ్రసు రాసుకోలేదు. పెన్ ముడిచి జేబులో పెట్టుకున్నాడు.

"ఆయనా, ఆ కుర్రాడి నాన్న?" అన్నాడు వెల, వెలా పోతూ.

"నీకు తెలుసా ?"

"ఆయనే మా ఆఫీసర్," అన్నాడు కృష్ణమూర్తి నెమ్మదిగా.

"అలాగా."

"ఆఫీసు టైమైంది. వెళ్ళొస్తాను సార్," అని లేచి గబగబా వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

---





# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

## 14

ఆ శుభ్రాలన్నీ ఎప్పుడో పోయాయి. మరీ రెండురోజుల్నుంచి మతి మతిలో ఉండడంలేదు. ఏం కట్టుకుందో, ఏం తిందో! ఇలాంటి అవమాన స్థితిలో యిలాంటి అసహాయస్థితిలో కాబట్టి ఇంత అశుభ్రంగా ఉన్నా యింకొకళ్ల యింటికి రాగలిగిందిగాని — ఈ పని చేసినందుకు మరొకప్పుడయితే తల బ్రద్దలు కొట్టుకు చచ్చి ఉండేది.

తనకి యింతగా యిష్టమైన యీ పరిశుభ్రత అనే అతి సూక్ష్మమైన విషయాన్ని తనకంటే ముందుగా గుర్తించి 'స్నానంచేసి రండి, వస్తేగాని యీ దరిద్రం వదల్దు' అని తనకి చెప్పింది ఎవరు?

కళ్ళల్లో ఆప్యాయత, పిలుపులో ఆత్మీయత - మాటలో మన్ననలో మర్యాద - చూడగానే సాటిమనిషికి ఏంకావాలో కనిపెట్టగలిగే సున్నితమైన మానవత - ఇవన్నీ కలగలిపితేనేనా యీ వసంత? ఈమె కాపరానికి చిచ్చు పెట్టడానికేనా తను పనిగట్టుకు వస్త?

“చాలు. వీళ్ల మెరమెచ్చుల్లోపడి యిప్పటికి నన్ను నేను మోసపుచ్చుకున్నది చాలు. ఈ డబ్బున్నవాళ్ళు ఎంత కపట నాటకమాడడానికైనా సిద్ధమే. ఈ అయిదు నిమిషాల్లో తనకేం తెలిసిపోయిందని యీవిడపట్ల మంచి అభిప్రాయం ఏర్పరుచుకోడానికి?

యాలిన్ బట్టలు కట్టుకోడం పూర్తి

కాలు కదపకుండా, నోరు మెదపకుండా కూర్చోడమే నాకు ప్రాణాంతకమై పోయేది. ఎప్పుడూ పదిమంది పిల్లల్ని చుట్టూ పెట్టుకుని గొల్లుమని గోలచేస్తూ గడిపేదాన్ని. ఎవరి రూమ్‌లో చూసినా నేనే. అఖరికి ఏ చెట్టు కొమ్మమీద చూసినా నేనే.

అలాంటిదాన్ని ఈ మారుమూల మారు పేరుతో నెలలకి నెలలు గడపడం నా వల్ల ఔనా? ఎన్ని సదుపాయాలున్నా కావా మేడ అయితే మాత్రం మా ఆర్ఫనేజ్‌లో ఒక్క చింతచెట్టుకి సాటి వచ్చేనా? ఇన్ని పేజీలు మాత్రమే గల ఈ పుస్తకాలూ, ఈ ఈ నియమిత సమయాలలోనే తప్ప పలకలేని ఈ ట్రాన్సిస్టరూ, ఇవా నాకు ఇక మీదట స్నేహతురాళ్ళు! ఒక ఆడదీ ఒక మొగాడూ కలసి చేసిన నేరానికి ఆడ దానికి మాత్రమే అన్ని నెలలపాటు అజ్ఞాతవాస శిక్షా? సమాన దోషి, అయిన మొగాడు మాత్రం కాలరెత్తుకుని హాయిగా కారులో తిరిగేనా?

ఏమిటేమిటో అనేకరకాల ఆలో చనలు నన్నెక్కడెక్కడికో తీసుకు పోయేవి. ఏ కారణంచేతైనా మదన్ నాలుగురోజులు రావడం ఆలస్యమైతే మరీ క్షణాలు, యుగాలు అయిపోయేవి. ఎక్కడికైనా పారిపోదాం అనిపించేది. కాని నా కెవరున్నారని ఎక్కడకు వెళ్ళను! ఒక్కొక్కరోజూ కాఫీ టిఫినూ ఎలా తెచ్చేవి అలా ఉండి పోయేవి. కారియర్ విప్పి నాలుగు ముద్దలు నోట్లో పెట్టుతుంటే ఇవతలికి వచ్చేది. మార్గరెట్‌గారికి ఉత్తరం రాసి పిలిపిద్దామా అని ఓ రోజల్లా గింగిర కొట్టుకున్నాను. ఆ సాయంకాలం మదన్ వస్తే అడిగాను.

"ఇదంతా మనిద్దరి క్షేమంకోసం రహస్యంగా ఉంచాలని ముందే నీకు చెప్పేను. ఇప్పుడు నువ్వు రిటెన్‌గా కమిట్ అవుతానంటే నేనేం చెప్పను. ఏ మాత్రం తొందరపడినా మనం తర్వాత బాధపడవలసి వస్తుంది! ఇంకెంత! అప్పుడే, ఇట్టే, నెల అయి పోయింది చూడు!"

"మీకేం? ఇట్టే అని సుళువుగా చెప్పేశారు. నాకు మాత్రం ఈ ఏకాంతం దినదిన గడంగా ఉంది, మా వాళ్ళం దర్నీ చూసి ఎన్నో యుగాలు అయి పోయినట్టుంది అప్పుడే. మా పెద్ద దొరసానమ్మ ఏ పది పదిహేను రోజు లకో ఓసారి రహస్యంగా వచ్చి నన్ను కలుసుకుంటూ ఉంటే యేం? ఆవిణ్ణో సారి చూస్తేగాని బతకలేనేమో అనిపిస్తోంది మదన్!"

"గర్భవతివి, పళ్ళూపాలూ పుచ్చుకుని ఆరోగ్యంగా ఉండాలిగాని మాటాడితే అలా కళ్ళనీళ్ళు పెట్టుకుంటే ఎలా? నీకు నేను ఏ లోపం చేశానని! అంతగా. నీకు ఆవిణ్ణి చూడాలని పిస్తే రేపే తీసు కొస్తాను, సరేనా?" (సశేషం)




"నువ్వు ఎంతో మంచివాడని మన స్నేహితులందరూ అనుకుంటున్నారు" అన్నాడు, సత్యనారాయణ.

ఈ మాటల్తో నాముఖం వికసిస్తుందనివాడు అభిప్రాయపడ్డాడు కాని, ఇలా దిగులుగా చూస్తానని వాడు అనుకొని వుండడు; వాడి ముఖంలోని డిసప్పాయింటుమెంటును చూస్తూనే నేనది గ్రహించగలిగాను.

"నాకు అంతకన్న పరమ శత్రువు—"

"శత్రువా? ఆడదా? మొగాడా?"

"ఆడో మొగో నేను నిర్ధారణంగా చెప్పలేను. మన మంచితనంకన్న ఆగర్భశత్రువు మరి వుండదు."

"అదా విషయం?... ఏం అలా అన్నావ్?"

"వీళ్ళందరికీ నేను మంచివాణ్నెందుకయ్యానో తెలుసా? అడిగిన వాడికల్లా డబ్బు అప్పిచ్చి, నా చేతకానితనాన్ని కప్పిపుచ్చుకుంటూ తలకుమించిన సహాయాలు చేస్తూ వొచ్చినందుకు—"

"దానికి వాళ్ల కృతజ్ఞులుగా వుండి— నిన్ను మంచివాడని అంటున్నారేకాని— దుర్మార్గుడని అనటంలేదే! అదీకాక— నువ్వు ఇచ్చిన డబ్బు అప్పుగానే కాని,

ధర్మంగా కాదుగా? అందుకని నువ్వు ఇచ్చిన డబ్బు ఇక్కడ లంచంగా కూడా చలామణీ అవదు."

"అప్పనేమాట అర్థమేకాని–నిజానికి అది ధర్మమే!"

"ధర్మమా? ఎట్లా?"

"ముందు అప్పుగా ఇమ్మనే అడుగుతారు ...మనం ఇస్తాం. కాని తరువాత అది మన చేతికివొచ్చి ఛస్తేగా?"

"రాక ఏమౌతుందీ! ఒకవేళ మరిచిపోయి వుండొచ్చు. నువ్వు కాస్త జ్ఞాపకం చేసి తిరగి తీసుకుంటే సరి."

"మరిచిపోవటం హాస్యాస్పదం. ఒకవేళ అదే నిజమైతే అలా మరిచిపొయ్యే వాణ్ణి 'కృతఘ్నుడు' అని తెలుగులో అనరు, చేసిన మేలును మరిచేవాడు కృతఘ్నుడు!...అడగటం అంటే మాటలా? స్నేహమనేది వొకటి అడ్డం వుందిగా! అడుగుతే ఏమన్నా అనుకుంటాడేమో ననే భయం; అసలు అడిగే స్వభావం కూడా మనకు లేదాయె! ఏదో విధంగా ఒకటికి రెండుసార్లు అడిగి ఒత్తిడి కలిగించామంటే – ఇంకేముందీ – మనతో మాట్లాడటం మానేస్తారు. ఊళ్లో మనను గూర్చి దుష్ప్రచారంకూడా సాగిస్తారనేందుకు సందేహంలేదు,"

"అది నీలోని బలహీనత...!"

"దాన్నే వాళ్ళందరూ 'మంచితనం' అనే మారుపేరుతో పిలుస్తున్నారు."

రెండు నిమిషాలు ఆలోచనలో పడి "తీసుకున్న సైకం తిరిగి ఇవ్వలేనివాళ్ళు అసలు అప్పుగా తీసుకోవటం దేనికి?" అన్నాడు సత్యనారాయణ.

"ధర్మంగా అడుగుతే ఎవరిస్తారూ? వాకిట్లోకి వొచ్చిన బిచ్చగాడికీ, ధర్మంగా అడిగే స్నేహితుడికీ – దుస్తుల తీరులో తప్ప ఇంకేమీ భేదంలేదు."

"ఇప్పుడు నీకు వెంకటేశ్వర్లు ఎంత ఇవ్వాలి?"

"వంద"

"వందా?...కృష్ణమూర్తి?"

"డెబ్బైయ్– మొత్తం మూడువేలకు తక్కువకాకుండా లిస్టువుంది—"

"మూడు వేలే"

"మరేమనుకున్నావ్? మూడు సంవత్సరాలనుంచీ ఇంత ఖర్చుపెడుతూ వీళ్ళందరిచేతా మంచివాణ్ణి అనిపించుకోవటం మాటలా! ఎవర్ని కాస్త కదిలించినా విషయాన్ని తప్పించి మాట్లాడుతారు. వాళ్ళేమో నాకు టోపీ వెయ్యగలిగినట్టూ, నాకన్న గొప్ప తెలివితేటలు ఉన్నట్టూ చూస్తూ–టలాయించి తిరుగుతారు. ఒక్కోచోట నన్నొక అపరిచిత వ్యక్తినిగా చూస్తారు. నేను గ్రహించగలిగిందేమిటంటే— ఈ విషయంలో ఏ కాస్త ముందుకుపోయినా— రానిడబ్బు రాకపోగా పైపెచ్చు విరోధాన్నికూడా కొని తెచ్చుకోవాలి—"

"ఇలాగాతై జీవితం ఎలాసాగుతుందీ!"

"అంతకన్న మరిగత్యంతరంలేదు. సాగినన్నాళ్ళే—ఏం చేస్తాం?"

సత్యనారాయణ ముఖం కొత్త ఆలోచనలో వెలిగింది. అన్నాడు; "ఒక విధంగా ఆలోచిస్తే నువ్వు మంచివాడివనే కీర్తికోసం పాకులాడుతున్నట్లు తోస్తుంది—"

"నేనెప్పుడూ అలాంటి కీర్తికోసం ప్రయత్నించలేదు. దానంతట అది టన్నులకొద్దీ వొచ్చి పడుతూవుంటే—నే ఒక్కణ్నే భరించలేక ఛస్తున్నాను. ఆ మంచితనం నాకు చేసిన మేలేమీలేక పోయినా, కీడుచేస్తోంది; అలాంటిదాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానించగలిగే ధైర్యం నాలాటి సామాన్యుడికి ఉండటం—నిజంగా అసహజమే;"

"నీ గొడవ నాకు అంతుపట్టలేదు. కాస్త కఠినంగా ప్రవర్తించకపోతే మిగిలిన మూడు ఎకరాలుకూడా అమ్మెయ్యాల్సి వొస్తుంది. ఇక సంసారం సంగతి వేరేచెప్పనక్కర్లేదు. ఇదంతా నీలోపమేననేందుకు నాకో మంచి కారణంకూడా కనిపిస్తోంది"

"ఏమిటది?"

"నన్నెవరూ అడగరేం?" తన తెలివితేటల్ని నేను మెచ్చుకోవాలని కాబోలు నా ముఖంలోకి సూటిగా చూశాడు.

"అడిగినా లేదని నిర్మొహమాటంగా అనేస్తావ్. అసలు నీదగ్గర్నుంచి డబ్బు రాల్తుందనే నమ్మకం ఎదుటివాడికి ఎలా కలుగుతుంది? ఎప్పుడు చూసినా జేబులో చిల్లరతప్ప ఇంకేమీ ఉండదాయె; ఇంకోడు నిన్ను అడిగేముందు—నువ్వే వాణ్ణి అడిగేస్థితిలో ఉన్నావనే అభిప్రాయాన్ని కూడా కలిగించక మానవు-తెలిసిందా?"

సత్యనారాయణ తెలిసినట్టుగా తల ఆడించి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

* * *

"ఇంత మారిపోతావనుకోలేదు; ఇలాటి దుస్థితికి వొస్తావనుకోలేదు" అన్నాడు పాతస్నేహితుడు సూర్యనారాయణ.

"నన్నుగూర్చిన విచారం నాకేమీ లేదు. ఇక నీకు దేనికి?"

"స్నేహితుణ్ణి కనుక... నిన్ను గూర్చి నువ్వెప్పుడూ ఆలోచించక పోవటంవల్ల విచారపడాల్సిన విషయం నీకు కనుపించలేదనుకుంటాను."

"పోనీ—ఇప్పుడావిచారాన్ని కొని తెచ్చుకోవటం దేనికి?"

"కొద్ది రోజుల్లోనే నీకు పిచ్చికూడ ఎక్కేట్టుంది... ఉండేందుకు ఇల్లు లేకుండా అమ్ముకున్నావు. చారెడు గింజలకూడా గతిలేకుండా పది ఎకరాలభూమినీ అమ్మి కూర్చున్నావు. కాటివనంకూడా అమ్మావుటే; ఇంకా విచారపడేందుకు ఇంతకన్న ఇంకేం కావాలి?"

"ఇండియా గవర్నమెంటుకు ఏ పన్ను రూపంలోనూ నాదగ్గర్నుంచి దమ్మిడీకూడా పోదు. కాగా, ప్రతి ఇతర పౌరుడికీవున్న హక్కులు నాకూ వున్నాయ్—"

"నీకు ఇంకా యీ బింకం ఉండటం ఆశ్చర్యంగానే వుంది"

"దీన్ని కూడా అమ్మలేదనా నీ ఆశ్చర్యం ?"

"ఇంత మొండిగా మారావేం? మొన్న మీ మామగారు కనిపించి నీ స్నేహ బృంద మంతాజేరి నిన్ను సర్వమంగళం చేశారని చెప్తే విని ఎంతో విచార పడ్డాను. భార్యాబిడ్డల గతేంకానూ ? ఏదన్నా ఉద్యోగమన్నా చెయ్యి—అంత కన్న ఇంకేంవుంది ?"

"వెధవ ఉద్యోగం!"

"అనా నాకు తెలియక అడుగు తాను— నీకు యీ స్నేహితులు ఎందు కంట ? ఒక తాగుడులేదు, బాగా అనుభ వించిందీ లేదు; ఐదు సంవత్సరాల్లో ఇంత డబ్బు ఖర్చయిందంటే— దానికి కార కులు నీ స్నేహితులు ! ఇప్పటికన్నా వాళ్ళను వొదలవేం ?"

"ఎట్లా వొదులుకునేదీ ? డబ్బుతో కొనుక్కున్న స్నేహమాయె చూస్తూ మాస్తూ ఎలా విసిరిపారేసేదీ ?''

''పోనీ వాళ్ళవల్ల నీకేమన్నా మేలు కలుగుతోందా ?"

"ఆఁ నన్ను కూడా వాళ్ళబృందంలో కలుపుకున్నారుగా !''

"మరి ఇన్నాళ్ళూ ?"

"ఇన్నాళ్లూ నేను వాళ్ళదగ్గర ప్రాపకం కోసం వాళ్ళ ఖర్చుల్ని భరించే వ్యక్తిని. ఇప్పుడు వాళ్ళే—"

"వాళ్ళు నీకింద ఏమన్నా ఖర్చు పెడుతున్నారంటావా ?"

"వాళ్ళ జేబుల్లోంచి కాకపోతే మాత్ర మేం ? మొదట్లో నన్ను వెతికితెచ్చి నట్టే— ఇప్పుడు మేమందరమూ కలిసి ఉన్నవాణ్ని ఇంకోణ్ని పట్టుకొచ్చి— తలకాస్తా పిండుకుంటాం! అ పిండుకునే వాళ్ళలో ఇప్పటికి నాక్కూడా వొక స్థానం లభించింది."

"వాడు పిండుకోనీవొద్దూ ?"

"అది మన ప్రావీణ్యత – దాన్ని ఎవ్వరూ ఆపలేరు. నే నేం అడ్డగించ గలిగానూ ? స్నేహితం ఉండనే ఉందాయె ! కొత్తవాడికి యీ స్నేహి తాన్ని వొదిలించుకుందామనే దురుద్దేశం వున్నా-మేము వొదలమాయె !"

"అంటే వాణ్ని నీలాగే సర్వ మంగళం చేసేదాకా— ?"

"అంతే !"

"జలగ వ్యవహారంగా వుందే !''

"కాని మేము జలగలాగు కాకుండా– బాధకనిపించకుండా-క్లోరోఫారం కింద చేసే ఆపరేషన్‌లాగు-పీల్చగలం !"

"మత్తు తెలిశాకన్నా—?"

"అప్పటికి మిగిలిం దేముంటుందీ ? నాలాగే పాపర్ ! అప్పటికికాని మా జల గర్ల సంఘంలో వాడికి సభ్యత్వం లభిం చదు."

"నువ్వు ఇంతడబ్బూ తగలేసి చివ రకు నేర్చింది యీ కళ్ళనమాట ? ఈ సంగతి వింటే నిన్ను ఎవడైనా జేర నిస్తాడూ? ఇలా గోముఖ వ్యాఘ్రంగా..."

"నా సంగతి ఊళ్ళో విచారించు—ఏ మంటారో ?"

"అదే నాకు ఆశ్చర్యంగా వుంది. ఇంత దుర్మార్గుణ్ణి 'మంచివాడు' అని లోకులు ఎలా అనగలుగుతున్నారంట?"

"మరి నేను పెట్టిన లంచం! ఇన్నాళ్ళూ నేను వాళ్ళకింద ఖర్చు పెట్టిన డబ్బు! నీకు మంచితనం పర్వ తాల పరిమాణంలో కావాలంటే—"

"నాకు వొద్దుబాబూ !"

"ఏం భయంలేదు... ఇదీ వొకరకం వ్యాపారమే అనుకో. నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్ల లాటిది... ఉత్తరోత్తరా క్రమంగా అంతకు రెండింతలు రిటరన్ వొస్తుంది... తెలిసిందా ?"

"నాకు అంతా అయోమయంగానే వుంది ? ఐనా ఇలా స్నేహితుల ధర్మాల మీద ఎన్నాళ్ళు బతుకుతావూ ?"

"ధర్మమేమిటీ – నీమొహం ? అప్పు!! మన జీవితం పట్టాల్ని అంటిపెట్టుకొని పరుగెత్తే రైలులాగు ఒడిదుడుకులు లేకుండా సాగిపొయ్యే అయోమార్గం !"

"ఇక్కడ నీ స్నేహితులేగా పట్టాలు కాని–రైలుపట్టాలు జరగవు, వీళ్ళు జరు గుతూ వుంటారు కనుక, నువ్వెన్న రైలు ఎప్పుడో అప్పుడు తలక్రిందు లుగా పడక మానదు."

"ఆ పట్టాపోతే–ఇంకో కొత్తపట్టా తెచ్చి వేస్తాం—"

"పోనీ స్నేహితులదగ్గర చేసే అప్పు మాత్రం ఏట్లా తీర్చగలవూ ?"

"తీర్చటం దేనికి ? నేను ఇప్పటికి అప్పుగా ఇచ్చిన పైకమంతా వొస్తే పోగొట్టుకున్న ఆస్తినంతా తిరిగి కొన గలను !"

"అప్పు తీర్చకపోతే ఊరుకుం టారా ?"

"నేనేం చెయ్యగలిగానూ ? అందరూ అంతే ; స్నేహంలో తీసుకున్న అప్పును తిరిగి అడిగి స్నేహాన్ని పోగొట్టు కుంటారా యేం !"

ఇట్లా ఎన్నిసార్లూ ?"

"ఒక్కో స్నేహితుడి తాహతునుపట్టి ఒక్కోసారే చాలు. కొత్త సభ్యులు వొస్తూనే వుంటారుగా!"

"ఇలాగే ప్రతివాడితోనూ వాగుతూ వుండు. నీ స్నేహాన్ని ముందుగానే అర్థంచేసుకొని నీ వీపు చెడగొట్టిపోతాడు– తెలిసిందా ?"

"మరేం ప్రమాదంలేదు. ఒకసారి సత్యనారాయణకు ఇదంతా చెప్పాను—"

"ఏ సత్యనారాయణా ?"




"ఆ పుస్తకాల షాపులో వుండడూ-"

"ఆఁ. పొద్దున నిన్నుగూర్చి గంట సేపు కీర్తించాడు..."

"వాడుకూడా మన ఖాతాదారు డేలే!... అంతావిని నాతో విరోధం పెట్టుకుంటాడేమో ననుకున్నాను. కాని ఆనాటినుంచీ మరీ అంటిపెట్టుకొని తిరగటం మొదలు పెట్టాడు నెలతిరిగేప్పటికి రెండువందలూ అప్పుతీసుకున్నాడు—"

"తీసుకొని ఇచ్చాడా?"

"ఈ దేశంలోనూ, ప్రత్యేకించి మా సంఘంలోనూ అలాటి ఆచారమే లేదన్నాగా! ఆనాటినుంచి వాడికి నేనెంతో మంచివాణ్ని!"

"నీమాటలు వింటూంటే నాకు పిచ్చెక్కేట్లు వుంది...పన్నెండయింది...యీ ఒంటిగంట బండికే వెళ్తాను—"

"వెళ్తే వెళ్ళావ్ కాని-నీదగ్గర వొక యాభై రూపాయలుంటే ఇచ్చి వెళ్ళు-నెలాఖరుకు పంపుతాను."

సూర్యనారాయణ బిత్తరపోయి చూసి, పెదవులదాకా వొచ్చిన మాటల్ని బలవంతాన బైటపడనీకుండా లోలోపలే గొణుక్కున్నాడు.

"మరేం భయం లేదు లేవోయ్. కావాలంటే నీకు నోటురాస్తాను—"

వాడు జవాబు చెప్పలేక, మాట్లాడకుండా యాభై రూపాయలూ ఇచ్చి, రిక్షా ఎక్కి "త్వరగా—స్టేషన్‌కు" అని తన వెనుక ఏదో వన్యమృగం ఉన్నట్టు, తిరిగన్నా చూడకుండానే సాగిపోయ్యాడు.

నేను ఇంతకుముందే అప్పుగా సంపాయించిన పైకాన్ని జేబులో పెట్టుకొని, స్నేహబృందంలోని సభ్యులు ఎక్కడ ఎదురౌతారో ననే భయంతో - సందుగొందుల్లోనుంచి ఇంటిదారి పట్టాను.

---

# దొంగ



## బాలగంగాధర తిలక్

మసక మసకగా వుంది వెన్నెల.

చెట్లక్రిందవున్న చీకటిలోంచి నడుస్తున్నాడు గోపాలం. మోకాళ్ళ పైకి ఎగకట్టిన పంచెకట్టూ, ఛాతీకి బిగుతుగా అంటుకొనిపోయిన బనీనూ, మొలలో చిన్న కత్తీ— ఆత్మ విశ్వాసంతో, ధైర్యంతో ఉన్నాడు గోపాలం...

మధ్య మధ్య త్రేణుపులు వస్తున్నాయి పుల్లపుల్లగా — ఒకే ఒక గ్లాసుడు నాటు సారా పుచ్చుకున్నాడు బలానికీ, హుషారుకీ. చదువురాని వాడైనా, ప్రతీదీ ఒక ప్లాను ప్రకారం నడవాలి గోపాలానికి. ఏ పని చేసినా ముందూ వెనకా చూసి ఆలోచించి బేరీజువేసే అలవాటు వుంది అతనికి. ఒక స్వాభావికమైన వివేకం వుంది. అందుకే రత్తయ్యా, సోములూ ఎంతో నమ్మకంవుంచి అతనిమీద యీ బాధ్యత వేశారు. వాళ్ళిద్దరూ లేకుండా

వుంటే, పనులు సవ్యంగా జరుగుతాయి. వాళ్ళిద్దరికీ నిదానం లేదు. ఉత్త కంగారు, ఉత్తి ఆశతప్ప.

రాత్రి ఒంటిగంట దాటితే కాని ఆవిడ మొగుడింటికి రాడు. రెండు వారాలు పరిశీలనగా చూసి ఈ విషయం గ్రహించాడు. ఆ క్లబ్‌లో కూర్చుని ఖరీదైన మందు తాగుతూ పేకాడుతూ డబ్బయిపోయేవరకూ అక్కడే వుంటాడు. ఈ లోగా అతని భార్య వొంటరిగా యింట్లో వంటగదికి పక్కగా వున్న గదిలో పడుకుని నిద్రపోతుంది. వంటగదికి దొడ్లో నుంచి వెళ్లాలి. దొడ్డి చాలా పెద్దది. ఎన్నో మొక్కలూ చెట్లూ వున్నాయి. వాటినీడలో తాను కనుపించడు. మరీమంచిది. వంటగది కిటికీ వానకి తడిసి ఎండకి ఎండి కమ్మిలు పట్టుతప్పి వున్నాయి. ఒలంగా తెలివిగా పనిచేస్తే మూడు నాలుగు ఊచల్ని తీసెయ్యవచ్చును. ఇంక ఒకసారి వంటగదిలో ప్రవేశించాక పని చాలా సులభం తాను అవతల గది తలుపు కొడతాడు మెల్లగా. ఆవిడ ఏ ఎలకో, పిల్లో అనుకుని తలుపు తీస్తుంది. అంతే, తాను కత్తి చూపించి భయపెడతాడు. మెళ్ళో వున్న నాలుగుపేటల గొలుసు ఒడుపుగా లాఘీగా తీసుకుంటాడు. ఆమె తెప్పరిల్లేలోపల, కేక వేసేలోపల తోటలోకి చీకట్లోకి అదృశ్యుడై పోతాడు.

గోపాలం యిలాగ తన ప్లానంతా ఆలోచించుకుంటూ నిబ్బరంగా నడుస్తున్నాడు. రోడ్లు నిర్మానుష్యంగా వున్నాయి - అక్కడక్కడ ఒకరిద్దరు రాత్రించరుల్ని తప్పించి, ఊరికి దూరంగా వున్న కొత్తపేట యిది. ఊళ్లోవున్న జనసంచారమూ అలజడీ ఇక్కడ వుండవు. మొదట ఆట అయిపోగానే మొగలోవున్న కిళ్ళీకొట్లూ, చిన్న కాఫీ హోటలూ మూసేస్తారు. చాలా ఇళ్లు నిద్రలో మునిగిపోయాయి. కొన్ని ఇళ్ళ లోంచి మాత్రం విద్యుద్దీపకాంతి కిటికీల లోంచి వస్తోంది. మొత్తమ్మీద వీధులూ, ఇళ్లూ ఆ మసక వెన్నెలలో ఒంటరిగా గోపాలంకోసం యెదురు చూస్తోన్నట్టు వున్నాయి.

గోపాలానికి తను చేసే పనిమీద నైతిక సందేహాలు ఏమీలేవు. దొంగతనం తప్పనీ, పాపమనీ అతను అనుకోలేదు. ఎందరో తమతమ అవసరాలకి యెన్నో వృత్తులూ, ఉద్యోగాలు చేసినట్టుగా అతనూ యిది చేస్తూన్నాడే తప్ప మంచిచెడ్డల సూక్ష్మ విచారణచేసే పిరికితనంకాని, అసలటువంటి ఆలోచనలకి అవసరంకాని అతనికి కనిపించలేదు. అందువలన అతనికి అంతరాత్మ నినొక్కివేయడమూ ఒప్పించడమూ లాంటి బాధలు కలుగలేదు. తనపనిలో దొరికిపోతే జైలుకి వెళ్ళాలన్న భయమూ జ్ఞానమూ వున్నాయి అతనికి. అందుకే జాగ్రత్తగా ప్లానువేసుకుంటాడు. ఎంతో

అవసరమైతేకాని రత్తయ్యనీ, సోముల్నీ వెంట తీసుకుని వెళ్ళడు. వాళ్ళిప్పుడు కనకోసం ఆశగా ఎదురు చూస్తూంటా రన్న ఆలోచన అతనికి మరింత ఉత్సాహం యిచ్చింది.

ఆ యిల్లు మసక వెన్నెల్లో ముడుచుకున్న తాబేలులా వుంది. ప్లాను ప్రకారం ఇంటివెనక్కి వెళ్ళి దొడ్లోకి ప్రవేశించాడు. అరటిచెట్లూ, కొబ్బరిచెట్లూ ఏవేవో మొక్కలూ, తుప్పలూ అంతా గలీజుగా చీకటిగా వుంది. నెమ్మదిగా నడిచి వంట గది దగ్గరకు వచ్చాడు గోపాలం. కిటికీ వూచల్ని ఒకసారి లాగిచూశాడు. ఇంతలో అతనికి లోపల్నుంచి మాటలు వినిపించాయి. అతనికి ఆశ్చర్యం కలిగింది. అతని పథకం అప్పుడే దెబ్బ తిన్నట్టనిపించింది. ఈసారి మాటలు కొంచెం గట్టిగా కోపంగా వినవచ్చాయి. గోపాలానికి కుతూహలం కలిగింది. బహుశా ఆ వచ్చిన వాళ్లెవరైనా మళ్ళీ వెళ్ళిపోవచ్చును. తన మార్గం నిరాటంకమవవచ్చును అనికూడా అనిపించింది. ఒకవేళ ఎవరేనా ప్రియుడేమో — మొగుడు లేకుండా చూసి ప్రేమకలాపం జరుపుతోందేమో అని ఊహ తట్టింది. మాటలు తొందరగా గట్టిగా వినబడుతున్నాయి. ఆవిడ గొంతులో ఏదో భయం, బాధా వున్నాయి. అతని కుతూహలం హెచ్చింది. బలంగా వూచల్ని లాగి కదిపి ఊడదీశాడు. నేర్పుగా ఏర్పడిన జాగాలోనుంచి వంటింట్లోకి ప్రవేశించాడు. పక్కగదిలోనుండి మాటలు వినబడుతున్నాయి.

"వద్దండీ – నా మాట వినండి" ఆవిడ గొంతు.

"ఇస్తావా – తగల నియ్యనా" మగ గొంతు

"ఎందుకు జూదమాడి తగలేస్తారు చెప్పండి. కాపరానికొచ్చిన నాటినుండి సరదాలేదు, సుఖంలేదు. ఉన్న ఆస్తంతా తగలేశారు చాలదా?"

"వెధవ లెక్చరివ్వక మర్యాదగా తీసి ఇలా ఇయ్యి. లేకపోతే..."

"ఈ ఉన్న ఒక్క గొలుసూ ఇస్తే నా గతేంకాను. బాబు గతి ఏంకాను; చూడండి వాణ్ని–కన్నకొడుకుని. మీకు దయలేదా? జాలిలేదా? ఏమండీ – ఈ వాళ్టికి ఊరుకోండి. పన్నెండు గంట లవుతోంది. ఒక్కరాత్రినీ బిక్కుమంటూ ఇంట్లో–రండి. పడుకోండి."

కర్కశంగా వినబడింది యీ సారి మగగొంతు – "ఇస్తావా – పీక పిసికి చంపెయ్యమన్నావా, వెధవ పీడ వదుల్తుంది"

"ఇవ్వను."

"ఇవ్వవా?"

"ఇవ్వనుగాక ఇవ్వను. ఇది మా పుట్టింటివారు పెట్టింది. ఇది నా ఆస్తి."

వింటూన్న గోపాలానికి ఆవిడ మాటలలో ఏదో న్యాయం గోచరించింది.

ఆవిడ గొంతు తియ్యగా సన్నగా జాలిగా వుంది. గోపాలానికి ఆవిడ మొగుడిమీద కోపంవచ్చింది.

"నీ ఆస్తా - ? ఏఁవిటే పేలావు ముండా - ఇన్నాళ్లూ తిన్నది నా డబ్బు కాదూ ; తే - ఆ గొలుసు తే."

"ఏఁవండీ. ఇలా అన్యాయంగా మాట్లాడతారేమండి... నేను మాత్రం మీ కోసం, మీ బాగుకోసం కాదూ చెపుతున్నది. ఈ గొలుసొక్కటే యింక మనకి ఆధారం నాకు పసుపు కుంకుమ కింద మా వాళ్లు రాసిచ్చిన ఎకరమూ మీరు అమ్మేస్తే యేమైనా అన్నానా? మీరు తాగుతారు. జూదమాడతారు. మీకు మంచీ చెడ్డా; భార్యా కొడుకూ అన్న విచక్షణ పోయింది. ఈ నరకంలో మగ్గిపోతూ ఉండాల్సిందేనా, మీ కాళ్ళు పట్టుకుంటాను. నా మాట వినండి "

ఛెళ్లుమని చప్పుడు వినిపించింది గోపాలానికి. జాలీఉద్రేకమూ కలిగాయి. దీనంగా మధురంగా గద్గదికంగా వున్న ఆమె గొంతు అతన్ని ఆకట్టింది.

"కొట్టండి, చంపండి. నా గొలుసు మాత్రం యివ్వను "

"ఇవ్వవూ, ఇవ్వవుటే పింజారి ముండా." మళ్ళీ గుద్దినట్టు చప్పుడు. ఆమె ఏడుస్తోంది, నిస్సహాయంగా. దీనంగా, బాధగా ఆమె ఆక్రోశించింది. ఇద్దరూ పెనగులాడుతూన్న ధ్వని వినపడింది గోపాలానికి

"వొదలండి న న్నొ ద లం డి. అమ్మో "

గోపాలం పిడికిళ్ళు బిగించాడు. అతని కళ్ళలో ఎర్రజీర కదలింది.

"పీక పిసికి తీసుకెళతాను. గొలుసు ఇలా పడెయ్యి."

"ఎందుకివ్వాలి మీకు. జూదంలో తగలెయ్యడానికా? ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూనే మాట్లాడుతోంది పిల్లవాడికి దగ్గుమందైనా తీసుకురాలేదు. ఒక్క మంచి చీర లేదు. కట్టుకున్న పెళ్ళాం చచ్చిందో బతికిందో చూడరు. ఇంక వీధులమ్మట ముష్టెత్తుకుని బతకాలి నేను."

"ఈ వేలెడు వెధవకోసం నా కివ్వ వన్న మాట ఆగు వీడిని చంపేస్తాను వీడి పీక నులిమేస్తాను."

"అయ్యో అయ్యో వాణ్ణి ఏం చెయ్య కండి. అయ్యో అయ్యో" ఆవిడ పెద్ద పెట్టున కేకలు. పిల్లవాడు కెవ్వుమని ఏడుపు.

గోపాలం ఇంక ఆగలేకపోయాడు. కుర్రవాణ్ణి పీక నులిమి చంపివేస్తున్న దృశ్యం అతని కళ్ళముందు కదలింది. బలమంతా ఉపయోగించి తలుపు తన్నాడు రాలేదు. తిరిగి దఢదఢా తన్నాడు. తలుపులు విచ్చుకున్నాయి. ఆమె కుర్రవాణ్ణి ఎత్తుకొని గోడమూలగా నక్కివుంది వణికిపోతూవుంది.

"బాబు నేమీ చెయ్యకండి. వొదలండి ఇదిగో గొలుసు" అంటూ మీదికి రాక్షసుడిలా వొంగిన అతనికి గొలుసు ఇస్తోంది మొగుడు తీసుకొని వెనక్కి తిరిగాడు. ఎదురుగా గోపాలం

"ఎవడవురా నువ్వు? అన్నాడు మొగుడు.

గోపాలం బలంగా అతని దవడమీద ఒకటి వేశాడు. మొగుడు తూలిపడబోయాడు. గోపాలం యీసారి మీదకురికి అతని తలవంచి బలంగా గుద్దాడు. అతను కిందపడ్డాడు

"ఆడతూతుర్ని కొడతావా? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా? దొంగ యెదవా, సిగ్గులేదురా. నీకు, బుద్ధిలేదురా. ఏది ఆ గొలుసు ఇలా యియ్యి లేవకు. లేచావంటే సంపేత్తాను."

గోపాలం అతని చేతిలోంచి గొలుసు లాక్కున్నాడు. అతను కిందపడి వగరుస్తున్నాడు. రొప్పుతున్నాడు. ఆమె యీ హఠాత్పరిణామం అర్థంకాక నిశ్చేష్టురాలై గోడకి బల్లిలా అంటుకుని కళ్ళప్పగించి చూస్తోంది.

"తాగుడూ జూదమూనట్రా నీకు సదువుకున్నోడివి ఉద్యోగం చేసి పెళ్లాం పిల్లల్ని పోషించాల్సింది. పైగా పెళ్ళాం నగలే ఎత్తుకుపోతావట్రా దొంగ నాయాల..."

నేలను కరచుకున్నా మొగుడు అస్పష్టంగా బూతులుతితువున్నాడు. గోపాలం డొక్కలో ఒకటి తన్ని "నోర్మయ్యి" అన్నాడు. ఆమె "వద్దు వద్దు కొట్టకు" అని అరచింది.

గోపాలం చేతిలో గొలుసుతో గోడ వారనున్న ఆమెను సమీపించాడు ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగా వుంది. జుట్టంతా రేగిపోయివుంది. చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిసిపోయి వున్నాయి. పాతికేళ్ళయినా వుండవు. ఆమె కళ్లలో భయాశ్చర్యాలు పెనవేసుకున్నాయి. చంకలో పిల్లవాడు ఏడుస్తున్నాడు.

"ఇదిగోనమ్మా గొలుసు" అంటూ ఆమె చేతికి గొలుసు ఇచ్చాడు. కింద దొర్లుతూన్న మొగుడు లేవబోయాడు. గోపాలం మొలనుండి కత్తి తీశాడు.

"ఇదేవిటో చూశావా! లేవడానికి ప్రయత్నించావా పొడిచేస్తాను ఖబడ్దార్. దెబ్బకి యెగిరిపోతావు."

మొగుడు దండం పెట్టాడు.

"నువ్వు మళ్ళీ ఎప్పుడేనా గొలుసు తీసుకున్నట్టుకాని, ఆవిడ వొంటిమీద దెబ్బపడినట్లుగాని తెలిసిందా నీ ప్రాణం తీసేస్తాను" గోపాలం కత్తిని అతని ముఖానికి దగ్గరగా పెట్టి ఝళిపించాడు.

మొగుడు తలవూపాతు ఇంకెప్పుడూ చెయ్యనన్నట్టుగా.

గోపాలం ఆమెవైపు తిరిగాడు. "ఏం భయంలేదు. ధైర్యంగా వుండమ్మా" అన్నాడు.

ఆమె భయంతో కృతజ్ఞతతో తల వూపింది.

గోపాలం కత్తి మొలలో పెట్టుకుని వెళ్ళిపోబోయాడు ఆమె హీనస్వరంతో అడిగింది. "ఎవ్వరు బాబూ నువ్వు..."

"నేనా...నేనా" తెల్లబోయాడు గోపాలం. "నన్ను గోపాలం అంటారు లెండి. అంతే'' అంటూ గోపాలం తలెత్తకుండా వడివడిగా పెరట్లోకి చీకట్లోకి వెళ్ళిపోయాడు.

---




పించింది గాని, నానమ్మగారినీ, అమ్మాయినీ చూస్తే చిన్నఆశ ఒకమూల పీడించింది.

"వెళ్ళొస్తా నానమ్మగారూ...వెళ్లొస్తానమ్మాయిగారూ!" అన్నాను, చేతనైనంత దిగులు నిరాశ గొంతులో నింపి. నానమ్మగారు కాస్త ఆలోచించి,

"రా రా అబ్బాయి" అన్నారు, అమ్మాయితో మెట్లెక్కుతూ.

ఇంక పని జరిగి తీరుతుందన్న ఆశ బలపడింది. వాళ్ళని అనుసరించాను.

మేడమీద పడకగదిలో కుర్చీలో కూచుని పేపరు చదువుకుంటున్నారు శేషాద్రిగారు. నానమ్మగారూ అమ్మాయీ ఆయనదగ్గర కెళ్లారు. నేను గుమ్మంలోనే నిలబడ్డాను.

"ఆయన పాపం చాలా కష్టాల్లో ఉన్నారట నాన్నా! ఏదన్నా పనివ్వకూడదా?" అంది అమ్మాయి.

"ఏం పనివ్వమంటావమ్మా? హోటల్లో పనికిరాడు. ఇంట్లో ఇవ్వడానికేంలేదు"

"ఇవ్వదలుచుకుంటే పనులే ఉండవా ఏమిటి?"

"పైగా సాటివాడు."

శేషాద్రిగారు ఆలోచిస్తున్నారు. మెత్తబడుతున్నట్టే తోచింది.

"నువ్వు ఇంగ్లీషు నేర్చుకుంటావా? టీచరుగా పెడతాను?"

నాలో ఆశ గంతులేసింది. అమ్మాయి ముభావంగా ఉండడం చూసి మళ్ళీ అడుక్కి పోయింది. అప్పుడంది నానమ్మగారు—

"ఇంట్లో నేర్చుకోడానికేం? నిక్షేపంలా నేర్చుకుంటుంది." ఎగిరి గంతేశాను.

(సశేషం)



# ఎన్నిక

## మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఇంటర్వ్యూ సరిగ్గా పదకొండున్నరకి.

నేను బెంగుళూర్ తొమ్మిదిన్నరకి చేరుకున్నాను. నాకోసం నన్ను ఇంటర్వ్యూకి పిలిచిన కంపెనీవాళ్లే ఓ పెద్ద హోటల్‌లో గది బుక్ చేశారు.

సరాసరి ఆ హోటల్‌కి చేరుకున్నాను ఆటోలో. నా పేరు చెప్పగానే గది నంబర్ చెప్పి, గది తాళంచేతులు అందించారు నాకు. హోటల్ బాయ్ నా సూట్‌కేస్ తీసుకువస్తే టిప్ దొరకచ్చని ఆశ పడ్డాడు కాని చిన్న బ్రీఫ్‌కేస్ మాత్రమే వుంది నా దగ్గర. ఒక్కరోజే నేను బెంగుళూరులో వుండేది. మద్రాస్‌నుంచి బెంగుళూరుకి నిజానికి అదికూడా అవసరంలేదు. కాని తెచ్చాను.

గదిలో బ్రీఫ్‌కేస్ తెరిచి, టవల్ తీసి ముందర మొహం కడుక్కొన్నాను. ఆ గదిలోని డ్రస్సింగ్ టేబిల్‌కున్న డ్రాయర్ తెరిచాను. నా కాగితాలు పెడ్దామని.

ఎదురుగా ఆ డ్రాయర్‌లో నా గుండె ఝల్లుమనేలా వుంది రూపాయలకట్ట. ఆ కట్టలో ఉన్న ఒక్క రూపాయి నోట్లే - పాతవి, కొత్తవి, నలిగినవి, నలగనివి, అన్నిరకాల రూపాయి నోట్లున్నాయి. లెక్క పెట్టాను, వందరూపాయలు సరిగ్గా.

బహుశా ఆ గది ఖాళీచేసినవాళ్లు దాన్ని అక్కడ దాచి, ఖాళీచేసేటప్పుడు తీసుకోవడం మర్చిపోయి వుంటారు. జేబులో వేసుకుని, వెంటనే ఇంటర్వ్యూకి హాజరవడానికి బయలుదేరాను. దారిలో ఆ కట్ట ఓ షాపులో ఇచ్చి, వంద రూపాయలనోటు తీసుకున్నాను. ఆ హోటల్‌వాళ్ళకి డబ్బు మర్చిపోయిన సంగతి వాళ్లు వచ్చికానీ, ఫోన్‌చేసికానీ చెప్పినా, నన్ను వెదికితే అది దొరకదిక.

ఇంటర్వ్యూలో అన్ని ప్రశ్నలకి సమాధానాలు చెప్పాను. మద్రాస్‌లో నేను పనిచేసే కంపెనీలో నేను నిర్వహించే బాధ్యతలకన్నా ఇక్కడ ఇంకా ఎక్కువ నిర్వహించాలి. అందుకే జీతం వెయ్యి కాక, పదిహేనువందలు ఇవ్వడా




నికి సిద్ధమయ్యారు వాళ్ళు. ఎపాయింట్‌మెంటు ఆర్డర్ నాలుగయిదు రోజుల్లో పంపుతామని చెప్పారు

హోటల్ గదికి తిరిగి వచ్చాను. ఎవరూ ఆ డబ్బు గురించి అడగలేదు. వెంటనే ఖాళీచేసేశాను, అనవసరంగా కష్టం కోసం ఎదురుచూస్తూ కోర్చోడం ఇష్టంలేక. వెంటనే మద్రాస్‌కి వెళ్ళే బస్ ఎక్కాను, ఆ రాత్రి ఉండకుండానే.

నాలుగోరోజు నన్ను ఇంటర్వ్యూ చేసిన కంపెనీనుంచి ఉత్తరం వచ్చింది. ఆత్రంగా కవరు విప్పాను. అపాయింట్‌మెంట్ ఆర్డర్ కాదది. వుద్యోగం ఇవ్వటం లేదని వ్రాసిన రిగ్రెట్ లెటర్. ఇంకా ఇలా వ్రాశారు.

"మీకు ఇద్దామనుకున్న పోస్టులో పనిచేసేవ్యక్తి మంచివాడు. లంచాలు పుచ్చుకోనివాడు. దొంగతనం చేయనివాడు. ముఖ్యంగా అవినీతిపరుడై వుండకూడదు. మీ మంచితనం నిర్ణయించడానికోసం, మీరు బసచేసిన హోటల్ గదిలో ముందుగా వందరూపాయలుంచాం. మీరు ఆ వందని హోటల్ యాజమాన్యం వాళ్లకి తిరిగి ఇచ్చేసి వుండాల్సింది. అది న్యాయం. మీరు దాన్ని సంగ్రహించటం మీ స్వభావాన్ని ప్రదర్శిస్తోంది. దయచేసి ఆ వంద పంపవలసిందిగా కోరుతున్నాం లేదా మీరు ప్రస్తుతం పనిచేస్తున్న కంపెనీకి ఈ సంగతి తెలియచేయాల్సి వుంటుంది."




శనివారం రాత్రి సుమారు ఎనిమిది గంటలయింది. విజయవాడ రైల్వే స్టేషన్‌కి మంగళరావు చేరుకుని పది నిముషాలయిపోయింది.

చుట్ట తాగుతూ మంగళరావు ఎదురుగా ఆగివున్న హౌరా—మద్రాస్ మెయిల్ వంక చూస్తూ ఆలోచిస్తున్నాడు దీర్ఘంగా—అతి దీర్ఘంగా.

తను తాగే ఆఖరి చుట్ట అది ఆవాలా, కాదా అని. తను ఇంకా బ్రతికే ఉండాలా లేక చచ్చిపోవాలా అని. మంగళరావుకి తను బ్రతికివుండటంవల్ల కలిగే ఉపయోగం ఏమీ కనిపించటంలేదు.

త నుబ్రతికే వుంటే, అందరిముందూ తిరుగుతూంటే, తనకి లభించేది సుఖం కాదు, అశాంతి. దుఃఖం. తీవ్రమయిన మనస్తాపం.

అలా అనవసరంగా అందరిచేతా

చిన్నచూపు చూడబడటానికి, అవమా నింపబడటానికి తనంతట తానుగా ఎటు వంటి తప్పూ చేయలేదు. తనని పుట్టిం చిన భగవంతుడిదే ఆ తప్పంతా. తనకి జన్మ ఇచ్చే తరుణంలో బహుశ బ్రహ్మ దేముడి మనస్సు బావుండివుండదు. అందుకే తనని గురించి అట్టే పట్టించుకో కుండా ఈ భూమ్మీదికి తోసేసాడు.

చుట్టని తాగుతూ ఎదురుగా కంపార్ట్ మెంటులోని కిటికీ ముందు కూర్చున్న దంపతులిద్దరివంకా చూసాడు మంగళ రావు. ఆ ఇద్దరినీ చూస్తూంటేనే ఎలాంటి వాళ్ళకయినా అసూయ కలగక మానదు.

అందులో తనకి కలగడంలో ఆశ్చ ర్యం వుండనే వుండదు. ముప్పై అయి దేళ్ళుంటాయి ఆ అబ్బాయికి. అందంగా, ఆరోగ్యంగా, ఖరీదయిన బట్టల్లో హుందాగా వున్నాడతను.

పాతిక వుండచ్చు ఆ బంగారు బొమ్మకి. నిజమే. సరిగ్గా అనుకున్నాడు తను. బంగారుబొమ్మే నిజంగా. బంగారం రంగు వొళ్ళు ఆ అమ్మాయికి. కోల మొహం. నల్లటి కళ్ళు. గుండ్రటి కళ్లు. కళ్ళలో వజ్రాలున్నాయని భ్రమ కలి గేలా మెరిసే నల్లటికళ్ళు. టమోటాపండు రంగులో వున్న తడి పెదవుల జంట వెనక తళుక్కుమనే పళ్ళు చిరునవ్వుకు తార్కాణం

నిజంగా ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణం చేయాల్సినంత అందం ఆ అమ్మాయి సొత్తు. అర్థ్రప్రాప్తం.అజంటఅదృష్టం.

మంగళరావు ఆలోచనలలోకి మళ్ళీ బ్రహ్మదేవుడు ప్రవేశించాడు. ఆ అమ్మా యిని బ్రహ్మదేవుడు ప్రత్యేకశ్రద్ధతో తయారుచేసాడు. తన దగ్గరున్న బంగారు మట్టినంతా ఆ అమ్మాయి దేహంకోసం ఉపయోగించి, సరస్వతి, నారదుల అభిప్రాయాలడిగి, నగిషీలు చెక్కి, చిరునవ్వుకి కూడా అందాలు తొడిగి, ప్రాణం ఇచ్చివుంటాడు.

మంగళరావు చుట్ట విసిరేసాడు ఆఖరి సారిగా దమ్ములాగి. ఓ నిశ్చయానికి వచ్చేసాడు గంట కొడుతూండగా. సందే హంలేదు. ఇదే ఆఖరిచుట్ట. ఇదే ఆఖరి రోజు. ఇదే ఆఖరి అయిదు నిముషాలు తన జీవితంలో. ఇక తను బ్రతకడు. బ్రతికి వుండలేడు.

చటుక్కున ప్లాట్‌ఫారం అంచుకు నడిచాడు. హౌరా-మద్రాస్ ఎక్స్‌ప్రెస్ ఇంజను గంభీరంగా అరిచింది, బయల్దేరు తున్నా నన్నట్టుగా. ప్రయాణీకులు పెట్టె ల్లోకి ఎక్కుతున్నారు. గార్డ్ విజిల్ వూది, పచ్చజండా వూపుతున్నాడు.

మంగళరావు క్షణం ఆలస్యం చేయ లేదు. ప్లాట్‌ఫారానికీ, రైలుపెట్టెకీ మధ్య వున్న ఖాళీస్థలంలోంచి, రైలు పెట్టె కిందకి దిగాడు. రెండు చక్రాల మధ్యనుంచి, రైలుపట్టాల మధ్యవున్న తూములాంటి దానిలోకి దిగాడు. తూములో నుంచుని, నడుము వంచి

పీపుని రైలుపట్టాలమీద ఆనించాడు ప్లాట్‌ఫారం వైపు. కళ్ళు మూసుకున్నాడు. వూపిరి బిగబట్టాడు. మనసులోనే క్షణాలు లెక్కబెట్టసాగాడు.

రైలు కదులుతుందనుకున్నాడు. తన మీదనుంచి ఆ కంపార్ట్‌మెంట్ చక్రం వెళ్తుందనుకున్నాడు. తన జీవితం కునిసిందనుకున్నాడు.

అరుపులు కేకలు. రైలు కదలలేదు. ఇందాక రైల్లో, కిటికీ ప్రక్కన కూర్చుని వున్న ఆ బంగారుబొమ్మ భర్త కంపార్ట్‌మెంట్ దిగి, ఆ కంపార్ట్‌మెంట్ కింద వున్న మంగళరావుని చెయ్యిపట్టుకుని, కోపంగా అరుస్తూ పైకి లాగసాగాడు.

చాలామంది గుమిగూడారు. సాయంపట్టారు. మంగళరావుని పైకి లాగారు. రైల్వేగార్డు, ఇంజన్ డ్రయివర్ వచ్చి చెడామడాతిట్టారు మంగళరావుని.

"నీ పేరు?" అడిగాడు అతను.

"మంగళరావు" హీనస్వరంతో చెప్పాడు మంగళరావు.

"ఎందుకిలా చేశావ్?" అడిగాడు రైల్వేపోలీస్.

"దుర్భరమయిన జీవితం కొనసాగించటం ఇష్టంలేక."

"ఇది చట్టవిరుద్ధం'' కఠినంగా అన్నాడు గార్డ్.

"కావచ్చు."

ఆ బంగారుబొమ్మ భర్త తదేకంగా చూస్తూండిపోయాడు మంగళరావువంక ఆశ్చర్యంగా

"నా వెంట రా" రైల్వే పోలీస్ మంగళరావు చెయ్యి పట్టుకున్నాడు.

ఆ బంగారుబొమ్మ భర్త మంగళరావు కొద్దిదూరం పోలీస్ వెంట వెనక నడిచాక కదిలాడు. మంగళరావు దగ్గరకి వెళ్ళాడు గబగబా. జేబులోంచి తన విజిటింగ్ కార్డు తీసి, మంగళరావు జేబులో వుంచుతూ అన్నాడు:

"శిక్ష పూర్తయ్యాక ఓసారి ఈ అడ్రసుకు రా. కొత్తజీవితం అక్కడ నీకు లభిస్తుంది. నీ కక్కడా బావుండక పోతే నీ ఇష్టం వచ్చినట్లు చేద్దువుగాని. కాని మరోసారి ఆత్మహత్యకి ప్రయత్నించే ముందు నాకు కనబడటం మర్చిపోకు.''

"ఎందుకు?" విస్మయంగా అడిగాడు మంగళరావు. "నాలాంటి వాడితో మీకు పనేముంటుంది? దుర్బలుడిని."

"నీకే తెలుస్తుందిగా."

మంగళరావు వెనక్కి తిరిగి చూస్తూ నడిచాడు పోలీస్‌ల వెంట.

రైలు అయిదు నిముషాల తర్వాత కదులుతుండగా అడిగింది బంగారుబొమ్మ తన భర్తని.

"ఎవరతను? ఏం మాట్లాడారు?"

జవాబు చెప్పలేదు భర్త. అసలు తన భార్య వంక చూడనయినా చూడలేదు.

*  *  *

జైల్లో వుండగా మంగళరావు ఆలోచించాడు చాలాసార్లు. కాని ఆ ఆగంతకుని ఆహ్వానంలోని అంతరార్థం బోధ

పడలేదు. కలకత్తా వెళ్ళి అతన్ని కలిసే దాకా.

కలిసాడు తొమ్మిది నెలల తర్వాత తనని చూడగానే గుర్తుపట్టాడు. గూర్ఖాతో ముందరే చెప్పివుంచినట్లున్నాడు. ఆల్సేషన్ కుక్క తననేం చేయకుండా డ్రాయింగ్ రూమ్‌దాకా తీసుకెళ్లాడు తనని గూర్ఖా. తను రాబోయే ముందు వుత్తరం రాయడం మంచిదయింది అనుకున్నాడు మంగళరావు.

"నీకు ఇంటిపనీ, వంటా వచ్చా?" అడిగాడు బంగారుబొమ్మ భర్త మంగళరావుని.

బదులుగా తలవూపి చెప్పాడు మంగళరావు.

"చాలాకాలం హోటల్‌లో పనిచేసాను."

"వెరీగుడ్. ఇప్పటినుంచే పనిలో చేరు. జీతం బాగానే ముడుతుంది."

"నేనా? నాకు పనిఇస్తున్నారా?" అని నవ్వి మళ్ళా చెప్పాడు." నాఅంతట నేనే పనిచేస్తానని ఇంతవరకు ఎంత మందిని అడిగినా ఎవరూ పని ఇవ్వలేదు మీరు ధర్మాత్ములులా వున్నారు."

"ధర్మాత్ముడ్నికాదు. అయినా పని ఇస్తున్నాను." మృదువుగా నవ్వి చెప్పాడు అతను.

"నామీద జాలా?" అడగకూడదనుకుంటూనే అడిగాడు మంగళరావు.

"కాదు. నా స్వార్థం."

ఆ సాయంత్రం డైనింగ్ రూమ్‌లో కూర్చుని టిఫిన్ తింటూన్న బంగారు బొమ్మకి బోర్నవిటా కలుపుతూ, 'దగ్గర నుంచి చూస్తే ఎంత బావుంది' అనుకోకుండా వుండలేకపోయాడు.

బాత్‌రూమ్ అద్దం ముందు నిలబడి, వాష్‌బేసిన్ గిన్నెలు తోలుస్తూ తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు మంగళరావు. చాలా చాలా నెలల తర్వాత అలా చూసుకున్నాడు.

పుట్టుకతోనే రెండుగా చీలిన పైపెదవి (హేర్ లిప్) పెదిమలకు మధ్య నుంచి బయటకి పొడుకుని వచ్చిన మూడు ఎత్తుపళ్లు. మొహంనిండా చిన్నప్పుడు వచ్చిన స్ఫోటకం మచ్చలు. ముందు సగభాగం బట్టతల. నుదుటి మీద నల్లగా కాల్చిన మచ్చ. చిన్నప్పుడు జ్వరంలో పోయిన కుడికన్ను.

కురూపి.

వికృతరూపుతను. తన మొహంలోకి చూడాలంటేనే రోతపుడుతుంది అందరికీ. కుడికాలికంటె ఎడంకాలు పెద్దదవటంవల్ల నడకలో కుంటితనం స్పష్టంగా కనిపిస్తుంది.

ఇలాంటి తనకి, అవమానాలతో, చీదరింపులతో, అవహేళలతో విసిగి వేసారిపోయిన తనకి ఇక్కడ క్రొత్త జీవితం? అంతా కలగావుంది.

"ఆయన వుత్త అనుమానం మనిషి." గూర్ఖా వారం రోజుల తర్వాత మంగళరావుకి చెప్పాడు. ఇంతకు మునుపు వుండే వంటవాడికీ, ఆ బంగారుబొమ్మకీ సంబంధం అంటగట్టి, వాడ్ని తన్ని తగిలేసాడు."



# మెలికల కడియాలు

వాసిరెడ్డి సీతాదేవి

పొద్దుట్నుంచీ కోటిగాడి వాలకం కని పెట్టి చూస్తున్నాడు రామిగాడు. దొరసానమ్మగారికి జ్వరం. దొరగారు వూళ్ళో లేరు. కోటిగాడు పొలంకేసి పోలేదు సరిగదా, ఆఖరికి ఇంటిక్కూడా వెళ్ళొచ్చినట్టు లేదు. కాట్లకుక్కలా కన పడిన జీతగాళ్ళందరినీ నానాకూతలూ కూస్తున్నాడు.

అసలే మచ్చుముఖం. అందుకు తోడు పొద్దుట్నుంచీ దొంగచూపులు చూస్తున్నాడు. తను రెండుసంవత్స రాల్నుంచీ గుట్టుగా దాచిన రహస్యం కాస్తా గ్రహించేశాడా అన్న అనుమానం కూడా కలిగింది రామిగాడికి.

సూర్యాస్తమయానికి ఇంక ఆట్టేకాలం పట్టదు తను యివ్వాళ పనులన్నీ చక చకా ముగించాడు. ఇంక పాడిగేదెలు రెంటికీ ఇంత కుడితి పెట్టటంతో తన పని ముగుస్తుంది. తరవాత సరాసరి భద్రాచారి దుకాణానికి. ఆ తరవాత...

ఆ సంగతి వూహ కందినప్పుడల్లా రామిగాడి శరీరం పులకరిస్తోంది. హృదయం ఆనందంతో పరవశ మౌతోంది. మనస్సు గాలిలో అలా తేలి పోయి, రెండు సంవత్సరాల కిందట తను పొందిన అనుభూతిని తిరుగా ఆకట్టుకుంటోంది.

నాలుగుచేటల తవుడు గబగబా కుడితి గాబులో పోశాడు రామిగాడు. రెండుచేతుల్నీ గాబులో పెట్టి నీళ్లతో కలిసీ కలవకుండావున్న తవుడును గిర గిరా తిప్పసాగాడు. సుడులుతిరుగుతూ అలలరూపంలో అంచుల కెగబాకుతున్న గాబులోని నీటిలాగే, అతడి మనస్సు కూడా భద్రాచారి దుకాణాన్నీ తను కొనబోయే మెలికల కడియాల్నీ అంది పుచ్చుకుంటోంది.

కోటిగాడు వచ్చాడు. అల్లంత దూరాన నుంచుని రామిగాణ్ణి నఖశిఖ పర్యంతం గుచ్చిగుచ్చి చూశాడు. రామి

గాడు ఇదేమీ గమనించే స్థితిలో లేడు... తన ఆలోచనల్లో... రెండుసంవత్సరాల శ్రమ ఫలితంగా, ఫలించిన తన ఆలోచనల్లో అతడు ఉండిపోయాడు.

"ఏంరోయ్, ఐ లే వు సా ర్ లో వున్నావ్?" అన్నాడు కోటిగాడు.

"ఎహెహె, ఏంలేదు'' అనేశాడు రామిగాడు, వులిక్కి పడి తలెత్తుతూ.

"మాణిక్యం తొందరగా రమ్మందేరా?" అన్నాడు కోటిగాడు, అదే దొంగచూపుతో.

"అదేం కాదులేవోయ్. ఇయ్యాల..." నాలిక్కొరుక్కున్నాడు రామిగాడు.

"అసలు సంగతేందర? నామీద నమ్మకం లేదా?"

"ఊఁ'' అని మూలిగాడు రామిగాడు. అంతలోనే వళ్ళుమరచిన వుత్సాహంతో "అఁ ఏంలేదు. మా ఆడదానికి మెలికల కడియాలంటే మాచెడ్డసరదా. పెల్లయినప్పటినుంచీ కొనిద్దామంటే డబ్బు పిగల్లేదు..."

"అయితే ఇయ్యాల కొనబోతూ వుండావన్న మాట?" మధ్యలోనే అందుకుని గుచ్చిగుచ్చి చూస్తూ అడిగాడు కోటిగాడు.

కోటిగాడి చూపుల్లో 'నీకింత డబ్బు ఇవ్వాళ ఎక్కడినుంచి వచ్చింది?' అన్న ప్రశ్న ద్యోతకమవుతోంది. కండ్ల కొనల్లోంచి ఈర్ష్య తొంగిచూస్తోంది.

రామిగాడి మనస్సు చివుక్కుమన్నది కోటిగాడూ, తనూ దాదాపు పదిసంవత్సరాలనుంచి ఐచ్చయ్యగారి పనిలో వుంటున్నారు. తనను చూస్తే ఎందుకో కోటిగాడికి ఎప్పుడూ కోపమే. తనకు పెళ్లయిన ఈ రెండు సంవత్సరాలనుంచీ ఆ కోపం చాలా విజృంభించింది మరీ ఈ పొద్దుట్నుంచి కారాలు మిరియాలు నూరుతున్నాడు.

తనమీద కోటిగాడికి యింత పగ ఎందుకో, యెంత ఆలోచించినా రామిగాడికి అర్థంకాదు. '...ఇయ్యాల కొనబోతుండావన్న మాట!' అన్న కోటిగాడి మాటల వెనక వున్న ద్వేషం రామిగాణ్ని కలత పెట్టింది. ఆ పక్కనే నుంచుని కోటిగాడు ఇంకా విషపునవ్వు నవ్వుతూనే ఉన్నాడు. వాణ్ణి వదిలించుకోవడం ఎట్లా?

కొంచెం చీదరించుకుంటూనే అన్నాడు రామిగాడు—

"ఏడాదినుంచీ అణాలూ, బేడలూ దాచి, ఎట్టయితేం కడాలు కొనేందుకు సరిపడే డబ్బు కూడబెట్టాలేవోయ్!"

ఆ తరవాత ఇక అక్కడ నుంచో లేదు. కుడితిగాబులోంచి చేతులు బయటికి తీసి, మోచేతులవరకూ అంటివున్న తవుడును విదిలించుకుంటూ, గొడ్లచావిడి వేపుకు వెళ్ళిపోయాడు.

రోజూ రాత్రి ఎనిమిదిగంటలవరకూ తెమలని పనిని ఈ రోజు ఆరుగంటలకే ముగించాడు రామిగాడు. దొరసానమ్మ

గారితో వెళ్తున్నాననిచెప్పి, సరాసరి భద్రాచారి దుకాణంకేసి బయలుదేరాడు.

ఈ రోజు అతడి మనస్సు ఆనందంతో పురవళ్ళు పరవళ్ళు తొక్కుతోంది. ఆలోచిస్తున్నాడు. ఇవ్వాళ కూడా భద్రాచారి తనని చూసి ముఖం చిట్లించుకుంటాడు. రోజూ తను చేతులు నలుపుకుంటూ ఒక్కసారి ఆ మెలికల కడియాలు చూపించమని అడిగేవాడు. విదిలించి వదిలించి అతను వాటిని చూపించేవరకూ వదిలేవాడుకాదు.

భద్రాచారి రోజూ తనకేసి 'ఎక్కడిదీ శనిగ్రహం' అన్నట్టు చూసేవాడు. కాని ఇవ్వాళ... దర్జాగా రొండినున్న సంచీలోంచి రూపాయలు తను బయటికి తీస్తాడు. ఒకటి...రెండు...మూడు... మొత్తం ముప్ఫైఆరురూపాయల్ని ఖంగుమనిపిస్తూ భద్రాచారిచేతుల్లో పోస్తాడు.

అప్పుడు చూడాలి భద్రాచారి భత్యారపు కళ్ళజోడు! బహుశా ముక్కుమీదికి జారిపడే కళ్ళజోడును మరో మారు తుడిచి పెట్టుకుంటాడు. ఇంత కాలంనుంచి తనను తేలిగ్గా చూసినందుకు విచారిస్తాడు. తనుమాత్రం డబ్బు అవతల పారేసి, ఆ మెలికలకడియాల్ని తీసుకుని గుట్టుచప్పుడుగా వచ్చేస్తాడు.

రామిగాడు భద్రాచారి కొట్టు ముందుకు వచ్చేశాడు. భద్రాచారి తల వంచుకుని కొలిమి వూదుకుంటున్నాడు. పల్లెటూరి జనంకూడా, బస్తీల్లోనే నగలు చేయించడం నేర్చింతరవాత, భద్రాచారికి దినం గడవటమే కష్టంగా వుంటున్నది. మరీ ఒక నెలనుంచి చేతిలో చిల్లిగవ్వ రాలలేదు. ఒక మెలికల కడియాల జత తయారై సిద్ధంగావుంది: అదన్నా అమ్ముడుపోతే- కాస్త డబ్బు చేతిలో మెదులును. నెల రోజులనుంచి రామిగాడు రోజూ, రేపు తప్పక కొంటాను, ఎవరికీ ఇవ్వవద్దని ఒక్కపొద్దులు చెబుతున్నాడు. రోజూ వచ్చి ఒకసారి చూపించేంతవరకూ విసిగించి మరీ పోతాడు.

రామిగాడి అమాయకత్వం చూస్తే భద్రాచారికి జాలి కలుగుతుంది. తన కోసమే ఆ మెలికలకడియాలు అట్టే పెట్టాననుకుంటాడు. అందుకే తనూ ఏదో వాణ్ణి కనికరిస్తున్నట్టు ప్రవర్తిస్తాడు.

కాళ్ళచప్పుడు విని భద్రాచారి, కొలిమిలో గొట్టాన్ని అలాగే వుంచి తలెత్తి చూశాడు. ఎదురుగా రామిగాడు. అంత వరకూ వాణ్ణిగురించే ఆలోచిస్తున్న భద్రాచారికి, వాడి ఆకారం చూసేసరికి వళ్లు భగ్గుమన్నది. రోజూ ఇదో నాటకం అనిపించింది.

"వచ్చావా, నా ప్రాణంతియ్యటానికీ కడియాలూలేవు గిడియాలూలేవు పోపో, వచ్చావు మహా కొనేవాడివి!" అనేశాడు. భద్రాచారి గుడ్లెర్రచేస్తూ

రామిగాడికి, భద్రాచారి ఈసడిం

పేమీ బాధ కలిగించలేదు. అత నేమం టాడో ముందే తెలుసుగనక, గంభీరంగా ఓ చిరునవ్వు నవ్వి, రొండిన కట్టుకున్న రూపాయిల సంచిని గబగబా వూడ దీశాడు.

భద్రాచారి గతుక్కుమన్నాడు. రామి గాడి కళ్ళు విజయగర్వంతో మెరుస్తున్నాయి. బహుశా విశ్వవిజేత అని పేరుగాంచిన సికిందర్‌కుకూడా, ఏ దేశాన్ని జయించినప్పుడూ అంత ఆనందం. అంత ధీమా, అంత విజయ గర్వం కలిగివుండదు.

ఒక్కొక్క చేలెక్క పెడుతూముప్పై ఆరు రూపాయలూ భద్రాచారి చేతులో పోశాడు రామిగాడు కాని, రామిగాడు వూహించినట్టు, భద్రాచారి భత్వారవు కళ్లు ఆశ్చర్యంతో మెరవలేదు సరికదా, కనీసం రోజూ తన్ను అంత చులకనగా చూసినందుకు పశ్చాత్తాపాన్నికూడా కన బరచలేదు.

తనకు వూరికేనే యిస్తున్నట్టు ఆ కడి యాలజతను చేతిలో పెట్టి, కిక్కురు మనకుండా డబ్బు మరోసారి లెక్క పెట్టుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు భద్రాచారి. రామిగాడికి ఆ నిమిషాన వీలుంటే, భద్రాచారిని నమిలి మింగు దామా అన్నంత కోపం వచ్చింది.

రామిగాడు తిరిగియింటివైపుకు నడుస్తున్నాడు. రెక్కలుంటే ఎగిరిపోయి వుండును. గాలితో తేలిపోతున్నాడు. రోజూలాగానే మాణిక్యం యీ రోజూ బుంగమూతిపెట్టి కూర్చొని వుంటుంది. కొద్దిరోజులనుంచి తననుఎందుకూ పనికి రాని దద్దమ్మకింద కట్టేసింది. మరి యీ రోజో...? తనకు తెలియకుండానే చేయి బొడ్లో దాచివుంచిన కడియాల మీదకి పోయింది. ఆడదాని దృష్టిలో ఒక్కసారి మగవాడు తేలిక అయాడా వాళ్ళను పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు, ఆ అభిప్రాయం మార్చడానికి. కాని అమాయకుడైన రామిగాడికేం తెలుసు ఆ విషయం; కడియాలు చూసి తన్ను ఆనందంతో కావిలించుకుంటుం దనుకున్నాడు రామిగాడు.

రామిగాడికి చిన్నప్పుడే తల్లీ తండ్రీ కరువయారు. మేనమామ యింట్లో పెరి గాడు. పెరగడమంటే పదిసంవత్సరాల నుంచి బుచ్చయ్యగారి యింట్లో రెక్కలు ముక్కలయేలాగబండచాకిరి చేస్తే నెలకు పది రూపాయిలజీతం యిచ్చేవారు అవి అల్లారుముద్దుగాతెచ్చి అత్తచేతిలో పోస్తే ముక్కువిరుస్తూ, మూతివిరుస్తూప్రొద్దున పూట యింత గంజి పోసేది. మళ్ళీ రాత్రిళ్ళుబుచ్చయ్యగారిఇంట్లోనే అన్నం తినేవాడు.

రామిగాడికి పెండ్లయి రెండు సంవత్సరాలయినా భార్య కాపరానికి వచ్చి ఆరు నెలలు మాత్రమే అయింది. యీ ఆరునెలల్లో భార్యను మెప్పించగలిగే ఏ గొప్ప పని చేయలేకపోయాడు ఆలో

చిస్తూ నడుస్తున్నాడు రామిగాడు. కళ్ళ ముందు నల్లగా నిగనిగలాడే బొద్దుపాటి కాళ్ళు-ఆకాళ్ళకు తెల్లని వెండి మెలికల కడియాలు కన్పిస్తూ, మరల తనను త్వరగా నడవమని కవ్విస్తూ, మధ్య మధ్య మాయమౌతున్నాయి. ఒక్కొక్కప్పుడు తన గుండెల్లోనే ఆ కాళ్ళు నడుస్తున్నట్లున్నాయి కూడా.

తనకు కడియాలు పెట్టిన కాళ్ళంటే చిన్నప్పటినుంచీ కూడ ఎంతో యిష్టం. ఈ మధ్య నాగరీకంపెరిగి, మగ ఆడ భేదమే లేకుండా పోతోంది మొండికాళ్ళ ఆడవాళ్ళను చూస్తేతనకుచాలాఅసహ్యం బుచ్చయ్యగారి కోడలు ఆ బంగారమ్మ మొండికాళ్ళు సన్నగా, పూసపుల్లల్లాగ ఎంత అసహ్యంగా వుంటాయి! అంతకంటే తన కాళ్ళే ఎంతో అందంగా వుంటాయనిపిస్తుంది!

మాణిక్యాం కాళ్ళ అందం చూసే, నల్లగా వుంటుందన్నా, పెదాలు లావుగా వుంటాయన్నా లెక్కచేయకుండా పెళ్ళి చేసుకున్నాడు.

పెళ్ళయినప్పటినుంచి ఆ కాళ్ళకు మెలికల కడియాలు పెడితే ఎంత అందంగా వుంటాయోనని వూహించుకొనే మురిసిపోయేవాడు. మాణిక్యాంతో కూడ కొని పెడతానని చెప్పాడు. కాని ఒక ఆశ పెట్టి ఆ ఆశను తీర్చలేని వాడంత అసమర్థుడైన భర్త, భార్యల దృష్టిలో యింకొకడు వుండబోడు.

పెండ్లయిన యీ రెండు సంవత్సరాల్లో ఎంత ప్రయత్నించినా కడియాలు కొనటానికి డబ్బు పిగల్చలేకపోయాడు. మాణిక్యాం తనను యీమధ్య పూర్తిగా అసమర్థుని కింద కట్టేసింది. తను ఏపని చెప్పినా చేయదుసరిగదా, దెప్పిపొడుపులతో ప్రాణంతీస్తోంది కానియీ రోజు...

చాలా వుత్సాహంతో ఈలవేస్తూ యింట్లో ప్రవేశించాడు రామిగాడు. మాణిక్యాం దొడ్లో గుడ్డలు వుతుకుతున్నది. చీర బిగగట్టి గుడ్డలు వుతుకుతూంటే ఆ నల్లని నిగనిగలాడే పాదాలు ఎంత అందంగా వున్నాయో అనిపించింది రామిగాడికి. కొంచెంసేపు అలాగే ఆ పాదాల్ని పరికిస్తూ నిలబడిపోయాడు. మాణిక్యాం రామిగాడ్ని చూసి చూడనట్లుగానే యింకా విసురుగా గుడ్డలు వుతుకుతున్నది.

రామిగాడు సంతోషంతో "ఏమేవ్. యిట్టారా, ఒక మంచిమాట సెపుతా, నిన్నేనే! పలుకే బంగారమయిందేమే!" అంటూ వూపిరాడకుండా కేకలేశాడు.

మాణిక్యాం వళ్ళు మండిపోయింది. వుతుకుతున్న చీరెను దూరంగా విసిరేసి చాలావడిగా రామిగాడివైపుకు నడిచింది. యింకొక రోజైతే రామిగాడు భయపడి వుండేవాడే కాని యీ రోజు మాణిక్యాం కోపంగావుండేనేఅందంగా కన్పిస్తున్నది.

"ఏం కొంప మునిగిపోయింది ? ఆ వజాన కేకలేస్తుండావు! ఏమీ చాతకాక



పోయినా కేకలుమాత్రం చాతవును" అంటూ హుంకరిస్తున్న మాణిక్యం చెయ్యిపట్టుకొని రామిగాడు చిరునవ్వుతో కూర్చోపెట్టబోయాడు. విసురుగా చెయ్యి విదిలించుకొని "నా బతుక్కుతోడు యీ సరసాలే తక్కువ" అంటూ ముఖం చిట్లించుకొని తిరిగి వెళ్ళిపోతున్న మాణిక్యం చెయ్యి మళ్ళీ గట్టిగా పట్టుకున్నాడు రామిగాడు.

"ఎందుకంత కోపం? నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో" అన్నాడు రామిగాడు ముఖం గంభీరంగా పెట్టి.

"ఆఁ తెచ్చావు ఏ అణాపావుకోడిలో, అర్ధనా పూలో" అంటూ చెయ్యి విదిలించుకోబోయింది.

రామిగాడుకొంచెంసకిలిస్తూఅన్నాడు. —"నన్ను ఎంత దూదపుల్లాయికింద కట్టేశావు? చెప్పు చూద్దాం ఏంతెచ్చానో?"

ఈసారి మాణిక్యం ముఖంలో కొంచెం మార్పు కన్పించింది. రాణీ మార్గంలో అడిగింది. "నాకు పనుంది పోవాలి. ఆ తెచ్చిన కాసులపేరు యేదో తొరగా చూపించు" అన్నది.

మాణిక్యం మాటల్లోని వ్యంగ్యం రామిగాడికి అంత వుత్సాహంలోనూ బాధ కలిగించింది. "కాసులపేరూ కాదు కట్లదండా కాదు. నీ కిష్టమైన మెలికల కడియాలు తెచ్చాను" అంటూ బొడ్లో దాచిన కడియాల్ని తీసి మాణిక్యం చేతిలో పెట్టాడు.

మాణిక్యం కళ్ళలో తళుకులు కదిలాయి. తనకళ్ళను తనే నమ్మలేకుండా

ఉంది, తెల్లగా మెరుస్తున్న మెలికల కడియాలు చూస్తూంటే. రెండు మూడు సార్లు కడియాలనుకిందకూ పైకీతిప్పుతూ పరీక్ష ప్రారంభించింది. చివరకు పూర్తి నమ్మకం కలగ్గానే భర్తవంక చూసింది.

రామిగాడి పెదవులమీద చిరునవ్వు తొణకిసలాడుతున్నది.కళ్ళుమాణిక్యాంను ధీమాగా ప్రశ్నిస్తున్నాయి:

"రామిగాడంటే యేమనుకున్నావు? అలాంటి ఇలాంటి అల్లాటప్పాగా దనుకున్నావుగదూ?"

మాణిక్యాంకు అమితానందం కలుగుతున్నా, రామిగాడు ఊహించినట్టుసంతోషంతో తననుకావిలించుకోలేదు సరిగదా కనీసం తనకు కృతజ్ఞతనైనా చూపకుండానే కడియాలను కాలుకు పెట్టుకుంటున్నది. రామిగాడి అంత ఉత్సాహమూ మంచుగడ్డలా కరిగిపోయింది.

"చూశారా బాబూ, ఆ ఎండి కడియాలు!" అన్న కోటిగాడి మాటలతో రామిగాడు వెనక్కి తిరిగిచూశాడు. ఒక కాలుకు కడియాన్ని బిగించి ఇంకొక కాలుకు బిగించటంలో మునిగి వున్న మాణిక్యాంకు వెన్నుమీద బలంగాచరిచినట్లయింది. పైకి తలెత్తి చూసింది. ఎదురుగా కోటిగాడు, మీసం మెలిపెడుతూ విషపునవ్వు నవ్వుతున్నాడు. పక్కనే యజమాని బుచ్చయ్యగారు వుగ్రుడై నిల్చునివున్నాడు ఆ పక్కనే యమదూతల్లాగా ఇద్దరు పోలీసులు చేతుల్లోని లాఠీలను నిమురుతూ నించున్నారు.

రామిగాడి కిదంతా ఏమీ అర్థం కావటం లేదు. తల దిమ్మెక్కిపోయింది. తను నిలుచునివున్న భూమి తన కాళ్ళ క్రిందనుంచి తప్పుకున్నట్లున్నది. కళ్ళు మసక కమ్ముతున్నాయి. అవమానంతో, దుఃఖంతో చూస్తున్న మాణిక్యాం కళ్ళు రామిగాణ్ణి బెదరకొట్టాయి. తలవంచుకున్నాడు. ఆ నల్లని కాళ్ళకు వున్న తెల్లని కడియాలు: ఇంకేమీ అతనికళ్లకు కన్పించటంలేదు.

వీపుమీద బలంగాపడ్డ లాఠీ దెబ్బకు బాధగా మూల్గేడు రామిగాడు. మాణిక్యాం పోలీసులకుఅడ్డుపడుతూ ఏడుస్తున్నది. అందులో ఒకడు మాణిక్యాం కాళ్ళకు వున్న కడియాలు లాగుతుంటే రామిగాడికి లాఠీదెబ్బలవల్ల కలిగే బాధకంటే వెయ్యిరెట్లు బాధకలుగుతోంది.

బుచ్చయ్యగారు ఏదోతిడుతున్నారు. కాని రామిగాడికి ఆ మాటలేమీ విన్పించటంలేదు. రామిగాడు మాట్లాడే స్థితిలో కూడా లేదు. లాఠీ వంటిమీద నాట్యం చేస్తున్నది.

రామిగాణ్ని కావిలించుకొనిఏడుస్తున్న మాణిక్యాంను ఒక పోలీసు వెనక్కినెట్టాడు. పడిపోతున్న మాణిక్యాంను రెండు చేతుల్తో పట్టుకొని కోటిగాడు కొంటెగా చూస్తూ, ఒక చిలిపినవ్వు నవ్వాడు. రామిగాడు ఒక్క వూపుతో

పోలీసుల్ని విదలించుకొని, కోటిగాడి జుట్టు పట్టుకున్నాడు. కాని వెంటనే బలంగా వీపుమీద పడ్డ లాఠీ దెబ్బతో రామిగాడు "అబ్బా" అంటూ కూల బడ్డాడు.

* * *

రామిగాడ్ని ఆరాత్రంతారిమాండులో వుంచారు పోలీసులు. లాఠీదెబ్బల బాధ కంటే తను చేసిన తప్పేమిటో తెలి యక బాధపడుతున్నాడు రామిగాడు. తను కొన్న మెలికల కడియాలకూ, బుచ్చయ్యగారికీ వున్న సంబంధమేదో రాత్రంతా ఆలోచించినా తెలియలేదు. కోటిగాడి పాత్ర అంతకంటే అర్థం కాలేదు.

రెండవరోజు మేజిస్ట్రేట్ కోర్టులో తెలిసింది. తను రామయ్యగారింట్లో వెండి పళ్లెం దొంగిలించాడట. దానికి నిదర్శ నంగా కడియాలు కూడా దొరికినవి కాబట్టి ఆరునెలలు శిక్ష విధించారు. రామి గాడికి తన మాటల్లో ఎవరికీ నమ్మకం కలగదని తెలిసి మారు మాట్లాడలేదు.

* * *

ఆరునెలల శిక్షాయిట్టే అయిపోయింది రామిగాడ్ని విడుదలచేశారు సరాసరి రైలు దిగి యింటికి బయలుదేరాడు. యీ ఆరునెలల జైలుజీవితానికీ, కారణమైన సంఘటనలు ఒకటొకటే అతణ్ని వేట గాడి కాఠిన్యంతో వెంబడిస్తున్నాయి.

తను సరాసరి యింటికెళతాడు. మాణిక్యాం తనను బాగా చూస్తుందా? తను జైల్లో వున్న ఈ ఆరునెలలలో చూసేందుకుఒక్కసారిమాత్రం వచ్చింది అదీ తన్ను చూట్టానికి కాదు; తనకు జరిగిన అవమానానికి తన్ను నిదించ టానికే ; తను దొంగతనం చేయలేదని ఎంత చెప్పినా మాణిక్యాం నమ్మలేదు. అవును, ఎలా నమ్ముతుంది ? చిన్న తనంనుంచి ఎంతో నమ్మకంగా, వళ్ళు దాచుకోకుండా రెక్కలకష్టం చేయించు కున్న బుచ్చయ్యగారికే తనమీద అను మానం కలిగింది: దానికి కారణం అర్థం కావటంలేదు. అంతాకోటిగాడి ఎత్తేనేమో! బుచ్చయ్యగారికి, ఇంకా ఆ ఇంట్లోవున్న అందరికీ తనంటే చాలా నమ్మకం, ప్రేమాకూడా నెలంకొద్దీ వూరి కెళు తున్నా అమ్మగారు ఇంటి భారమంతా తన మీదవేసి నిశ్చింతగా వుండేది. సామాను గది తాళంచెవులు ఎప్పుడూ తన దగ్గరనే వుండేవి. ఇందువల్లే కోటి గాడికి బహుశా తనంటే కోపమేమో. ఎప్పుడూ తనకు బాధ కలిగించేలా మాట్లాడేవాడు.

తనను అంత దయగా చూసిన బుచ్చయ్యగారు ఇలా మారిపోవటానికి, కోటిగాడు కారణం కాదుగదా? ఈ అను మానం కల్గానే రామిగాడి హృదయం భయంతో కంపించిపోయింది. వాడు తనను ఎందుకిలా క్రూరంగా వెంబ డిస్తాడు ? వాడినుంచి తప్పించుకోవడం ఎలాగ ?

పువ్వులమ్మిన వూళ్ళో కట్టెలెలా అమ్ముతాడు? వూళ్లో తలెత్తుకొని తిరిగే యోగ్యత యింక తనకు లేదు. రేపు పొద్దుటికి మాణిక్యాంతో చాలా దూరం ...ఈ ఘోర మృగాలనుంచి చాలా దూరం...వెళ్ళిపోతాడు.

ఇంటిముందు ఆగగానే రామిగాడి వళ్ళు ముచ్చెమటలు పోసింది. ఇంటి తడిక వేసివుంది. పైన తాటాకులు లేచి పోయాయి. ఆ ఇల్లు చూస్తేనే దాదాపు కొద్దినెలల నుంచి మానవమాత్రులెవరూ నివసిస్తున్నట్టు లేదు.

రామిగాడు ఇంటిముందు మట్టిలోనే కూలబడ్డాడు. తన మాణిక్యాం ఏమయి నట్టు? వియోగదుఃఖంతో మరణించిందా? లేక తిండికి జరక్క ఎక్కడైనాపోయిందా? ఆపైన ఆలోచించలేకపోయాడు 'మాణిక్యాం' అంటూ పెద్దగా ఒక కేక పెట్టాడు. బిగ్గరగా ఏడవబుద్ధిఅవుతోంది.

కొంతసేపటికి తేరుకుని తన ఆలోచనలకు తనే సిగ్గుపడ్డాడు. తను అలా ఎందుకు శకునపక్షిలాగా అనుకోవాలి? పుట్టింటికి పోయివుండకూడదూ?

ఇంతలో ఎవరిదో పద ధ్వని రామిగాడి చెవులబడింది. వెనక్కు తిరిగి చూశాడు. బుచ్చయ్యగారు.

"నీకు చాలా అన్యాయం చేశారా, రామిగా!" అన్నాడు బుచ్చయ్యగారు. ఆయన కళ్ళల్లో దయ వుట్టిపడుతోంది.

రామిగాడుజవాబుచెప్పలేకపోయాడు. ఏదో గొంతుకు అడ్డుపడి నట్టయింది. మళ్ళీ బుచ్చయ్యగారే అన్నాడు:

"కోటిగాడి మాటలు నమ్మి, నీ మీదతు కంతా పాడుచేశాను. నువ్వు జైలు కెళ్ళిన మూడో నెలలోనే, వాడు దానితో ఎటో లేచిపోయాడు. వెండి కంచం దొంగిలించింది వాడేనన్న సంగతి తరువాత తెలిసింది!"

రామిగాడు నిలువు గుడ్లేసి చూస్తున్నాడు అందరితోపాటు మాణిక్యాం కూడా తను వెండిపళ్లెం దొంగిలించాడని పూర్తిగా నమ్మిందన్నమాట.

"ఒకసారి శిక్షపడ్డాక ఇక దానికి తిరుగులేదుకదా. అందుకే ఏంచేయలేక వూరుకున్నాను. రా, తిరిగి పనిలోకి వచ్చేయ్, మాణిక్యాంపోతే మరొకతి..."

రామిగాడు ఓ పిచ్చినవ్వునవ్వాడు.

"కోటిగాడుదానికిమెలికల కడియాలు కొనిపెట్టుంటాడు. అది వాడితో లేచిపోయింది. నేను కష్టపడి దాచినముప్పైయ్యారు రూపాయలూ... ఆరునెల్లు... జైలూ......"

రామిగాడు జుట్టు పీక్కున్నాడు. బుచ్చయ్యగారికేసీ, ఇంటికేసీ శూన్యంగా చూశాడు.

"కోటిగాడు...మెలికల కడియాలు మాణిక్యాం...అహహ్హా;"

ఒకటే నవ్వు. తిరిగి తిరిగి అవే మాటలు. దగ్గిరికొచ్చి భుజంమీద చేయి వేసిన బుచ్చయ్యగారిని తొలగతోసుకుని విల్లునుంచి వెలువడిన బాణంలా రామిగాడు అక్కడినుంచి పరిగెత్తాడు.



గుత్తుల భాస్కరరావు

శేషగిరి మంచివాడు కాదని వినికిడి.

అతని చరిత్ర ఆ వీధి అమ్మాయిలు చెబితే వినాలి.

"శేషగిరి ఎలాంటివాడంటే వాడి పేరు వ్రాసి బ్రాకెట్‌లో దొంగముండా కొడుకు అని వ్రాయొచ్చు."

"జ్వరం చూపులూ వాడూనూ. ఆడది కనిపిస్తే చాలు అతలకుతలమై పోతాడు."

"దౌర్భాగ్యుడికి పెళ్ళయిందట. అయినా పాడురోగం. ఆడవాళ్ళని చూపులతో జుల్లించేస్తాడు."

"ఛి. వాడి చూపుల్లో ఎన్ని పాడు అర్థాలుంటాయో తెలుసా" యివి వాళ్ళ అభిప్రాయాలు.

మరో అమ్మాయి ఉంది. పేరుజ్యోతి. శేషగిరి అంటే తగని ద్వేషం. "ఆడ దాన్ని చూస్తే ముళ్ళపందిలా విచ్చు కుంటాడు. వెధవకి అక్కా-చెల్లెళ్ళు లేరేమో" అంటుంది. ఒకసారి తనవెంట పడినప్పుడు ఆ మాటే అడిగింది. అతను "బావుంది. ఉన్న ఆడపిల్లలం దర్నీ అక్కా-చెల్లెళ్ళతో పోల్చుకుంటే ప్రియురాళ్ళు మిగిలేదెలా?" అని మూతి తిప్పుకున్నాడు.




జ్యోతి కళ్లు శేషగిరిని చూస్తే భగ్గున మండుతాయి. అలాగని చూడక మానదు. రోజుకోసారి అతన్ని చూసి ఉమ్మి తిట్టి వేళ్ళు విరవకపోతే ఆమెకు నిద్రపట్టదు. అన్నం సయించదు. ఆ ప్రయత్నంలో ప్రతి సాయంత్రం అతను 'బీటు'కు వెళ్లే సమయంలో కిటికీ ఊచలు పుచ్చుకొని ఖైదీలా ఎదురుచూస్తుంది.

శేషగిరి ఆ రోజు సాయంత్రం మామూలుగా ఆ దారిన వచ్చాడు పోతూ పోతూ కిటికీవంక చూసి విషపు నవ్వొకటి విసిరాడు. ప్రతిగా జ్యోతి ఉమ్మింది. పళ్ళు పటపట లాడించింది. అవే శుభాకాంక్షలుగా భావించి ముందుకు నడిచాడు. ఎవరో స్త్రీ అతని కెదురుగా వస్తుంది. అందం వయసూ ఉన్నవేమో- ముఖ్యంగా ఆడదేమో - శేషగిరి వదల దనుకుంది జ్యోతి. ఆమె అనుకున్నట్టు గానే అతను ఆమెతో పెద్దగా నవ్వి మాట్లాడి - వెంటనే ముందుకు సాగి పోయాడు. జ్యోతికి వంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినయ్. ఆమెను ఎడ్యుకేట్ చెయ్యాలనిపించింది కిటికీ వదలి బైటికివచ్చి 'హలో' అని పిలిచింది. ఆమె ఆది ఏమిటన్నట్టు చూసింది.

"చూడండి. వాడు మిమ్మల్ని ఏదో కూసాడు. మీరు మెత్తగా ఊరుకున్నారేం. గట్టిగా బుద్ధి చెప్పకపోయారూ?"

"ఎందుకు?"

"వాడు పరమదుర్మార్గుడు. ఆడపిల్లలపాలిట శత్రువు. ఊరికే ఎవర్నీ పోనివ్వడు. ఏదో వాగుతాడు. వెంటపడతాడు."

"నాకు తెలియదు సుమా!"

"ఈ వీధిలో ఏ ఆడపిల్లనైనా సరే అడగండి. తలో కథ చెబుతారు."

"నేనెంత మోసపోయాను?"

"ఏం?"

"ఆయన నా భర్త."